మహాత్ముడు 1929 లో ఆంధ్రదేశ పర్యటనము సలిపి నప్పు డీ యాశ్రమము నచ్చటి ప్రజాసేవయు జూచి సంతసించి తన యంగ్ ఇండియాపత్రికలో 16-5-29 తేదిన నిట్లు ప్రశంసించెను.

"నే నీ విశాల దేశమున గావించిన పర్యటనమునం దెచ్చటనుగూడ ఈ ఫిర్కాలో జూచినంత ఉత్సాహ మును జీవకళను జూచియుండలేదు. ఆశ్రమవాసులు సామాన్యజీవయాత్రను గడపుచున్నను వారు గ్రామ స్థులలో నైక్యమై వారిపై నఖండమైన పలుకుబడిని సంపాదించినారు. ఈ పేదగ్రామములో ఐదు వేలరూపా యిలు వసూలయ్యెను. ఇంత పెద్ద మొత్తము మరేఇతర స్థలమందును లభించియుండలేదు" గాంధిమహాత్ముని కత్యంత ప్రియతమమగు నిర్మాణకార్యక్రమమునందును ముఖ్యముగా ఖద్దరుద్యమమునందును రాజకీయోద్య మమునందును ఎన్నికష్టములు వచ్చినను చలింపక స్థైర్యముతో పనిచేసిన వీరులలో ఆంధ్రదేశమునందు డాక్టరుగారికే అగ్రస్థానమియ్యవలెను.

డాక్టరుగారు 1930-1932 లో జరిగిన సత్యాగ్ర హోద్యమములందు మఱల కారాగారమున బ్రవే శించినారు. గోదావరిజిల్లాలో కాంగ్రెసు ఉద్యమము విజృంభించుటకు మూలకారణముగానున్న ఈ డాక్టరు గారిని వీరియాశ్రమమును అణగ ద్రొక్కవలెనని రాజమహేంద్రవరడిప్యూటీ పోలీసు సూపరెంటెండెంటు

ముస్తాఫాలీఖాను నిశ్చయించుకొని 1932 జనవరి 18 వ తేదీన ఆశ్రమవాసులను లాటీచార్జిచేసి అరెస్టుచేసి ఆశ్రమమును వశము చేసికొని దానిధ్వజస్తంభమును ఇతర ఆస్తిని నాశనముజేసి అంతటితో కసితీరక ఆశ్రమవాసులకు 4, 5, సంవత్సరముల దీర్ఘశిక్షలు వేయించి ఆశ్రమమును పాడుపెట్టించెను.

ఆశ్రమవాసులపైన కేసువిచారణ జరుగుచుండగా జనవరి 26 తేది స్వాతంత్ర్య దినోత్సవమునాడు స్త్రీలు సత్యాగ్రహము చేసిరి. అంతట వీరినిబంపినది డాక్టరు సుబ్రహ్మణ్యముగారేయని ముస్తాఫాలీఖానునిశ్చయించి ఉగ్రుడై సుబ్రహ్మణ్యముగారు నాళము చినభీమరాజు గారింట నుండగా ముస్తఫాలీఖాను పోలీసు సిబ్బందితో వచ్చి ఆయనను భీమరాజుగారిని ఇంక నిరువురిని గలిపి అక్రమసమావేశమని ప్రకటించి పోలసులను చెదరగొట్టుడని యాజ్ఞాపించెను. భీమరాజుగారును సుబ్రహ్మణ్యంగారును తొలగిపోమనియు తమ్ము అరెస్టుచేయుడనియు నిశ్చలులై నిలిచిరి. అంతట నాపోలీసు అధికారి ఆగ్రహము పట్టలేక డాక్టరుగారిని చావమోదించెను. పది ఎముకలు విరుగగా ఆయన స్మృతితప్పి పడిపోయిరి. మూడునెలలు మంచముపట్టిరి. అక్రమసభచేసిరని తన యధికారమును తిరస్కరించిరని ముస్తఫాలీ వీరిపైన నొక అబద్ధపుకేసు బనాయించెను. ఈముస్తఫాలీఖాను తన తాబేదారులచేత నబద్ధపుసాక్ష్య మిప్పించుటయేగాక

ముస్తఫాలీకూడా అబద్ధపు సాక్ష్యమిచ్చెనని ఆ కేసు విచారించిన సబుకలెక్టరు బాలకృష్ణయ్యరు ఐ. సి. ఎస్. గారు వ్రాసి డాక్టరుగారిని విడుదలచేసినారు. తరువాత నీ అబద్ధపు కేసుపెట్టినందుకు ముస్తఫాలీచేత జిల్లాకోర్టు వారు డాక్టరుగారికి నష్టపరిహారమిప్పించిరి. హైకోర్టులో కూడా ముస్తఫాలీ యబద్ధము స్థిరపరచిరి. అమలాపుర ములో నింకొక కేసును డాక్టరుగారిమీద దాఖలు చేయించి 6 నెలలు శిక్ష విధించిరి. చెరసాలనుండి ఈయన బయటకు వచ్చినపిదప మహాత్ముని హరి జనోద్యమము సందర్భమున 1933 లో సీతానగర ములో నీయన ఒక హరిజనాశ్రమము స్థాపించిరి. తరు వాత తమ సత్యాగ్రహాశ్రమము వశముకాగా పోలీసు వారుచేసిన భీభత్సమునెల్ల చక్కజేయుట కెంతోసొమ్ము కావలసివచ్చెను. ఆర్థికమాంద్యము కలిగినది. అయి నను రాత్రింబవళ్లు కష్టపడి ఆశ్రమమును పునరుద్ధ రించిరి. ఇట్టిస్థితిలో గాంధిమహాత్ముడు మఱల నొక మారువచ్చి ఆశ్రమమునుజూచి నిట్టూర్పునూర్చినారు. ఇట్టి నిరంతరసేవవలన తీవ్రమైన లాటీదెబ్బల వలన ఆరోగ్యము చెడి క్షయవ్యాధిపీడితులై డాక్టరుగారు 23-12-1936 వ తేదీన స్వర్గస్థులైనారు.

సుబ్రహ్మణ్యముగారి మరణమునుగూర్చి తెలియ గానే ఆసమయమున జరుగుచుండిన కాంగ్రెసు నగర

మున నుండిన గాంధిమహాత్ముడీక్రింది సందేశమును తంతివార్తద్వారా పంపెను :

కాంగ్రెస్ క్యాంపు,
24-12-1936.

"సుబ్రహ్మణ్యము (యొక్క) మరణము (దేశమునకు) మహత్తరమైన ఇక్కట్టు. ఆతని వినయము, స్థైర్యము, త్యాగము అద్వితీయములైనవి. ఆతని కుటుంబమునకు ఆతని (గౌతమీసత్యాగ్రహ) ఆశ్రమమునకు నాసానుభూతిని తెలుపుచున్నాను."

గాంధి.

*Congress Camp*
*24-12-1936*

"Subrahmanyam's death great blow. His humility, sacrifice and steadfastness were all his own. My sympathy with his family members and his Ashram.

*Gandhi.*"

# భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము

## విషయవిభాగ సూచిక

### ప్రథమభాగము - సింహావలోకనము

## స్థితిగతి లెక్కల సూచిక

## (Statistics)

# భారతదేశమున

# బ్రిటిష్ రాజ్యతంత్రము

## 1600—1937

ప్రథమభాగము: సింహావలోకనము.

## మొదటి పరిచ్ఛేదము: కాంగ్రెసు ప్రభుత్వోదయము.

I

### కాంగ్రెస్ రాజ్యనీతి సాధనవిధానములు.

1937 వ సంవత్సరము జూలై నెలలో కాంగ్రెసు (జాతీయమహాసభ) భారతదేశమునందు ఆరురాష్ట్రములలో మంత్రిత్వము స్వీకరించినది. తరువాత పశ్చిమోత్తర సరిహద్దు పరగణాలలోకూడా కాంగ్రెసు ప్రతినిధులే మంత్రులుకాగా నాటినుండి ఏడురాష్ట్రములందు ప్రభుత్వము చేయుచున్నది. ఈ మహాసంస్థ భారతదేశ దాస్యవిమోచనకొరకును దారిద్ర్యవిమోచనకొరకును సంపూర్ణ స్వాతంత్ర్యముతప్ప వేరు మార్గములేదని నిశ్చయించి అందుకొరకు ఏబ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వముతో తీవ్రముగా పోరాడుచు శాసనసభలను ఇతర ప్రభుత్వసంస్థలను బహిష్కరించి, సహాయ నిరాకరణమునుజేసి, శాసనోల్లంఘనమును గావించి, అష్టకష్టములకోర్చి, అజ్ఞాతవాసమును గూడ జేసెనో ఆ ప్రభుత్వముయొక్క దుర్గములలోనే నేడు

ప్రవేశించి వానిని స్వాధీనము జేసికొని తానే ప్రభుత్వము వహించినది.

ఈ రాజకీయ పరివర్తనము చాల విచిత్రమైనది. ప్రభుత్వముతో ఎట్టి సంపర్కమును కలిగియుండుటకుగాని శాసన సభలందు ప్రవేశించుటకుగాని కాంగ్రెసు చాలకాలమువరకు ఇష్టపడలేదు. దీనికి కారణము ప్రభుత్వము తోడి సంబంధము విషతుల్యమనియు అందదుగిడినవారెల్లరు బ్రిటీష్ రాజ్యతంత్రమునందు చిక్కి వారికి వశమై వ్యక్తిత్వమును గోల్పోయి వారి చెప్పుచేతలలో నేయుండి స్వదేశమునకు స్వధర్మమునకు ద్రోహమొనరించుచుండుటయు, కొన్నాళ్లు దేశభక్తులని పేరుపొందిన మహానుభావులుకూడ ప్రభుత్వపువలలో చిక్కియుండుటయు కాంగ్రెసువారిలోగూడ కొందరు స్వార్థపరులై ప్రభుత్వపక్షమున జేరుటయు కాంగ్రెసు కన్నులార గాంచియుండెను. కాంగ్రెసు నాయకుడుగానుండి సింహగర్జనల జేసిన సురేంద్రనాథ్ బెనర్జీ శాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వమువారి వలలో జిక్కి వారి వ్యామోహమునబడి మితవాది యైపోవుటయు, కాంగ్రెస్ సభాధ్యక్షత వహించినవారిలో ననేకులను ప్రభుత్వము చేరదీసి బిరుదులిచ్చి అధికారములిచ్చి నోరుగట్టుచుండుటయు, కాంగ్రెసు వేదికపై కెక్కినవారిలో ప్రముఖులను గూడ అట్లే సత్కరించుచుండుటయు, అందువలన రెడ్డినాయుడు గారివంటి కుశాగ్రబుద్ధిగలవారు కూడ ఆవలలో చిక్కి గాంధీ మహాత్ముని గోచీపాతరాయస్వరాజ్య మన సాహసించుటయు, ప్రభుత్వమును తీవ్రముగా విమర్శించియుండిన బయ్యా నరసిం

హేశ్వరశర్మగారు కాంగ్రెసును విడనాడి కార్యనిర్వాహక సభ్యుడై కాంగ్రెసుకు విరోధియగుటయు, ఇంకనూ ఆశ్చర్యకరముగా నీ మహానుభావుడే మరియొకమారు ప్రభుత్వము చేసిన ఘోరాన్యాయములకు అసమ్మతిగా తన పదవికి రాజీనామానిచ్చి మరల ప్రభుత్వమువా రీతనిని బుజ్జగించి లోబరచుకొనగా తన రాజీనామా నుపసంహరించుకొనుటయు, శాసన సభ్యుడుగా నుండినప్పుడు తీవ్రజాతీయవాదిగా ప్రవర్తించుచు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా కాంగ్రెసుకు సహాయుడుగా నుండిన షణ్ముఖం చెట్టిగారు, ప్రభుత్వపు రాజ్యతంత్రమునబడి సర్ బిరుదమునొంది భారత దేశ పారతంత్ర్యమునకు "ఒటావా" ఆర్థిక దాస్యమునకు కారకుడగుటయు ప్రత్యక్షముగా జూచిరి. ఎందరో మహానుభావు లిట్లు ప్రభుత్వమువారికి దాసాను దాసులై ప్రవర్తించుచుండుటయు తుదకు ప్రజలపక్షమున ప్రజాప్రతినిధులుగా ఎన్నుకొనబడిన శాసనసభ్యులలో గూడ కొందరు ప్రభుత్వము వారి బిరుదులకు ప్రాపకమునకు ప్రాకులాడి వారివలన మెప్పుపొందుటకు బ్రిటీషు సామ్రాజ్యతత్వమునకు అనుకూలముగను భారత దేశ ప్రజల క్షేమమునకు వ్యతిరేకముగను అనేక విషయములందు వోటుచేయుచుండుటయు, (బ్రిటీషు) రాజప్రతినిధియు ఆయన భార్యయు వారి తాబేదారులును జరుపు విందులకుపోయి మర్యాదలందుటయు ఆ మోమోటమిచే గూడ ప్రభుత్వము పక్షమున వోటుచేయుటయు, ఇట్లు సామదానభేదదండోపాయములచేత శాసనసభలను కూడ ప్రభుత్వము వశపరచుకొని భారత దేశ ఆర్థిక క్షేమము

నకు విరుద్ధముగా బ్రిటీషు వర్తకులకు లాభకరముగ నుండు పెక్కుచట్టములు, తీర్మానములు, గావించుచుండుటయు సుంక ములు పన్నులు విధించుటయు కాంగ్రెసు నాయకులు చూచి ఈ పద్మవ్యూహమున ప్రవేశించుట కిష్టపడలేదు.

బ్రిటీషు ప్రభుత్వమువారు శాసనసభల నిర్మాణములో గూడ తమ పక్షీయులే ఎన్నుకొనబడునట్లును, తమకువ్యతి రేకులగు జాతీయవాదులు ప్రవేశింప లేకుండునట్లు చేయుటకును జాతి, మత, కుల వివక్షతలను, భేదములను శాశ్వతముగా నెలకొల్పి ఆయాపక్షీయులుబండారులతో పోరాడుకొనిబ్రిటీషు ప్రభుత్వమునే ఆశ్రయించియుండునట్లు చేయగల ప్రత్యేక నియోజకవర్గముల నేర్పాటుచేసి శాసనసభలు మొదలు గ్రామ పంచాయితులువరకు నన్నిసంస్థలును,ఈకులతత్వ వాదులతోను మతాభిమానులతోను స్వార్థపరులతోను నింపి, ఈ కీలుబొమ్మల యొక్క సహాయముతో నిరంకుశముగా పరిపాలింపసాగిరి. స్థానికస్వపరిపాలనా సంస్థలందు రాజకీయ పద్ధతులపైనగాక కులతత్వ పద్ధతులపైననే వివిధపక్షము లేర్పడుటవలన కక్షలు కలహములు వర్ధిల్లినవి. కార్యాలోచనను పరిపాలనా నిర్వహ ణమును విడదీయకపోవుటవలన అనర్థములు వృద్ధియైనవి. మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, పంచాయితీలు స్వార్థపరుల చేతులలోపడి కంట్రాక్టులందు ఇతర పనులందు లంచగొండె తన మభివృద్ధియైనది. ఈ సంస్థలందు జేరినవా రెల్లరు ధనబలము అధికారబలము నుపయోగించుకొని ప్రభుత్వప్రాపకముతో శాశ్వతముగా ప్రజాపీడన చేయుచుండిరి. ఇట్లు దేశ పరిపాలన

మెల్ల కేవలము బ్రిటీషు ప్రభుత్వమువారి దయాధర్మముల పైనను అధికారప్రాబల్యముల పైనను ఆధారపడియుండినందున దేశములో స్వార్థపరుల సంఖ్య హెచ్చసాగెను. శాసనసభలలో దేశక్షేమముకొరకు జాతీయశ్రేయముకొరకు రాజకీయ [illegible]ముకొరకు పాటుపడు నిష్కల్మష హృదయులును జాతీయ రాజకీయ పక్షములును వర్ధిల్లుటకు వీలులేకుండునట్లు చేయబడెను. కేవలము కులకక్షలనే ప్రధానముగాగల జస్టిసు పార్టీ నిర్మాణమునకు ప్రభుత్వమువారుచేసిన దోహదము జగత్ప్రసిద్ధము. ఇట్టి కులతత్వపక్షములు ఇతర రాష్ట్రములందు గూడ ఏర్పడుటకు అవకాశములు కల్పింపబడెను. ఇట్టివారెల్లరు ప్రభుత్వమువారి రాజ్యతంత్రమునకు వశులై వారి నిరంకుశ పరిపాలనకే సహాయపడసాగిరి. ఇట్లు దేశముయొక్క రాజకీయశక్తులన్నియు ప్రభుత్వము చేతిలోని కీలుబొమ్మలైనవి. అందువల్లనే ఈ కళ్మలమునందు పడుటకు కాంగ్రెసు అంగీకరింపలేదు

ప్రభుత్వయంత్రము:—బ్రిటీషుప్రభుత్వము కేవలము అమానుషమును నిర్జీవమును అగు ఒకయంత్రమే యని భారత జాతీయనాయకులును, చరిత్రకారులును, రాజనీతిజ్ఞులగు విదేశీయులును గూడ అంగీకరించియున్నారు. ఈ ప్రభుత్వ మొక ఇనుప చట్రము. దీనిలోని ఐ.సి.ఎస్. ఉద్యోగులు దేశ ప్రజల యొక్క సేవకులుగాగాక కేవలము విదేశ "సర్కారు"యొక్క నౌకరులుగా మాత్రమే ప్రవర్తించుచు వారి యాజ్ఞాను వర్తులై ప్రజలకు వ్యతిరేకముగకూడ వర్తించుచుందురు.

ప్రభుత్వనివేదికలు మాత్రము చక్కగా సాలియానా ప్రక టింపబడుచుండును. విద్యాభివృద్ధి, వైద్యసహాయము, దేశము యొక్క ఆర్థికాభివృద్ధి చక్కగ జరుగుచున్నటులే ఆనివేదికల యందు చూపబడును. పైయధికారికి దాసానుదాసుడై వర్తిం చుచు ఎల్లప్పుడును వానిని మెప్పింపజూచుటయు, క్రింది ఉద్యోగి పైన స్వారిచేసి హింసించి నీచముగ జూచి తృణీకరించుటయు నీ ప్రభుత్వములో ఉద్యోగలక్షణములుగా నున్నవి. ఈఉద్యో గులకు ప్రజల కష్టసుఖములు తెలియవు. వానిని గూర్చి ఆలో చింపనైన ఆలోచింపరు. జమాబందీలయందును పర్యటనము లందును మహావిభవముతో పరివారముతో పోయి గ్రామస్థు లను పీడించి సప్లయిలు పొందుదురు. కొందరు ధర్మాత్ము లున్నను చాలమంది యుద్యోగులకిది యలవాటు. ప్రజలతో కలసి మెలసి వారి కష్టసుఖములు తెలిసికొనవలసిన ఉద్యోగ శాఖ లగు డి. పి. డబ్లియు., వ్యవసాయ, పారిశ్రామిక, సహకారశాఖ లందు గూడ ఈ పద్ధతులే అమలు జరుగుచున్నవి. ప్రజలతో నీ గొప్పయుద్యోగులు తెనుగున మాటలాడుట గూడ లేదు! భారతీయులుగూడ ఇంగ్లీషు మాటాడవలసినదే!! దొరలనిపించు కోవలసినదే. అధికారములను చలాయించుటయే గాని ఆలన పాలనలు లేవు. వీరు గ్రామములకు చేయు మేలు లేదు. అధికారులు వచ్చునప్పుడెల్ల గ్రామస్థులు చాల కష్టపడుదురు. వీరు వచ్చినందుకు సంతోషపడువారులేరు. ప్రతిపెద్ద యుద్యో గియు ఇంకొకచోటికి బదలాయింపు చేయబడినప్పుడు అల్పా హారవిందులు పూలదండలు ఫొటోగ్రాపులుతో బహూకరింప

బడుటయు నొక ఆచారమైనది. ఇందుకు చందాలు వసూలు చేయబడుటయు బీద గుమాస్తాలు, గ్రామోద్యోగులు, బీద జనులు గూడ చందా లిచ్చుకొనవలసి వచ్చి బాధపడుచుండుటయు జరుగుచున్నది. ఇక మంత్రులుగాని పెద్ద యధికారులుగాని వచ్చునప్పుడు జరుగుఉత్సవములకు చేయబడు ఖర్చులకు ప్రజలు పడు బాధలకు మితిలేదు. అన్ని శాఖలలోను లంచగొండితనము అధికమై ప్రజలు పీడింపబడుచున్నారనుటలో అతిశయోక్తి లేదు.

భారతదేశములోని పోలీసుశాఖ ఒక విచిత్రమైన సంస్థ. ఇతర దేశములందువలె వీరు ప్రజాసేవకులుగా నుండి పౌరులకు సహాయముచేయుట కేర్పడినవారుగారు. కేవలము బ్రిటీషు సామ్రాజ్యప్రభుత్వము వారి తాబేదారులై ప్రభుత్వముయొక్క పరువు ప్రతిష్ఠలను కాపాడుచు నిరంకుశ ప్రభుత్వము నమలు జరుపుట కేర్పడిన అధికారులై యున్నారు. సామాన్యవ్యవహారములందు గూడ వీరు చేయు జులుమునకు అత్యాచారములకు మితిలేదు. దేశప్రజలను వీరు మనుష్యులవలె చూడక పశువులవలె జూచుచుందురు. వీరికి నేరములను కనిపెట్టు శక్తి తక్కువ. దౌర్జన్యముచేసి ఎవరినో యొకరిచేత ఒప్పించి కేసులు బనాయించుట మాత్రము తెలియును. ఈ పోలీసుశాఖలో లంచగొండితన మత్యధికముగా నున్నదనియు వీరనేక అన్యాయములను జేయుచున్నారనియు దీనిని వెంటనే సంస్కరింపవలసినదనియు అనేక హైకోర్టు జడ్జీలు హెచ్చరించియున్నారు. ఇక రాజకీయములందు పోలీసువారుచేయు దారుణచర్యలమాట

చెప్పనక్కరలేదు. లాటీప్రయోగములు, తుపాకీకాల్పులు, స్త్రీల నవమానించుట, శాంతిసైనికులను స్మృతి తప్పువరకు కొట్టుట, అనేక అత్యాచారములు చేయుట, జైళ్ళలో ఖైదీలను లాటీలతో కొట్టుట, సత్యాగ్రహమహోద్యమమున పరిపాటి యైనది. నాటి పోలీసు రాజ్యమును గూర్చిన కథలందరికిని దెలి యును. పోలీసు సూపరెంటెండెంటు స్వయముగా కూడ దగ్గర నుండి డాక్టరు సుబ్రహ్మణ్యంగారిని, వెన్నేటి సత్యనారాయణ గారిని, అనేక మర్యాదస్థులను ఎముకలు విరుగకొట్టించిన సంగతి అనేక కేసులలో బయల్పడినది. ఒక ఆంగ్లేయ డాక్టరు గూడ ఇట్లు కొట్టబడెను. ఇతని పేరు పేటర్. ఒక ప్లీడరుగారిని వస్త్రవిహీనునిజేసి కొట్టినసంగతి గూడా పార్లమెంటులో చర్చింపబడినది. దొంగతనము జరిగినదని పిర్యాదుచేయుగా 'మీ గాంధితో చెప్పుకో'మని పోలీసువారు ఈసడించిరి! ఈ పోలీసుశాఖకు మేజస్ట్రీటులకు అవినాభావసంబంధము కలదు. నాడు జిల్లా మేజస్ట్రేటుకన్న పోలీసు సూపరెంటెండెంటు కే ప్రభు త్వములో హెచ్చు పలుకుబడి యుండెను. పోలీసువారికి కావల సిన సహాయమెల్ల చేయవలసినదని మేజస్ట్రేటులకు తాఖీదులంప బడెను. బెజవాడలోనే ఒక కేసు విచారణ జరుగుచుండగా డిప్యూటి సూపరెంటెండెంటు న్యాయస్థాన వేదికపై సబుకలెక్ట రుతో కలిసి కూర్చొనియుండుటను ఈ గ్రంథకర్త స్వయముగా చూచియున్నాడు. సబుకలెక్టరుప్రయివేటు రూములోనికిపోయి రాజకీయ నాయకుల కివ్వవలసిన తరగతినిగూర్చి పోలీసువారే నిర్ణయింపచేసి యుండుట సర్వసామాన్యముగా జరుగుచుండెను.

శాశ్వతముగా నొక్క-చోటనే పరివేష్టించి కేసులు విచారించ వలసిన స్టేషనరీ మేజస్ట్రేటు గుడివాడ తాలూకాలో పోలీసు డిప్యూటి సూపరెంటెండెంటు ఆజ్ఞకుబద్ధుడై ఊరూరదిరిగి లాటీ ప్రయోగముల కనుజ్ఞనిచ్చుటయేగాక తన కోర్టుకు చాల దూరమున నింకొక గ్రామములో కేసు విచారణచేసినాడు. ప్లీడర్లను రానీయలేదు. అంతట హైకోర్టువా రీతనిని తీవ్రముగా మందలించినారు. నాడు పీనలు కోడ్డులో చెప్పబడిన పూర్ణ శిక్షను విధించుటయు పూర్తిజరిమానాను విధించుటయు సామాన్యమైనది. జమ్నాలాల్ బజాజి, డాక్టరు పట్టాభి సీతా రామయ్యగార్ల వంటివారిని "సి"క్లాసులో నుంచుచుండిరి. భూలాభాయి దేశాయిగారికి 10 వేలు జరిమానాయు షోలా పూరులో నొకరికి 30 వేలు జరిమానాయు విధింపబడెను. నాడు మేజస్ట్రేటు కోర్టులందు కాంగ్రెస్ శాంతిసైనికులను నాయకు లనుఆ అధికారులు తీవ్రముగా శిక్షించుటేగాక దుర్భాష లాడుట ఇతరవిధముగా అవమానించుటయుకూడ జరిగినది. నాయకు లోర్పుకొనిరిగాని కొందరు సామాన్యులుఎదురు జవా బులుచెప్పిరి. కొన్ని ఉదాహరణములు నాకు జ్ఞాపకమున్నవి: మంచివాడును దివ్యజ్ఞానియనియు పేరుపొంది వృద్ధిలోనికి వచ్చు చున్న ఒక బ్రాహ్మణ డిప్యూటీకలెక్టరు గారొక శాంతి సైనికుని భీమవరంలో విచారించుచు నీ తండ్రిపేరేమని యడి గిరి. ఆయువకుడు "మహాత్మాగాంధి" యని జవాబుచెప్పెను. అంతట నీ సద్ధర్ముడగుకలెక్టరుగారు 'గాంధీ నీ యమ్మ మొగుడా?' యని అడిగిరి. ఆ యువకుడు రోషావేశముతో

గోడపై వ్రేలాడుచుండిన జార్జి రాజు బొమ్మ చూపి "మొన్న రాజభక్తి సభ జరిపితివే, జార్జిచక్రవర్తి నీ యమ్మ మొగుడా?" అని కలెక్టరుగారిని అడిగెను. ఈ డిప్టీకలెక్టరు చాలా లాఠీ చార్జీలు చేయించి భీమవరంలో బ్రిటిష్‌సామ్రాజ్యము కాపాడి నందు కీతనికి తరువాత పెద్ద యుద్యోగములోనికి ప్రమోషను ఒసగబడినది.

బెజవాడ సబుకలెక్టరునెదుట ఒక గొప్ప కుటుంబము లోని కమ్మయువకుని కాంగ్రెస్ ఉద్యమమున పట్టి తెచ్చిరి. ఆ భారతీయోద్యోగి ఈయువకుని నీవృత్తియేమని యడిగెను. ఇతడు దేశసేవయనెను. అంతట నా కలెక్టరు రికార్డులో "దేశ దిప్పకాయ" (వేగబాండు) అని నమోదుచేసెను! ఈ దేశ దిమ్మరి యిప్పు డొక శాసనసభ్యుడుగా ఎన్నుకొనబడినాడు! ఐ. సి. ఎస్. లోని భారతీయుడు ఒంగోలు సబు కలెక్టరుగానుం డగాన త్యాగ్రహోద్యమ సందర్భమున దేశభక్త కొండా వెంకట ప్పయ్యపంతులుగారిని విచారించి శిక్షించుచు "నీ కిన్ని యేండ్లు వచ్చినను బ్రిటిష్‌ప్రభుత్వమునకు వ్యతిరేకముగా పనిచేసి నందుకు నీవు ఇదివర కొకమారు శిక్షింపబడియున్నను నీకు బుద్ధిరాలేదు" అని అందరు వినుచుండగా ననెను! ఈ గొప్ప యుద్యోగి నేడు పెద్దకలెక్టరుగానున్నాడు. కాని ఇతని బానిస గుణము కాంగ్రెసు ప్రభుత్వమునకు రాగానే ఇంకను ప్రక టింపబడినది. నేడితడు కాంగ్రెసుమంత్రులను, కార్యదర్శు లను ఆశ్రయించుట, వారికి స్వాగతమునిచ్చుట, విందు లొస

గుట ప్రారంభించినాడు. పంతులుగారికింకను బుద్ధిరాలేదుగాని ఇతనికిమాత్రము బుద్ధివచ్చినది. మంగళసూత్రమును జరిమానా క్రిందజప్తుచేసిన ఆంగ్లేయ నబుకలెక్టరుచేసినపని పైనచెప్పబడిన భారతీయులు చేసినదానికన్న అన్యాయమైనది కాదు. ఏలనన అతడు తక్కినవారివలె బానిసనౌఖరీలోను మెహర్బానీకొరకట్లు చేసినవాడుగాడు. అదితప్పని తెలియగానే పశ్చాత్తాపము దెల్పినాడు. ఈ నల్లదొరలకుమాత్ర మేకోశమునను బశ్చాత్తాపములేదు.

కాలమహిమవలన ఏ కాంగ్రెసువారి నీ యుద్యోగులెల్లరు బాధించి అవమానించియుండిరో ఆ కాంగ్రెసు చేతిక్రిందనే నేడు పనిచేయవలసినగతి వీరికిపట్టినది. ఈ మహానుభావులు నాడు తాముచేసిన ఘోరాన్యాయములనెల్ల మఱపించుటకో యన నేడుఇతరులందరికన్నను కాంగ్రెసు మంత్రులకు ఎక్కుడుగా స్వాగతము లిచ్చి విందుల కాహ్వానించుటయు కాంగ్రెసువారిని పొగడుటయుజరుగుచున్నది. "మేమేమిచేతుము? రావణునకైన స్వస్తిజెప్పవలె రామునకైనస్వస్తిజెప్పవలె" ననివీరనుచుందురు. గాని నిజముగా వీరు ఆనాడుచేసిన అత్యాచారములెల్లఆనాటి ప్రభుత్వము వారుచెప్పినందువల్లనే చేసిరా? కేవలము మెహర్బానీకొరకు ఒకరికన్న ఇంకొకరు గొప్పవార మనిపించుకొందమని, విరిగిన కాంగ్రెసు ఎముకలపైన, చిందిన కాంగ్రెసు రక్తముపైన, తమ స్వార్థ సౌధములను నిర్మించుకొందమనికదా వీరా కూరకృత్యములెల్లచేసిరి! ఇది కేవలము సామాన్య సేవకవృత్తిలోని హైన్యస్వభావ ఫలితమే కాదు. ఏండ్లతరుబడి

పారతంత్ర్యమున బడియుండిన బానిసల యజమానుల తొత్తుల క్రిందితొత్తులై కూలీమేస్త్రీలుగానుండు నౌఖరీపద్ధతి ఫలితమే యిది. వీరి ననవలసిన పనిలేదు. నేడు వీరుచేయు మహార్యాభీపనులు కట్టిపెట్టి తమ ప్రీతనిరంకుశ పద్ధతులనెల్ల మాని, వీరు కాంగ్రెసు చెప్పినట్లు ప్రజాసేవచేసి పూర్వము చేసిన పాపములకు పరిహారము గావించుకొని ధన్యులగుదురు గాక !

ఉద్యోగములందు మాత్రమే గాక, బ్రిటిషు రాజ్యతంత్రము నిర్మించియుంచిన ఏ సంస్థయందు ప్రవేశించినను గూడ క్రమక్రమముగా ధనవ్యామోహముననో అధికారవ్యామోహముననో ఇంకొక వ్యామోహముననోబడి మత్తుమందు జల్లి వశపరుపబడిన వారివలె భారతీయులు స్వదేశమును స్వధర్మమును గూడ మరచి ప్రవర్తించుట జరుగుచున్నది. ఇదిచూచియే మన కాంగ్రెసు, ఈ శాసనసభలను కోర్టులను పాఠశాలలను, ఉద్యోగములను గూడ బహిష్కరించవలెనని నిర్ణయించినది. బిరుదులనుత్యజించవలెననియు ప్రభుత్వోద్యోగులను గౌరవించుట కేర్పడిన సమ్మానములందు కాంగ్రెసు పాల్గొనకూడదనియుఇంకనుఎన్నోకట్టుబాటులుచేసికొనినది. కాంగ్రెసు తనయొక్కపరిశుద్ధజాతీయతనుసంరక్షించుకొని దేశభక్తి పూరితమై దేశముకొరకు ప్రజలకొరకు ఎన్నికష్టములకైన నోర్చి దేశదారిద్ర్యమును మాన్పుటకు సంపూర్ణస్వాతంత్ర్యమును సంపాదించుటకు శాంతిసమరమున పాల్గొని సర్వస్వమును త్యజించిఆహుతికాగల త్యాగధైర్యశాంతిసత్య సాహసౌదార్య

ములు గల స్వాతంత్ర్యయోధులను సత్యాగ్రహమహారథు లను తయారు చేయగలిగినది. ఈమహా సైన్యములను నిర్మించుటలో యమనియమములవంటి ధర్మానుష్ఠాన పద్ధతులు గల క్రమశిక్షణము గావించినది. అందువలననే బ్రిటీష్ రాజ్యతంత్రములకును ఆశలకును లోబడక కాంగ్రెసు సైనికులు పని చేయ గలుగుచున్నారు. పురుషోత్తము డగు గాంధిమహాత్ముడు నాయకత్వము వహించినందుననే ఇట్టి పవిత్రమైన పరిస్థితి ఏర్పడినదని ప్రత్యర్థులు కూడ అంగీకరించియున్నారు. కాంగ్రెసు మహాతేజముతో శాంతిసమరమును జరిపి పరిశుద్ధమైన మనస్సుతో నేడు తన కార్యదీక్షను శాసన ధర్మబద్ధములైన మార్గముల ద్వారా సాధింపదలచినది. ఏప్రభుత్వము ప్రజల శాశ్వత దాస్యముకొరకు రాజ్యాంగ శృంఖలములను నిర్మించియున్నదో ఆప్రభుత్వముయొక్క సంస్థలందే ప్రవేశించి క్రమశిక్షణతో కట్టుబాటులతో పనిచేసి ఆ రాజ్యాంగ శృంఖలమును భగ్నముచేసి సంపూర్ణ స్వాతంత్ర్యమును స్థాపించుటకు ఈ సంస్థల నుపయోగించి కృతార్థత గాంచదలచినది. అందువల్లనే శాసనోల్లంఘన, సాత్త్వికనిరోధ, సహాయనిరాకరణ, సత్యాగ్రహ పద్ధతిని మార్చి రాజ్యాంగ ధర్మపద్ధతుల ద్వారా శాసనసభలందు ప్రవేశించి మంత్రిత్వాధికార స్వీకరణము జేసి నేడు రాష్ట్రీయప్రభుత్వములను నడుపుచున్నది. ఇందుకొరకు కెన్నో కట్టుబాటులు చేసికొన్నది.

## II

## అధికార స్వీకారము—నిర్వహణము.

పదునాల్గేడుల యరణ్యావాసము ఏబదేండ్ల స్వతంత్ర పోరాటము జరిగినపిదప, స్వార్థపరుల రాజకీయపక్షములు, కీలుబొమ్మల ప్రభుత్వములు పోయి స్వతంత్రవీరుల కాంగ్రెసు ప్రభుత్వము రాగానే సేతుశీతాచలపర్యంతముగల భారత దేశము ఒక్కనిట్టూర్పు విడిచినది. సంపూర్ణస్వాతంత్ర్యము లభింపకపోయినను, అధినివేశస్వరాజ్యము రాకపోయినను. నిజమైన రాష్ట్రీయ స్వపరిపాలనము లభింపకపోయినను బాధ్యతాయుత స్వపరిపాలనాపద్ధతిలో సామాన్యవిషయములందైన గవర్నరుల అడ్డంకిలేకుండా స్వదేశమంత్రుల ప్రభుత్వము జరుగునుగదాయనియు, తరతరములనుండి దారిద్ర్యదుఃఖము ననుభవించుచున్న భారత దేశ రైతుబిడ్డలు కూలివారునుగల పాటకజనము, కొంతవరకైన ప్రభుత్వసాహాయ్యము పొంది బ్రతుకుదెరువు కలిగి కాలక్షేపము చేయవచ్చుననియు, వారికిగల బాధలలో కొన్నిటినైన నీ ప్రజాప్రభుత్వము తీర్చగలదనియు, కాంగ్రెసు కరాచీలో చేసిన ప్రజల ప్రాతిపదిక హక్కులును ఈ ఏబదేండ్లలో చేసియున్న తీర్మానములలోను ఈఎన్నికలందు పాల్గొనినప్పుడు చేసిన సంస్కరణల ప్రణాళికలో చేసిన వాగ్దానములలోను కొన్ని పనులనైనను చేసి దీనజనులకు మేలు కలిగించగలదనియు ప్రజలెల్లరు చకోరపక్షులవలె వేచియున్నారు.

ఎన్నికలప్పుడు చేసిన వాగ్దానములను చెల్లించుట యనునది ప్రపంచములో నెక్కడను కని విని ఎరుగనిసంగతి. ఆపద మ్రొక్కులవలె అదను గడచినపిదప, ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధులు తమ వాగ్దానములు మరచి ప్రమత్తులై ప్రవర్తించుచుండుట జగద్విఖ్యాతము. కాని దేశసేవకు నడుము గట్టిన కాంగ్రెసు తన వాగ్దానములను మరువలేదు. ఎన్నికల ప్రణాళికలో చెప్పిన ప్రతిసంగతి "తూ చ" తప్పకుండా చెల్లించుటకు నడుముకట్టినది. బ్రిటీషు రాజ్యతంత్రమునందు పార్లిమెంటుమంత్రి గవర్నరు జనరలు, గవర్నరులను ఎట్లు నడిపించుచున్నారో కాంగ్రెసు రాజకీయములందు కాంగ్రెసు ప్రెసిడెంటు వర్కింగుకమిటీవారు కాంగ్రెసుమంత్రుల నట్లు నడుపసాగిరి. ఈ కాంగ్రెసు ప్రభుత్వము చేయుచున్న ఏడు రాష్ట్రములును ఏకోన్ముఖమునకు తీసికొనిరాబడి కేవలము ప్రజల యొక్క క్షేమలాభములకొరకే పరిపాలన జరుపబడునట్లు విధింపబడినది. చేయునది కాంగ్రెసు ప్రభుత్వము; చేయించునది కాంగ్రెసే! ఇక చేయబడు పరిపాలనము ప్రజాపాలనమై ప్రజలచే, ప్రజలకొరకు నిర్వహింపబడుచుండుటలో నాశ్చర్యమేమి? ప్రభుత్వము వహించినవారు త్యాగశీలురు. అందువలన నీప్రభుత్వముయొక్క విధానమంతయుగూడ త్యాగధర్మములతో నిండిపోయినది. కాంగ్రెసుమంత్రులు ముందుగా తమ జీతములను పూర్వమంత్రుల జీతములలో 10 వ వంతుకు తగ్గించుకొనిరి. తరువాత కాంగ్రెసు ఉద్దేశ్యముల నొక్కటొక్కటిగా నమలులోపెట్టసాగిరి. నిర్బంధ శాసనములను రద్దుచేయు

టకు, రాజకీయఖైదీలను విడుదలచేయుటకు, మద్యపాన నిషేధ మును చేయుటకు, గ్రామ పునరుద్ధరణము చేయుటకు, చేతి పరిశ్రమలను ఖద్దరును సంరక్షించి అభివృద్ధి చేయుటకు, వ్యవ సాయదారుల ఋణభారమును తగ్గించుటకు, భూమిపన్ను తగ్గిం చుటకు భూస్వామ్య పద్ధతులను ధర్మబద్ధములుగ జేయుటకు, కర్షక కార్మిక శ్రేయమును కలిగించుటకు వెంటనే ప్రారం భించిరి. కాంగ్రెసు ప్రభుత్వ వ్యయపద్ధతి ఎట్లున్నదో చూపు టకు సంయుక్తరాష్ట్రమునందు పండిత గోవిందవల్లభ పంతు గారు అధికారమునకు రాగానే శాసనసభలో ప్రవేశపెట్టిన వ్యయపట్టికను ఉదాహరణముగ గైకొనవచ్చును.

పూర్వము 1935-36 సం॥ ఆదాయవ్యయ పట్టికలో 30 లక్షల రూపాయిలు, 1936-37 సం॥ బడ్జెటులో 63 లక్షల రూపాయిలు, రాబడికిమించిన వ్యయము చూపించబడెను. ఈసంవత్సరము మొదట ప్రాతమంత్రులచే తయారుచేయబడిన బడ్జెటులో జమకంటెఖర్చు41లక్షరూపాయిలు ఎక్కువఉన్నది. కాంగ్రెసువారు అధికారమునకువచ్చుసరికి కొంతరాబడి అధిక ముకాగా ఆలోటు 30 లక్షలవరకు వచ్చినది. పరిపాలనా వ్యయము తగ్గింపబడెను. ముఖ్యముగా ప్రయాణపు అలవెన్సులు 6 లక్షలు తగ్గింపబడినది. ఇన్నికారణములవలన లోటులేకపోగా 4½ లక్షలు నిలువ ఉండునట్లు ఆదాయవ్యయపట్టిక తయారు కాబడెను.

గవర్నమెంటువారు 17½ లక్షలరూపాయిలు క్రొత్త స్కీములకు శాంక్షనుచేసిరి. సాధారణపరిపాలన క్రింద 12 లక్షలరూపాయిల వ్యయము తగ్గింపదలచిరి.

జాతీయాభివృద్ధిని కలుగచేయు శాఖలకు గతసంవత్సరముకంటె ఈ సంవత్సరము 23 లక్షలు ఎక్కువఖర్చు పెట్టదలచిరి. ప్రజాక్షేమమును పెంపొందించు పనులకు 26½ లక్షలు ఏర్పాటు చేయబడెను.

ఈ క్రింది విధముగా ధనవ్యయము తలపెట్టబడినది:—

| | |
|---|---|
| గ్రామముల అభివృద్ధికి | రూ 10,00,000 |
| గ్రామములలో గ్రంథాలయములకు | 20,000 |
| పెద్దపట్టణములలో కలితీలేని పాలు సప్లయికి | 20,000 |
| కలితీలేని నేతిని తయారుచేసి అమ్ముటకు | 12,500 |
| పల్లెలలో నాణ్యమైన విత్తులుసప్లయి చేయుటకు | 3,00,000 |
| ఫెర్టిలైజర్లను సప్లయి చేయుటకు | 2,00,000 |
| పశుజాతిని అభివృద్ధి పరచుటకు | 37,500 |
| ఫలములను ఎక్కువగా నుత్పత్తి చేయుటకు | 2,000 |
| బంగాళాదుంపలను పరిశోధించుటకు | 5,000 |
| వ్యవసాయమునకు గొట్టపునూతులకు | 31,000 |
| ఖాదీపరిశోధన సల్పుటకు | 10,000 |
| చేనేత పరిశ్రమల అభివృద్ధికొరకు | 1,24,000 |
| లేబరు వెల్ఫేరుపనికి (కార్మికక్షేమమునకు) | 10,000 |
| బెల్లమును తయారుచేయు విధముల అభివృద్ధికి | 38,000 |

| | |
|---|---|
| ఇండస్ట్రియల్ క్రెడిటు కంపెనీకి | 1,25,000 |
| మార్కెటింగు కంపెనీకి | 25,000 |
| మలేరియా వ్యాధిని తొలగించుటకు | 80,000 |
| గ్రామములలో వైద్యసహాయమునకు | 1,50,000 |
| పారిశ్రామిక పనులకుగాను యువకులకు | 1,00,000 |

ప్రాతగవర్నమెంటువారు ఇదివరకే కల్లుపాటలను పాడించి యుండినందున, ప్రస్తుత గవర్నమెంటువారు ఏ విధమగు మార్పులను చేయజాలకపోయిరి. వచ్చే సంవత్సరమునుండి మద్యపాన నిషేధము అమలునం దుంచబడునని ప్రధానామాత్యుడు చెప్పెను. గవర్నమెంటు ఉద్యోగస్థులలోనున్న అవినీతిని తొలగించుటకుగాను ఒక స్పెషలుఆఫీసరును నియమింతురు. ఇందుకుగాను రు 10000 లు ప్రత్యేకింపబడెను.

గ్రామాభివృద్ధికై పాటుపడినవారిని గౌరవమేజిస్ట్రేట్లుగాను జుడిషియల్ ఆఫీసర్లుగాను నియమించుటకు అవకాశము కలదు. వీరిని గవర్నమెంటు సర్వీసులలోనికికూడ తీసుకొందురు.

ఈ సాలుకు (1938-39) తయారుచేయబడిన కాంగ్రెసు మంత్రుల బడ్జెటులు చక్కగానే యున్నవి.

సంయుక్తరాష్ట్రములందు: ప్రజారోగ్యముకొరకు ఒక కోటి పదిలక్షలరూపాయిలు ఖర్చుపెట్టుట; ఇందులో 97 లక్షలు కేవలము గ్రామస్థుల క్షేమలాభములకొరకే వినియోగించుట; వేసవికాలములో ప్రభుత్వకార్యాలయములు చల్లని కొండలపైకి పోవు దురాచారమును మానుట; మణిపురి, ఏటా జిల్లాలలో

మద్యపాననిషేధమును ప్రారంభించుట; నిమ్నజాతుల విద్యాభి వృద్ధికొరకు 50 వేల రూపాయిలు ఖర్చుపెట్టుట; విద్యార్థుల దేహదార్ఢ్యమును వృద్ధిచేయుటకు సైనికశిక్షణము నిచ్చుటకు 50 వేలు వెచ్చించుట; దేశవాళీబెల్లము పరిశ్రమల అభివృద్ధికి క్రిందటిసాలున చేసినఖర్చు 37 వేలను ఈసాలున ఒక లక్ష రూపాయిలకు హెచ్చించుట; చేతిమగ్గముల పరిశ్రమను సంరక్షించుటకు క్రిందటిసాలున చేసినఖర్చు ఒకలక్షముప్పదినాలుగు వేలనుండి ఈసాలున ఒకలక్ష అరువదినాలుగువేలకు హెచ్చించుట; ఖాదీపరిశ్రమకు 10 వేలకు బదులు 20 వేలు ఖర్చుపెట్టుట; నూతనపారిశ్రామిక వృత్తివిద్యలందు ఇతరకళలందు విద్యార్థులను తయారు చేయుటకొరకు ఒక లక్ష రూపాయిలను విరాళముల (గ్రాంటులు) క్రింద ఖర్చుచేయుట; నేరములుజేయు జాతులుగా నిర్ణయింపబడిన అనాగరికుల నుద్ధరించుటకొరకు అదనముగా 25 వేల రూపాయిలు ఖర్చుచేయుట; పోలీసుశాఖకు వెచ్చించు సొమ్ములో నింకొక లక్షరూపాయిలు తగ్గించుట; రాష్ట్రములో ఖనిజసంపదను శోధించుటకొరకు 6 వేలు; అయిదారుగురు వైమానికులను తయారుచేయుటకు 5 వేలు; కార్మిక శ్రేయముకొరకు క్రిందటిసాలున ఇచ్చిన పదివేలను ఈ సాలున 25 వేలకు హెచ్చించుటయు ఈసాలు ఆదాయ వ్యయపట్టిక లోని ప్రధానవిశేషములు.

మద్రాసు రాజధానిలో: క్రిందటి సాలువలెనే ఈ సాలున గూడా 75 లక్షల భూమిసిస్తుల తగ్గింపు; గ్రామములకుమంచి నీటి సదుపాయములను గలుగజేయు ప్రణాళికను నెరవేర్చుటకు

నిశ్చయించి ముందుగా నీయేడు 15 లక్షల రూపాయలు ఖర్చు చేయదలచుట; ఈ సాలున చిన్న రైతులకు వారి ఋణములను పరిష్కరించుకొొన గలందులకు వారికి సహాయము చేయుకొొరకు 50 లక్షల రూపాయలను ప్రత్యేకించి యుంచుట; పశువుల మేపు కొనుటకు విధింపబడు పుల్లరి రుసుములలో నూటి కేబది వంతుల తగ్గింపు; క్రిందటి సాలున సేలములో ప్రారంభించిన మద్యపాన నిషేధమును చిత్తూరు కడప జిల్లాలకు వ్యాపింపజేయుట; క్రిందటి సాలుకన్న ఈసాలున విద్యకొొరకు 5¼ లక్షలుఎక్కువ ఖర్చుచేయ దలచుట; అల్లో వైద్యము కొొరకు ప్రజారోోగ్యము నీటి సరఫరాల కొొరకు 20 లక్షలును, వ్యవసాయము పశుసంరక్షణకు సహకారపరపతికి 4 లక్షలు, పరిశ్రమల యభివృద్ధికి 4¼ లక్షలుఎక్కువగా ఖర్చుపెట్ట దలచుటయు ఈ సాలున నిర్ణయింపబడిన ఆదాయవ్యయ పద్ధతిగా మద్రాసు ప్రధానామాత్యుడు 1938 మార్చి 1 వ తేదీన శాసనసభలో ప్రకటించినాడు.

కాంగ్రెసు ప్రభుత్వమునకు రాగానే భారత దేశ దాస్యమును చిరస్థాయిగా చేయదలచిన ఈబానిసరాజ్యాంగమును తిరస్కరించుచు భారతజాతీయప్రతినిధులమహాసభ (Constituent Assembly) వారిచే తయారుచేయబడురాజ్యాంగ స్థాపనమును గోరుచు నొకతీర్మానము అన్ని శాసనసభలందును గావింపబడెను. బ్రిటిష్‌వారు భారత దేశ కేంద్రమున ప్రవేశ పెట్టదలచిన ఫెడరలు రాజ్యాంగవిధానము భారత దేశప్రజలకు అనిష్టకరమనియు అంగీకారముకాదనియు దానిని వెంటనే రద్దుపరచి కేంద్రప్రభుత్వమునకు తగు ఏర్పాటు గావింప

వలసినదని బ్రిటీషుప్రభుత్వమునకు తెలుపుచుకూడ తీర్మానములు గావింపబడెను. ఇట్లు భారత దేశజాతీయతత్వము బ్రిటీషుసామ్రాజ్యతత్వముతో బ్రిటీషు రాజ్యాంగధర్మపద్ధతులతో నే పోరాడు నవీనయుగము ప్రారంభమైనది. బ్రిటీషు రాజ్యతంత్రమును ఎదుర్కొనిన శక్తులలో కాంగ్రెసుశక్తి మహాశక్తి యనియు ఇక నీబ్రిటీషు రాజ్యతంత్రముయొక్క ఆటలు సాగవనియు వెల్లడి యైనవి. బ్రిటీషుప్రభుభక్తిపరాయణులయొక్కయు, స్వార్థపరులగు జాతిమతకుల పక్షములవారియొక్కయు రోజులు దగ్గరించినవని భారత దేశజాతీయవికాసము నిక నెవ్వరు నాపలేరని కాంగ్రెసుప్రభుత్వము ప్రపంచమునకు వెల్లడించినది. నేడు కాంగ్రెసుయొక్క తేజము అప్రతిమానమై మహాత్ముని సారథ్యమున నిస్సందేహముగా నీస్వాతంత్ర్యమహాయుద్ధమున సంపూర్ణ విజయము గాంచగలదని స్థిరపడినది. బ్రిటిషు సామ్రాజ్యము వారు కాంగ్రెసు శక్తికి వెరగందినారు. రాజప్రతినిధియు గవర్నరులును కాంగ్రెస్ తేజమును చూచి ఆశ్చర్యపడినారు. భారత దేశమునందు ఐరోపావాసులును ఆంగ్లేయ సంఘములవారును వీరి పత్రికరాజములను ఈ కాంగ్రెసు మంత్రులయొక్క ప్రభుమంత్రోత్సాహ శక్తులను జూచి మెచ్చుకొన్నారు. పూర్వపు స్వార్థపరుల ప్రభుత్వమునకును నేటి స్వార్థత్యాగుల ప్రభుత్వమునకును గల తారతమ్యమును చూపి బాగుబాగనినారు. ఇట్లు శాసన సభా ప్రవేశము అధికారస్వీకరణము కాంగ్రెసు బలమును తేజమును ఇనుమడింప జేసినవి. కాంగ్రెసు పరువు ప్రతిష్ఠలు

పెంపొందినవి. నిర్మాణ కార్యక్రమము నెరవేరుచున్నది. కాంగ్రెసు ఉద్దేశ్యములు సఫలీకృతములగుచున్నవి. దేశములో జాతీయ భావము ద్విగుణీకృతమై కాంగ్రెసు అధికారమున లేని తక్కిన రాష్ట్రములందు కూడ ఈ భావములు ఈ సంస్కరణములు వ్యాపించి కాంగ్రెసు యొక్క అఖిలభారత జాతీయతను సార్థకమొనరించుచున్నది. నేడు గవర్నరులు గవర్నరుజనరలు బ్రిటిష్ పార్లమెంటువారు కూడ కాంగ్రెసును జూచి గడగడ వణకుచున్నారు. కాంగ్రెసుకొరకు సర్వస్వము త్యజించి కాంగ్రెసు పోరాటములో బాధలనంది తుదకు దేశముకొరకు ప్రాణములర్పించిన ధన్యులగు లోకమాన్య తిలకు, లజపతిరాయి, దాసు, నెహ్రూ, అన్సారీ, ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు డాక్టరు సుబ్రహ్మణ్యంగారు మొదలగు మహారథులయొక్కయు అతిరథుల యొక్కయు ఇంకనేక సేనానుల యొక్కయు, బ్రిటిష్ వస్త్రబహిష్కారమున ప్రాణముబాసిన బాబుగనూలవంటి శాంతిసైనికుల యొక్కయు, పేరులేకుండగనే పనిచేసి దేశమున కాహుతియైన అసంఖ్యాకులగు అజ్ఞాతవీరుల యొక్కయు తపము నేటికి పుష్పించినది. త్వరలోనే ఫలింపగలదనుటకు సందియములేదు. ఈ కాంగ్రెసుపితృదేవతల యాత్మలు కొంత వరకైన శాంతి జెందుచున్నవనుటలో సందియములేదు.

## III

## రాజ్యాంగధర్మ మర్యాద

రాజకీయములందు కాంగ్రెసుయొక్క బలము ప్రదర్శింపబడిన తరుణము త్వరలోనే తటస్థించినది. సంయుక్త రాష్ట్రమునను బీహారులోను మన మంత్రులు దారుణవిప్లవ వాదుల నెల్లరిని వదలివేయుచు ఉత్తరువుచేయగా గవర్నరులు దాని కడ్డుపడి గవర్నరుజనరలుచేత రద్దుచేయించిరి.

ఈ దారుణవాదుల సమస్య భారత దేశములో చాల కాలమునుండియున్న సమస్య. 1897 లో నిది ఆరంభమై 1908-09 లో అతి తీవ్రమై 1912 వరకు దీని నణచుటకు ప్రభుత్వమువారు ప్రయోగించిన కఠిన శాసన నియమములు, విధించిన ఉరిశిక్షలు, కఠిన వరకములు, పెట్టిన కుట్రకేసులు, చేసిన సోదాలు భీభత్సములవలన ముఖ్యులు జైళ్ళలోని కంపబడుట వలన లోకమాన్యుడాదిగాగల రాజకీయనాయకులనుగూడ నిర్బంధములందుంచి సామాన్యప్రజాభిప్రాయమును, ప్రజల ప్రాతిపదిక స్వాతంత్ర్యములనుగూడ అణచివేసి భీభత్సము చేయుటవలన, కొన్నాళ్ళు ఈదారుణవాదుల కృత్యములందు విరామముకలిగెను.

రౌలటుకమిటీవారి నివేదికవలన దేశములో సీయుద్యమమెంతలోతుగా వేళ్ళుపారి పాదుకొనినదీ వెల్లడియయ్యెను. 1918 నాటికి 800 మంది నిర్బంధితులుండిరి. నాటినుండి నేటి వరకు దారుణకృత్యము లప్పుడప్పుడు జరుగుచునేయుండెను.

ఇట్టి స్థితిలో మహాత్ముడు స్వరాజ్యము సంపాదించుటకు అహింసాపద్ధతులతో శాంతి సమరముచేసి సహాయ నిరాకరణ శాసనోల్లంఘనోద్యమములను ప్రారంభించెను. ఈ అహింసా మార్గముతో సాత్వికనిరోధముచేయుటలో తాము బాధపడుట తప్ప ప్రతిపక్షులను బాధపెట్టగూడదు. ఈ వింతపద్ధతివలన దేశములోకలిగిన సంచలనమున కాశ్చర్యపడి నిజముగాదీనివలన కొంతలాభము కలుగునేమోయని తోచినదిగానిమహాత్ముని అహింసాపద్ధతి శాంతి సమరము నణచుటకు ప్రభుత్వము ప్రయోగించిన హింసాపద్ధతులు, కూ్రరశిక్షలు, లాఠీఛార్జిలు, కాల్పులుచూచి ఈఅహింసాపద్ధతులతోడ సాత్వికనిరోధము చేయుటవలన లాభములేదని దారుణవాదులకెల్లరకు తోచినది. అంతట వారుచెలరేగి దారుణకృత్యములు చేయసాగిరి. 1924 లో రీడింగు ప్రభువుక్రిమినలు లా అమెండ్మెంటు సవరణ ఆర్డినెన్సు జారీచేసి తీవ్రనిర్బంధవిధానమును ప్రయోగించెను. 1924 అక్టోబరు, నవంబరులలో 63 మంది అరెస్టు చేయుబడిరి. వీరిలో 18 మంది 1818 సం॥ రిగ్యులేషనుక్రింద నిర్బంధింపబడి తరువాత ఆర్డినెన్సుక్రింద శిక్షింపబడిరి. కలకత్తా కార్పొరేషను ఎగ్జిక్యూటివ్ ఆఫీసరగు సుభాస్ చంద్రబోసును, ఇంకొకశాసన సభ్యుడునుకూడా అరెస్టుచేయబడిన వారిలోనుండిరి. ఈయువకులనెల్ల దేశములో వివిధజైళ్లలో పడవేసిరి.

1930 లో మహాత్ముడు సత్యాగ్రహము ప్రారంభించుటకు ముందు తన అహింసాపద్ధతుల ప్రకారము శాంతిసమరము జరుపుకాలమున దారుణవాదులు దారుణకృత్యములుచేసి

శాంతికి భంగముకలిగింపకుండ నుండవలసినదని కోరెను. ఆయన కోరికప్రకారముకొన్నాళ్లూరకొనిరిగాని శాసనోల్లంఘనమును అణచుటకు ప్రభుత్వమువా రవలంబించిన క్రూరపద్ధతులు, లాటీచార్జీలు, కాల్పులు చూచినపిదప దారుణవాదులు చెల రేగి ప్రభుత్వముపై దిరుగబడిరి. భగవత్ సింగు తన అసమ్మతి సూచించుటకు అసెంబ్లీసభలో బాంబుపడవేసెను. అంతట ప్రభుత్వముగూడ తీవ్రమైన చర్యగైకొని కుట్రకేసులుపెట్టి చాలమందిని శిక్షించిరి. భగవత్ సింగు నురిదీసిరి. విల్లింగ్డన్ ప్రభువు వచ్చినపిదప ఇంకను తీవ్రపద్ధతి ప్రారంభించెను. ఈదారుణ వాదులను అణచుటకు కొలటు శాసనముకన్న తీవ్రతర నిర్బంధములుగల ఆర్డినెన్సులజేసెను. ఎట్టి విచారణలేకనె వందలకొలది మందిని నిర్బంధింపసాగిరి. దేశములో పటాలములు నడుపబడుచుండెడివి. వారికి విద్యార్థులెల్లరు సలాములు చేయవలసియుండెను. దారుణవాదుల బంధువులు స్వేచ్ఛగా తిరుగుటకు వీలులేదు. అందరును అనుజ్ఞాపత్రములను పొందవలెను. పాఠశాలల పిల్లలుగూడ నిర్బంధించబడిరి. సర్ జాన్ ఆండర్సన్ వంగరాష్ట్రమునకు గవర్నరుగా నియమింపబడెను. ఐర్లాండులో సిన్‌ఫిన్ విప్లవమున అనుభవముగలవాడై నందుననే నియమింపబడెనని ప్రతీతి. ఈ సందర్భమున మూడువేలమంది యువకులు చెరలందుంచబడిరి. ఈ దారుణ వాదుల దారుణకృత్యములకు ప్రభుత్వమువారి దారుణవిధానము తీసి కట్టుగా లేకుండెను. ఈ యువకులను సన్మార్గమునకు త్రిప్పవలెనని వీరి నహింసావాదులుగా చేయవలెనని మహాత్ముని

సంకల్పము గానిప్రభుత్వము మహాత్ముని కా యవకాశమును కలిగింపలేదు. ఈ దారుణవాదులుకూడా స్వతంత్రముకొరకే ప్రయత్నించు దేశభక్తులైనందున, దేశమునకు స్వపరిపాలన మొసగినచో వీరు తమ దారుణ వాదమును వదలివేయుదు రని మహాత్ముడు చెప్పినను ప్రభుత్వము నమ్మలేదు. రాష్ట్రీయ స్వపరిపాలనము వచ్చినచో వెంటనే వీరిని విడుదలచేయవలెనని రౌండు టేబిలు సభలోకూడా ఈయన చెప్పియున్నాడు. తుదకు మహాత్ముని జోస్యమే నిజమైనది.

ఈ దారుణవాదు లుంచబడిన సామాన్య జైళ్ళలోని పరిస్థితులును అండమాను దీవులలోని అనారోగ్యస్థితులును కూరపద్ధతులును భరింపలేక జైలుపద్ధతులందు సంస్కరణ ములగోరుటకు ఈ దారుణవాదులు నిరశనవ్రతము చేయ సాగిరి. ఇందుకొరకే జతిన్‌దాసు ప్రాయోపవేశము చేసియుం డెను. దీనివలన సామాన్య రాజకీయఖైదీలకు కొంత సౌక ర్యము కలిగింపబడెను గాని అండమానుదీవులవారి బాధ లట్లేయుండెను. ఇది భూతలస్వర్గమని ప్రభుత్వపక్షపాతు లనగా చూచివచ్చిన ప్రజాప్రతినిధు లిదిభూలోక నరకమనిరి. దీనినిగూర్చి శాసన సభలలో తీవ్రచర్చలు జరిగెను. గాని లాభము లేకపోయినది. ఇట్టి స్థితిలో నూతన రాజ్యాంగ సంస్కరణల చట్టము అమలులోనికి వచ్చినది. అండమాను ఖైదీలు 200 మంది తమ బాధలు భరించలేక ప్రాయోప వేశము చేయ నిశ్చయించిరి. అందువలన దేశములో గొప్ప సంచలనము కలిగినది. మహాత్ముడు తాను వారితరఫున పని

చేసెదననియు వారిని నిరశనవ్రతము మానవలసినదనియు కోరి వంగరాష్ట్రప్రభుత్వమువారితో మాటలాడగా తుదకా ఖైదీల నందరిని అండమానునుండి మన దేశమునకు తెచ్చిరి. విచారణలులేకయే నిర్బంధమునందుంచబడిన 'డిటెన్యూ' దారుణవాదులను మెల్లిగా విడచి వారిచర్యలు కనిపెట్టిచూచు పద్ధతిని ఆండర్సన్ ప్రారంభించియుండెను. ఆ పద్ధతిని ఇంక నెక్కువజేసి నిర్బంధితులను చాలవరకు విడుదలజేసిరి. ఇక కొద్దిమంది అండమాను ఖైదీలు మిగిలిరి. వీరిలో చాలమంది వంగరాష్ట్ర ప్రభుత్వములోనివారు. 23 మంది బీహారువారు, 15 మంది సంయుక్త రాష్ట్రములవారు. వీరిని విడుదలచేయుట న్యాయమని కాంగ్రెసు అభిప్రాయము. ఆ ప్రకారము వీరిని విడుదలచేయుటకు మంత్రిమండలి సభలో ఆలోచించగా గవర్నరులు ఏదో మిషపైన జాగుచేయసాగిరి. వీరు రాజకీయ ఖైదీలు గారనియు దారుణనేరములకొరకు శిక్షింపబడ్డ నేరగాండ్రనియు గవర్నరు యొక్క వాదము. అందువలన వీరిని విడువరాదనిరి. వీరు దేశస్వాతంత్ర్యము కొరకే దారుణ పద్ధతులు ప్రయోగించుచు విప్లవమార్గముల నడచిన రాజకీయవాదులనియు వీరుకూడ రాజకీయ ఖైదీలేయనియు మరియు నేటి రాజకీయ పరిస్థితులలో పూర్వమువలె హింసాపద్ధతు లనవసరమని గ్రహించి వీరు అహింసామార్గముల పోరాట పద్ధతులకు త్రికరణ శుద్ధిగా అంగీకరించుచూ మహాత్మునికి మాటనిచ్చినారనియు వీరిని విడుదలచేసి తీరవలెననియు మంత్రులు వాదించిరి.

పదియొల్లున్నను ఖైదీల విడుదల మంత్రుల యధికారము క్రింద జేరిన సామాన్య పరిపాలనకు సంబంధించిన విషయము. అందువలన కాంగ్రెసు మంత్రులు ఈ కొద్దిమంది ఖైదీలను విడుదలచేయుచు జారీ చేసిన ఉత్తరువులను గవర్నరుజనరలు తనయొక్క శాంతిభద్రతల కేర్పడిన విశేషాధికారము నుపయోగించి రద్దుచేయుట రాజ్యాంగధర్మవిరుద్ధమని రాష్ట్రియ స్వపరిపాలనకును లోగడ చేయబడిన వాగ్దానములకును భంగకరమనియు మంత్రుల యాత్మగౌరవమునకును భంగకర మనియు నిశ్చయించి సంయుక్తరాష్ట్ర బీహారుల లోని కాంగ్రెసు మంత్రులు ఫిబ్రవరు 15 తేదీన రాజీనామా నిచ్చిరి. ఈ విషయము దేశములోను ఇంగ్లాండులోను గూడ తీవ్రముగా చర్చింపబడి మనమంత్రులదే న్యాయపక్షమని నిర్ణయింపబడినది. హరిపురకాంగ్రెసు ఫిబ్రేవరు 20 వ తేదీన జరిగెను. గాంధిమహాత్ముని ప్రభావమువలన ఈవిషయమునుగూర్చి అతినిపుణమైన తీర్మానము చేయబడెను. అంతట రాజప్రతినిధియు గవర్నరులుగూడ తమపొరబాటు సవరణ జేసికొని మనమంత్రులతో సఖ్యతచేసికొనిరి. ఇట్లు సామాన్య పరిపాలన మందు మంత్రుల పరిపాలన కాటంకము చేయరాదను రాజ్యాంగమర్యాద యొకటి యేర్పడినది.

# IV

## ప్రభుత్వనిర్వహణమునందలి కష్టసుఖములు.

పరిపాలనయంత్రము:—దేశపరిపాలనము ప్రభుత్వనిర్వహణము సామాన్యకార్యములుకావు. అందు ముఖ్యముగా దేశము పారతంత్ర్యమున బడియుండి దేశప్రజ లజ్ఞానులై నోరులేనివారైనప్పుడు దేశసేవయు ప్రజాసేవయు చేయుట మరింతకష్టతరము. మరియు మన భారతదేశ రాజకీయములందు మనజాతీయ ప్రభుత్వమునకు ఇంకను కష్టతమమైన పరిస్థితులేర్పరుపబడియున్నవి. రాజ్యతంత్రముగ్గుపాలుగా నభ్యసించిన ఆంగ్లేయరాజ్యనీతిజ్ఞులు దేశములో జాతీయతను విచ్ఛిన్నము చేయుటకు నీ రాజ్యాంగమున అనేకభేదోపాయములను కల్పించియున్నారు. పార్లమెంటుయొక్క సర్వాధికారము, వారితాబేదారులగు రాజప్రతినిధియొక్కయు గవర్నర్లయొక్కయు విశేషాధికారములు నీరాజ్యాంగములను శత్రులబోనుగా జేసినవి. ప్రజల కేయుపకారము చేయవలయునన్నను ఎదోయొక వాడికత్తిపై అడుగుపడితీరును. మంత్రులయాజ్ఞలెల్ల నిర్వహించవలసినవారిలో ముఖ్యులు ఐ. సి. యస్. ఉద్యోగులు. ప్రాతనిరంకుశ ప్రభుత్వయంత్రమునెల్ల నడిపినది వీరే. ప్రాతప్రభుత్వస్వరూపమున కొన్నిమార్పులు జరిగినను ఈ ఐ. సి. యస్. ఇనుపచట్రములో నెట్టిమార్పును చేయబడలేదు. ఇందువలన ప్రజలకు బాధ్యులగు మంత్రులక్రింద మంత్రులకు బాధ్యతవహింపని ఐ. సి. యస్. వారు నెలకొల్పబడుటవలన నీప్రభుత్వ యంత్రమును నడుపుట ఎంత

కష్టమో అనుభవించిన తెలియునేగాని యూహింపనలవిగాదు. ఇప్పుడుగాకపోయిన ముందైనను ఈచిక్కులెల్ల క్రమక్రమముగా దలలెత్తగలవు. మనమంత్రులను జీకాకుపర్చుచున్న పరిస్థితు లిప్పటికే గలవు.

బ్రిటీషు పార్లిమెంటువారు, గవర్నరుజనరలు గవర్నరుల ద్వారా తమ సర్వాధికారములను చలాయించి మన మంత్రుల పరిపాలనకు వెంటనే అడ్డుతగులకపోయినను ఎన్నటికైనను తగవులురాకతప్పదు. మన ప్రజలకుక్షేమలాభములు కలిగింపవలెనన్నచో బ్రిటీషువారికి నష్టములుగలుగకతప్పదు. తత్క్షణమే లోపల నణగియున్న విశేషాధికారములు త్రాచుకోరలవలె ప్రయోగింపబడితీరును. బ్రిటీషువారి పలుకుబడి యింకను మిగిలియున్నది. ప్రాపకము, గౌరవపట్ట ప్రదానము, పదవులు, బిరుదులు ఒసగబడుచు ప్రజలలో కొందరికి వ్యామోహము కలిగించుచునేయున్నవి. ఎంత విధేయత కనబరచుచున్నను బ్రిటీషు రాజ్యతంత్రమునకు మూలకంబములగు సీ ఐ. సి. ఎస్. ఉద్యోగులు లోలోపల ప్రాతనిరంకుశ పద్ధతులతో వ్యవహరించుచునేయున్నారు. డెక్కుబంగాళా, మోటారుకారు, జమాబందీ పద్ధతులు జరుగుచునేయున్నవి. అనుశృతమైన జరీతలపాగలు, నల్లకోటులు, మల్లుపంచలు ధరింపనక్కరలేదని మన కాంగ్రెసుమంత్రు లుత్తరువు లిచ్చియున్నను నిరంకుశ పూర్వాచార పరాయణులు ఈ బ్రిటీషు డవాలీలను తీసివేయనీయలేదు. నేటికిని ప్రభుత్వ కార్యాలయములందు బుట్టతలపాగలు కనబడుచునేయున్నవి. పై యధికారులు ప్రాతదుస్తులనే తాము

ధరించుచు క్రిందివారిని ధరింపజేయుచునేయున్నారు. ప్రభుత్వోద్యోగులు ఖద్దరును స్వేచ్ఛగా ధరింపవచ్చునని మంత్రుల వలన తాఖీదు సాదరుచేయబడినను అమలులో నదృశ్యమై యున్నది. జాతీయజెండా నెగురవేయుటకు ప్రజలు ఉత్సాహపడుచుండగా, ప్రభుత్వ మామోదించుచుండగా, మంత్రులు దానిని శిరసావహించుచుండగా, కొందరు బ్రిటీషుప్రభు భక్తిపారాయణు లింకను 'యూనియన్ జాక్'ను నెలకొల్పుచునే యున్నారు. బీహారుసెక్రిటరీ యగు నొక ఐ. సి. ఎస్. ఉద్యోగి తన తాబేదారులకు జారీ చేసిన తాఖీదు కాంగ్రెసుమంత్రుల అధికారమునకు భంగము కలిగించుచున్నదని తరువాత రద్దుచేయబడినదిగాని అసలు సంగతి తెలిసినది. జాతీయ భావములుగల భారతీయ ఐ. సి. ఎస్. ఉద్యోగియగు కామత్ గారిని ఆయనక్రింద నుండవలసిన తెల్లపోలీసు యుద్యోగిచేసిన అగౌరవమువలన ఆయన తన పదవికి రాజీనామానిచ్చుటలోనే ప్రభుత్వోద్యోగములందు కూడ నేటికిని యెంత తారతమ్యమున్నదీ వెల్లడియగుచున్నది. భారతీయులను తెల్లవారింకను అవమానించుచునేయున్నారు. ఈమధ్య మన విద్యార్థులు తెల్ల సోల్జరులవలన అవమానింపబడిరి. తెల్లసోల్జరులు చేయుచున్న అత్యాచారము లనేకములు బయల్పడినవి. మేజస్ట్రీటులు, పోలీసువారు ఇతర ప్రభుత్వ శాఖోద్యోగులు తమ ప్రాతపద్ధతులను ఇంకను మార్చుకొనలేదు. ఏ కొలదిమంది ఉద్యోగులో తప్ప చాలమంది ఇంకను ప్రజలను ఈగలు దోమలువలె చూచుచున్నారు. ప్రజలే

పాలకు లను సంగతి గమనించి ఈ ప్రభుత్వోద్యోగులు వీరి తాబేదారులు ప్రజలను గౌరవించుటలేదు సరికదా వారితో కలిసిమెలసి మాటలాడుటయైనలేదు. డి. పి. డబ్లియు. శాఖలో నింకను లంచములు చెలరేగుచునేయున్నవి. సహకారసంఘములు జిల్లాబోర్డులు మునిసిపాలిటీలు కులతత్వకక్షలకు తావలములై స్వార్థపరులతో నిండి ప్రజల కుపకరింపకున్నవి. చిన్నచిన్న ప్రభుత్వోద్యోగులు దఫేదారులు పోలీసుజవానులు రాజకీయమునందు వచ్చినమార్పును అర్థము చేసికొనలేకుండ నున్నారు. జనసామాన్యము తమ హక్కులను అర్థము చేసుకొనలేకున్నది. ఈపరిస్థితులను మాన్పుటకు మనమంత్రులు వెంటనే తగుచర్య దీసికొనినతప్ప దేశప్రజలు ఈప్రభుత్వము వలన పొందతగిన లాభములను పూర్తిగా పొందజాలరు.

కాంగ్రెసుయొక్క గృహచ్ఛిద్రములు :—ఇక కాంగ్రెసులో కూడా కొన్నిలోపములు కనబడుచున్నవి. కాంగ్రెసులోనే వివిధభావములవారు వివిధభాషలవారు వివిధజీవితవిధానముల కలవాటుపడినవారు గలరు. కొందరు తమపవిత్రతను వీడి పతితులై దుర్మార్గము లొనరించుచున్నారు.

కాంగ్రెసు సంస్థలకు ప్రభుత్వములో గొప్పపలుకుబడి యున్నందున వీనిలో ప్రవేశించి వీనిని వశపరచుకొనుటకు ఇతర పక్షీయులు స్వార్థపరులు, పూర్వపు మల్లుతానుల ప్రభుభక్తి పరాయణులు, మహాప్రయత్నములు చేయుచు కాంగ్రెస్ఎన్నికలలో అనేక అన్యాయములు జరుపుచున్నారు.

ధనము విచ్చలవిడిగా వెదజల్లబడుచున్నది. క్రమశిక్షణము లేక, విధేయత లేక, పెద్దపిన్న తారతమ్యములేక ఎవరికివారు నాయకులై కాంగ్రెసులో అపకీర్తికరములైన పనులు చేయుచుండుట చూచుచున్నాము. 'చోటా' కాంగ్రెసు నాయకులు బయలుదేరి కాంగ్రెసులో చీలికలు కలిగించుచున్నారు. సోషలిష్టులను వారు జవహర్‌లాలు నెహ్రూ ప్రభృతుల పరిశుద్ధ సామ్యవాద సిద్ధాంతములను శిరసావహింపక ఎవరికితోచిన సిద్ధాంతములను వారు వెదజల్లుచు శాంతిభద్రతలకు కూడ భంగము కలిగించి తమ కాంగ్రెసుసోదరులగు మంత్రులకు చాలకష్టములు తెచ్చిపెట్టుచున్నారు. ఇక మంత్రులలో కూడ లోపములు లేకపోలేదు. వీరిలో కొందరు కాంగ్రెసు సాము గరడీలలో ఆరితేరివృద్ధులైన మహాయోధులు, కొందరు నూనూగు మీసాలవారు, కొందరు తాత్కాలికముగా కాంగ్రెసు ప్రమాణములనుగైకొని వచ్చినవారు. ఇన్నిరకములవారిని కూడకట్టుకొని పరిపాలింపవలసివచ్చి శాసనసభలలోను ప్రభుత్వములోను మన ప్రధానమంత్రి కఠిన నియమములు కట్టుబాటులు చేసినాడు. ఇట్లు చేసియుండనిచో మనప్రభుత్వము కప్పలతక్కెడవలె యుండునేమో! రాష్ట్రీయ కాంగ్రెసుసభలలో మన కాంగ్రెసువారి వైఖరి చూచినచో కట్టుబాటులుండుట మంచిదే యైనదని స్థిరపడినది.

కాంగ్రెసే ప్రజలు, ప్రజలే కాంగ్రెసు, గనుకను కాంగ్రెసు మంత్రులు ప్రజాసేవకులే గనుకను పూర్వపు నిరంకుశ మంత్రులకు చేసినట్లు ప్రజలు కష్టపడి ఖర్చుపడి స్వాగతము లిచ్చి ఫోటోగ్రాఫులు దీసి విందులుచేసి తుదకు తమకు

గావలసిన సంస్కరణములనుగూర్చి మొఱబెట్టుకొనుచు వినతి పత్రములు సమర్పించు పద్ధతి మానవలెననియు, కాంగ్రెసు మంత్రులకు నిర్భయముగా తమ కష్టసుఖములను తెలుపవలసినదనియు, అవసరమని తోచినచో కావలసిన సంస్కరణములు సూచించు నొక ప్రజ్ఞాపనపత్రికను ఒసగవచ్చుననియు కాంగ్రెసులో బాధ్యత గలవారును, మహాత్ముడును, మన ప్రధానామాత్యుడును గూడ మొట్టమొదటనే చెప్పియున్నారు. కాని ప్రాత సంప్రదాయములో మునిగి తేలుచుండి ప్రాతపద్ధతు లొక్కమారుగా మానలేని కొందరు ప్రజలు మన మంత్రులకు గూడ విందులు వినతిపత్రములు సమర్పించిరి. అంతట నీ వ్యామోహము వృద్ధియైనది. ఒకరినిచూచి ఒకరు ఇట్లుచేయుటయు వీనిని స్వీకరించుటయు జరుగుచున్నది. ఈ పదుగురుమంత్రులు పదిమంది కార్యదర్శులు వచ్చునప్పుడు పోవునప్పుడుగూడ ఏదో యొక సందర్భము కల్పింపబడుచు, విందులు, వినతిపత్రములు, పూలదండలు సమర్పింపబడుచున్నవి. పొగడ్తలు ఫోటోగ్రాఫులు వృద్ధియైనవి. స్వార్థపరులు ధనము విచ్చలవిడిగా ఖర్చుపెట్టి మంత్రులను కార్యదర్శులను ఏదోమిషపైన రప్పించి మహార్యాదలు చేయుచున్నారు. త్యాగశీలురును స్వతంత్రయోధులునగు నీమంత్రులును కార్యదర్శులును తమ కాంగ్రెసు ధర్మములకు దీనివలన భంగము కలుగుచున్నదని కొంచమైన ఆలోచించుటలేదు. ఈ అధికార వ్యామోహమున దిగ్భ్రమ జెంది కర్తవ్యతా మూఢతచేత బాధ పడుచున్నారో లేక

ప్రభుత్వోద్యోగుల కరస్పర్శనములు, సరససల్లాపములు, మెప్పులు చూచి మురియుచున్నారో గాని మహాత్ముని ధర్మబోధలను కాంగ్రెసు నియమములను కూడ మరచి ప్రవర్తించుచున్నట్లు అనుమానము కలుగుచున్నది. తమ పరిపాలన చక్కగా జరుగుచున్నదో లేదో కనిపెట్టి చూచుటకును, ప్రజల కష్టసుఖము లరయుటకునుగదా, యీ మంత్రులు కార్యదర్శులు దేశములో పర్యటనముచేయుట! ఇట్టికరి, యీ విందులలో, సన్మానములలో, ఊపిరితిరుగక యున్నందున, వీరు తమతో కష్టము లనుభవించిన కాంగ్రెసు సేవకులతోగాని జనసామాన్యముతోగాని దేశక్షేమలాభములను గూర్చి మాటలాడుటకు కూడ వీలుకలుగుటలేదని వీ రేల గమనింపరు? మంత్రు లీ వ్యామోహామును వీడవలెను. ఈ విందులు గోవిందులు నిరాకరింపవలెను. ఈ వినతిపత్రములు తిరస్కరింపవలెను. తాముక లెక్టరులయింటఅధికారులయింటబస చేయుట మానవలెను. ఉద్యోగులకు సందర్శనములిచ్చి బహిరంగముగా కరస్పర్శనముచేయుట మానవలెను. ప్రాతఖైదీలతోను, దీనజనులతోను, దరిద్రులతోను ఎక్కువగా కలిసి మెలసి వర్తింపవలెను. లేనిచో ప్రాతపరిపాలనా పద్ధతులును, నిరంకుశప్రభుత్వమును పోయి, ప్రజాపరిపాలన మేర్పడినదని జనసామాన్యము గ్రహింపనేరదు. ప్రాతమంత్రులకు క్రొత్త మంత్రులకు గల తారతమ్యము వెల్లడికానేరదు. ప్రజాప్రభుత్వమనగా, ప్రజలందరికిని బాధ్యతగల ప్రభుత్వమనియు కేవలము ధనవంతులకే గాక, దరిద్రులకు, రైతులకు, కూలి

వారికి గూడ వోటుహక్కు కలుగుట అనగా తమ యభి ప్రాయానుసారముగా ప్రవర్తించి తమక్షేమలాభములకొరకు ప్రభుత్వము నడుపగల ప్రతినిధుల నెన్నుకుని వారిచే పరిపాలన జేయించుటయే యనియు ప్రజలెల్లరు గ్రహించునట్లు చేయ వలెను.

ఈప్రభుత్వము తమదేయనియు, పూర్వము తమపై స్వారిచేయుచుండిన నిరంకుశాధికారులు, కలెక్టరులు, తహిసీలు దారులు, మేజస్ట్రీటులు, పోలీసువారు, ఇప్పటినుండి తమకు సేవకులై మెలగవలసియున్నదనియు ఇందుకు వ్యతిరేకముగా ప్రవర్తించినచో వారిని తాము దండింపవచ్చుననియు, ప్రజలు తెలిసికొనునట్లు చేయవలెను. దేశముయొక్క భాగ్యభోగ్యము లెల్ల జనసామాన్యము అనుభవించుటకు హక్కుకలదనియు, విద్యావైద్యసహాయములుచేయుడని, అజ్ఞానము బాపుడని, దారి ద్ర్యము మాన్పుడని ప్రభుత్వవర్గమును కోరుటకు తమకధికార ముకలదను సంగతి నీ ప్రభుత్వమంత్రులు ప్రజలకు స్పష్టముగా చెప్పవలెను. దేశము నావరించియున్న ఈగాఢమైనఅవిద్యాం ధకారము ప్రజల నావరించియున్న అధికారులను జూచిన భయము పోయినగాని ప్రజలకు కలిగిన స్వల్ప అధికారములు ఈవోటు హక్కులు వారు తమలాభముకొరకు వినియోగించు కొని బాగుపడజాలరు. అవియున్నియు ధనికులకే లాభము కలిగించునుగాని బీదలకు లాభింపవు. కూలివాడు ఎప్పటికిని కూలివాడుగానే యుండును గాని ప్రభుత్వమును నడుపగల రాజకీయ హక్కుగల పౌరుడుగా అభివృద్ధిగాంచజాలడు. అందు

వలన నేటిమంత్రు లిప్పటికైనను తమధర్మమునుగుర్తెరిగి దేశ సమస్యలెల్ల పరిశీలించి ప్రజల క్షేమలాభములకు వలసిన సంస్కరణ లెల్ల చేయుటయేగాక అవి అమలుజరుగుచున్నదీ, లేనిదీ కనిపెట్టి చూడవలెను. ఇట్లు తల్లి శిశువును సంరక్షించు నట్లు మంత్రులు ప్రజలను కాపాడి పరిపాలించవలెను. లేనిచో నీ నోరులేనిప్రజలు మఱల అజ్ఞానమున, భయమున మునిగి పైకిరాలేక అగాధములో పడిపోవుదురు.

## V

## కాంగ్రెసుమంత్రుల కర్తవ్యములు

కాంగ్రెసుప్రభుత్వము చేయవలసిన మొదటిపని, యీ ప్రజల అవిద్యాంధకారమును తొలగించుటకు తన సర్వ శక్తుల నుపయోగించుట. తమకు కొన్నిహక్కులు కలవను జ్ఞానము ప్రజలకు కలిగింపవలెను. ఇది చేయనిచో నీప్రభుత్వము వలని లాభము ప్రజలు పూర్తిగా పొందజాలరు. జిల్లాలోని వివిధశాఖల అధికారులెల్లరు వేలకువేల రూపాయిలు జీత బత్తెములుగా పుచ్చుకొని, ప్రజలపైన నిరంకుశాధికారము చలాయించుచు, దర్బారులలోని నవాబులవలె ప్రవర్తించు చున్నారు. ఉద్యోగ హోదాలోనుండు భారతీయులుగూడా “దొర”గారని పిలిపించుకొనుచు, పాటకపుజనముయొక్క కష్ట సుఖములు తెలిసికొని వారి బాధలు నివారణచేయకపోవుట యట్లుండ వారితో మాటలాడక వారిని తమ బంగాళాదగ్గరకు

కూడ రానీయక, వారి బిళ్ళబంట్రోతులను కాపలాయుంచి మౌనవ్రతులై, అధికార రోగపీడిత బధిరాంధక శవములవలె నుండు పద్ధతి యింకను జరుగుచునేయున్నది. వీరినిజూచి ప్రజలు భయపడుచునేయున్నారు. ప్రజలకు క్షేమముకలుగ వలెనన్నచో నీ దుష్టవిధానము పోవలెను. ఈయుద్యోగులెల్లరు తమ పర్యటనములందు తమ తమ కార్యాలయములు చేయు పనియు, అందువలన ప్రజలు పొందతగిన సహాయమునుగూర్చి తెనుగున ప్రతిగ్రామములోకూడా ఉపన్యసింపవలెననియు ప్రజ లడుగు ప్రశ్నలన్నిటికిని వీరు తెనుగున సమాధానము జెప్పవలెననియు, ఇందుకొరకు కొక దినచర్యపుస్తకముంచవలె ననియు దానిని పై యధికారులు తనిఖీ చేయుచుండవలయు ననియు, జీతవృద్ధులందు ప్రమోషనులందు నీ దినచర్యల పుస్తక ములను బట్టి వీరుచేసినట్లు కనబడు ప్రజాసేవయే వీరి యర్హ తకు సాక్ష్యముగా గైకొనబడునట్లు ఉద్యోగ నిబంధనలను మార్చవలెను. అట్లుచేసినగాని నిరంకుశ సంప్రదాయమునందు మెలగిన ఈ " దొరలు" ప్రజలకు నిజముగా సేవజేయరు. నేటి వార్షికనివేదికలవలె కేవలము బూటకపు కార్యక్రమముల వివరణగాకుండా నిజముగా వీరు సరిగా పనిచేసి ప్రజాసేవ చేయుచున్నారోలేదో కనిపెట్టి చర్య గైకొనుటకు మంత్రులువీరి పనిని తనిఖీచేయుటకు ప్రత్యేకముగా కొందరుద్యోగులను నియ మించవలెను. అంతటితో తృప్తిజెందక దేశ ప్రజలయొక్క క్షేమలాభముల కొఱకు పనిచేయు రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీలకుగూడ ప్రభుత్వశాఖలందలి అన్ని వ్యవహారములను

తనిఖీ చేయుటకు సంస్కరణములను గూర్చి సూచించుటకు తగు అవకాశ మివ్వవలెను. అట్లు చేయబడిన సూచనలను మన్నించి ఆసంస్కరణములు చేయవలెను. ఇట్లు చేసినచో మంత్రులు నిర్ణయించు ప్రజాసేవ చక్కగా నెరవేరగలదు.

కాంగ్రెసు సంఘములు గూడ చాల జాగ్రత్తగా ప్రవర్తింపవలెను, గాని తొందరపడరాదు. నేటి జిల్లా కాంగ్రెసు సంఘములు గూడ సంస్కరింప బడవలెను. ఏలననగా దీనిలో స్వార్థపరులు చేరగా పార్టీలుబయలుదేరి పూర్వపు జస్టిస్ పార్టీలను తలదన్నుచున్నవి.

నేడుమన కాంగ్రెసు ప్రభుత్వమువారు హెచ్చుగా శాసన నిర్మాణములో నిమగ్నులైనారు. ఇదిచక్కగానే యున్నది. కాని వెంటనే తీరికచేసుకుని తక్కినరాష్ట్రము లందువలెనే పరిపాలనశాఖ లన్నియు వెంటనే సంస్కరించి పరిపాలించుట యావశ్యకము. మరియు ఇతర సంస్కరణలను గూడ తక్షణము చేయవలెను.

నేటి ప్రాథమిక పాఠశాలలందు పనిచేయు ఉపాధ్యాయులు విద్యాగంధములేక, నీతి నియమములులేక వేరే మార్గమున బ్రదుకలేనిచో బడిపంతులు ఉద్యోగము చేయుటకు వచ్చి ఇనస్పెక్టర్లకు పిండివంటభోజనములిడి లంచమిచ్చి బ్రదుకువారుగా నున్నారు. చాలమంది పంతులమ్మలకు వర్ణక్రమము రాదు. ఇటీవల విద్యాధికారి "స్టేతం" గారు ప్రకటించిన నివేదికలో చెప్పబడిన ప్రాథమిక పాఠశాలలందలి ఘోరాన్యాయములం దావంతయైన నతిశయోక్తి లేదు. ఆ లోపముల

వలన మన ప్రాథమిక విద్యావిధానము పుచ్చిపోయి మన విద్యార్థులు పాడగుచున్నారు. దానిని వెంటనే సంస్కరించుట మన మంత్రుల కర్తవ్యము. నేటి పంతుళ్ళ యొక్కయు పంతులమ్మల యొక్కయు శక్తిసామర్థ్యములను వెంటనే పరీక్ష జరిపి చూచి తగనివారిని తీసివేసి మంచివారిని నియమించుట అత్యంతావశ్యకము. భారతదేశ ప్రభుత్వమును చేయవలసిన పౌరులను తయారుచేయవలసిన విద్యావిధానమును వెంటనే నిర్ణయించి అమలులో పెట్టవలయును. ఎన్ని శాసనములు చేసినను సంస్కరణములుగావించినను ఇదిచేయనిదీ మనము బాగుపడము.

ప్రభుత్వ వైద్యాలయములందు బీదజనులకు మందుల పేరు చెప్పి ఏదో రంగునీళ్ళనిచ్చి పంపుటయు, వీరికొంటకుకొన్న పాలు అధికారులు త్రాగుటయు, వీరికేర్పడిన వైద్యసహాయము ధనికులకిడుటయు, లంచములపద్ధతియు, వెంటనే నిర్మూలింపవలెను. సహకారశాఖలోను, వ్యవసాయ పారిశ్రామిక శాఖలందును ప్రజాసేవపేరున జరుపబడుచున్న కపటనాటకమునంత మొందించి, ఆ శాఖోద్యోగులు ప్రజలకు నిజమైన సేవ చేయునట్లు చూడనలెను.

అనేకతరములనుండి నిరంకుశపరిపాలనమున బాధలనంది దారిద్ర్యమున అవిద్యాంధకారమున మునిగియుండిన రష్యాదేశమున ఐరోపాయుద్ధానంతరము జరిగిన ప్రజావిప్లవము వలన సోవియటుసామ్యవాదుల ప్రజాపరిపాలన ఏర్పడినది. ఈనూతనప్రభుత్వము స్థాపింపబడిన పదేండ్లలో ప్రజలెల్లరు విజ్ఞానవికాసమును బొందిరి. కర్షకులు, కార్మికులు, పాటకపు

జనముగూడ తమ దేశపరిపాలనమున పాల్గొని తమక్షేమలాభ ముల కొరకు దానిని నిలుపుకొనగలుగు శక్తిసామర్థ్యము లేర్ప డినవి. ఈపరివర్తన అచ్చటి ప్రజాప్రతినిధులగు మంత్రులు చేసిన సంస్కరణలవలననే జరిగినది. ఈ సంస్కరణలలో కొన్నిటినైన మనము పరిశీలించి వానిని స్వీకరించి అమలు జరుపవచ్చును.

సోవియటు రాజ్యములోని వ్యవహారములు మార్పు వీలు లేనట్లు స్థిరముగా నినుపచట్రములలో బిగియింపబడవు. ఏ శాఖలోనైన నేదైన లోపము కనబడినచో నది వెంటనే సవ రింపబడును. ప్రతి ప్రభుత్వకార్యాలయములోను లోటుపాటులు వ్రాయగలందులకు ఫిర్యాదులు వ్రాయగలందులకు ఒక బోర్డు బల్ల యుంచబడును. దానిపైన నెవరేమివ్రాసినను జాగ్రత్తగా విచారింపబడి నిజమున్నచో తగుచర్య గైకొనబడును. సోవి యటు పాఠశాలోపాధ్యాయులు సైతము అప్పుడప్పుడు పరీ క్షింపబడి వారి శక్తియందు లోపములు కనబడినచో వారు తీసివేయబడుదురు.

సోవియటురాజ్యములోని విద్య యనేక మార్గముల నభివృద్ధిని గాంచుచున్నది. సినీమాద్వారమున ప్రజల సాంఘి కాచార జీవనములు, దుస్తులు, పండుగలు, శరీరశాస్త్రము, ఖగోళశాస్త్రము, మున్నగు ప్రకృతి శాస్త్ర విషయములు, శిశుసంరక్షణము, ప్రసవవైద్యము జన్మనిరోధము, ప్రజారో గ్యము మున్నగు విషయములెల్ల చక్కగా ప్రజలకు బోధింప బడును. ఉపాధ్యాయులు, ఉపన్యాసకులు నూరూరదిరిగి తమ

తమ శాస్త్రజ్ఞానమును ప్రజలకు బోధించుచుందురు. అనేక వస్తుప్రదర్శనములు, పారిశ్రామిక ప్రదర్శనములు జరుపబడు చుండును. చిత్రవస్తు ప్రదర్శనాలయములు, గ్రంథాలయములు విరివిగా స్థాపింపబడినవి. రేడియో దూరశ్రవణ యంత్రములద్వారా విద్యాప్రచారము గావింపబడుచున్నది. యుద్ధపూర్వము నూటికి తొంబదిబంది నిరక్షరులుగానున్న రష్యాలో నిప్పుడు నూటి కెనుబదిమంది విద్యావంతులుగా నున్నారు.

ఇంకొక విశేషమేమన ప్రతిపట్టణములోను, ఒకధర్మపు క్లబ్బు, పఠనమందిరము నెలకొల్పబడినవి. వానినంటి యొక విచారణమందిరముండును. అచ్చట బాలురు, వృద్ధులు, రైతులు, కార్మికులు, వీరువారను తారతమ్యము లేకుండ, ఎల్లరును తమకు గావలసిన సమస్త విషయములనుగూర్చి యడిగి తెలిసికొనవచ్చును. టైము ఎంత? రైలు ఎన్నిగంటలకు బయలు దేరు ననుప్రశ్నలు మొదలు ప్రపంచవార్తలు, శాస్త్రవిషయములు సైతము అడిగినవారికి చెప్పవలసినదే!

పైన చెప్పబడిన విషయములందెల్ల పురుషులతోపాటు స్త్రీలును. సమానాధికారము, అవకాశములుకలిగి అభివృద్ధి గాంచుచున్నారు.

దాసవృత్తియందుపడి, ధనికులలాభముకొరకు కష్టించు రోజులుపోయి రష్యాదేశపురైతులు సోవియటు సార్వజనిక ప్రభుత్వాధికారులైనారు. ప్రభుత్వోద్యోగుల నెన్నుకొను టలో రైతులకు పలుకుబడి, వోటుకూడ కలదు. గ్రామము

లందు, పట్టణములందు నున్న పారిశ్రామికుల క్షేమ లాభముల కొరకే అన్ని పనులు నిర్వహింపబడుచున్నవి. పొరబాటు లప్పు డప్పుడుజరుగుచున్నను మొత్తముమీద జనసామాన్యముయొక్క సమష్టి క్షేమలాభములకొరకే సర్వకార్యములు నిర్వహింపబడు చున్నవి. చిరకాలమునుండి జనులుపడియున్న అధోగతినుండి, వారిని పైకిదీసి ఉద్ధరించుకొరకు, ఆధునిక జ్ఞానమునందు వారినిగూడ భాగస్వాములుగా జేయుటకు ప్రయత్నములు జరిగినవనుటకు సందియములేదు. పుస్తకములు, కరపత్రములు, వార్తాపత్రికలు వారికొరకు ఏటేటను లెక్కలేనన్ని ప్రకటింప బడి పంచిపెట్టబడుచున్నవి. వారిపిల్లలకు చదువుచెప్పుటకు పాఠశాలలును, యువకులకు సాంకేతికవిద్య, వృత్తివిద్య నేర్పు పాఠశాలలును, నెలకొల్పబడినవి. దేశమందంతటను ఉపన్యా సము లొనగబడుచున్నవి. విజ్ఞానము నలుగడల వ్యాపించు చున్నది. అవిద్య తొలగిపోవుచున్నది. పైతరమువారుకూడా విద్యావంతు లగుటకొరకు వయోజనవిద్య స్థాపింపబడినది. స్త్రీలుకూడ పురుషులతోపాటు తుల్యులుగా నెంచబడుచు దేశనాగరకతయందు సభ్యత కలిగియున్నారు. దేశములోని అన్ని పరిపాలనశాఖలయందును స్త్రీలు నియమింపబడి, దేశ ముయొక్క రాజకీయసాంఘికఆర్థికపురోభివృద్ధికి తోడ్పడు చున్నారు.

సోవియటు ప్రభుత్వము పశుజాతిని కోళ్లువగైరా పక్షి జాతిని ప్రశస్తతరముగా జేసినది. శాస్త్రపరిశోధనలను ప్రయో గములను జనసామాన్యమునకు తెలియజెప్పుటకు లెక్కలేనంత

ద్రవ్యము కర్చుపెట్టుచున్నందున పన్ను లొకభారముగా లేవు. ప్రజారోగ్యమును కాపాడుటకు ఆసుపత్రులును విరివిగా స్థాపించ బడినవి.

1918 వ సంవత్సరపు విప్లవమువలన అంతకు పూర్వము ధనికులవశమున నుండిన 15 కోట్ల యెకరముల భూమి రైతులకొరకు సాగుచేయబడుచున్నది. దేశములో సంఘ స్వామ్యపద్ధతి స్థాపింపబడి, వివిధ కుటుంబములు కలిసి చేయుసమష్టి కృషి, ట్రాక్టరు యంత్రకృషిపద్ధతియు స్థాపింప బడినవి. ఇతర దేశములందు వాణిజ్యవ్యవసాయ పారిశ్రామిక వృత్తులం దుపయోగింపబడు సహాకారపద్ధతులెల్ల పరిపూర్ణ ముగా సంస్కరింపబడి రాజకీయార్థికవిషయములు సమన్వ యము చేయబడిన సర్వసమానకర్మకర సహాకార సంఘస్వా మ్యము స్థాపింపబడినది. పై పద్ధతులనెల్ల మన దేశమునగూడ నెలకొల్పవచ్చును.

మనకాంగ్రెసు మంత్రులు దేశదారిద్ర్యము మాన్పు టకు చేయవలసిన ప్రథమచికిత్స గాఢముగా దేశము నావ రించియున్న అవిద్యాంధకారమును తొలగించుటయే. అట్లు చేసిననే ప్రజలు కన్నులు తెరచి తమ దుస్థితిని, ప్రపంచము లోని అభివృద్ధిని, గాంచి బాగుపడుటకు ప్రయత్నింపగలరు. పాఠశాలలు, గ్రంథాలయములు ఉపన్యాసములు, సినీమా, రేడియో ప్రదర్శనములు మొదలగు సమస్త నూతన సాధ నములచేతను విద్యావ్యాప్తి గావింపవలెను. ప్రభుత్వోద్యోగు లెల్లరు ప్రజల కీవిషయములను బోధింపవలెను. ప్రజలకు శౌచ

పద్ధతులు, పౌరస్వాత్వపద్ధతులు ఈమార్గములద్వారా వెంటనే బోధించవలెను.

దేశసంపద నభివృద్ధిచేయుటకును ప్రజల ఆదాయమును హెచ్చు చేయుటకును ప్రయత్నించవలెను. వ్యవసాయము నందు నూతనపద్ధతు లవలంబించవలెను. సాగు చేయువల సిన భూమినంతయు సాగుచేయువలెను. పల్లపు సాగుకొరకు నీటిపారుదలను వృద్ధిచేయవలెను. మంచి ఎరువులు పరికరము లుపయోగించవలెను. లాభకరములగు క్రొత్త పంటలను వేయుట మొదలిడవలెను. పంటలను నిలువజేసి లాభసాటి ధరలకు విక్రయించుట కవకాశము కలిగింపవలెను. వ్యవసా యపుపనులకు వలసిన ధనమును చౌకవడ్డీలకు సులభసాధ్యము చేయవలెను. రైతులు కోర్టులలో దిగి పాడుకాకుండమాధ్యస్థ తీర్మానపద్ధతి ప్రారంభింపవలెను. సంవత్సరము పొడుగున పని లేనికాలమును వ్యర్థపరచు రైతులకు వారి కుటుంబములకు తీరిక వేళలందు పనికలిపించి వారి యాదాయమును వృద్ధిపరుపగల పాడిపంటలకు సంబంధించిన పరిశ్రమలు, అనుగతగృహ పరి శ్రమలు, చేతిపనులు నెలకొల్పవలెను.

దేశములోని ముడిపదార్థములను ఖనిజజంతువృక్ష సం బంధపుటుత్పత్తులను పాడిపంటలను పుట్టినవి పుట్టినట్లు విదేశ ములకు ఎగుమతిచేసి అధిక వెలలకు వానినే తయారువస్తు వులుగా దిగుమతి చేసికొను పద్ధతిమాని నిర్మాణ కౌశలము చేతను, మానవ పరిశ్రమ వలనను, యంత్ర సాహాయ్యమునను సరకులనెల్ల కొంచముగనో గొప్పగనో నిర్మాణ వస్తువులుగ

మార్చి ఎగుమతిచేయుచు మనము సులభముగా చేసికొనలేని వస్తువులను మాత్రమే దిగుమతి చేయవలెను. ఇందులకువలసిన కార్ఖానాలు యంత్రాలయములు స్థాపించి నడుపవలెను.

అర్థోత్పత్తియందు వాణిజ్య వ్యవసాయ పరిశ్రమలందు సమష్టికృషి సమష్టిప్రయత్నము సమష్టి లాభమునుగల సహకార పద్ధతులను ప్రజలయందు వ్యాపింప జేయవలయును.

దేశప్రజల జవసత్వముల నభివృద్ధిగావించి జీవనాధార సౌఖ్యములు, ఆరోగ్యము కలిగింపవలెను. ఇతర దేశములందు వలెనే ఆరోగ్యసూత్రములను రోగనివారణోపాయములను బోధింపవలెను. రోగచికిత్స కుచితవైద్యసహాయము గావింపవలెను. జబ్బుపడిలేచినవారికి విశ్రాంతిగృహములను ఉచిత జీవనోపాధియు కలిగింపవలెను. అనాథలకు, అశక్తులకు, వృద్ధులకు, దరిద్రులకు, బాలబాలికలకు, ప్రసూతిస్త్రీలకు, వ్యాధిగ్రస్తులకు దారిద్ర్యమున మరణింపకుండుటకు వలసినజీవన భృతి,ఉపకార వేతనములు,ఇతరసాహాయ్యమును గావింపవలెను.

ఈసంస్కరణల నెల్ల చేయుటలో మనమంత్రులు తమ క్రిందియధికారులు తాము నిర్ణయించిన విధానముల నెల్ల చక్కగా నెరవేర్చుచున్నారో లేదో అందలి లాభములు జన సామాన్యములు పొందగలుగుచున్నారో లేదో కూడా కని పెట్టుచుండవలెను.

ఇట్లు భారతదేశప్రజల క్షేమ లాభములకొరకు నేడు కాంగ్రెసుమంత్రులు చేయవలసిన పనులు లెక్కకు మీరి

యున్నవి. ఈ కార్యములెల్ల జయప్రదముగా నెరవేర్పవలె నన్నచో నీ మంత్రులు, ఈ కార్యదర్శులు, నీ శాసనసభ్యులు కాంగ్రెసుసంఘముల సామాన్యకాంగ్రెసు సభ్యులుకూడ కలసి కష్టపడి పనిచేయవలెను. అంతేకాని ఒకరిసాయము మనకేల యనిగాని, వారికి మనమేల సాయము చేయవలెననిగాని యుపేక్షింపరాదు. కాంగ్రెసు పతాకముక్రింద పనిచేయువా రెల్లరు, మంత్రులైనను, కార్యదర్శులైనను, శాసనసభ్యులైనను, కాంగ్రెసుసంఘముల పాలకవర్గమువారైననుఊరు పేరు లేని కాంగ్రెసు వాదియైనను, సత్యాగ్రహమువలెనే ఈ ప్రభుత్వ నిర్వహణముకూడ భారతదేశప్రజల దారిద్ర్యనివారణకొఱకు, పూర్ణస్వాతంత్ర్య స్థాపనకొఱకు గాంధీమహాత్ముని నాయకత్వమున జరుపబడుచున్న మహాయజ్ఞమేయనియు దీనిని జయప్రదముగా నిర్వహించి దేశఋణము తీర్చుకొనవలయు ననియు గ్రహించి త్రికరణశుద్ధిగా నందుకొరకు దీక్షవహించి ఈ కాంగ్రెసు పతాకముయొక్క అంతరార్థగుణములగు త్యాగధైర్యశాంతి సత్యసాహసౌదార్య ధర్మములతో స్నాతకులై తరలవలెను. ఈ స్నాతకులకెల్లరకు తైత్తిరీయోపనిషత్తులోని వాక్యమును జ్ఞాపకముచేయ సాహసించుచున్నాను. "సత్యముతప్పకుడు; ధర్మమువీడకుడు; క్షేమకరములగుమార్గములనే చరింపుడు." వందేమాతరం!

## రెండవ పరిచ్ఛేదము : బ్రిటిష్ రాజ్యతంత్రపరిణామము

### I

"తూర్పుఇండియా వర్తకసంఘమువారు భరతఖండమున వర్తకముచేయుకొరకు కట్టుకొనిన గిడ్డంగులు కోటలయ్యెను. కోటలు సైనికనివహముల కాలవాలమగు దుర్గములయ్యెను. సైనికనిచయములు సామ్రాజ్యసంపాదనకు సాధనములయ్యెను. ఈయారోహణము మెల్లగా, సహజముగా అనివార్యముగా జరిగిన రాజ్యతంత్రముయొక్క పరిణామము" అని తూర్పుఇండియావర్తకసంఘమువారి కొలువులోనే పనిచేసిన ఉద్యోగియగు ఫిలిప్ ఫ్రాన్సిస్ 1787 లో వ్రాసియున్నాడు. భారతదేశమునందు బ్రిటీష్‌రాజ్యతంత్రముయొక్క చరిత్రను క్లుప్తముగా ఒక్కవాక్యములో చెప్పవలెనన్నచో పైనచెప్పినదానికన్న చక్కగా నెవ్వరును చెప్పజాలరు. 1858 వ సంవత్సరమువరకును ఇంగ్లీషువారీదేశములో పన్నినతంత్రములు చేసినచర్యలు అన్నియుగూడ ఈదేశమున రాజకీయార్థిక ఆధిపత్యమును చేజిక్కించుకొనుటకొరకే చేసిరి. ఈబ్రిటీష్ రాజ్యతంత్రప్రభావమువలన భారతదేశభూభాగములో మూడింట రెండువంతులు బ్రిటిష్‌ఇండియా యైనది. తక్కిన మూడవవంతునందలి రాజులు బ్రిటీషువారికి లోబడి స్వదేశసంస్థానములైనవి. అంతట దేశపరిస్థితులు తారుమారైనవి. వర్తకముకొరకువచ్చి మనరాజుల నాశ్రయించినవారే మన రాజులకు రారాజులైరి. ఇట్లు దేశమునెల్ల ఆక్రమణచేసి రాజ్యాధిపత్యమును సంపాదించి రాజకీయార్థికసామ్రాజ్యమును

స్థాపించిన పిదప నీరాజకీయాధికారముల నెల్ల తమ ఆర్థిక లాభముకొరకుపయోగించుకొను పద్ధతిని ప్రారంభించగా ఈదేశ భాగ్యభోగ్యము లెల్ల వారి వశమై మనము నానాటికి దరిద్రుల మగుట జరిగినది. మన పూర్వపరిశ్రమలు ఎగుమతి వ్యాపారము నశించి బ్రిటిషు వస్తువులు కొనుట ప్రారంభమై మనకు ధనము వచ్చుటకు బదులుగా మన దేశమునుండి సాలియానా కోట్ల కొలది ధనము సీమకు తరలింపబడసాగినది. ఇంగ్లీషువారీ దేశమున అడుగిడినది మొదలు భారత దేశములోని భూభాగముల నెల్ల ఆక్రమించుటకు రాజులనెల్ల లోబరచుకొనుటకు ఎన్నో తంత్రములు పన్ని రాజకీయాధిపత్యమును సంపాదించినది ఇందుకొరకే. నాటి రాజ్యతంత్రమెల్ల ఈ యుద్దేశ్యముతోనే జరుపబడెను. తరువాత 1858 మొదలు నేటివరకు తాము సంపాదించిన రాజకీయ సామ్రాజ్యములోని ఆధిపత్యమును దీనివలన పొందు ఆర్థిక లాభములను నయముననో భయముననో ఉపాయము వలననో నిలుపుకొను నుద్దేశ్యముతోనే ఈ బ్రిటిష్‌రాజ్యతంత్రము ప్రయోగింపబడుచున్నది.

భారత దేశమున రాజ్యస్థాపనము చేయబడుచుండిన మొదటి దినములలో బ్రిటిషు రాజ్య తంత్రము దేశాక్రమణ కొరకు దేశములో తమప్రభుత్వమును సుస్థిరముగా స్థాపించుటకు వర్తకలాభము పొందుటకు నిర్భయముగా ఉపయోగింపబడెను. నాటి కీదేశప్రజలు నోరులేనివారు. ఎట్టి జంకును లేకనే దేశముయొక్క భాగ్యభోగ్యముల నీకంపెనీవారు

స్వేచ్ఛగా సీమకు తరలించుచుండిరి. తరువాత దేశములో నీపారతంత్ర్యముపైన విరోధభావముకలిగి సిపాయివిప్లవము జరిగినది మొదలు దేశములో రాజకీయ పరిజ్ఞానము క్రమ క్రమముగా వర్ధిల్లి తుదకు ప్రజాభిప్రాయమును నిర్భయముగా ప్రకటించు ప్రజాసంస్థ యొకటి 1885 లో కాంగ్రెసు రూప ముగా వెలసి బ్రిటిషు పరిపాలనావిధానమును విమర్శించుచు దేశప్రజలకు హక్కులుకోరుటయు ప్రారంభముకాగా నాడు మొదలు బ్రిటీషువారు ఒకవంక నీ తీవ్రరాజకీయ ప్రజాభి ప్రాయమును రాజద్రోహమని అణచుటకును, ఇంకొకవంక ఏవో కొన్ని కల్లబొల్లి కబురులుచెప్పి స్వల్పపురాజకీయ సంస్క రణములు గావించినట్లు నటించి భారత దేశ ప్రజలలో కొంద రిని చేరదీసి బుజ్జగించి బ్రిటీషు పరిపాలనవలని లాభములను గూర్చి ప్రచారముగావించునట్లు చేయుచు బ్రిటీషు రాజ్య తంత్రములో కీలుబొమ్మలగా నుపయోగించి ఒక కపటనాట కము నాడసాగిరి. ఈకపటరాజ్య తంత్రనాటకమున ప్రథ మాంకములోనే కొన్ని దేశీయపత్రికలఅధిపతులు రాజద్రోహ నేరమున కాహుతులైరి. లోకమాన్యతిలకునిగూడ చెరకంపిరి. ఈ నాటకసందర్భమున నే, బొమ్మలకొలువు లనదగు శాసన నిర్మాణసభలు 1893 లో స్థాపింపబడెను.

అంతట నాటకములో రెండవయంకము ప్రారంభ మైనది. రాజప్రతినిధిగా కర్జనుప్రభువు రంగస్థలమున బ్రవే శించగా నతని నిరంకుశపరిపాలనా ఫలితముగా దేశములో స్వదేశీయుద్యమము, రాజకీయాందోళనము వందేమాతరం

ప్రబోధము ప్రారంభమైనది. కర్జను నిష్క్రమించగా మార్లే ప్రభువు రాజ్యాంగమంత్రిగా మింటోప్రభువు రాజప్రతినిధిగా రంగమున ప్రవేశించిరి. తీవ్రజాతీయవాదులను రాజద్రోహమునకు చెరలకంపి జాతీయభావము నణగద్రొక్కివేసి తరువాత శాసనసభల సంస్కరణల ప్రణాళిక నాటకమునాడి మితవాదులను జేరదీసి తమ నిరంకుశ పరిపాలనమును వారి సహాయముతో సాగించిరి.

బ్రిటీషు రాజ్యతంత్ర నాటకమున మూడవయంకమున అనీ బిసెంటుకు లోకమాన్యుడు తోడై దేశములో స్వరాజ్యాందోళన ప్రారంభముకాగా ప్రభుత్వమువారు నిర్బంధ విధానముతో ప్రజాభిప్రాయము నణగద్రొక్కిరి. అయితే ఐరోపాసంగ్రామమున మనసహాయము గావలసివచ్చి భారతదేశమునకు బాధ్యతాయుత పరిపాలనము నిచ్చెదమని మాంటేగుచేత ఆపద మొ్రక్కులు మొ్రక్కించి ఆపదగడువ బెట్టుకొని ఘోరరౌలటుశాసనమును ప్రయోగించి స్వాతంత్ర్యమువారించి పంజాబువధల భీభత్సముజరిపి కొన్నిరంగములు ప్రదర్శించి, ఎట్టకేలకు మసిబూసి మారేడుకాయజేసి 1919 లో సారవిహీనమైన రాజ్యాంగ సంస్కరణముచేసి ద్వంద్వ పరిపాలనను స్థాపించగా నీరాజ్యాంగనాటకమున నాలుగవయంకము ప్రారంభమైనది.

## II

మాంటేగూసంస్కరణములను కాంగ్రెసు తిరస్కరించెను. గాంధిమహాత్ముడు పంజాబువధల యవమానము భారతదేశస్వరాజ్యము వలనగాని తీరదనితలంచి దానిని సంపాదింప దీక్షవహించి సహాయనిరాకరణోద్యమము ప్రారంభించెను. ఆ మహోద్యమమున భారతదేశము తన దీర్ఘనిద్రనుండి మేల్కాంచినది. శాంతిసమరపద్ధతి యారంభమై ప్రజలు సాత్విక నిరోధము శాసనోల్లంఘనమునకు సిద్ధపడిరి. కాని చౌరీచౌరాలో దౌర్జన్యము జరిగినందున మహాత్ముడు ఉద్యమము నాపివేసెను. అంతట ప్రభుత్వము విజృంభించి తీవ్రనిర్బంధ విధానమును సాగించి మహాత్ముని చెరకంపెను. తరువాత శాసనసభలో కాంగ్రెసు ప్రవేశించి పోరాడసాగెను. అధినివేశస్వరాజ్యమిత్తు రాజ్యాంగము తయారు చేయుట కొక రౌండుటేబిలుసమావేశము నాహ్వానించవలసినదని కేంద్రశాసనసభవారు 1924లో తీర్మానించిరి. మాంటేగూసంస్కరణల రాజ్యాంగము లోపభూయిష్ఠమని అందలిమంత్రులధికారవిహీనులుగా నున్నారని ఆరాజ్యాంగము నడిపిన మితవాదులు జస్టిస్‌పార్టీనాయకులు కూడ వెల్లడించిరి. అంతట అధినివేశస్వరాజ్యము వెంటనే ఇవ్వబడవలెనని సర్వపక్షసభవారు తీర్మానించగా నెహ్రూ కమిటీవారొక రాజ్యాంగము తయారుచేసిరి. ఒక్కసంవత్సరములో నిది యొసగనిచో పూర్ణస్వాతంత్ర్యము ప్రకటింతుమని కాంగ్రెసు తీర్మానించెను. రాజ్యాంగసంస్కరణలకొరకు దేశములో రాజకీయాందోళనము ప్రబలుచుండెను. భారత

దేశమున క్రమక్రమముగా బాధ్యతాయుత పరిపాలనము స్థాపించెదమని బ్రిటీషువారు పొరబాటున 1919 సంవత్సరపు రాజ్యాంగచట్టఉద్దేశ్యములోనే వివరించి యుండిరి. మఱియు పదేండ్లలో రాజ్యాంగసంస్కరణలనుగూర్చి విచారింతుమనియు అందు నిర్ణయించియుండిరి. 1928 నాటికి ఆగడువుకాలము దగ్గరించినది. అందువలన రాజ్యాంగసంస్కరణలనుగూర్చి ఏదోవిచారణను కొంతచేసితీరవలెను. అయితే ఈవిచారణ ఫలితముగా ఏమైన రాజ్యాంగసంస్కరణ చేయునది లేనిది బ్రిటీషువారి యిష్టములో నుండును. బ్రిటీషువారికి నిజముగా మనకు స్వరాజ్య మివ్వవలెనని లేదు. అందువల్లనే తాము 1919 లో చెప్పిన బాధ్యతాయుతపరిపాలన మనగా అధినివేశ స్వరాజ్యము కాదని బ్రిటీషురాజనీతిజ్ఞు లప్పుడే వాదింపసాగిరి. అంతట దేశమున తీవ్రఅసమ్మతి కలుగగా బ్రిటీష్ వారు నీలఅపోహాలు రాజప్రతినిధిద్వారా మఱల తొలగించిరి. రాజ్యాంగ వ్యవహారములనుగూర్చి విచారణచేయుటకు పార్లమెంటువారు సైమను కమిటీని నియమించిరి. దీనితో బ్రిటీష్ రాజ్యతంత్రి నాటకములో రాజ్యాంగ సమాలోచనఘట్టమును అంతర్నాటకములును ప్రారంభమయ్యెను. దేశములో ఈ తెల్ల కమిటీపట్ల తీవ్రఅసమ్మతి కలిగెను. అందువలన సైమనుగారు ఇంగ్లీషు సభ్యులతోపాటు కొందరు భారతీయ కీలుబొమ్మల ఉపసంఘములు ఏర్పాటుచేసి వారితో కూడా రంగమున ప్రవేశించిరి. వారికివ్వబడిన నల్లజెండాల తిరస్కార స్వాగత హార్తాళములను 144 వ శెక్షనులతోను, లాటీచార్జీలతోను

ఎదుర్కొనిరి. ఈ జాతరనుజరపి ఈ కమిటీవారిని పోలేరమ్మను సాగనంపినట్లు పంపిరి.

1929 సంవత్సరము డిసెంబరు 31 తేదీన కాంగ్రెసు వారు పూర్ణస్వాతంత్ర్య తీర్మానమును గావించిరి. భారత దేశదారిద్ర్యము మాన్పుటకు కొన్ని సంస్కరణములనైన ముందుగా చేయుడని మహాత్ముడుకోరినను బ్రిటీష్ వారు వినలేదు. అంతట పూర్ణస్వరాజ్యముకొరకు 1930 లో శాసనోల్లంఘనము ప్రారంభింపబడగా 60 వేలమంది చెరకేగుటతో, లాటీప్రయోగముతో, కాల్పులతో సైనికశాసనము వంటి తీవ్రనిర్బంధవిధానము ప్రయోగించిరి. ఇట్లు కాంగ్రెసు నణచియుంచి తమకు తోచిన రాజ్యాంగసంస్కరణాల జేయుటకు ఆలోచించుటకని బ్రిటీష్ప్రభుత్వమువారు ఒక రౌండు టేబిలు సభను ఏర్పాటుచేసి తమకు దాసానుదాసులగువారిని ఆ రౌండుటేబిలు బొమ్మలకొలువులో గూర్చుండబెట్టి చర్చలు జరిపి మినహాయింపులు రక్షణలుగల బాధ్యతాయుత పరిపాలనమును భారత దేశమునకివ్వవలెనని తీర్మానముచేయించి ఒక రాజ్యాంగప్రణాళిక తయారుచేసిరి. ఆనాడు ఇంగ్లాండు ప్రభుత్వము నిర్వహించుచుండిన లేబరుపక్షమువారు కాంగ్రెసు లేనిది భారత దేశ సమస్య పరిష్కరించలేమని తుదకుగ్రహించి ఆనాటి రాజప్రతినిధి ఇర్విన్ ప్రభువుద్వారా కాంగ్రెసుతో "గాంధి ఇర్విన్' రాజీజేసికొని రెండవరౌండుటేబిలుసభ సమావేశపరిచి దానికి కాంగ్రెసు నాహ్వానించిరి.

ఇంతటితో నింకొకరంగము ప్రారంభమైనది. 1932 లో గాంధిమహాత్ముడు కాంగ్రెసుప్రతినిధిగా నింగ్లాండుకు వెళ్లెను. అచ్చట ఆయనకు అఖండమైన స్వాగత మివ్వబడెను. ప్రపంచములోని గొప్పవారెల్లరు నాయనను గౌరవించిరి. అంతట నాయన రౌండుటేబిల్లు సభలో కాంగ్రెసు యొక్క ఉద్దేశ్యములను భారత దేశప్రజల కోర్కెలను నిర్భయముగా వివరింపసాగెను.

ఇంతలో నింగ్లాండులో లేబరుప్రభుత్వము పోయి భారత దేశస్వాతంత్ర్యనిరోధులగు కన్సర్వేటీవులు ప్రభుత్వము నకువచ్చి కుటిలనీతిని, మిత్రభేదమును ప్రయోగించి రెండవరౌండుటేబిలు కాన్ఫరెన్సును విఫలముజేసి భారత దేశమును శాశ్వతదాస్యమున నుంచుటకు బద్ధకంకణులై ఒక అంతర్నాటకమును ప్రయోగింప సమకట్టిరి. భారత దేశమునకు స్వరాజ్యార్హత లేదని వాదించు నింగ్లాండులోని కన్సర్వేటివు ప్రతినిధులను రంగములో ప్రవేశపెట్టి వారి చేత గొప్పఆందోళన చేయించిరి. భారతీయులలో కాంగ్రెసు గాక తక్కినపక్షములవారితరఫున ఆహ్వానింపబడిన కీలుబొమ్మలలో కొందరు స్వార్థపరులనుచీలదీసి విడదీసిపాలించుచాణక్య నీతిని ప్రయోగించి వారిజాతిమతకులాభిమానములను ప్రజ్వలింపజేసి ఆస్వార్థపరులచేత రౌండుటేబిలుసభాస్థలిలోనే బహిరంగముగా కాంగ్రెసునెడలను తుదకు గాంధిమహాత్మునియెడలనుగూడ తమకు విశ్వాసములేదనియు, జాతీయవాదులతో తమకు సంబంధములేదనియు, తామల్పసంఖ్యాకులనియు,తమకు

రాజ్యాంగమున అనేకరక్షణలు కావలెననియు, ప్రత్యేకనియో జకవర్గములు గావలెననియు, పలికించి భారత దేశ పారతంత్ర్య మును శాశ్వముగా నుంచగల వరము లనేకములు గోరించిరి. ఈవరములను పాలించుటకు బ్రిటీషుప్రభుత్వము నే మధ్యస్థులుగా నుండుడని కూడ ఈకీలుబొమ్మలు కోరి బ్రిటిష్ వారి మెప్పునందిరి. భారత దేశ రాజకీయములందు మొదటినుండియు విడదీసి పాలించు బ్రిటిషువారి కుటిలనీతి ఇట్లు సఫలత గాంచినది. ఏక క్రియా ద్వ్యర్థకరీ యనునట్లు భారత దేశములో కాంగ్రెసుకు జాతీయ వాములకు పలుకుబడిలేదని ప్రకటించుట, భారత దేశమునకు బ్రిటిషువారు శాశ్వతముగా అధికారులై యుండి తీరవలెనని భారతీయుల నోటనే సభాముఖమున ప్రపంచము నకు జాటచేయుట ఒక్కసారిగనే చేయగలిగిన ఈ బ్రిటీషు వారి రాజ్యతంత్రము చాణక్య నీతిని గూడా తలదన్నెను. బ్రిటీషు రాజ్యతంత్రము సఫలతగాంచినది. ఇట్టి స్థితిలో కాం గ్రెసును అణచివేయుటకు నాటి రాజప్రతినిధియగు విల్లింగ్డన్ ప్రభువు తీవ్రనిర్బంధ ప్రయోగము గావించి కాంగ్రెసు వారిని జైళ్లలో పెట్టి ఆర్డినెన్సులవల్ల పరిపాలన సాగించుచూ మరల కొందరు కీలుబొమ్మలను రంగస్థలమునకు రప్పించి మూడవ రౌండు టేబుల్ నాటకము నాడుటయు, తరువాత ప్రత్యేక నియోజక వర్గములు, అన్ని అధికారములు మినహా యింపబడిన బాధ్యతలేని పరిపాలన పద్ధతియుగల వైటుపేపరు ప్రణాళిక ప్రకటించుటతో 1933 నాటికి రాజ్యాంగనాటక ములో నాలుగవ యంకము పూర్తియై కీలుబొమ్మలు నిష్క్రి

మించెను. ఇప్పటి కీనాటకము ఆరంభమై 6 సంవత్సరములు గడచినవిగాని ఇదిపూర్తి కాలేదు.

ఐదవ యంకము ప్రారంభ మయ్యెను. ఈ వైటుపేపరు ప్రణాళికను వడపోసి సారవిహీనముచేయుట కొక జాయింటు పార్లమెంటరీకమిటీ నియమింపబడెను. నుఅల కొందరు భారతీయులు రంగస్థలముపై కెక్కింపబడి మరల దీర్ఘవిచారణలు, చర్చలు ప్రారంభింపబడి, రాజ్యాంగమింకను సారవిహీనము చేయబడి, జూలై 1934 లో నొక నివేదిక ప్రకటింపబడినది. తరువాత పార్లమెంటులో కనివిని యెరుగని యొకవిపరీతపు రాజ్యాంగమును నిర్మించుచు డిశంబరు 1935 లో చట్టము చేయుటతో పంచమాంకము పూర్తియైనది.

III

ఇట్టి నాటకమున అనేక అంతర్నాటకములు, ప్రవేశములు, నిష్క్రమణములు, అపవారితపు సంభాషణలు, ఏకాంత సంభాషణలు, స్వగతములు, విష్కంభములు జరుగగా ఈ నాటక ఫలితముగా నీమాయశిశువు జన్మించెను. చూడగా చూడగా నీమాయ రాజ్యాంగము కేవలము సైమనుగారి శిశువుగానే కనబడుచున్నది. నేడు మన రాజకీయకులము పాలిటికి ముసలమైన సంస్థానములును రాష్ట్రములును కలిసిన రాజ్యాంగసమాఖ్య (ఫెడరేషను) ఊహను గర్భాధారణముచేసినవాడా సైమను పొంబడే. అతడు తన నివేదికలో సూచించిన రాష్ట్రీయపరి

పాలనమే నేడు మరికొన్ని మినహాయింపులతోను అడ్డంకులతోను ఇంకను సారవిహీనముగ చేయబడి మనకీరూపమున ప్రసాదింపబడినది. అతడు సూచించినట్లు సర్వాధికారములెల్ల పార్లమెంటులోను వారితాబేదారులగు గవర్నరుజనరలు యొక్కయు గవర్నరులయొక్కయు చేతులలోను ఉంచబడి ప్రజాప్రతినిధులగు మంత్రుల ప్రభుత్వమనునది కేవలము నిర్గంధకుసుమముగా మాత్రమేగాక దుర్గంధకుసుమముగా గూడ చేయబడినది. అట్లైనచో నీమాత్రపు రాజ్యాంగ సంస్కరణ ఆ సైమనుకమిటీ నివేదిక ప్రకటింపబడిన మరునాడే చేయవచ్చునే! ఏల నిన్ని సమాలోచనములు; ఇన్ని ఈ భారతీయ బొమ్మలకొలువు సభలు, అందలిచర్చలు; ఇంత ధనవ్యయము ? దీని కంతకును కారణము లేకపోలేదు. దీని కెల్ల బలవత్తరమైన మూలకారణము బ్రిటీష్ రాజ్యతంత్రమే. 1919 సంవత్సరపు రాజ్యాంగచట్టములో ప్రకటించిన ఉద్దేశ్యానుసారముగాను తరువాత బ్రిటీషు ప్రభుత్వము చేసిన ప్రకటనలవల్లను ఈ రాజ్యాంగమునం దేదో కొంత మార్పు, ఏదో కొంత సంస్కరణము, చేయక తప్పదయ్యెను. అయితే ఈ మార్పువలన ఈ సంస్కరణములవలన బ్రిటీషు సామ్రాజ్యము బ్రిటీషు వర్తకులు వృత్తివంతులు ఈ భారతదేశము వలన పొందుచున్న అమిత లాభములయం దావంతయైన కొరతకలుగరాదు. ఇప్పుడేకాదు; ఇకముందెన్నటికిని గూడ బ్రిటీషువారి కీ దేశమువలన కలుగుచున్న విశేషలాభముల కెట్టి భంగము కలుగరాదు. అందుకు వలసినబందోబస్తులు

చేసికొని తీరవలెను. బ్రిటీషువారికి నష్టకరమైన ఎట్టిశాసనములుగాని చేయుటకు భారతీయుల కొంతమైన అవకాశము అధికారము నుండరాదు. ఈయుద్దేశ్యము నెరవేరవలెనన్నచో నిజమైన అధికారములు భారతదేశపు ప్రజాప్రతినిధులకిచ్చుటకును వీలులేదు. తాముచేసిన వాగ్దానము చేయకుండ పోయిరను అపవాదు రాకుండా ఏవోకొన్ని సంస్కరణములు జేసినట్లునుండవలెను; నిజముగా తమ వాగ్దానము చెల్లింపను రాదు. భారతదేశమునకు బాధ్యతాయుత ప్రజాప్రతినిధ్య పరిపాలనము కొంతప్రసాదించినట్లు కనబడవలె; నిజమైన ప్రజాప్రభుత్వపద్ధతులు, అధికారములును ఆప్రభుత్వమునకు నుండరాదు. ఇట్టి పరస్పరవిరుద్ధములైన ఉద్దేశ్యములను లోపల పెట్టుకొని రాజ్యాంగమును నిర్మించు టెంతకష్టము! ఇదియెల్ల కేవలము నిరంకుశముగా చేసినట్లు ప్రపంచము గ్రహింపకుండ భారతీయులలో కొందరిని చేరదీసి వారితో ఆలోచించినట్లు నటించి వారియిష్టముతోనే యీ రాజ్యాంగమును తాము నిర్మించితిమని ప్రపంచమునకు చాటుటకునుగూడ ఈతంత్రమెల్ల పన్నబడినది.

కేవలము స్వలాభముకొరకు పర రాజ్యాక్రమణము చేయదలచిన ఐరోపాజాతివారగు ఇటలీవారుగూడ తామాక్రమింపదలచిన అబిసీనియా దేశములోని వారి అనాగరికతను తొలగించి వారినుద్ధరించుటకే వారి రాజ్యమును తాము వశపరచుకొనుచున్నామని ఇటీవల ప్రకటించుట జగత్ప్రసిద్ధము. అట్లే బ్రిటీషువారుకూడా తమకు బానిసగానున్న ఈపాలిత

రాజ్యమెంతో యనాగరక రాజ్యమనియు, అందలి ప్రజలజ్ఞాను లనియు, అనాగరికులనియు, వీరికి స్వరాజ్యార్హత లేదనియు తాము లేకున్నచో జాతి మతభేదములవలన ఒండొరుల గొంతు కలు కోసికొన సిద్ధపడుదురనియు, అందువలనగూడ వారుస్వపరి పాలనమునకనర్హులనియు ప్రపంచమునకు వెల్లడించి, తామెంతో దయార్ద్రహృదయులును, ధర్మబుద్ధిగల ఉదారస్వభావులు నైనందుననే ఇంతకష్టపడి భారతదేశము నింత న్యాయముగా పరిపాలించుచున్నామనియు, కేవలము పరమార్థచింతతోనే ఈరాజ్యాంగసంస్కరణ చేయుచున్నామనియు ప్రపంచమునకు చూపుటకుగూడ కొన్ని సారవిహీనములగు అధికారముల నొసగుచు నీరాజ్యాంగమును తయారుచేసినారు. భారతదేశ భాగ్యభోగ్యములనెల్ల తాము స్వప్రయోజనార్థము వినియో గించుకొనుచున్న సంగతి కప్పిపుచ్చి తమయౌదార్యగుణమును చాటుకొనుటకు గూడ బ్రిటీషుప్రభుత్వము వారితంత్రములెల్ల చేసి ఈబూమ్మకొలువుసభలు, వీనిలోని సమాలోచనలు నడిపి తుదకీ వింత రాజ్యాంగమును చేసినారు. ఈ సమాలోచనము లందు బ్రిటీషువారెంత తెలివితేటలతో తమ రాజ్యతంత్ర మును ప్రయోగించిరో రెండవ రౌండుటేబిలు సభయందు తెరవెనుక మహమ్మదీయులతోను ఇతర అల్పసంఖ్యాక జన సంఘముల ప్రతినిధులతోను ఇంగ్లాండు దేశ కన్సర్వేటివు నాయకులు జరిపిన కుటిలనీతి కుట్రలలోనే బయల్పడినది. దాని ఫలితముగా స్వార్థత్యాగియు ప్రపంచమునందెల్ల గౌరవ్యుడు నగుమహాత్ముని సలహాలుకూడా వారు తృణీకరించి భార

తీయప్రజలెల్ల రేకగ్రీవముగా కోరుచున్న స్వరాజ్యమును గూడమఱచి, బ్రిటీషు ప్రధానామాత్యుని మధ్యస్థుని గా నేర్పరచుకొని ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరచుకొనుటయు రౌండుటేబిలుసభ రసాభాసముకాగా మహాత్ముడింటికి మరలుటయు నిక్కడ కాంగ్రెసు నణగద్రొక్కుటయు జరిగినది. బ్రిటీషువారు కుటిలరాజ్యతంత్రము ప్రయోగించి సఫలమనోరథులై రెండవ రౌండుటేబిలు సభలోని స్వార్థపరులమాటలు చర్యలు ప్రకటించుటకు చాటె, "చూచితిరా మేమెంత ధర్మాత్ములమో! గాంధిమహాత్ముని మాటకూడ వినక పోరాడుకొను వివిధపక్షములు భారతదేశములోకలవు గనుక వారిని మేముతప్ప భారతజాతీయ ప్రజాప్రభుత్వములు రక్షింపలేవుగనుకను అంగీకుతగిన బందోబస్తులెల్ల మేము చేసి వానిని పరిపాలించుటకే మేమచ్చట శాశ్వతముగా ప్రభుత్వము చేయుదలచినా"మని ప్రకటించి ధైర్యముతో నీ చట్టములోని విపరీతపుటన్యాయ నిబంధనలు శాసించిరి.

బ్రిటీషువారీ నాటకమునెల్ల ఎందుకాడవలసివచ్చినది? అనుదానికి కొక కారణముకూడకలదు. గాంధిమహాత్మునికి ప్రపంచములో చాలా గౌరవమును, పలుకుబడియు కలవు. ఆయన నాయకత్వమున కాంగ్రెసు చాలా బలవంతమైన రాజకీయసంస్థయై, నూతనపద్ధతులతో స్వాతంత్ర్యముకొరకు శాంతిసమరము చేయుచున్నది. ఈ విచిత్ర స్వతంత్ర పోరాటమును ప్రపంచజాతులెల్ల ఆశ్చర్యముతో చూచుచు, "నిజముగా యుద్ధములులేకుండా హింసలేకుండా అహింస

తోను సత్యవ్రతముతోను ప్రపంచసమస్యలెల్ల పరిష్కరింప వీలుకలదా" యని దిగ్భ్రమజెందుచు భారత దేశ రాజకీయము లెల్ల ఈ పాశ్చాత్యజాతుల దృష్టిలో మెలగుచున్నందున బ్రిటీషువారి అంతర్జాతీయ ప్రపంచరంగమున భారత దేశ ములో తమ రాజ్యతంత్రమును సమర్థించుకొనుట యవసర మయ్యెను. అందువలనగూడా ఈ కపటనాటకము నాడవలసి వచ్చెను. భారత దేశమున నీ మహాత్ముడు నీ కాంగ్రెసు నీ శాంతి సమరము నుండియుండనిచో సైమను నివేదికనాడే వీనికి మసి బూసి మూ రేడు కాయయునియుందురు. ఇప్పుడు కేవలము మసిమాత్రమే గాక బ్రిటీషువారు అతినిపుణతతో తయారు చేసిన చక్కని కృత్రిమపు రంగులుగూడ పూయవలసివచ్చెను. అందుకే ఈ రాజ్యాంగచట్టము నిర్మించుట కిన్నేండ్లు పట్టినది.

## మూడవ పరిచ్ఛేదము:

## బ్రిటిషు రాజ్యతంత్రముయొక్క ఆర్థిక ఫలితములు

### I

ఇంగ్లీషువారీదేశములో అడుగు పెట్టినది లాభము సంపాదించుట కొరకు; వారీదేశము నాక్రమించినది లాభము నార్జించుటకు; వారీ దేశమును పరిపాలించునదియుగూడ అందుకే. ఈ సంగతి గడచిన 175 సంవత్సరముల బ్రిటీషు రాజ్యతంత్ర చరిత్రవలన జగద్విఖ్యాతమైనది. 1935 లో నూతన రాజ్యాంగ చట్టము వలన నీసంగతి యిక దాచనవసరములేని రాజనీతిగా సూత్రీకరింపబడినది. ఈ అన్యాయపు రాజనీతిని తిరస్కరించి

విమర్శించువారెల్లరు రాజద్రోహులు; దీనికొరకు కార్యశూరులై ప్రవర్తించువారెల్లరు అరాజకులు; దీనికొరకు సంఘబలమును చేకూర్చుకొన దలచువారెల్లరు విప్లవకారులు.

భారతదేశమున వర్తకము చేయవచ్చి ఈ దేశములోని రాజులలో మిత్రభేదముల గల్పించి రాజ్యమునాక్రమించి తామే పరిపాలకులైన ఆంగ్లేయ తూర్పు ఇండియావర్తక సంఘము భారతదేశమున సంపాదించిన పలుకుబడియు రాజకీయాధిపత్యమును అధికార బలమును భారత దేశ భాగ్యభోగ్యములు ఇంగ్లాండు లాభముకొరకు వినియోగించుటకొరకే ఉపయోగింపబడు బ్రిటిష్ రాజ్యతంత్రపద్ధతి యానాడే ఆరంభమయ్యెను. ఈ దేశమును పరిపాలించుటకు కంపెనీవారు నియోగించిన గవర్నరు గవర్నరుజనరలులయొక్కయు వారి చేతిక్రిందపనిచేయు తాబేదారీ ఉద్యోగులయొక్కయు దుశ్చర్యలను బర్కు మున్నగు ధర్మవాదులు ఇంగ్లాండు పార్లమెంటులో వారన్‌హేస్టింగ్సు విచారణసందర్భమున తెలియపరచియున్నారు. ఈ దేశమునుండి సంతతధారగా కోట్లకొలది ధనకనకవస్తు వాహనములను సీమకంపుటయే నాటి ప్రభుత్వవర్గమువారి ప్రధానకర్తవ్యముగ నుండెను. ఈదుష్పరిపాలనములోని అన్యాయములే 1857 నాటి విప్లవమునకు గారణమయ్యెను.

ఈ దేశములోనికి అడుగిడిన నాటనుండియు తూర్పు ఇండియావర్తకసంఘమువారి ప్రధానలక్ష్యము ధనార్జనము. వర్తకమువల్ల అమితలాభములార్జించుటకు వలసినప్రయత్నము

కొల్ల వారుచేయుచుండిరి. తమబలము, పలుకుబడి తుదకు రాజ్యాధికారముగూడ ఇందుకే ఉపయోగించిరి. ఎగుమతివ్యాపారములోనేగాక దేశములోని వర్తకములో ఉప్పు, పోకచెక్కలు, నల్లమందు మొదలగువస్తువులను ప్రత్యేకముగా తామొక్కరే వ్యాపారము చేయుహక్కును సంపాదించి దానివలన విశేషధనము ఆర్జించుచుండిరి. దేశములో తమకుగల రాజ్యాధికారము పలుకుబడి నుపయోగించి తమకు కావలసిన సరకులను తాముకోరిన ధరలకు విక్రయించవలసినదని దేశీయవర్తకులను పరిశ్రామికులను నిర్బంధించి క్రూరకృత్యములనుకూడ చేయుచుండిరి. దేశములోని కంపెనీనౌకర్లు క్రిందివాని మొదలు గవర్నర్లవరకుగూడా స్వంతవ్యాపారములు చేసికొనుచు విశేషలాభములు పొందుచుండిరి. అందువలన లంచగొండెతనము దుష్పరిపాలనము హెచ్చెను. దేశప్రభువులు వీరికీలుబొమ్మలైనందున ఈదౌర్జన్యములకు అన్యాయములకు ఆలనపాలన లేదు. ప్రజల మొఱ లాలించువారులేరు. దేశములో వర్తకము ఆంగ్లేయులహస్తగతమాయెను. ఇతరులెవ్వరైన పోటీకి వచ్చినచో కంపెనీవారు దౌర్జన్యముగా వారిని హింసించి వారిసరకులను కాజేయుచుండిరి. కంపెనీప్రభుత్వమునందు విచ్చలవిడిగా దోపిడిజరిగినదనుట అతిశయోక్తి లేదు. ఇంగ్లాండులోని డైరక్టర్లు ఎల్లప్పుడును సొమ్ము పంపమనికోరుచుండిరి. అందువలన సొమ్ము సేకరించుటకు కంపెనీవారెన్నెన్నో దుర్మార్గములు చేయుచు ఎవరికిదొరికినది వారు కాజేయుచుండిరి. ఇంగ్లీషు డైరక్టర్లకుగావలసినది లాభముతప్ప వేరొకటిలేదు. దేశములోనెంత

దుష్పరి పాలన జరుగుచున్నదీ వీరుగమనింపరు. గమనించినను చర్య గైకొనరు. భారత దేశము తమ స్వంత జమీందారీ లేక జాగీరు అనియు అందలి వర్తకము వల్లనేగాక పరిపాలనవల్ల కూడా తమకు సరియైన లాభము రావలెననియు కంపెనీవారి యూహ. ధన సంపాదన కొరకు ఆనాడు ఎన్నో అన్యాయములు ఘోరములు మన దేశములో జరిగెను. క్లైవు, వారన్ హేస్టింగ్సులు దేశీయ నవాబులకు రాజులకు గావించిన అన్యాయములు, చేసిన ప్రజాపీడనము బయల్పడినప్పుడు గూడ ఎట్టిచర్యయు గైకొనబడలేదు. భారత దేశములో నీమహానుభావులిరువురు చేయని నేరము లేదని ఒకచరిత్రకారుడు వ్రాసియున్నాడు. తమఅన్యాయములు కప్పిపుచ్చుకొనుటయేగాక తమ కుతంత్రములు సమర్థించు కొనుటకు ఎన్నో దుస్తంత్రములు పన్ని తామెంతో ధర్మస్వరూపులమనియు ఈ దేశపు నవాబులెంతో దుర్మార్గులనియు ఇంగ్లాండువారికి అబద్ధములు గల్పించి చెప్పుచుండిరి. ఉదాహరణమునకు సురాజుద్దౌలాపట్ల వీరన్యాయము గావించి సురాజుద్దౌలా దుర్మార్గుడనియు అతడుచాల మంది ఇంగ్లీషు వారిని హింసించి చీకటి కొట్టులో పెట్టి తలుపు వేయుగా ఆ వేసవిలో ఊపిరి తిరుగక నోరెండి చాల మంది దుర్మరణమునొందిరని కంపెనీవారు ప్రకటించిన కలకత్తా చీకటికొట్టు కథకూడా ఇటువంటిదే యని ఇటీవల చరిత్రపరిశోధకులు బయల్పరచియున్నారు, కంపెనీ డైరెక్టర్లకు పార్లిమెంటులో గొప్పపలుకుబడి యున్నందున భారతదేశములో తమ తాబేదారులు కంపెనీ లాభముకొరకు చేసిన ఘోరా

న్యాయములెల్ల కప్పిపుచ్చి వారిని సమాధాన పరచుచుండిరి. 1765 సం॥ రం నాటికి కంపెనీవారికి దేశములోని రాజకీయములందుగూడ గొప్ప పలుకుబడి కలిగినది. అంతట వీరు మొగలుచక్రవర్తిని వంగరాష్ట్ర నవాబును జేబులో వేసికొని వంగరాష్ట్రమున 'దివానీగిరి' అనగా దేశాదాయము వసూలుచేయు హక్కును సంపాదించిరి. ప్రజలనుండి 132 లక్షలు వసూలుచేసి 26 లక్షలుమాత్రము దర్బారుకిచ్చి తక్కినది వీరు జేబులో వేసికొను హక్కు పొందిరి. 1768 మొదలు 1770 వరకు దేశములో ఘోరక్షామమువచ్చి ఒక కోటిమంది చనిపోయినప్పుడుగూడ ఈ పన్నుల వసూలులో ఆవంతయైన తగ్గింపుచేయలేదు. కంపెనీవారును వారి ఇజారాదారులును అతిక్రూర విధానములచే అణా పైసలుతో వసూలుజేసిరి.

## II

### భారతదేశమునుండి సీమకు ధనము ప్రవహించుట

ప్లాసీయుద్ధముతో భారతదేశమున నాంగ్లేయులరాజ్యాధిపత్యము స్థిరపడినది. ఈరాజ్యాధికారముల నుపయోగించి వారు మనదేశభాగ్యభోగ్యములను సీమకు గొనిపోవుట ప్రారంభించినారు. ఈవిధానము నాటికి నేటికి నొక్కతీరుగా జరుగుచున్నది. ఇందువలన వారు నానాటికిధనికులై సుఖపడుటయు, మనము దరిద్రులమై బాధపడుటయు సంప్రాప్తించినది.

ఈధనప్రవాహము మొదట నింగ్లీషు కంపెనీవారును వారి యుద్యోగులును మనదేశనవాబులవల్ల రాజులవల్ల బహు

మతులరూపమున లంచములు పుచ్చుకొనుటతో ప్రారంభమైనది. 1757 మొదలు 1766 వరకు అట్లు పుచ్చుకొన్న బహుమతుల మొత్తము 60 లక్షల పౌనులనిఅంచనా వేయబడినది. ప్రాతమారకపు రేటు ప్రకారము నవరసు 15 రూపాయిల చొప్పున నిది 9 కోట్లరూపాయిలని మనమూహించవచ్చును. నాటికంపెనీయుద్యోగులలో క్లైవు ఒక్కడే వంగరాష్ట్రనవాబువల్ల పుచ్చుకొనిన బహుమతులు కొన్ని వేల నవరసులుండె ననగా తక్కిన అసంఖ్యాకులగు నుద్యోగులు వసూలుచేసి సీమకంపిన సొమ్మెంతయుండునో ఊహించవచ్చును.

కంపెనీవారీదేశమునుండి సీమకు తీసికొనిపోవుట కవలంబించిన రెండవమార్గము ఈదేశమున తాము ఆక్రమించిన రాజ్యములందలి పన్నులవలన వచ్చిన దేశాదాయములో సామాన్య సివిలుపరిపాలనకు గావలసిన ఖర్చులుపోగా మిగిలిన నికరాదాయమెల్ల సీమకుపంపి కంపెనీ వాటాదారులు లాభముల క్రింద పంచుకొనుట. ఈ దేశాదాయములో కొంతభాగమైనను ఈదేశప్రజలసౌకర్యములకొరకుగాకపోయినను తామువసూలు చేయుచుండిన అత్యధిక భూమిశిస్తు కాధారభూతమైన పల్లపు సాగు కవసరమైన నీటి వసరులకైనను ఖర్చుచేయక పన్నుల వసూలకొరకు తా మేర్పరచిన ఉద్యోగుల జీతములు స్వల్ప వ్యయములుపోను తక్కినసొమ్మంతయు సీమకు తరలింపసాగిరి.

ఈ భూమిశిస్తు లేక పన్నుల వసూలుకొరకు రెండు పద్ధతు లవలంబించిరి. వంగరాష్ట్రములోను, బీహారు సంయుక్త రాష్ట్రములలోను మదాసులో కొన్నిచోట్లను భూముల

హక్కులను రైతులనుండి తీసివేసి ఆ భూములపైన తమకు సాలున కింతయని శాశ్వతశిస్తు లేక పేష్కష్ఇచ్చు పద్ధతిని తమ క్రింద నదివరకు పన్నులువసూలు యిజారాలు పొందియున్న దళారీలకు ఆ జమీలనొసగి జమీందారీపద్ధతి నెలకొల్పి దీనికే పర్మనెంటు సెటిల్మెంటనిరి. మదరాసురాజధానిలోని తక్కిన చోట్ల నీ శాశ్వత పైసలాగాక తామేభూమిహక్కులువహించి తమ కలెక్టరుద్వారా రైతులకు పట్టాలిప్పించి ఏసాలుకాసాలు భూమిశిస్తు వసూలుచేయు రైత్వారీపద్ధతి స్థాపించిరి. ఈరెండు పద్ధతులందును భూమిశిస్తు అత్యధికముగానేయుండి దానిని వసూలుచేయుటకు క్రూరపద్ధతు లవలంబింపబడెను.

కంపెనీ వంగరాష్ట్రమున పన్నుల వసూలుహక్కుపొందునాటికి

1764—65 మధ్య భూమిసిస్తు 818000 పౌనులుండెను.

1765—66 కంపెనీపరిపాలనయొక్క మొదటిసాలున 1470000

1790—91 నాటికి 2680000 పౌనులయ్యెను.

1812—13 లో 40 లక్షల 90 వేల పౌనులనుండి

1822—23 నాటికి ఒక కోటికి 36 లక్షలపౌనులయ్యెను.

1857—58 నాటికి ఒకకోటి 57 లక్షలయ్యెను.

కంపెనీవారును భూస్వాములును కలిసి రైతుల నిట్లు పీడించుటవలన కరవు లధికమయ్యెను. వంగరాష్ట్రమున 1770 లో వచ్చిన కఱవులో ఒక కోటిమంది మరణించిరి. ఆ రాష్ట్రములో మూడవవంతు మంది మరణించి నందువలన వ్యవసాయభూమి క్షీణించినను గూడా 1771 లో వసూలుచేయు

బడిన నికరాదాయము 1768 నాటికి మించినదని వారన్ హేస్టింగ్స్ సీమలోని కంపెనీ డైరెక్టర్లకు వ్రాసెను.

III

ప్రత్యేక వ్యాపార హక్కులు ఇజారాలవల్ల రాజకీయములందలి లంచగొండితనము వల్ల భరింప రాని భూమిసిస్తులవల్ల కంపెనీవారు భారతదేశములోనుండి సాలియానా ఎంతో ధనమును నికర లాభముగా సీమకు పట్టుకొని పోవుచుండిరి. ఈ ప్రకారముసీమకునిరంతరధనప్రవాహముప్రారంభమైనది. 18 వ శతాబ్ద ప్రారంభమున అనగా 1772 మొదలు 1835 వరకు ఈ ధనప్రవాహము సాలుకు 30 లక్షల పౌనులుగా నుండెనని అంచనా వేయబడినది. ప్రైవేటుగా పంపబడు సొమ్ముతో కలిసి సాలుకు 50 లక్షల పౌనులుండెనని అంచనా వేయబడినది. ఈప్రవాహము నానాటికి వృద్ధియైనది. 1835—1839 మధ్య దామాషాగా సాలు 1 కి 5,347,000 పౌనులు పోవుచుండెను 1855—1859 కి మధ్య ప్రతిసాలున 7,730,000 పౌనుల చొప్పున పోవుచుండెను.

ఇట్లు సీమకు పోవుచుండిన నిరంతర ధన ప్రవాహముల వలనఆంగ్లేయ పరిపాలనక్రింద మన దేశము నానాటికి దరిద్రమై పోవుచున్నదనియు పూర్వపురాజుల నిరంకుశపరిపాలనలో ప్రజలెట్టి బాధలు పడుచున్నను దేశముమాత్రముసుభిక్షముగ నుండెడిదనియు సర్. ఆర్. గ్రాంటుగారిది చూచి 1836 లో వ్రాసియున్నారు. ఈ దేశాదాయమునెల్ల నీదేశములోనే కర్చు పెట్టిన చో ప్రజలకు క్షేమ లాభములు గలిగి

యుండును. అట్లుచేయక దానిని సీమకు గొనిపోయి కంపెనీ వాటాదారులకు లాభముక్రింద పంచిపెట్టబడుచునందున నీదేశము నానాటికి దరిద్రమైపోయి ప్రజలకు సౌకర్యములు లేక దుర్దశవచ్చినది. 1790 లో గవర్నరుజనరలుగ నుండిన కారన్ వాలిస్ "పై విధముగా నీదేశమునుండి సీమ కిట్లు సొమ్ము పంపబడుచున్నందువల్లను ప్రైవేటుగా పంపబడుచున్నవి శేష ధనమువల్లను, భారతదేశజవసత్వములెల్ల హరించిపోవుచున్నవి అందువల్ల నీ దేశముయొక్క పాడిపంటలు, కృషిసంపద, వాణిజ్యము క్షీణించుచున్నవి" అని కంపెనీవారికి మినిట్సులో వ్రాసినాడు. 1787 లో 'సర్ జాన్ షోరు' "ఈకంపెనీవారీదేశములో వర్తకులేగాక ప్రభువులుగా నున్నారు. వర్తకులుగా దీని వ్యాపారమెల్ల కొల్లగొనుచున్నారు; పరిపాలకులుగా దీని ఆదాయమెల్ల మ్రింగుచున్నారు. ఈదేశముయొక్క నికరాదాయము సీమకంపుటలో రొక్కముగాగాక దానివిలువకు సరిపడిన ముడివస్తువులు సీమకంపబడుటవలన నిజముగా నీదేశ సంపదయే సీమకు తరలిపోవుచున్నది. కంపెనీవారి పరిపాలనము వలని లాభముకన్న పరాయివారిట్లు దేశముయొక్క భాగ్యభోగ్యములు తరలించుకొని పోవుటలోని నష్టములే అధికముగా కనబడుచున్నవి" అని వ్రాసినాడు.

వంగరాష్ట్రములో 1807—1814 కు మధ్య సర్వేలు జరిగినవి. వీనిని గూర్చి విమర్శించుచు మాంట్గొమరీమార్టిను 1835లో నిట్లు వ్రాసినాడు "ఈసర్వేనుబట్టిచూడగా ఈదేశము సకలసంపదలకు నిలయమే గాని ఇందలి ప్రజలతిదరిద్రులుగా

కనబడుచున్నారు. సాలియానా బ్రిటిషు ఇండియాలోనుండి సీమకు 30 లక్షల పౌనుల చొప్పున పోవుచున్న ధనము ఈముప్ప దేండ్లకు మామూలు వడ్డీరేటుతో 723,900,000 పౌనులు అయియున్నది.

ఇంగ్లాండునుండి ఇంతధనము వెలుపలికి ప్రవహించిపోయి నచో ఆదేశముమాత్రము దారిద్ర్యమున మునుగకమానునా? ఇట్టితరి రోజుకు రెండుమూడు పెన్నీలు (అణాలు) కన్న కూలి డబ్బులుగిట్టక అవస్థపడు భారతీయునిపై నిదియెంత భారముగా నుండును?"

మిల్లువ్రాసిన హిందూదేశచరిత్రలోగూడ నీ ధన ప్రవాహ మతికఠినముగా విమర్శింపబడినది.

## IV

భూమిశిస్తు ఇతరపన్నులలో పరిపాలన ఖర్చులుపోను ప్రతిసాలున మిగిలిన నికరదేశాదాయము నిట్లు ప్రతిసాలున కంపెనీ వాటాదారుల లాభము క్రింద పంచిపెట్టుటకు సీమకు పంపబడుచున్నను వారికి చాలలేదు. అందువల్ల దాని క్రింద కొంతసొమ్ము కావలసివచ్చినదనియు- తాముచేసిన యుద్ధములకు కొంతసొమ్ము కావలసి వచ్చినదనియు చెప్పి మొదట కొంత ఋణము తెచ్చి ఆ ఋణమును దానిపై నివ్వ వలసిన వడ్డీనిగూడా మన దేశముపైన బడవేసినారు. ఇదియే మన ప్రభుత్వఋణముయొక్క పుట్టుకచరిత్ర. అనేకరూపము లుగాఅది వృద్ధియై తుదకు నేడు 1300కోట్ల రూపాయిలై సాలు

1 కి 16 కోట్ల రూపాయిలు దానిపైన వడ్డీక్రిందనే చెల్లించు చున్నాము. ఆఋణముపై నింతవరకు చెల్లించిన వడ్డీ అసలు ఋణముకుమించినది. దీనిలో 729 కోట్ల 40 లక్షలు కేవలము ఆంగ్లేయులలాభముకొరకే వినియోగింపబడియుండెను. మిగతా 400 కోట్లు మన దేశములో దుబారాఖర్చుతో నిర్మింపబడిన రైళ్ళువగైరా పనులకొరకు ఖర్చుఅయినది.

| సంవత్సరము | ఋణస్వభావము | మొత్తము |
|---|---|---|
| 1792 లో | పైనచెప్పినట్లు కంపెనీచేసినది 70 లక్షల పౌనులు. | |
| 1799 లో నది | 100 లక్షలుగా పెరిగినది. | |
| 1805 లో నిది | 210 లక్షలు | |
| 1807 లో నిది | 270 లక్షలు | |
| 1829 లో నిది | 300 లక్షలకు పెరిగినది. | |
| 1857 నాటికి | 59½ కోట్లరూపాయిలుగా పెరిగెను. | |

ఇందులో 1857 కు పూర్వముకంపెనీవారి దేశాక్రమణ యుద్ధములకొరకైన వ్యయము 35 కోట్లు రూ

1833 మొ॥ 57 వరకు కంపెనీ వారికి వాటాలపైనవడ్డీ క్రింద నిచ్చినది 15 కోట్ల 12 లక్షలు

50 కోట్ల 12 లక్షలు

1857 లో సిపాయివిప్లవమణచి నందుకని చెప్పి 40 కోట్లు రూ.

1857-74 వరకు కంపెనీ వాటాలపైన
వడ్డీక్రింద 10 కోట్ల 8 లక్షలు
కంపెనీవాటాలను భారత దేశప్రభు
త్వముక్రింద కొనివేసినందుకు 12 కోట్లు

22 కోట్ల 8 లక్షలు

1857-1900 వరకు రాజ్యాక్రమణయుద్ధముల
కొరకు చేసినవ్యయము 37 కోట్ల 50 లక్షలు
1914-1920వరకు ఐరోపాసంగ్రామమున
భారతదేశమిచ్చిన విరాళము 189 కోట్లు
ఆయుద్ధముక్రింద చేయబడిన వ్యయము 170 కోట్ల 70 లక్షలు

397 కోట్ల 20 లక్షలు

1857-1931 బర్మాకొరకుగావింపబడిన
చిల్లరఖర్చులు 20 కోట్లు
డిటో 82 కోట్ల

102 కోట్లు

1916-1921 ఇంగ్లాండుప్రభుత్వమువారి
ద్రవ్యపద్ధతివలన రివర్స్
కౌన్సిలులోని నష్టము. } 35 కోట్లు
రైల్వేకంపెనీలనుండి రైళ్లుకొనుటకు 50 కోట్లు
సైన్యములకుగావలసిన రైళ్లనిర్మాణము 33 కోట్లు

7,29,40,00,000

# V

తూర్పు ఇండియాకంపెనీవా రీ దేశమునకు వర్తకము జేయువచ్చిన మొదటిరోజులలో నింగ్లాండులో పరిశ్రమలు లేవు. అందువలన ఈ దేశపు డక్కామజిలినులు, రవసెల్లాలు, శాలికోలు, సుగంధద్రవ్యములు, పంచదార, గాజు సామానులు ఇంకను అతిసున్నితమగు వస్తుజాలము పారిశ్రామిక సరకులు ఇంగ్లాండుకు ఐరోపాకు నెగుమతి చేయుచుండిరి. ఇంతలో ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవము కలిగెను. ఆవిరియంత్ర సహాయమున వస్తునిర్మాణమునకు మార్గము లేర్పడెను. దేశపరిశ్రమ లభివృద్ధిగాంచవలెనన్నచో ఇతరులపోటీ నరికట్టవలెను. అంతట కంపెనీవారు భారత దేశపరిశ్రమలవలన తయారగు వస్తువుల నింగ్లాండులోనికి పంపుటమాని ఈ దేశపరిశ్రమల నొక్కటొక్కటిగా నాశనముజేసి ఇంగ్లాండు యంత్రమగ్గముల పైన నేయబడిన నూలుసరకులు ఇతరవస్తువులు ఈ దేశములోనికి దిగుమతిచేసి ప్రజలు కొనునట్లు చేయసాగిరి. దేశములోని ఎగుమతిదిగుమతులపై సుంకములు విధించుట దేశములోని వ్యాపారములనుగూర్చిన కట్టుబాటులు ఈదృష్టితోనే గావింపసాగిరి. ముడివస్తువు లింగ్లాండు కెగుమతిచేయుటలో తక్కువ పన్ను, తయారుసరకులపైన హెచ్చుపన్ను, ఇట్లే ఇంగ్లాండులోనుండి దిగుమతిచేయు తయారుసరులకుపైన తక్కువపన్ను విధింపబడసాగెను. ఇట్లు తమ రాజకీయబలమును అధికారమును తమ దేశ ఆర్థికలాభముకొరకు వినియోగింపసాగిరి. ఈ విధానము ప్రయోగించుటవలన త్వరలోనే భారత దేశమునుండి

తయారుసరుకు లెగుమతి చేయబడుట తగ్గిపోయెను. దేశము లోని పురాతన పరిశ్రమలు క్షీణించి పోయెను. క్రొత్తవిసెల క్రొల్ప వీలులేకుండ బందోబస్తులు నిషేధములుచేయబడెను.

ఇంగ్లాండులోనుండి ఇండియాకుపంపబడు నూలుసరకుల పైన నూటికి 3½ వంతున పన్ను. ఇండియానుండి ఇంగ్లాండు కెగుమతి చేయబడువానిపైన నూటికి 10 వంతుల చొప్పున పన్ను. ఇంగ్లాండుకు ఎగుమతిచేయు పంచదార ముడివస్తువు గాన తక్కువపన్ను. దీనినుండి తయారుకాబడు "రమ్ము" అన బడు సారాపైన అత్యధికపన్ను. ఇండియానుండి ఇంగ్లాండుకు పంపు యినుముపైన అత్యధికపన్ను. ఇంగ్లాండునుండి దిగుమతి చేయు యినుముపైన పన్నేలేదు! ఈ విధానమువలన 1814 నుండి 1835 సంవత్సరముల మధ్యకాలములో నిండియానుండి ఇంగ్లాండుకు పంపబడు నూలుసరకులు నాలుగవవంతుకు పడి పోయెను. ఆకాలములోనే ఇంగ్లాండునుండి దిగుమతిచేయబడు నూలుబట్టలు ఆరురెట్లకు పెరిగెను. 1815 లో ఇండియానుండి 1300000 పౌనుల ప్రత్తి ఎగుమతి చేయబడగా నది 1832 లో 100 000 పౌనుల విలువకు పడిపోయెను. ఇంగ్లాండులో నుండి 1815లో 26, 300 పౌనులు నూలుసరకులు ఇండియాకు దిగు మతిచేయబడిన స్థితిపోయి 1832 నాటికి సాలుకు 400,0 0,000 పౌనులు (60 కోట్లరూపాయల) విలువగల నూలుసర కులు దిగుమతి చేయబడుట గలిగెను. ఇట్లే పట్టుసరుకులు 1828లో 920000 పౌనుల విలువగలవి ఎగుమతి కాగా 1831-32 లో 540000 పౌనులకు క్షీణించెను. 1857 నుండి అది

మఱియు పూర్తిగా పోయెను. 1828—38 మధ్య ఇండియా నుండి ఇంగ్లాండుకు సాలుకు 28000 పౌనుల విలువ ఉన్ని సరకులు ఎగుమతి చేయబడెను. ఆకాలపు స్థితిపోయి 1857 నాటికి ఇంగ్లాండునుండి ఇండియాలో ఉన్ని దిగుమతి విలువ 300000 పౌనులనుండి 800000 పౌనులకు పెరిగెను.

ఇట్లే పంచదార ఎగుమతితగ్గిపోయి 15 కోట్ల విలువ దిగుమతిచేయు స్థితివచ్చెను. మఱియు గాజు సరకుల పరిశ్రమ క్షీణించెను. తుదకు ఓడల నిర్మాణపరిశ్రమకూడా హిందూ దేశములో పూర్తిగా నాశనముచేయబడెను. 1857 నాటికుండిన భారతీయనౌకలసంఖ్య 34286;1898 నాటికి 2302 క్రిందికి తగ్గిపోయెను. తుదకు సాలుకు 132 నౌకలు తిరుగుస్థితికివచ్చెను. కోస్తావర్తకముగూడ బ్రిటీషువర్తకుల వశమయ్యెను. భారత దేశ పరిపాలనమంతయు బ్రిటీషువర్తకులకు ఇంగ్లీషువారికి లాభకరముగా నుండునట్లు చేయుబడుచున్నదని చెప్పుటకు ఉప్పు పన్ను చరిత్ర నుదాహరణముగా చూపవచ్చును. ఇంగ్లీషువారి యోడలలో బరువుచాలక ఉప్పు వేసుకొనివచ్చుచుండగా దానిని బజారులో అమ్ముటకు దేశవాళీ ఉప్పుపైన పన్నువిధించినగాని ఉప్పుధర హెచ్చి అది చెలామణికాదుగనుక బ్రిటీషుప్రభువులు ఉప్పుపన్ను విధించిరి. ఈ ఉప్పుపన్నుయొక్క రహస్యమిదియే. బ్రిటీషువారి ఆర్థిక లాభవిధానములో నీ పన్ను ఒక ప్రధాన స్తంభముగనుకనే భారతీయు లెంత మొరపెట్టుకొన్నను నాటికి నేటికి నిది తీసివేయబడలేదు. బ్రిటీషువారు మొదటినుండియే

ప్రారంభించిన ఈ ఆర్థికలాభవిధానముకూడ నాటికిని నేటికిని మారలేదు.

## VI

స్వతంత్రభారతము "బ్రిటిష్ ఇండియా"గా చేయబడిన పిదప భారత దేశప్రభుత్వస్వరూపమునం దెన్నిమార్పులు జరిగినను భారత దేశభాగ్యభోగ్యముల నింగ్లాండువారి లాభము కొరకు బ్రిటీషుసామ్రాజ్యస్వప్రయోజనముకొరకు వినియోగించుకొని ఈ దేశప్రజల నధోగతిలోనికి దింపు రాజకీయార్థిక దాస్య పద్ధతిలో మార్పుకలుగలేదు. బ్రిటీషుపరిపాలనావిధానమువలన భారతీయుల పూర్వపరిశ్రమలు నశించినవి. అందు ముఖ్యముగ నౌన్నత్యము జెందిన వస్త్రపరిశ్రమ నౌకాజీవనము ఇతరపరిశ్రమలు రూపుమాసినవి. ఇప్పటికి నుద్ధరింప వీలుగల గ్రామపరిశ్రమలనైనను ప్రభుత్వమువా రుద్ధరింపరైరి. క్రొత్త వానిని నెలకొల్పక యుపేక్షించుచున్నారు. అందువలన భారతీయు లార్థికాభివృద్ధిలేక సహజనంపదను గోల్పోవుచు ఏటేట కోట్లకొలది రూప్యముల విలువగల విదేశవస్త్రములు, ఇతర వస్తువులు గొనుచు నానాటికి బీదలగుచున్నారు.

భారతీయుల కార్థికస్వాతంత్ర్యములేదు. భారతీయార్థిక పరిపాలనము బ్రిటీషువారి వ్యాపారశ్రేయమునే ముఖ్యలక్ష్యముగ జూచుకొనుచు బ్రిటీషుమంత్రి హస్తగతమైయున్నది. అందువలన భారతీయులకు నష్టకరములును బ్రిటీషువారికి లాభకరములునగు విధానములు దాపురించుచున్నవి. పన్నులు

లేకుండగ దిగుమతులుచేయు "స్వేచ్ఛావ్యాపార" పద్ధతియు, బ్రిటీషు సామ్రాజ్యమువారికి సౌకర్యముల నిచ్చు "ఇంపీరియల్ ప్రిఫరెన్సు" పద్ధతియుగూడ ఇంగ్లాండు దేశమునకే లాభకరములుగనున్నవిగాని భరతఖండమునకు నష్టకరములే యైనవి. మనరూపాయయొక్క బంగారు విలువను తమ కనుకూలమగు మారకపు పద్ధతి కనుగుణముగ నేర్పరచి లాభము పొందుచున్నారు. ఇంగ్లాండు దేశమునుండి మన దేశమున రైలుదారులనువేయుటకు వ్యాపారము చేయుటకును వచ్చిన వర్తకులు మనకు వ్యతిరేకముగ ప్రవర్తించుటయు వింత కాదు.

భారతీయుల ఆర్థిక పారిశ్రామిక విద్యాభివృద్ధికి భంగకరముగ అమితవ్యయమును దెచ్చిపెట్టిన బ్రిటిషుపరిపాలనావిధానము బీదలగు భారతీయుల కెంతమాత్రము తగదు. దీనియనర్థములు జగద్విదితములుగ ఉన్నవి. ప్రతిసాలున మన ఆదాయమునందు చాలభాగము సైన్యమే మ్రింగివైచుచున్నది. మన పరిపాలకోద్యోగుల వేతనము లత్యధికములుగ నున్నవి. ప్రపంచమున నే దేశమున నింత యమితముగ లేవు. ఈ దుర్వ్యయమునకు సొమ్ము చాలనందున జనసామాన్యము పైన మిక్కుటములగు పన్నులు విధించి పీడించుచున్నారు. ప్రపంచమునందలి నాగరక దేశములలో ధనికులను బాధించు ఆదాయపుపన్ను వారసత్వపుపన్ను అధికముగ విధింపబడి బీదలను బాధించు భూమిపన్ను సుంకములు తక్కువగ విధింపబడుచుండగ మన దేశమున మొదటిరకము తక్కువగను, రెండవరకము హెచ్చుగ నున్నది. భూమిపన్ను కర్షకుల నికరాదాయమున

వగముపైగా మిగులుచున్నది. ఇదిగాక ప్రపంచవిరుద్ధమగు ఉప్పుపన్ను విధించి బీదలను పీడించుట చిత్రము. సారాయము విక్రయముచేసి ప్రభుత్వము ధనము గడించుట యధర్మముగ నున్నది. ఇట్టి పన్నులపద్ధతి స్వాతంత్ర్యముగల దేశములందు ప్రజ లంగీకరింపరు.

భరతఖండమున కానక్కరములేని యుద్ధములకొరకు భరతఖండపు ఆదాయము దుర్వ్యయము గావింపబడినది. సామ్రాజ్యమును వృద్ధిజేసుకొనుటకును, ఇనుప దారులువేసి సైన్యముల రాకపోకలను సులభము చేయుటకును తమ సౌకర్యముల కొరకును ఇంగ్లాండులో ఋణములను దెచ్చిరట. నేడు 1200 కోట్లరూపాయల ఋణము భారతీయులు భరింపవలెనట. దీనికయి ప్రతివత్సరము నింగ్లాండుకు వడ్డీని చెల్లించుటకు మన యాదాయమున చాల వ్యయమగుచున్నది.

ఇంగ్లాండునకు బోవున దీ ధనము మాత్రమే కాదు; మనకు దిగుమతులకన్న ఎగుమతులధికముగ నున్నందునను ఇంగ్లాండునకే చాలవరకు మన ముడిసరుకులు పోవుచున్నందునను వారికి చెల్లించుటకు సుంకముల క్రిందను వారికివచ్చు లాభముల క్రిందనుపోవు ధనము, ఇంగ్లీషు ఉద్యోగుల వేతనముల క్రిందను సంపాదనల క్రిందను పోవుధనమును మనకు గావలసిన వస్తువుల నింగ్లాండులో కొనుటవలన పంపుధనమును గలసి నిరంతరాయముగ పోవుచున్న ధన ప్రవాహము మనల బీదల జేసి వారిని ధనికుల జేయుచున్నది. ఇట్లు పోవుచున్న

ధనప్రవాహము సాలుకు అన్ని రూపములుగానుకలసి 304 కోట్ల రూపాయిలుఅని అంచనా వేయబడినది.

వ్యాపార సంబంధమైనట్టియు, వృత్తిసంబంధమైనట్టియు విజ్ఞానప్రద మైనట్టియు విద్యనభివృద్ధిచేయుటకు ప్రభుత్వమువా రుపేక్షించినందువలన ప్రజ లజ్ఞానమున మునుగుటయు, ఆర్థి కాభివృద్ధి కలుగకపోవుటయు, క్రొత్తపరిశ్రమలు వృద్ధిగాక పోవుటయు తటస్థించి ఆర్థికక్షయముకలుగుచున్నది. మఱియు నింగ్లాండులోని జనులకు దినమున కొకనికి 4 రూప్యముల దామాషా ఆదాయము వచ్చుచుండగ మనదేశమున నొకని కొకదినమునకు ఒకఅణా తొమ్మిదిపైసలే దామాషా ఆదా యముగ నున్నది! ఇంతియె కాదు. అజ్ఞానమువలనను, నివా రింపబడనందువలన పెరుగుచున్న అనారోగ్యమువలనను, ప్రజల దామాషా ఆయుర్దాయము కూడ క్షీణించి మరణ సంఖ్యయు వృద్ధియగుచున్నది. ఇతర దేశములందు దామాషా ఆయుర్దాయము 40 సంవత్సరములై యుండగ మనదేశమున 23 సంవత్సరములు మాత్రమే!

భరతఖండమునకు ఆర్థికస్వాతంత్ర్యముగల సంపూర్ణ స్వరాజ్యము కలిగినగాని ఈ ఘోరాన్యాయములు తొలగవని దాదాభాయి నౌరోజీ నాటినుండి లజపత్‌రాయిగారి నాటి వరకు భారతీయ నాయకులెల్ల రుద్ఘోషించినను బ్రిటీషువారు పెడచెవిని బెట్టిరి.

భారతదేశ దారిద్ర్యమును బాపుటయే కాంగ్రెసు యొక్క ప్రధానోద్దేశ్యము అందుకొరకే కాంగ్రెసు ఈ 50

సంవత్సరములనుండి పాటుపడుచున్నది. భారత దేశ ప్రజల ఘోర దారిద్ర్యమును నివారించుటకు వెంటనే కొన్ని ఆర్థిక సంస్కరణములనైన జేయవలసినదని బ్రిటీషువారిని మహాత్ముడు కోరియున్నాడు. వారు అట్లు చేయనందున ఇక నీ సామ్రాజ్య తత్వముతో సంబంధమున్నన్నినాళ్లు ఈ దారిద్ర్యము తప్పదని గ్రహించి పూర్ణస్వరాజ్యముకొరకు సత్యాగ్రహ మారంభించెను.

ఇట్లు కంపెనీవారి కాలమున ప్రారంభమైనకొల్ల నేటికిని జరుగుచునేయున్నది. మనదిగుమతులకన్న ఎగుమతులధికము గానుండి ఈ ఎగుమతులెల్ల ప్రకృతిసంపదకు జెందిన ముడి పదార్థములే యైనందున ఈ తేడాయంతయు మనకు నష్టము వారికి లాభకరము. కంపెనీకాలములోవలెనేడు దేశముయొక్క నికరాదాయమే ఇంగ్లాండుకు బహిరంగముగా పంపబడకున్నను ఉద్యోగులజీతములక్రింద సైన్యముక్రింద ప్రచ్ఛన్నముగానది పంపబడుచునేయున్నది. ఆంగ్లేయులకు ప్రత్యేకముగా వ్యాపార యిజారాలేకపోయినను నేటి ఆర్థికపరిపాలనలోని బ్రిటీష్ సామ్రాజ్యలాభవిధానమువలన నాఫలితమే సిద్ధించినది. ఇట్లు ఉద్యోగులజీతములు, పింఛనులు, విదేశవ్యాపారము, ఓడల కిరాయి, ఇన్సురెన్సు బ్యాంకింగు కమీషనులు, మారకము రైలుదారులు, రూపముగా నేటికిని ధనము సీమకుప్రవహించి పోవుచునేయున్నది. ఇట్లు ధనము నిరంతరముగా పోవుచున్న సంగతి భారతీయమితవాదులు, అర్థశాస్త్రజ్ఞులు, తుదకింగ్లీషు వారుసైతము అంగీకరించుచున్నారు గాని ఎంతమొత్తము

పోవుచున్నదను విషయమున కొంత యభిప్రాయభేదము కలదు. సాలుకు కొన్ని వందలకోట్లరూపాయిలు పోవుచున్నవని మాత్రము అందరు నంగీకరించుచున్నారు.

1906 లో హైండ్‌మన్‌గారు సాలు 1కి 400 లక్షలు పౌనులని అంచనావేసినారు. విల్సన్‌గారు 350 లక్షలనిరి. సర్ థియోడర్ మారిసన్‌గారు 210 లక్షలని అంచనావేసినారు.

ఈధనప్రవాహము మొత్తము సాలు 1కి 161 కోట్ల రూపాయలని ఒకఅంచనావేయబడి దానిని సర్ విశ్వేశ్వరయ్య గారు తమగ్రంథములో నుదాహరించినారు.

| | కోట్ల రూ॥ లు |
|---|---|
| బ్రిటీషు లేక ఇతరవిదేశీ ఓడల కేవులు నుంచి | 35 |
| బ్రిటీషు లేక ఇతరవిదేశీ బ్యాంకుల కమీషనులు | 21 |
| బ్రిటీషుజాతివారు వ్యాపారమువల్ల, జీతముల వల్ల, పరిశ్రమలవల్ల పొందులాభము | 40 |
| బ్రిటీషువారీ దేశములో పెట్టినపెట్టుబళ్లపైన సాలుకు నూటికి 5 చొ॥ వడ్డీ | 65 |
| వెరసి. | 161 |

మన దేశమునుండి ప్రతిసాలున ప్రవహించిపోవు ధన ప్రవాహము 219 కోట్ల 86 లక్షలరూపాయలని ఇంకొక అంచనావేయబడినది. ఇది ప్రొఫెసర్ షాగారు తమ ఆర్థిక శాస్త్రములోవేసిన లెక్క.

1. 1921-22 లో ఇంగ్లీషు ప్రభుత్వము ప్రభుత్వరీత్యా మనవలన వసూలుచేసుకున్న మొత్తము

(Home charges) 50 కోట్ల రూ॥లు

2. విదేశీయులు భారతదేశములో స్థాపించిన కంపెనీల పెట్టుబళ్ళపైన వడ్డీలు 60 ,,

3. విదేశీయ కంపెనీలకు సరకు కొరకు ప్రయాణీకులకొరకు మనము చెల్లించిన ఓడకేవు 41 కోట్ల 63 లక్షలు

4. మనము చెల్లించిన బ్యాంకింగు కమీషను 15 కోట్లు

5. విదేశీయ ఉద్యోగులు వ్యాపారులు మనదేశములో సంపాదించిన లాభము 53 కోట్ల 23 లక్షలు

వెరసి 219 కోట్ల 86 లక్షలు

ఇటీవల ఇంగ్లాండు దేశమునకు మన దేశమునుండి సాలియానా పోవుచున్న ఈ ధనప్రవాహము 303 కోట్ల 90 లక్షల రూపాయలని అమెరికావారు 1931 లో అంచనా వేసియున్నారు.

| | |
|---|---|
| ఉద్యోగుల జీతములు | 62 కోట్ల 10 లక్షల రూ |
| విదేశ వ్యాపారము | 61 కోట్ల 20 లక్షల ,, |
| నౌకా లాభములు | 42 కోట్లు |
| (ఇన్స్యూరెన్సు) భీమావ్యాపారము | 10 కోట్ల 50 లక్షలు ,, |
| బ్యాంకింగు కమీషను, మారకము | 7 కోట్ల 50 లక్షలు ,, |
| రైలురోడ్లు | 12 కోట్ల 60 లక్షల ,, |

వెరసి 303 కోట్ల 90 లక్షల రూ.

ఈ సొమ్ము వారికిట్లు చెందుచున్నదని నిర్ధారణచేసినారు.

| | | |
|---|---|---|
| వ్యాపారలాభము | 6780 | లక్షలు రూపాయిలు |
| పబ్లికుఋణములలో పెట్టుబడి | 7500 | ,, |
| లాభముల తిరుగుపెట్టుబడి | 7500 | ,, |
| ఇంగ్లాండుకు పంపబడు రెమిటెన్సులు మొదలగు పైకము | 6000 | |
| ప్రభుత్వపంపుళ్లు | 1500 | ,, |
| వివిధములు | 1110 | .. |

వెరసి 303,90 లక్షలు రూపాయిలు

భారత దేశప్రజల దామాషా ఆదాయ మతిహీనముగా నుండుటకు గల మూలకారణములలో నిదియొకటి.

## భారతదేశ ప్రజల దామాషా ఆదాయము.

### వి వి ధ అం చ నా లు.*

| ఎవరిఅంచనా? | ఏసంవత్సరము? | దామాషాఆదాయము. మనిషి 1 కి సాలుకు ఎన్నిరూపాయలు. |
|---|---|---|
| దాదాభాయి నౌరోజీ | 1870 | రు 20—0—0 |
| బారింగు బార్బరు | 1882 | 27—0—0 |
| డిగ్బి | 1898-99 | 18—0—0 |
| కర్జను ప్రభువు | 1900 | 30—0—0 |
| డిగ్బి | 1900 | 17—4—0 |
| అట్కిన్సన్ | 1875 | 25—0—0 |
| ,, | 1895 | 34—0—0 |
| ,, | 1911 | 50—0—0<br>80—0—0 |
| వాడియా జోషీగార్లు | 1913-14 | 44—5—6 |
| షా ఖంబటాగార్లు | 1921 | 67—0—6 |
| ఫీండ్లే షిరాస్ | 1921 | 107—0—0 |
| ,, | 1922 | 116—0—0 |
| సర్ విశ్వేశ్వరయ్యగారు | 1931 | 80—0—0 |

* విశ్వేశ్వరయ్యగారివిగాక తక్కిన అంకెలు Indian Economics by G. B. Jathar and S. G. Beri, అను గ్రంథము నుండి.

ఈ అంకెలవిషయములో గమనింపవలసిన ముఖ్యవిషయములు.

1. ధరల తేడాలు: 1913 - 14 లో 45 రూపాయల ఆదాయము 1921 - 22 లో 81 రూపాయలతో సమానము.
2. షా ఖంబటాగార్లు బ్రిటీషురాజ్యము సంస్థానములుకలిపి అంచనా వేసిరి. బ్రిటీషురాజ్యము కొంచె మధిక భాగ్యవంతము గనుక తక్కిన అంచనాల దామాషా తగ్గును.
3. ఫిండ్లేషిరాగ్జ్ గారి అంచనాలో వేలకువేలు సంపాదించు వృత్తివంతులు ఉద్యోగుల ఆదాయము చేరినది.
4. వివిధ దేశముల ఆదాయములతో నిది పోల్చిచూచునప్పుడు ఆయాదేశీయుల ఆహారవ్యవహారములుకూడ గమనింపవలసి యుండును. అందరికి నొకే జీవనాధారపద్ధతు లుండవు.
5. ఇటీవల 1931 లో బ్యాంకింగు విచారణ సంఘమువారు భారత దేశములోని కర్షకుల దామాషా ఆదాయము ఎంత హెచ్చు మదింపువేసినను సాలుకు తల 1కి 42—0—0 రూపాయలకన్న లేదని నిర్ణయించినారు. అందువలన మన దేశములో తల 1 కి దామాషా ఆదాయము రోజు 1 కి రు 0—1—7 లు.

వివిధ దేశములలో సాలుకు మనుష్యునికి వచ్చు దామాషా ఆదాయము కొన్ని అంచనాలు (రూపాయలు)

| దేశము | 1900 | సంగ్రామ పూర్వము. | 1914 | 1919 | 1924 |
|---|---|---|---|---|---|
| అమెరికా | 585 | 750 | 1080 | 1850 | 3328 |
| బ్రిటిషుదీవులు | ... | 600 | 750 | 1250 | 1456 |

| దేశము | 1900 | సంగ్రామ పూర్వము | 1914 | 1919 | 1924 |
|---|---|---|---|---|---|
| జర్మనీ | 330 | 705 | 450 | 520 | 570 |
| ఫ్రాన్సు | 405 | 495 | 570 | ... | 603 |
| కెనడా | 390 | 435 | 600 | 1420 | 1511 |
| ఆస్ట్రేలియా | 600 | 480 | 830 | 1431 | 1431 |
| జపాను | ... | 345 | 345 | 198 | 205 |
| భరతఖండము | 17-4-0 | 30 | 45 | 74 | 80 |

ఇట్టి బీదజనులపైన పన్నులభార మెట్లు వృద్ధియగు చున్నదో చూతము:—

(పురుషోత్తమదాస్ ఠాకూర్దాస్ గారి అంచనా)

| | | రు. అ. పై. |
|---|---|---|
| 1871 | లో తల 1 కి సాలుకు పన్ను | 1-13- 9 |
| 1881 | ,, | 2- 2- 3 |
| 1901 | ,, | 2- 6- 6 |
| 1911 | ,, | 2-11- 3 |
| 1913 | ,, | 2-14- 5 |
| 1922 | ,, | 6- 1- 8 |
| 1921-22 | ,, ( ప్రభుత్వ అంచనా ) | 5- 1- 1 |
| 1925-26 | ,, | 5-10- 9 |
| 1927-28 | ,, | 5-10-10 |
| 1929-30 | ,, | 5- 5- 6 |
| 1932-33 | ,, | 5- 0- 6 |

ఇతరదేశములతో పోల్చినచో నిది తక్కువగా కనబడి నను దామాషా ఆదాయమునుబట్టి యత్యధికమే. తక్కిన దేశ ములలోవలె గాక మన దేశములో ధనికులకన్న బీదవారే నూటికి నలుబదివంతు లధికపన్ను భరించుచున్నట్లు ప్రొఫె సర్ షా ఖంబటాగార్లు తెల్పినారు. దీనికి కారణము బీదలను బాధించు భూమిపన్ను, ఉప్పుపన్ను అధికముగా నుండుట. ఇతరదేశములలో ఆదాయపుపన్ను, సుంకములు, అధికములు.

పన్నుల పద్ధతి.

1928-29 లో మన దేశమునందలి పన్నులను,ఇంగ్లాండు జపానులలో విధించబడిన పన్నులను జూచినచో ఆయా విధాన ములలోని తారతమ్యము కనబడును. ఆ దేశములలో ధనికుల పైనబడు పన్ను ఎక్కువయు బీదవారిపైన బడునది తక్కువగ నుండగా మన దేశములో నందుకు విరుద్ధముగా నున్నది.

| | భరతఖండము | ఇంగ్లాండు | జపాను |
|---|---|---|---|
| 1 ఆదాయపుపన్ను (ఇన్ కంటాక్సు) | 12.5 | 43.77 | 32.9 |
| 2 వారసత్వముల పై పన్ను మరణములపన్ను | (లేదు) | 14.9 | (లేదు) |
| 3 భూమిపన్ను | 25.3 | .13 | (8.1) |
| 4 సుంకములు | 41.0 | 20.7 | 16.9 |
| 5 ఆబ్కారి | 13.9 | 20.5 | 42.1 |
| 6 నల్లమందు | 2.4 | (లేదు) | (లేదు) |
| 7 ఉప్పు | 4.9 | (లేదు) | (లేదు) |
| పన్నుల విధానపు మొత్తము. | 100 | 100 | 100 |

* పన్నులభారము

(1923—24 లెక్క)

| ప్రభుత్వపు ఆదాయము పద్దు: | ధనికులపైన | బీదలపైన |
|---|---|---|
| | (కోట్లరూపాయలు) | |
| సుంకములు | 20 | 21 |
| భూమిపన్ను, నీటితీరువ | 20½ | 21½ |
| ఆదాయముపన్ను | 20 | ... |
| ఆబ్కారీపన్ను | ... | 20 |
| ఉప్పుపన్ను | 1¼ | 7½ |
| అడవులు, రిజిస్ట్రేషను | 2 | 5 |
| స్టాంపులు | 6½ | 6½ |
| రైళ్లు | 33 | 60 |
| తపాలా ఆఫీసు | 5 | 5½ |
| మునిసిపలు పన్నులు | 3 | 10 |
| జిల్లాబోర్డు ,, | ... | 10 |
| వెరసి కోట్ల రూ॥ లు. | 111¼ | 167 |

ఇట్లు ధనికులకన్న బీదలు 56¾ కోట్ల రూపాయలు అధికపు పన్ను భరించుచున్నారు.

ఇట్టి విపరీతపుపన్నుల విధానముచే గ్రహించిన పన్ను నెట్లుపయోగించుచున్నారు ? ఋణతీర్మానము క్రింద నూటికి

* Sixty Years of Indian Finance [2nd Edition]

15.2 వంతులు; సైనికవ్యయముక్రింద 39.5 వంతులు; సివిలు పరిపాలన జీతములకొరకు 39.2 వంతులు; ఖర్చుచేయుచున్నారు. అందువలన దేశాభివృద్ధి కత్యంతావశ్యకములగు విద్య, ప్రజల ఆరోగ్యము, పరిశ్రమలు, వ్యవసాయముల కొరకు భారత దేశ రాష్ట్రీయప్రభుత్వములు చేయువ్యయ మతిహీనముగానున్నది.

1928—1929 లెక్కలు. *

| రాష్ట్రము | మొత్తముఖర్చు (రూపాయలు) | తల 1కి ఎంత? (రూపాయలు) |
|---|---|---|
| మద్రాసు | 4 కోట్ల 25 లక్షలు | 1 |
| బొంబాయి | 3 కోట్ల 7 లక్షలు | 1 $\frac{59}{100}$ రూపాయలో వంతులు |
| వంగరాష్ట్రము | 2 కోట్ల 73 లక్షలు | 29/50 ,, |
| సంయుక్తపరగణాలు | 2 కోట్ల 98 లక్షలు | 13/20 ,, |
| పంజాబు | 2 కోట్ల 90 లక్షలు | 1 $\frac{2}{5}$ ,, |
| బీహారు & ఒరిస్సా | 1 కోటి 47 లక్షలు | 21/50 ,, |
| మధ్యరాష్ట్రము | 1 కోటి 8 లక్షలు | 77/100 ,, |
| అస్సాము | 58 లక్షలు | 19/25 ,, |

దేశప్రజలు నానాటికి దరిద్రులై పోవుచున్నారు.♦ రైతులదుస్థితి వర్ణనాతీతము. వారుపన్నులిచ్చుకోలేక ఋణమున

* Life and Experiences of a Bengali Chemist. Sir P. C. Ray. ఇది సర్ ప్రఫుల్ల చంద్రరాయిగారి లెక్క.

♦ అనుబంధములో దేశస్థితిగతి లెక్కలపట్టికలను చూడుడు

మునిగినారు. 1891-92 లో మద్రాసు ప్రభుత్వమువారు ప్రక టించిన '40సంవత్సరముల అభివృద్ధి'యను నివేదికలోనే ఆనాటికి రైతులఋణభారము 29 కోట్లుండెనని ఒకకాకుల లెక్క వేసినారు. తరువాత సెంట్రల్ బ్యాంకింగు విచారణసంఘము వారిది 1931 నాటికి 150కోట్లనిఅంచనా వేసినారు. దీనికొరకు నియమింపబడిన సత్యనాధన్ ఐ.సి.ఎస్.గారిది 200కోట్లనినారు. నేడు యావద్భారతదేశ రైతులపైన వేయికోట్లు పైగా ఋణ భారము పడినది. దీనివడ్డీలు చెల్లించుకోలేక బాధపడచున్నారు.

## నాలుగవ పరిచ్ఛేదము :

## బ్రి టీ షు ప్ర భు త్వ యం త్ర ము.

## I

### బ్రిటిష్ పార్లిమెంటు సర్వాధికారము

భారతదేశము ఆంగ్లేయవర్తక కంపెనీవారికి చేజిక్కక పూర్వము 1600 వ సంవత్సరమునుండి మద్రాసు, సూరతు, బొంబాయి మొదలగు రేవు పట్టణములలో వారు స్థాపించిన (ఫ్యాక్టరీ) వర్తకస్థానములందు పనిచేయుచుండిన గుమాస్తాలు ఏజంట్లు మొదలగు ఉద్యోగులును, ఆవర్తకస్థానముల వ్యవహారములను నిర్వహించుటకు ఏర్పరుపబడిన ప్రెసిడెంట్లు లేక గవర్నరులును, వారికి సలహానిచ్చుటకు కంపెనీలోని అనుభవజ్ఞులగు ఉద్యోగులతో నిర్మింపబడిన కార్యాలోచన సంఘములు (కౌన్సిళ్లు)ను, నేటి బ్రిటిషుప్రభుత్వములోని ఐ. సి. యస్.

ఉద్యోగులకు, గవర్నరు, గవర్నరు జనరలులకు, కార్యాలోచన సభల (ఎగ్జిక్యూటివు కవున్సిళ్ళ)కు ప్రాతిపదికలని చెప్ప వచ్చును

కంపెనీవారు దేశాక్రమణచేయగనే, ఒక్కసారిగనే, నేటి ప్రభుత్వయంత్రమును స్థాపించలేదు. ప్రాత మొగలాయి ప్రభుత్వయంత్రమును, దానిలోని ప్రభుత్వోద్యోగులను వశము చేసికొని వారివలననే దేశముయొక్క రెవెన్యూ, (ఆదాయము) వసూలు, సివిలుపరిపాలన, పోలీసుపని, న్యాయవిచారణయు జరుపుచుండిరి. ఆనాటి (భారతీయ) "నేటివు" తహాశీలుదారులు గ్రామోద్యోగులు నేటికిని నిలుపబడినారు. మొగలాయి కాలమునాటి "అమల్ గుజారు" లే నేటి జిల్లాకలెక్టరులయి నారు. కొంతకాలమువరకు ఆనాటి ప్రాతభారతీయ యుద్యోగులపైన నీ కంపెనీవారి ఆంగ్లేయోద్యోగులు నౌఖరులు, పైతనిఖీచేయుచు, కొన్నాళ్లు జరిపిరి. తరువాత తామేస్వయముగా అధికారము వహించిరి. మద్రాసు మొదలగువానికి పైనచెప్పబడిన ప్రెసిడెంట్లు వలననే "ప్రెసిడెన్సీ" (రాజధాని) లనుపేరు వచ్చినది. నాటికి బొంబాయి, మద్రాస్, కలకత్తా రాజధానులలో కదానితో మరియొకదానికిని వాని పరిపాలక వర్గములకును పరస్పరసంబంధములేదు. వర్తకము చేయుటకు వచ్చిన ఈకంపెనీవారిట్లు పరిపాలన చేయసాగినందున ఇంగ్లాండు దేశములో నీకంపెనీవారి ప్రభువులగు "బ్రిటీష్ పార్లమెంటు వారు" 1773 లో నీదేశపు పరిపాలనా విధానమునుగూర్చి "రెగ్యులేటింగు ఆక్టు" అను నొక చట్టమునుచేసి కొన్ని కట్టు

ఖాటులతో నీదేశపరిభుత్వమునకు అనగా నాటిరాజధానులు, కార్యాలోచన సంఘములు వాని గవర్నరులు గల వివిధ పరిపాలక వర్గములకు పైన కలకత్తా గవర్నరునే అధిపతిగా జేసి "గవర్నరుజనరల్" అను బిరుదమునిచ్చిరి. 1773 లో వారన్ హేస్టింగ్సు మొదటి గవర్నరుజనరల్ అయ్యెను. ఈతడు దేశముయొక్క ఆంతరంగిక పరిపాలనము నందు కొన్నికట్టు దిట్టములను చేసెను. అదివరకుండిన కలగలపు పద్ధతులను రద్దుచేసి ప్రతిజిల్లాకు నొక "కలెక్టరు"ను నియమించి ఆతనికే రెవిన్యూ, పోలీసు, న్యాయవిచారణాధికారముల నిచ్చెను. ఇదియే నేటి బ్రిటిషుప్రభుత్వ యంత్రముయొక్క పునాది.

ఇట్లు పార్లమెంటువారీదేశ ప్రభుత్వమును గూర్చి శాసనములు చేయుచున్నను, నిజముగా నీ దేశపరిపాలన మంతయు ఇంగ్లాండులోని తూర్పు ఇండియావర్తక కంపెనీ వాటాదారులయొక్క కార్యనిర్వాహక సంఘమగు "డైరెక్టరుల కోర్టు" వారి యధికారముక్రిందనే జరుగుచుండెను. ఇచ్చటి గవర్నరుజనరలు మొదలు క్రింది యుద్యోగు లెల్లరుకూడ నీకంపెనీ డైరెక్టరుల తాఖీదులను శిరసావహించవలసియుండెను. కంపెనీవారీదేశమును తమస్వంత జమీందారీగా వ్యవహరించుచు, నీదేశపరిపాలనమును తమ స్వలాభముకొరకే జరుపసాగిరి. అన్యాయములు మితిమీరగా నీకంపెనీ పరిపాలనపైన కొంత పైతనిఖీ చేయుటకు కంపెనీ డైరెక్టరులతోపాటు పార్లమెంటు మంత్రులుగల "బోర్డుఆఫ్ కంట్రోలు" అను

నొక తనిఖీసభను ఏర్పరచి కంపెనీ వ్యాపారమునకు, పరిపాలనమునకు వేరు వేరు లెక్కలనుంచునట్లు నింక కొన్ని యేర్పాట్లు చేసి 1784 లో పార్లమెంటువారింకొక శాసనమును చేసిరి. కాని ఈ దేశమునకు గవర్నరు జనరలు మొదలు చిన్న యుద్యోగివరకు అధికారులను నియమించు హక్కు, దేశాదాయ వ్యయపద్ధతిని పరిపాలనా విధానమును నిర్ణయించు అధికారమును కంపెనీకే యుండెను. దేశముయొక్క నికరాదాయములనెల్ల కంపెనీ వాటాదారులు లాభములక్రింద పంచుకొనుచుండిరి. ప్రభుత్వస్వరూపమున తరువాత నెన్ని మార్పులు జరిగినను కంపెనీపరిపాలన 1858 లో రద్దుచేయబడు వరకుకూడ నీయన్యాయపు విధానమే అమలు జరుగుచుండెను.

అందువలన నీ దేశమునుండి అమితలాభమును సంపాదించుకొరకు అనేక దుర్మార్గపు పద్ధతులు అవలంబింపబడెను. పన్నులు వసూలుచేయుటకు, కలెక్టరులును, వారికింది యుద్యోగులగుతహశ్శీలుదారు మొదలగు వారునుతమపోలీసుఅధికారములనుపయోగించి రైతులను పీడించుటయేగాక అతిక్రూరములయిన హింసాపద్ధతులు అవలంబింపసాగిరి. క్రైస్తవమతబోధకులు దేశప్రజలను తమ మతము లో కలుపుకొనుటకు కంపెనీ యుద్యోగులతో కుట్రలుచేయసాగిరి. కంపెనీవారి దుష్పరిపాలనము మితిమీరినది. దేశీయరాజులు నవాబులు సింహాసనభ్రష్టులుగ జేయబడిరి. దేశభాగ్యభోగ్యములు కొల్లగొనబడుచుండెను. ఈ అన్యాయములవలన 1845 మొదలు 10 సంవత్సరములు దేశములో తీవ్రమయిన ఆందోళన బయలు దేరినది.

మద్రాసులో గాజుల లక్ష్మీనరుసు సెట్టిగారును ఇతర రాష్ట్రము లందు నితరభారతీయ ప్రముఖులును స్వదేశ సంఘములను స్థాపించి స్వధర్మరక్షణకొరకును, దేశప్రజలబాధలు బాపుట కును దేశపరిస్థితులను దెలుపుచు కంపెనీ డైరెక్టరులకు, పార్ల మెంటువారికిని అనేక మహాజరులంపిరి. ఆనాటి ఆంగ్లేయులలో కూడ జాన్ బ్రూస్ నార్టన్, డేవిడ్ హేర్ మొదలగు కొందరు మహానుభావులు భారతదేశోద్ధరణకు పాటుబడసాగిరి, గాని లాభము కలుగలేదు. పార్లమెంటువారు వీరి మొరలను చెవినిపెట్టక 1853 లో కంపెనీవారికి మరల రాజ్యాధికార పట్టా నిచ్చిరి. ఇట్టి దుర్భరమైన స్థితిగతులలో దేశములో విప్లవాగ్ని బయలుదేరి 1857 లో స్వదేశరాజులు, నవాబులు, హిందూ మహమ్మదీయ ప్రజలు, భారతీయ సిపాయిలు, నేకమై ఈ విదేశీయ పరిపాలన నంతమొందించుటకు స్వాతంత్ర్యసమరము జరిపిరి. గొప్పరక్తపాత మయినపిదప, ఇంగ్లాండు పార్లమెంటు వారు కన్నుతెరచి కంపెనీ ప్రభుత్వమును రద్దుచేసిరి.

నేటి భారతదేశ పరిపాలనా విధానమునకు పునాది 'సిపాయి విప్లవా' నంతరము 1858 సంవత్సరమున ఇం గ్లాండుదేశపు పార్లిమెంటువారు చేసిన ఇండియా రాజ్యాంగ చట్టమే. స్వరూపమున తరువాత కొన్ని మార్పులుజరిగినను దీని స్వభావము మాత్రము మారలేదు. దాని ప్రకారము భారత దేశమున నదివరకు జరుగుచుండిన తూర్పు ఇండియా కంపెనీ యొక్క ప్రభుత్వము రద్దుచేయబడి ఆంగ్లరాజమకుటముక్రింద బ్రిటీషుసామ్రాజ్య పార్లిమెంటు ప్రభుత్వము ప్రారంభ

మైనది. ఆచట్టమునుబట్టి భారత దేశప్రభుత్వ వ్యవహారముల నిర్వహణమునకు పార్లమెంటుకు బాధ్యతవహించి ఇంగ్లాండు మంత్రి మండలిలో సభ్యుడుగానుండు ఒక రాజ్యాంగమంత్రి (సెక్రెటరీ ఆఫ్ స్టేటు) నియమింపబడెను. ఇతని యధికారమునకు లోబడి ఆంగ్లరాజు పేరున భారత దేశపు గవర్నరు జనరలు రాజప్రతినిధిగా నీ దేశమును పరిపాలించునట్లు నిర్ణయింపబడినది. ఆప్రకారము నాటి ఇంగ్లాండు ఏలికయగు విక్టోరియా రాణి 1858 లో భారత దేశమున తన పరిపాలనను ప్రకటించుచు నాటి గవర్నరు జనరలగు క్యానింగును రాజప్రతినిధిగా చేసెను. పార్లమెంటువారి సలహాతో విక్టోరియా "ఇండియా మహారాజ్ఞి" అను బిరుదును 1876 లో శాస్త్రోక్తముగా ధరించగా 1877 జనేవరు 1 వ తేదిన ఢిల్లీ దర్బారులో నీసంగతి ప్రకటింపబడెను.

ఇట్లు ఆనాటికుండిన 23 కోట్ల భారతీయ ప్రజలు గల భారత దేశభాగము "బ్రిటీషు ఇండియా"గా చేయబడి ఇంకను ఆనాటికిగల 6 కోట్ల జనసంఖ్యగలిగి స్వదేశసంస్థానాధీశులుక్రింద నుండిన భాగముతో కలిపి "బ్రిటీషుసామ్రాజ్యము"లో చేర్చబడి, ఇంగ్లాండురాజు లేక రాణి, కామన్సుసభ ప్రభువుల సభ కలిసిన 'పార్లమెంటు' అనబడు బ్రిటీషు ప్రజాప్రభుత్వసంస్థయొక్క తాబేదారీపాలిత రాజ్యముగా చేయబడినది. 1858 చట్టముక్రింద ఇంగ్లాండు పార్లమెంటుకు బాధ్యత వహించు ఇండియా మంత్రికి, పూర్వము కంపెనీ కాలమున బోర్డుఆఫ్ కంట్రోలువారికిని కంపెనీ డైరెక్టర్లకును రహస్య

కమిటీకి నుండిన అధికారము లన్నియు సంక్రమించినవి. భారత దేశములోని గవర్నరు జనరలు మొదలు క్రిందనున్న చిన్నయధికారులవరకు అందరు నీతని ఆజ్ఞలను శిరసావహించవలెను. ఈమంత్రి కొన్ని అధికారములను స్వయముగానే చలాయించును. కొన్నిటిని తనసహాయము కొరకేర్పడిన కార్యాలోచన సభతో కలసి చలాయించును. కొన్ని రాజకీయ రహస్య విషయములు ఇతరముఖ్య వ్యవహారములు తప్ప తక్కిన వ్యవహారములన్నియు కార్యాలోచనసభ యెదుట పెట్టబడును. పూర్వము రహస్యకమిటీవారి ద్వారా బోర్డుఆఫ్ కంట్రోలు వారు పంపు రహస్యపు తాఖీదులు స్వదేశ సంస్థాన వ్యవహారములు పైన చెప్పబడిన తరగతిలోచేరిన రాజకీయ రహస్య విషయములు. ఈకార్యాలోచనసభలో 15మంది సభ్యులుండిరి. అన్నివిషయములు మెజారిటీ తీర్మానము ప్రకారము జరుగుచుండెను. వ్యవహార బాహుళ్యమువలన అన్ని సంగతులు కార్యాలోచనసభ వారందరునుకలసి ఆలోచించుట కష్టము గనుక ఫైనాన్సు(ద్రవ్య) రాజకీయ, మిలిటరీ, రివిన్యూ, స్థితిగతి లెక్కలు, న్యాయవిచారణ, పబ్లికుశాఖ, పబ్లికు వర్కులు, స్టోర్సు అనబడు కమిటీలుగా విభజింపబడి ఈసభవారు పనిచేయుచుండిరి. పూర్వము బోర్డు ఆఫ్ కంట్రోలు కార్యాలయముక్రింద నుండినసిబ్బంది యావత్తు ఇండియామంత్రి కార్యాలయమునకు మార్చబడెను. క్రొత్తఉద్యోగములుకూడ నిర్మింపబడి వాని కర్తవ్యములు, జీతములు, పింఛనులు సభాయుతుడగు రాజునాజ్ఞవలన నిర్ణయింపబడెను.

ఇండియామంత్రికి భారత దేశపరిపాలనపైన సర్వాధి కారముకలదు. ఇది యెట్టిదనగా నీదేశాదాయములో నొక దమ్మిడీయైనను ఖర్చుపెట్టవలెనన్నను ఈతనిఅనుజ్ఞను గవర్నరు జనరలు పొందవలెను. అయితే ఆచరణలో నెలకు 250 రూపాయిలకు లోబడిన జీతములు ఉద్యోగములును సాలుకు 25 వేల రూపాయిలకు హెచ్చుఖర్చుగాని ఉద్యోగవర్గపు ఏర్పాటులు మాత్రము ఇండియాగవర్నమెంటుకు వదలబడెను.

1858 సంవత్సరపు చట్టమువలననే భారత దేశముపైన బ్రిటీషుపార్లమెంటుకుగల సర్వాధికారము స్పష్టీకరింపబడినది. రాచరికపు హక్కులనుబట్టి ఆంగ్లరాజులకుగల అధికారములు, మొగలాయిసామ్రాజ్యచక్రవర్తులనుండి బ్రిటీషువారికి సంక్రమించిన సర్వాధికారములు, భారత దేశములోను ఇంగ్లండులోను రాజ్యాంగవ్యవస్థకుగల నీ యధికారములు పార్లమెంటుచట్టము ద్వారా స్థిరీకరింపబడినవి. గవర్నరుజనరలుకు అతని కార్యాలోచనసభకు గల సంబంధములు, కర్తవ్యములు, రాజధాని ప్రభుత్వములపైన ఆతనికిగల అధికారములు, (స్థానిక) రాష్ట్రీయ శాసనసభల యొక్కయు హైకోర్టుల యొక్కయు ఇండియా మంత్రియొక్కయు అధికారములు కూడ చట్టబద్ధములు చేయబడినవి. భారత దేశమునకు పార్లిమెంటు వారెట్టి చట్టమైన చేయవచ్చును. భారత దేశమునకు ఋణములు చేయుటకు ఇండియా మంత్రి కధికారమివ్వబడినది. సరిహద్దు సంరక్షణకొరకు తప్ప సైన్యముక్రింద వ్యయముచేయుటలో ఇండియాశాసనసభ యిష్టములేనిది పార్లి

మెంటువా రీదేశాదాయము ఖర్చుపెట్టరాదను నొకనియమము చేయబడెను. సీమలో కావలసిన ఖర్చులన్నియు సీదేశాదాయము నుండియే వ్యయము చేయబడును. ఇండియామంత్రి జీతము కార్యాలయ ఖర్చు, తక్కిన రాజ్యాంగ మంత్రులవలె కామన్సుసభలో వోటుకు పెట్టబడవు. భారత దేశ ఆదాయ వ్యయ లెక్కలు ప్రజల నైతిక ఐహికాభివృద్ధిని గూర్చిన నివేదికయు ప్రతియేటను పార్లిమెంటు ఎదుటపెట్టబడవలె నని నిర్ణయింపబడెను.

## II

## స్వదేశసంస్థానములు*

1858 వ సంవత్సరపు రాజ్యాంగచట్టమునుబట్టి స్వదేశ సంస్థానధీశులందరు ఇంగ్లాండురాణీయెడలను ఆమెసంతతివారి యెడలను విధేయులై వారి సర్వాధికారమునకు లోబడియుండునట్లు రాజ్యాంగధర్మమునుబట్టి స్థిరపడినది. ఆనాటి గవర్నరు జనరలగు కాన్నింగు మొదటి వైస్రాయిగా ప్రకటింపబడెను. సంస్థా

* బ్రిటిషువారు మనదేశము నాక్రమించిన కాలములో కొందరురాజులు వారికి సహాయము చేసియు వారినాశ్రయించియు వారితో సంధియొడంబడికలు చేసికొనియు తమరాజ్యములు కొన్ని షరతులకులోబడి నిలుపుకొనిరి. ఈ రాజ్యములే నేటి స్వదేశ సంస్థానములు. ఇవి స్వతంత్రరాజ్యములుకావు. ఇవి బ్రిటిషు సార్వభౌమ ప్రభుత్వముయొక్క అదుపుఆజ్ఞలకు లోబడి బ్రిటీషు సామ్రాజ్యములో చేరిన శాబేదారీ పాలిత రాజ్యములు. ఈ సంస్థానాధీశులకును బ్రిటిషు ప్రభుత్వమునకును మధ్య అమలులోనున్న ఒడంబడికలనుబట్టి వీని అధికారములు గౌరవములు యేర్పడియున్నవి. ఎప్పటిక

నాధీశుల రాజ్యములుకూడా ఇంగ్లాండు రాణీవైనందున ఇక నేభాగమును మరలకలుపుకొనుట యనునది జరుగదు; కాని తగుకారణమున్నచో నొకసంస్థానాధీశుని తొలగించి ఇంకొకరిని సింహాసనమున నిలుపవచ్చును. ఈసిద్ధాంతము మేయోప్రభువు రాజప్రతినిధిగానుండినప్పుడు రాజపుత్రస్థానములో ఆల్వారురాజు విషయమున తీసుకొనిన చర్యలో స్థిరపడెను. తరువాత నీయధికారమును పురస్కరించుకొనియే బరోడా రాజు రెసిడెంటుకు విషప్రయోగము జేసెనని అతనిని పదభ్రష్టుని జేసిరి. ఇటీవల బావ్లా హత్యకేసువలన ఇందూరు

---

ప్పుడు ఇంగ్లండునుండి ఇండియా రాజ్యాంగ కార్యదర్శి జారీచేయు తాఖీదుల ననుసరించి భారత దేశములోని ఆంగ్లరాజ ప్రతినిధియగు వైస్రాయి ఈ సంస్థానములపైన అధికారములు చలాయించుచుండును. బ్రిటిషు ప్రభుత్వము తరపున 'రెసిడెంటు'ను పేర నీ సంస్థానములందొక బ్రిటీషు అధికారి యెల్లప్పుడు నిలిపియుంచబడును. అతడు వైస్రాయికి బాధ్యుడై యుండును. సంస్థానాధిపతులు తను రాజ్యములను ఈ రెసిడెంట్లయొక్క సలహాను పొందియే పరిపాలించుచుందురు. రెసిడెంట్లను మంచిచేసికొనినచో సంస్థానముల ఆంతరంగిక పరిపాలనములో సంస్థానాధిపతు లెంత నిరంకుశముగా ఎంత అన్యాయముగా ప్రవర్తించినను దిక్కుఉండదు. చాలమంది సంస్థానాధిపతులు తమరాజ్యములను తమస్వంతఆస్తిగా అనుభవించుచు ప్రజలపైన పన్నులు విధించి వసూలుచేసి తమయిచ్చవచ్చినట్లు ఖర్చుపెట్టుచుందురు.

సంస్థాన పరిపాలనమునందు ప్రజల కెట్టిఅధికారములును లేవు. ఇటీవల మైసూరు తిరువాన్కూరు కొచ్చిను మొదలగు సంస్థానములందు ప్రజాప్రతినిధి సంస్థలునెలకొల్పి పరిపాలనలో ప్రజలకు కొంచెము ప్రవేశము గలిగించుట జరుగుచున్నను మొత్తముమీద నీ సంస్థానముల పరిపాలనా విధానము నిరంకుశ రాజరికముగనే యున్నది.

రాజును తొలగించి కొమారుని నిల్పిరి. రాజకీయకారణముల వల్ల నాభారాజును, దేవాస్ రాజును, ఆల్వారు రాజును పదచ్యుతులుగ జేసిరి. బొమ్మమారినప్పుడెల్ల బ్రిటీషువారి సర్వాధికారమును పలుకుబడియు హెచ్చుచుండును.

## III

### కేంద్రపరిపాలన : ఇండియా గవర్నమెంటు

1858 మొదలు క్రొత్తరాజ్యాంగమున భారతదేశ ఆంతరంగికపరిపాలనమున హెచ్చుమార్పులు జరుగలేదు. దేశపాలనమునకు పూర్వమువలెనే గవర్నరుజనరలే అధిపతి. శాసనధర్మములందు వైస్రాయియను పేరు లేదుగాని సామాన్యముగా అతడాపేరుతోనే వ్యవహరింప బడసాగెను.

ఈ సంస్థానాధిపతు లాండొరులతోగాని విదేశములతోగాని రాజ్యాంగవ్యవహారములు జరుపుటకువీలులేదు. అయధికారము సార్వభౌమ ప్రభుత్వము వారికి మాత్రమేకలదు. సంస్థానముల అంతరంగిక వ్యవహారములందు శాంతికి భంగము కలిగినచో మాత్రము బ్రిటీషుప్రభుత్వము వారు జోక్యము కలిగించుకొందురు. సంస్థానముల్లో దుష్పరిపాలనము ప్రబలినట్లుగాని, సంస్థానాధీశుడు పరిపాలించుట కశక్తుడైనట్లుగాని సంస్థానము బ్రిటీషుప్రభుత్వముపట్ల రాజద్రోహము చేయుచున్నట్లుగాని బ్రిటీషు సార్వభౌమ ప్రభుత్వమువారికి రూఢియైనచో తగుచర్య గైకొందురు. ఇటిసంస్థానములలో సాధారణముగా అన్యాయములు జరుగుచునేయుండునుగాని బయటకురావు. ఇట్టి సంస్థానములు పెద్దవి చిన్నవి కలిసి రమారమి 600 కలవు. కొన్ని సంస్థానములు పేరునకే సంస్థానములుకాని నిజమునకు చిన్న జమీందారీలేయని చెప్పవచ్చును.

ఆంగ్లరాణి లేక రాజు యొక్క ఫర్మానాక్రింద నితడు నియమింపబడి 5 సంవత్సరములు పరిపాలించును. ఇతనికి ఖర్చులుగాక సాలుకు 2 లక్షల 50 వేల రూపాయిలు జీతము. దేశ పరిపాలనకంతకు నితడు బాధ్యుడైయుండును. స్వదేశసంస్థానముల వ్యవహారములపైనగూడా అదుపుఆజ్ఞలు కలిగియుండును. సాక్షాత్తుగా ప్రభుత్వము చలాయించుటలో నీప్రభుత్వాధికారములు కేంద్రరాష్ట్రీయప్రభుత్వముల మధ్యవిభజింపబడినవి. కార్యాలోచనసభాయుతుడగు గవర్నరుజనరలుకే 'ఇండియా(ప్రభుత్వము)గవర్నమెంటు' అనిపేరు. ఈకేంద్రఇండియా గవర్నమెంటువారికే విదేశవ్యవహారములు, దేశరక్షణము, పన్నులవిధింపు, చెలామణి, ఋణము, నిరకునామా (టారిఫ్)లు తపాలా, తంతి, రైళ్లు, పైన అధికారమునుంచుకొని తక్కిన అంతరంగిక పరిపాలన పన్నులు (రివిన్యూ) దేశాదాయము వసూలు, విద్య, వైద్యము, ఆరోగ్యము, పల్లంసాగునీటిపారుదల, బిల్డింగులు, రోడ్లు రాష్ట్రీయప్రభుత్వములకు వదలబడినవి. అయినను ఈరాష్ట్రీయపరిపాలనలపైన కేంద్రప్రభుత్వము పెత్తనము చేయుచుండును. సామాన్యపరిపాలనా విధానమునెల్ల ఈకేంద్రప్రభుత్వమే నిర్ణయించి అవి సరిగా జరుగుచున్నవో లేవో యని ప్రభుత్వనివేదికలనుబట్టి తనిఖీచేయుచుండును.

తాను వ్యవహరించు రైళ్లు, తపాల, తంతి మొదలగు ప్రభుత్వశాఖల ముఖ్యాధికారులనుగాక రాష్ట్రీయప్రభుత్వములకు వదలిన వ్యవసాయము, సాగు, అడవులు, విద్య,

వైద్యము మొదలగు శాఖలపైన తనిఖీకొరకు కొందఱు ఉద్యోగులనుకూడా కేంద్రప్రభుత్వము నియమించును. రాష్ట్రీయ ప్రభుత్వముల ఆదాయవ్యయ ప్రణాళికలు కేంద్ర ప్రభుత్వమునకు పండబడగా వానిని అవసరమైనచో సవరణ చేయును. రాష్ట్రీయ ప్రభుత్వము నియమించు ఉద్యోగి వర్గములు అదనపుసంఖ్య ఉద్యోగుల నియామకమునకు కేంద్ర ప్రభుత్వమువారు అనుమతించవలెను. అందువలన కేంద్రప్రభుత్వము అంగీకరింపనిది రాష్ట్రీయ ప్రభుత్వములు పరిపాలనకు సంబంధించిన ఏక్రొత్తకార్యము చేయవీలులేదు. రాష్ట్రీయ ప్రభుత్వములోని ఉద్యోగులకు ఇతర ప్రజలకు ఆ ప్రభుత్వముల ఉత్తర్వులపైన కేంద్ర ప్రభుత్వమునకు అప్పీలుచేసికొను అధికార మివ్వబడినది. మద్రాసు బొంబాయి రాష్ట్రములుగాక తక్కిన రాష్ట్రములందు ముఖ్యమైన ప్రభుత్వోద్యోగుల నియామకమునందెల్ల కేంద్రప్రభుత్వమువారి అనుమతి పొందవలెనను నిబంధన మేర్పరుపబడినది. పెద్ద రాష్ట్రములకు వేరువేరు ఆదాయవ్యయపట్టికలుండును. రాష్ట్రములో వసూలు చేసిన ఆదాయములో భాగమును పొందును. వీనిలో ముఖ్యముగా భూమిసిస్తు, సెస్సులు, ఎక్సైజు, స్టాంపులు అడవులు, ఆదాయపుపన్ను రాష్ట్రముల కొసగబడినవి. మొదటి రోజులలో ఇంత కాలము ఇట్లు వసూలుచేసికొని ఉపయోగించుకో వచ్చునని కొంత కాలపరిమితివరకు నిర్ణయింపబడుచుండెను. 1906 తరువాత నిదిస్థిరముగా నిర్ణయింపబడెను. ముఖ్యమైన రాష్ట్రములకు శాసన సభలుండెను. కాని కేవలము రాష్ట్రీయ వ్యవహా-

రములను గూర్చి మాత్రమే శాసించుటకు వీలుండెను. ఆ శాసన సభ(లెజిస్లేటివు కౌన్సిలు)లు చేయు శాసనముల న్నియు గవర్నరుజనరలుఆమోదము పొందవలెను. ముఖ్యమైన స్వదేశసంస్థానము లన్నిటి పైన గవర్నరు జనరలే అధికారము కలిగియుండును. తిరువాంకూరు, కొల్హాపూరు, పాటియాల సంస్థానములపైన మాత్రము ఆయా రాష్ట్రీయ ప్రభుత్వముల కధికార మీయబడెను. ఇది చారిత్రిక పరిణామము.

గవర్నరుజనరలు కార్యాలోచన సభలో పూర్వము సామాన్యసభ్యులు నలుగు రేయుండిరి. 1861 లో 5వ సభ్యుని నియమించుట యవసరమని అట్లుచేసిరి. 1874 లో పబ్లికు వర్కులకు అవసరమైనచో 6వ సభ్యుని జేర్చుకొనవచ్చునని శాసించిరి. సర్వసేనాని ఎప్పుడును అసాధారణ సభ్యుడుగా నుండును. ఈకార్యాలోచన సభలో మెజారిటీ అభిప్రాయ ప్రకారమే వ్యవహారములు తీర్మానింపబడును; గాని గవర్నరు జనరలు అత్యావసర సమయములందు భిన్నముగా వర్తింపవచ్చును. ఈసభకు గవర్నరుజనరలే అధ్యక్షత వహించును. అతడు హాజరులేనిచో సీనియర్‌సభ్యుడు అట్లుచేయును. ఈ కార్యాలోచనసభ పూర్వము అన్ని వ్యవహారములు కలిసి ఆలోచించుచుండెను. లా మెంబరు, ఫైనాన్సు మెంబర్లు మాత్రం వేరుగానుండిరి. అయితే క్యానింగు హయాములో 1858 లో వ్యవహార బాహుళ్యము వలన ఒక్కొకసభ్యుని కొక్కొకశాఖ విభజించి యివ్వబడెను. చాలాముఖ్యమైన వ్యవహారములు మాత్రము గవర్నరుజనరలో లేక అందరుకలిసిన సభయో

పరిష్కరించుచుండును. క్యానింగుకాలములో ప్రభుత్వశాఖల పరిపాలనము ఐరోపాలోని రాజ్యముల మంత్రిమండలి (క్యాబినెట్టు) పద్ధతి ప్రకారముగా అచ్చటిమంత్రుల కేయే అధికారములుండునో ఈసభ్యులకు నాయాఅధికారము లుండునట్లు పరిపాలనశాఖలు విభజింపబడెను. ఈ సభ్యులపైన గవర్నరు జనరలు అదుపుఆజ్ఞలుపై పెత్తనము వహించియుండెను. ఈ ప్రభుత్వశాఖలు విదేశ, స్వదేశ, రివిన్యూ, వ్యవసాయ, శాసననిర్మాణ, ఫైనాన్సు, పబ్లికువర్క్సు, వాణిజ్యపరిశ్రమిక, సైనిక, మిలిటరీ శాఖలుగా విభజింపబడినవి. విదేశ వ్యవహారములు గవర్నరుజనరలే చూచుచుండెను. దీనిలోస్వదేశసంస్థాన వ్యవహారములు చేరియుండును.

## IV

## రాష్ట్రీయ పరిపాలన

బ్రిటిష్ ఇండియాలో 8 పెద్దరాష్ట్రము లుండెను. మదాసు బొంబాయి రాజధానులొక్కొక గవర్నరు క్రిందను బెంగాలు, సంయుక్తరాష్ట్రము,(ఆగ్రా, అయోధ్య) పంజాబు, బర్మా, తూర్పు వంగరాష్ట్రము, అస్సాములు ఒక్కొక లెఫ్టినెంటు గవర్నరు క్రిందను తక్కిన చిన్నభాగములగు పశ్చిమోత్తర పరగణాలు, బెలూచిస్థానము,కూర్గు, అజ్మీరు, మేర్వారు, అండమానులు కమీషనర్ల క్రింద నుండెను. ఈ ప్రభుత్వము లన్నియు గవర్నరు జనరలు చెప్పినట్లు నడువవలెను.

మద్రాసు రాజధాని పరిపాలనముయొక్క వివరములను చూచినచో రాష్ట్రీయవిధానము తెలియును. ముగ్గురు సభ్యులుగల కార్యాలోచన సభాయుతుడగు గవర్నరునందు రాజధాని ప్రభుత్వము నెలకొల్పబడియుండెను. ఆసభలో నొకడు తత్కాలమునాటి సర్వసేనాని. గవర్నరులేనిచో "సీనియర్ మెంబ"రధ్యక్షుడు. ఈమెంబర్లను రాణీ నియమించును. శాసన నిర్మాణముకొఱకు చేర్చుకొనబడు సభ్యులను గవర్నరు నియమించును. చీఫు శెక్రిటరీ, రివిన్యూ శెక్రిటరీ, పబ్లికు వర్క్సు శెక్రిటరీ, నీటిపాఱుదల జాయింటు శెక్రిటరీలు, క్రింద నలుగురు అండరు శెక్రిటరీ లుండిరి. న్యాయవిచారణశాఖ, శాసన నిర్మాణశాఖకు ఒక అసిస్టెంటు శెక్రిటరీకూడ యుండును. చీఫ్ శెక్రటరీక్రింద ఫైనాన్సు (ద్రవ్యశాఖ) న్యాయవిచారణ, విద్య, రాజకీయము, మతము, నావిక, శాసన నిర్మాణ పిటీషన్లు, శాఖలుండెను. రివిన్యూ శెక్రిటరీక్రింద, రివిన్యూ పింఛనుశాఖలు, పబ్లికువర్క్సు సెక్రిటరీ, నీటిపారుదల జాయింటు సెక్రిటరీక్రింద పబ్లికువర్క్సు, పబ్లికువర్క్సు సెక్రిటరీక్రింద రైల్వేలు, మిలటరీ సెక్రిటరీక్రింద సైనికశాఖ యుండెను.

## VI

### ఐ. సి. ఎస్. ఉద్యోగివర్గము

భారతదేశప్రభుత్వయంత్రమును నడుపునది అనగా నీకోట్లకొలదిప్రజలను సాక్షాత్తుగా పరిపాలించునది సంస్థానాధీశులతో సాక్షాత్తుగా వ్యవహరించునది రమారమి 1200

సంఖ్యగల సివిలు మిలిటరీశాఖల ఆంగ్లేయోద్యోగులై యున్నారు. బ్రిటీషు ఇండియాలో 250 జిల్లాలపైగానుండెను. జిల్లా 1 కి 4430 చతురపు మైళ్లు. 9 లక్షల 31 వేల జనసంఖ్య దామాషాగానుండెను. ఈజిల్లాల పరిపాలనను ప్రభుత్వశాఖల లోని వివిధవ్యవహారములను నిర్వహించునది ఈఉద్యోగవర్గమే. వీరికి "కవనెంటెడ్ సివిలుసర్వీసు" అని పేరు. వీరుద్యోగమున చేరకపూర్వము ఇంగ్లండులో ఇండియామంత్రితో తమ ఉద్యోగ షరతులను గూర్చియు హక్కుబాధ్యతలు జీతభత్యములు పింఛనులు మొదలగు వానినిగూర్చియు ఒక "కవనెంటు"లేక ఒడంబడికను చేసికొనుట అనాదినుండిజరుగుచున్నందున ఈఉద్యోగ వర్గమున కాపేరువచ్చెను. నాటి ఆంగ్లేయ సివిలుసర్వీసు ఉద్యోగులెల్లరు తూర్పుఇండియాకంపెనీనాటి ఫ్యాక్టరీల గుమాస్తాలు, ఏజెంట్లు, వర్తకులయొక్క సంతతియని చెప్పవచ్చును. కంపెనీకాలములో నీ ఉద్యోగులు నిర్వహించవలసిన పరిపాలన వ్యవహారములకు తగిన శిక్షణముగాని తగు జీతములుగాని వారికి లేకుండెను. అందువలన లంచగొండెతనము స్వంతవ్యాపారము మున్నగు దురాచారములు ప్రబలియుండెను. క్లైవు వారన్ హేస్టింగ్సులు ఈ ఉద్యోగుల లోని అన్యాయములను కొంత సంస్కరించిరిగాని దీనినినిజముగా చక్కజేసినది సద్ధర్ముడగు కారన్ వాలిస్ ప్రభువు. వారిజీతములను హెచ్చించి వారిలో కొంతనీతి నియమమును స్థాపించెను.

ఈ కవనెంటెడు సివిలు సర్వీసులకు కంపెనీ డైరెక్టరులే ఉద్యోగులను నియమించుచుండిరి. 1793 లో కంపెనీ కివ్వబ

డిన సన్నదు పట్టము ప్రకారము భారతదేశములోని కవున్సిలు మెంబరుకన్న తక్కువ హోదాగలఉద్యోగము లీసివిలు సర్వీసుకు ప్రత్యేక హక్కుగా పార్లిమెంటువారివలన చేయబడినవి. నాటినుండియే దీనికి కవనెంటెడు సివిలు సర్వీసు అనిపేరువచ్చినది. ఈ తరగతిలో చేరనివారికి అన్‌కవనెంటెడ్ సివిలు సర్వీసు అని పేరువచ్చినది. ఈ ఉద్యోగులను రెండుసంవత్సరములు తరిబీదు చేయుటకు ప్రత్యేక కాలేజీ 1805 లో ఇంగ్లండులో ఏర్పాటు చేయబడెను. ఈ ఉద్యోగములు కేవలము డైరెక్టర్ల ఆశ్రియింపుపైన ప్రాపకముపైన 1853 వరకు ఆధారపడియుండెను. ఆ సంవత్సరములో వీనిని పోటీ పరీక్షలలో తేరినివారికిచ్చు పద్ధతి నిర్ణయింపబడెను. మొదటిపరీక్ష 1855 లో జరిగెను. డైరక్టర్లు ఏర్పరచిన కాలేజీ 1858 లో మూయబడెను. వీరుఉద్యోగములో చేరవలసినవయస్సు 21-23 గా నిర్ణయింపబడి ఒకసంవత్సరము ఇంగ్లండులో నొక విశ్వవిద్యాలయమున తరిబీదుపొందునట్లు ఏర్పాటు చేయబడెను. ఇది తరువాత 19 కి తగ్గింపబడెను.

ఈ సివిలియన్ ఉద్యోగులు యువకులుగా క్రొత్తగా ఈ దేశమునకువచ్చి ఈ దేశధర్మములు భాషలు, రివిన్యూ వ్యవహారము, నేర్చుకొనగలందులకు మొదటజిల్లా ముఖ్యపట్టణములో చిన్నమేజస్ట్రీటుగా నియమింపబడి అవి నేర్చుకొని చిన్నపరీక్షలిచ్చిన తరువాత పెద్దహోదాకు మొదటితరగతి మేజస్ట్రీటుగాను ఇంక పై అధికారములకును అర్హుడగును.

1793 చట్టము పెద్దరాష్ట్రములకే వర్తింపబడెను గాని చిన్నపరగణాలకు వర్తింపబడనందునను పెద్దరాష్ట్రములలో గూడ కొన్ని సందర్భములలో ఈ సివిలుసర్వీసు ఉద్యోగులు గాక ఇతరులుకూడ సివిలు ఉద్యోగులుగూడ నియమింపబడ వలసివచ్చినందునను అట్టి ఉద్యోగవర్గమునకు హక్కు-బాధ్యతలు చట్టమునుబట్టి అంతవరకు విధింపబడి యుండనందునను 1861 లో ఇండియన్ సివిల్‌సర్వీసెస్ ఆక్టు అనబడు నొక చట్టము చేయబడి కవనెంటెడు సివిలుసర్వీసువారికి ప్రత్యేక హక్కుగా నుంచబడిన ఉద్యోగముల జాపితాను నిర్ణయించి ఇతర ఉద్యోగుల నియామకమును శాస్త్రసమ్మతము చేసెను.

మదాసులో నీకవనెంటెడ్ సివిలుసర్వీసువారి కీదిగువ ఉద్యోగములు ప్రత్యేకింపబడి యున్నవి :—

2 కౌన్సిల్ మెంబర్లు; 2 హైకోర్టు జడ్జీలు; 2 జిల్లా జడ్జీలు; 21మంది బోర్డుఆఫ్‌రెవిన్యూసభ్యులు; 3 గవర్నమెంటు సెక్రెటరీలు; 21 కలెక్టరులు; 19మంది రివిన్యూబోర్డుసెక్రటరీలు 1 మదాసు కష్టమ్సుకలెక్టరు; సబ్‌కలెక్టరులు, ప్రిన్సిపాల్సు, అసిస్టెంటులుకలసి 17మంది; గవర్నమెంటు అండరుసెక్రటరీలు ఇద్దరు; హెడ్డుఅసిస్టెంటులు, సీనియరు అసిస్టెంటులు కలసి 19మంది; ఒకస్పెషలు అసిస్టెంటు. ఈ ఉద్యోగములు లా ప్రకారము ప్రత్యేకింపబడినవి. వీరిలో 30మంది నెల 1కి రు 2500 లు మొదలు 6500 వరకు జీతములున్న వారు. మిగతా వారికి 600 మొదలు 2500 వరకు జీతములుండును. 1855 కు పూర్వము ఈ ఉద్యోగములు కేవలము కంపెనీ డైరెక్టర్ల

అధీనముననుండెను. ఆసంవత్సరమున పోటీపరీక్షలు నెలకొల్పబడెనని చెప్పియుంటిమి. 1890 లో పార్లమెంటు శాసనము క్రింద కొన్ని నిబంధనల ప్రకారము ఇండియా గవర్నమెంటువారికి ఇష్టమున్నచో ఏయుద్యోగమునకైనను భారతీయులను నియమింపవచ్చునని శాసింపబడినదిగాని ఈనిబంధనలు అమలులోనికి 9 సంవత్సరములకుగాని రాలేదు. అప్పుడుగూడ ఈ అధికారమునుబట్టి నియమింపబడిన భారతీయులసంఖ్య అతిస్వల్పము. 1886-87 లో నౌకపబ్లిక్కు సర్వీసుకమీషను చేసిన సూచనల ప్రకారము ఇంగ్లాండులో నియమింపబడు ఐ. సి. ఎస్. ఉద్యోగులు రాష్ట్రీయ సివిలుసర్వీసు, (తాబేదారి) సబార్డినేట్ సర్వీస్ అనబడుతరగతులుగ చేయబడెను. ఎట్టిశాసనము నిబంధనము లేకపోయినను ఆచారమునుబట్టి ఈక్రింది యుద్యోగములు కేవలము ఇంగ్లాండులో నియమింపబడిన ఐ. సి. ఎస్. వారికిమాత్రమే హక్కుకలిగియున్నవి. తిరువాంకూరు రెసిడెంటు; హైకోర్టు రిజిస్ట్రారు; నీలగిరికమీషనరు; రివిన్యూసెటిల్మెంటు డైరక్టరు; రివిన్యూసెటిల్మెంటు డిప్యూటీకలెక్టరులలో కొన్ని జిల్లా స్మాల్ కాజుకోర్టు జడ్జీపదవులుకూడా ఐ. సి. యస్. వారే పొంది యుండిరి.

క్రొత్తగావచ్చిన జూనియరు సివిలియనులు ముందుగా పనినేర్చుకొనుటకు జిల్లా ముఖ్యపట్టణమున అసిస్టెంట్లుగానుండి పైనచెప్పబడిన ఉద్యోగములలో నాల్గుసంవత్సరములలో ప్రవేశింపగల్గుదురు. సెలవుమీదనున్నవారు పోగా ఇట్టివి నూరు ఉద్యోగములుండును. దామాషాగా సాలుకు 7 మంది

ఇట్లు నియమింపబడుచుందురు. వీరికి జీతములు, సెలవుబత్తె ములు ఫింఛను మున్నగువానిలో ప్రత్యేక సౌకర్యములు కలిగింపబడి వానికి ప్రత్యేకనిబంధనలు గావింపబడినవి. వీరిజీతములో నూటికి 4 చొప్పున పింఛనుకొఱకు మినహాయించి సీమకంపుదురు. వీరు చనిపోయినచో భార్యలకు అనాథలగు పిల్లలకు ప్రావిడెంటుఫండు గవర్నమెంటువలననే ఏర్పాటు గావింపబడినది.

"స్టాఫ్‌కోర్" అనబడు సైనికోద్యోగవర్గమొకటిగలదు. దీనిలో 559 ఆఫీసర్లుందురు. వీరు మిలిటరీసివిల్ కార్యనిర్వాహణము కొఱకు కలిపి నియమింపబడిరి. దీనిలో 149 మంది ప్రత్యేకము సివిల్ పనులకు అనగా పొలిటికల్, పబ్లికువర్కులు, పోలీసు, సర్వే, ఫారెష్టుశాఖలు, 410 మంది సైనికోద్యోగులుగా నుందురు. భారతదేశమంతలో నీతరగతి ఉద్యోగులు వారు 1200 మంది యుండిరి. ఒక్క మదాృసురాజధానిలోనే కవనెంటెడ్ సివిలు సర్వీసు "స్టాఫ్‌కోరు" కలసి 300 మంది యుండిరి. ఈఉద్యోగులకు వేరే సెలవురూల్సు, పింఛనురూల్సు ఏర్పాటు చేయబడినవి.

## VII

### జిల్లాకలెక్టరు పరిపాలన

జిల్లాకలెక్టరు ప్రభుత్వముయొక్క ప్రతినిధిగానుండి ప్రజలదృష్టిలో నతడే సర్కారుగా పనిచేయును. వారి బాధలు తీర్చుటకు వారికి క్షేమము కలిగించుటకు నాతడే దిక్కు.

ఇతడే ప్రధాన రివిన్యూ ఉద్యోగియు న్యాయవిచారణ చేయు మేజస్ట్రీటును. ప్రథమములో నీరెండు హోదాలు విడివిడిగా నుండెను. గాని తరువాత నీ రెండు నొకే అధికారివలన చలాయింపబడుచుండెను. జిల్లా మేజిస్ట్రీటు సివిలుజడ్జి వంగరాష్ట్రమున ప్రారంభములో నొకేయధికారిగానుండెను. జైలువిడుదల సర్టిఫ్యేటు కోర్టువలన చేయుబడుచుండును. కారన్ వాలిసు తరువాత కొన్నినాళ్ళకు జడ్జీ యధికారమునుండి మేజస్ట్రీటు అధికారము విడదీయుబడెను. వంగరాష్ట్రము బీహారు ఒరిస్సాలు దివానీగా పొందిన కంపెనీ పరిపాలన స్థాపించినపిదప 1772 లో వారన్ హేస్టింగ్సు కాలములో వంగరాష్ట్రములో కలెక్టరు ఉద్యోగము నిర్ణయింపబడినది. సంయుక్తరాష్ట్ర మదరాసు బొంబాయి రాష్ట్రములలో మేజస్ట్రీటు న్యాయవిచారణాధికారము(రివిన్యూ) భూమిసిస్తుల అధికారమును ఒకే కలెక్టరు చలాయించు పద్ధతి స్థాపింపబడి అదియేతక్కిన రాష్ట్రములలో కూడఅనుకరింపబడినది.

కలెక్టరు రివిన్యూఅధికారము ఆ రాష్ట్రములలోనున్న భూస్వామ్యపద్ధతిపై నాధారపడి యుండెను. వంగరాష్ట్రమున పర్మనెంటు సెటిల్మెంటులోని శాశ్వత సిస్తు వసూలు పద్ధతివలన నీతనిపని చాలా తేలిక. మదరాసులో రైత్వారీ పద్ధతివలన వేలకొలది వ్యవసాయకులవలన వసూలుచేయవలసిన పని కష్టతరము. అందువలన అసంఖ్యాకులగు గ్రామసిబ్బంది పైన నితడు అధికారమును కలిగియుండును. కలెక్టరుకు గ్రామస్థుల స్థితిగతులు భూమిపంటలు ధరలు గూర్చిన

లెక్కలు తయారుచేయుట, జమీందారురైతుమధ్య శిస్తువ్యాజ్యములు, గవర్నమెంటువారు వ్యవసాయదారులకిచ్చు ఋణములు ఎక్సైజు, ఆదాయవ్యయము, స్టాంపుడ్యూటీ, యితర రివిన్యూ ఆధారములను పరిపాలించుట జిల్లా బొక్కసము (ట్రెజరీ) మేనేజిమెంటు ఇతని ముఖ్యకర్తవ్యములు. ఇతడు రెండుసంవత్సరముల శిక్షను వెయ్యిరూపాయీలజరిమానాయు విధించవచ్చును. జిల్లాయొక్క శాంతిని కాపాడుట ఈతని కర్తవ్యము. నేరములను అణచుట ఈతని విధి. పోలీసువ్యవహారములపైన ఈతనికి పెత్తనముకలదు. జిల్లాజైలు ఈతని యధికారముక్రింద నుండును. దీనికితోడు పబ్లికువర్క్సు, అడవులు, జైళ్లు, ఆరోగ్యశాఖలు, విద్యాశాఖ మునిసిపలు జిల్లాబోర్డులశాఖలు క్రొత్తగా నిర్మింపబడినందునను ఆయా శాఖల వ్యవహారములపైనగూడ నీతనికి పైతనిఖీచేయువలసినవిధి కలిగినది. సాధారణముగానితడు జిల్లాబోర్డుకు ప్రెసిడెంటుగా నుండెను. ప్రతిజిల్లా వ్యవహారముల విషయమున ప్రభుత్వమునకు ప్రజలకు మధ్యనుండు నధికారి యితడే. ఈతని సలహానుబట్టియే జిల్లాపరిపాలనమెల్ల నడచుచుండెను. హిందూమహమ్మదీయుల కొట్లాట, దౌర్జన్యముల నివారణ, కలవుల నివారణ మున్నగు కార్యములనెల్ల నీతడు నిర్వహించవలెను. అనేక అర్జీలు మనవులు నీతడు చిత్తగించవలెను. దరఖాస్తులు మంజూరుచేయవలెను.

కలెక్టర్లకు 1804 సం॥రపు రెగ్యులేషనువలన మైనర్లపైన అధికారమును, 1816 రిగ్యులేషనువలన సరిహద్దు తగాదాల పరిష్కారము, 1822 లో గవర్నమెంటు ఆస్తిహారింపు స్వామి

ద్రోహానేరవిచారణలు, 1831 లో గ్రామోద్యోగ పారోదాల దావాల విచారణలు, 1836 లో భూస్వాములకు రైతులకు మధ్య శిస్తువ్యాజ్యముల విచారణలు, 1871 లో మ్యునిసిపలు వ్యవహారములు, 1871 లో రివిన్యూబోర్డుకు ఏజెంటుగా ధర్మాదాయముల వ్యవహారముల అధికారము, కలిగినది. 1817 లో సముద్రతీరప్రదేశములందు సుంకముల, వ్యవహారములు వీరి యధికారము క్రింద జేర్చబడెను.

జిల్లాకు పోలీసుసూపరెంటెండెంటు (ఆంగ్లేయోద్యోగి) జిల్లాకలెక్టరు అధికారముక్రిందనే యుండెను. సివిలుసర్జను కలెక్టరుకు ఆరోగ్యవిషయమునందు సలహాదారుడు. లోకలు ఫండు లేక జిల్లా ఇంజనీరు కూడా ఇంకొక జిల్లాయుద్యోగి.

ఈ కలెక్టరుక్రింద ఆంగ్లేయ అసిస్టెంట్లు జిల్లాభాగముల కధికారులగు సబుకలెక్టర్లు నుందురు. జిల్లా సబుడివిజనులుగా చేయబడి జూనియరు సివిలుసర్వీసు ఆఫీసర్లక్రిందను, రాష్ట్రీయసర్వీసు ఉద్యోగులగు భారతీయ డిప్యూటీకలెక్టర్లక్రిందను నుండెను. కలెక్టరు క్రింద శాఖలు 1. నేటీవు కరస్పాండెన్సు నిర్వాహణ (కొరకొరక శిరస్తాదారు.) 2. ఇంగ్లీషు కరెస్పాండెన్సు జనరల్ అక్కవుంటు శాఖ. 3. ట్రెజరీస్టాంపుల శాఖ. 4. ప్రెస్ శాఖ. 5. ఇతర కార్యాలయనౌకరులు.

ట్రెజరీపైన అధికారమును 2. 3. శాఖలకు మేనేజిమెంటును ఒక నేటివు డిప్యూటికలెక్టరుక్రింద నుండెను. ఈకలెక్టరుల పైనను వీరిక్రింది యధికారు లందరిపైనను రివిన్యూబోర్డు అధికారము కలిగియుండును. మదరాసుజిల్లాలలో 4-5 సబుడివిజను

లుండెను. సబుడివిజనులలో తాలూకాలు, వానికి తహసీలు దార్లు నుండిరి. తాలూకా రమారమి 400 మొదలుకొని 600 చదరపుమైళ్లు వైశాల్యము. తహసీల్దారు రివిన్యూపని చేయుగా, స్టేషనరీ సబు మేజస్ట్రేటులు అనబడు వారు న్యాయ విచారణకు నియోగింపబడిన పద్ధతికూడ నెలకొల్పబడెను. గాని తాశిల్దారుకుగూడా క్రిమినలు అధికారములున్నందున పూర్వమునుండి రివిన్యూపరిపాలనలోని జులుము జరుగుచునే యున్నది. గ్రామోద్యోగులగు మునసబు కరణములు, రివిన్యూ ఇనస్పెక్టర్లు ఇతర సిబ్బందియు కలెక్టరు క్రిందవారే.

## VIII

## న్యాయవిచారణ కోర్టులు.

మొగలాయిరాజ్య కాలమున న్యాయవిచారణలో ఆనాటి 'నవాబునాజీం' ముఖ్య నేరములను, 'నాయబునాజీం' తక్కిన కేసులను, 'ఫౌజుదారుముహాతవాళ్లు కొత్వాలు' అనబడువారు చిల్లర కేసులను జిల్లా ముఖ్యస్థానములో విచారించుచుండిరి. దేశము లోపల జమీందారులే విచారణాధికారము కలిగియుండిరి.

ఇంగ్లీషుకంపెనీకి 1683 లో న్యాయ విచారణాధికారము ఇవ్వబడి ఒకన్యాయవాది యిద్దరు ఆంగ్లవర్తకులుగల కోర్టులు నిర్ణయింపబడెను. 1726 లో న్యాయవిచారణాధికారము క్రమ పరచుటయవసరమై డైరెక్టర్లు ఆంగ్లరాజు అధికారముపొంది కల కత్తా మద్రాసు బొంబాయిలలో మేయరుకోర్టులు, 9మంది ఆల్డరు మన్లు మేయరు కలిసినవి, స్థాపించి, ఐరోపావారి వ్యాజ్యములు

పరిష్కరించిరి. నాలుగువేల రూపాయిల లోపు వానికి ప్రెసిడెన్సీ రాజధాని గవర్నమెంట్లకు అప్పీలుండెను. నాలుగు వేల రూపాయలు పైబడినవానికి ప్రివీ కౌన్సిలుకు రెండవ అప్పీలుకూడనుండెను. 1753లో నాంగ్లరాజునలన కోర్టుఆఫ్ రిక్వెస్టులు అనబడునవి స్థాపింపబడి 20 రూపాయలకు మించని కేసులు డైరెక్టర్ల అధికారము క్రింద విచారించుచుండెను. దేశము లోపల ప్రాత మొగలాయి కోర్టులు కొన్నాళ్లు జరిగినవి.

1772 లో వారన్ హేస్టింగ్సు 'దివానీ అదాలత్తులు' అనబడు సివిల్ కోర్టులను జిల్లాలలో ఐరోపా జడ్జీలతో స్థాపించెను. వీరికి హిందూమహమ్మదీయ న్యాయాధికారులు సహాయముచేయుచుండిరి. అల్పపు కేసులు విచారించుటకు "నేటివులు" (భారతీయులు) సదరమీనులుగను, మునసబులుగను నియమింపబడుచుండిరి. వీనిపైన ప్రావిన్షియలు సివిలుకోర్టులు నలుగురు జడ్జీలుగల రాష్ట్రీయ సివిలుకోర్టులు నిర్మింపబడి వానికి అప్పీలు అధికారము నివ్వబడెను. ఈ అన్నికోర్టుల పైన 'సదరు దివానీ అదాలత్తు' లేక ప్రధానసివిలు అప్పీలు కోర్టు సభాయుతుడగు గవర్నరు అయిదుగురు నేటీవు అధికారులు కలిసినది స్థాపింపబడెను. నేరవిచారణలకు మొగలు కోర్టులు తీసివేయబడి రాష్ట్రీయ క్రిమినలుకోర్టులు లేక 'నైజామత్ అదాలత్తు'లు నిర్మింపబడెను. వీనిలో మహమ్మదీయ న్యాయాధిపతులే పరివేష్టించుచుండిరి గాని కంపెనీయధికారులు పైతనిఖీచేయుచుండిరి. పైన చెప్పబడిన రాష్ట్రీయ సివిలు అప్పీలు కోర్టుజడ్జీలు సహాఖ్యాటుగా వచ్చి ఈకోర్టుల

పైన క్రిమినలు అప్పీళ్లను విచారించుచు, తాబేదారీ కోర్టుల పైనను మేజస్ట్రీటులపైనను అధికారము కలిగియుండి 'సదరు నైజామత్ అదాలత్' అనగా ప్రధాన క్రిమినలు అప్పీలు కోర్టుగా వ్యవహరింపబడెను.

1773 లో కలకత్తా సుప్రీముకోర్టు, ఒక ప్రధాన న్యాయమూర్తి యితర న్యాయాధిపతులు గలట్టిది స్థాపింపబడి మేయరు కోర్టులు రద్దుచేయబడెను గాని రిక్వెస్టుకోర్టులు జరుగుచునే యుండెను. 4 వేలరూపాయలు పైబడిన కేసులలో ప్రీవీకవున్సిలుకు అప్పీలు అధికారము లివ్వబడెను. సుప్రీము కోర్టులో అమలుజరిగిన సివిలు క్రిమినలు శాస్త్రధర్మము ఆంగ్లేయులదే. వ్యవహార విధులు కూడ ఇంగ్లీషువారివే. అదాలత్ కోర్టులకు ఆంగ్లధర్మము తెలియదు. వారికి తోచిన మంచిపద్ధతుల న్యాయము ధర్మము ప్రకారము, హిందూ మహామ్మదీయ ధర్మముప్రకారము, రెగ్యులేషనుల ప్రకారము, న్యాయవిచారణ జరుపవలెనని విధింపబడెను. ఇట్లు పరస్పరవిరుద్ధముగా నుండిన కోర్టులు చిక్కులకు కారణమయ్యెను. సుప్రీముకోర్టు విచారణాధికారము కౌన్సిలుమెంబర్లకు వర్తించదని 1781 లో శాసింపబడెను. కంపెనీవారి మామూలు కోర్టులు శాస్త్రసమ్మతము చేయబడినవి. మరియు గవర్నమెంటు రివిన్యూ రెగ్యులేషనులపైన సుప్రీముకోర్టుకు అధికారము లేకుండ చేయబడెను. మదరాసు బొంబాయిలలోకూడ 1801, 1823 నాటికి మేయరు కోర్టులుతీసివేయబడి రికార్డరుకోర్టులు స్థాపింపబడెను. 1861 లో పాతసదరుకోర్టుల పద్ధతి తీసివేయబడి

నేటి హైకోర్టులు స్థాపింపబడినవి. నేడు మేజస్ట్రేటులకు, సెషన్సు కోర్టులకు క్రిమినలు ప్రొసీజరు పీనలుకోడ్లు ధర్మప్రమాణములు. సివిలువ్యవహారములుకూడ శాస్త్రబద్ధములు చేయబడి జిల్లా జడ్జి, సబుజడ్జి, మునసబుకోర్టులు స్థాపింపబడినవి.

## IX

## 'నేటివ్' సివిల్ సర్వీస్ (ఉద్యోగవర్గము)

ఇంగ్లాండులో నియమింపబడు కవనెంటెడ్ సివిల్ సర్వీస్ వారుగాక అట్టి ఒడంబడికలులేని (అన్ కవనెంటెడ్ సివిల్ సర్వీస్ 1886-1887 తరువాత దీనికే రాష్ట్రీయసివిల్ సర్వీస్ అనిరి.) సామాన్య సివిల్ శాఖలోని ఉద్యోగులలో నెల 1 కి రూ 10 లు మొదలు అంతకు పైబడిన జీతములవారు కలరు. పార్లమెంటువారు 1793 లో చేసిన శాసనము ప్రకారము పైనచెప్పబడిన ఒడంబడికల ఉద్యోగవర్గము తప్ప యితరు లెవ్వరు కంపెనీ క్రింద ఉద్యోగులుగా నియమింపబడ రాదని శాసింపబడి యున్నందున ప్రభుత్వమువా రప్పుడప్పుడు నియమించుచువచ్చిన ఈ తరగతి ఉద్యోగములు అశాస్త్రీయ ములుగను అస్థిరములుగను నుండెను. మద్రాసులో 1859 లో డిప్యూటీకలెక్టర్లనబడు నొక హోదా నిర్మింపబడెను. అప్పుడే జాను మేజస్ట్రేటు పదవులు, స్మాలుకాజు జడ్జీ పదవులు భారతీ యులకు ప్రవేశమివ్వబడెను. 1861 సంవత్సరపు సివిల్ సర్వీ సెస్ ఆక్టువలననే ఈ యుద్యోగములకు స్థిరత్వమేర్పడెను. 1876 నాటికి ఛీఫ సెక్రటరీ, రివిన్యూసెక్రటరీ, మిలిటరీ సెక్ర

టరీ, పబ్లికువర్క్సు సెక్రిటరీల నలుగురకు నలుగురు అసిస్టెంటుల పదవులు గెజిటెడ్ ఉద్యోగములుగా చేయబడినవి. అనగా నీపదవులలో సామాన్య ఉద్యోగులు నియమింప వీలుకలదు. 1871నాటి కిట్టిసామాన్య ఉద్యోగవర్గమునందు 16 వేలు ఉద్యోగులుండిరి. ఇంతకన్నను చిన్నతరగతి ఉద్యోగులు 80 వేలమందియుండిరి.

ఒడంబడికలులేని ఈసామాన్యఉద్యోగవర్గములో న్యాయ విచారణ రివిన్యూ శాఖలందలి ప్రధానపదవులు డిప్యూటీకలెక్టరు, తహీస్సలుదారు, డిప్యూటీ తహీస్సలుదారు, సబ్ జడ్జీ, జిల్లా మునసబులు. ఈ ఉద్యోగవర్గము అన్కవనెంటెడ్ సర్వీస్‌లో నాంగ్లేయులు చేరుట కిష్టపడరు. ఇది 'నేటివ్ సర్వీసు' అని కూడ వ్యవహరింపబడెను. దీనిలో నెల 1 కి 250 మొదలు 600 వరకు జీతములుగల డిప్యూటీ కలెక్టరులు 68 మంది; నెల 1 కి 150 మొదలు రూ 250 వరకు జీతముగల తహస్సీలు దారులు 156; నెల 1 కి రు 50 లు మొదలు రూ 150 వరకు జీతము గల డిప్యూటీ తహస్సీలుదారులు 178; నెల 1కి రూ 500లు చొప్పునజీతము గల సబ్ జడ్జీలు 14; నెల 1కి రూ 200 మొదలు 300 వరకు జీతముగల జల్లామునసబులు 110.

### ఇతరఉద్యోగములు:

ఇక ఇతరశాఖలలో అక్కవుంటుశాఖ, విద్యాశాఖ, రిజస్ట్రేషను, స్టాంపులు, వైద్యము, పోలీసు, జైళ్లు, పబ్లికు వర్క్సు, రైల్లుశాఖ ఒడంబడకలులేని సెక్రెటేరియటులు లో

కొన్ని హెచ్చుజీతములుగల ఉద్యోగములుకూడ నుండెను. రూ 1500 లు కూడా జీతముకల ఉద్యోగములున్నవి. దీనిలో మద్రాసులో 1877-78 లో 1980 మంది యుండిరి.

తాబేదారీనౌఖరులు:

ఈసామాన్య అన్కవనెంటెడ్ సర్వీస్క్రింద కొద్దిజీత గాండ్రు చిన్నఉద్యోగులు నౌకర్లుకలసి మద్రాసు రాజధానిలో ఒకలక్షమంది యుందురు. వీరిలో గ్రామోద్యోగులు నౌకరులు ఇతరులు నుందురు.

## X

### పెద్ద ఉద్యోగములు, వాని జీతములు.

"1892 లో పార్లమెంటువారు తయారు చేయించిన లెక్కప్రకారము భారత దేశములోని ఐరోపాజాతి యుద్యోగులజీతములక్రింద మన దేశప్రభుత్వ మిచ్చినసొమ్ము:

| | | |
|---|---|---|
| (1) సర్వీసులోనున్న ఆఫీసర్లకుజీతములు | పౌనులు | 8771443 |
| (2) సెలవుపైనున్న ఆఫీసర్లకు | | 463631 |
| (3) ఇండియాలోని ఆఫీసర్లకు పింఛనులు | | 232888 |
| (4) రైల్వేసర్వీసులోని ఆఫీసర్లకు | | 806284 |
| వెరసి | పౌనులు | 10274246 |

గమనిక— i. ఈలెక్క పౌను 1 కిరూ10లచొప్పున లెక్కగట్టిచూచినారుగాని 1900నాటికి పౌనువిలువ రూ15 లకి పెరిగినందున ఇంకా50లక్షలు దీనికిచేరవలెను.

ii ఈ లెక్కలో సాలు 1 కి 100 పౌనులు అనగా రూ 1500 లు పై బడినజీతములు మాత్రమే చేరినవి.

iii. ఐరోపావారి జీతముమాత్రమే చేరినది. ఇంగ్లాండులో పింఛను పుచ్చుకొన్న ఐరోపావారి కిచ్చు అలవెన్సులు చేరలేదు.

iv. సాలు 1 కి 100 పౌనులుకు తక్కువ జీతములుగల సోల్జరులు జీతములు చేరలేదు.

v. మఱియు ఇటీవల ఐరోపావారి సంఖ్య హెచ్చినది.

vi రూపాయివిలువ తగ్గినందున వారికి కంపెన్సేషన్ అలవెన్సులుకూడ ఇవ్వబడుచున్నది"

అని శ్రీ రమేశచంద్రదత్తుగారు తమ భారతదేశ ఆర్థిక చరిత్రలో వ్రాసియున్నారు. *1893 నాటికే ఐ. సి. యస్. వగైరా ఆంగ్లేయులకు ఇజారా హక్కుగలఉద్యోగములందు 950 మంది తెల్లవారు 20 మంది భారతీయులు నుండిరి.

పెద్దజీతములుగల గొప్ప యుద్యోగములందు భారతీయులకు ప్రవేశము కలిగింపుడని భారతీయులు చాలాకాలమునుండి ఆందోళనము చేయగా చేయగా 1917లో లోకవిచారణసంఘము నేర్పరచిరి. వారు ఐ. సి. యస్. పోలీసు మొదలగు 24 రకముల ఉద్యోగవర్గములను గూర్చి తమ అభిప్రాయముల సూచించిరి. పర్యవసానమేమనగా భారతదేశ పరిపాలన బాధ్యతను చక్కగా నిర్వర్తించుట కొఱకు ఐ. సి. యస్. పోలీసుశాఖ

* ఇంకను వివరములకు 83-84 పుటలు చూడుడు.

లలో భారతీయుల నంతగానియమించుట మంచిదిగాదనియు, ఇకకొన్ని శాఖలలో కొంత ఎక్కువసంఖ్య భారతీయులను నియమింపనచ్చుననియు తీర్మానించిరి. ఇట్లు తెల్లవారి జీతములు తగ్గలేదు; భారతీయుల సంఖ్యయైనను హెచ్చలేదు.

వీరుపరిశీలించిన 24 ఉద్యోగవర్గములందును కలిసి 9949 మంది ఉద్యోగులుండిరి. దీనిలో 4140 మంది అనగా నూటికి 42 వంతులు ఇంగ్లాండులోనే నియమింపబడుచుండువారు. ఈశాఖలలో నెల 1కి రూ 200 రూపాయిలకు తక్కువగాని జీతములవారు 11064. దీనిలో నూటికి 42 వంతులు మాత్రమే భారయులు నెల 1కి 500 లకు జీతము తక్కువగాని యుద్యోగములసంఖ్య 4984. వీనిలో నూటికి 19 మంది మాత్రమే భారతీయులు. నెల1కి రు 800 లకు తక్కువగానిసంఖ్య 2501. వీరిలో నూటికి 10 మందిమాత్రమే భారతీయులు. సర్ అబ్దుర్ రహీము గారు ఈ విచారణసంఘములో నొక సభ్యులు. పాపము, వారు తమ అసమ్మతిని సూచించిరి. ఇండియన్ సివిలుసర్వీసులో 1350 మంది తెల్లవారును, 61 మంది మాత్రమే భారతీయులు నుండుటనుగూర్చి విచారించి ఇంగ్లాండులోను భారత దేశములోను ఐ. సి. యస్. పరీక్ష యొక్కసారిగా జరుపుట యవసరమనిరి.

భారత దేశ ప్రభుత్వ వ్యయము మితిమీరి, 1922-23 నాటికి సాలు 1 కి 32 కోట్లు రూపాయిలులోటు కలుగుచుండెను. ఆ సాలున 29 కోట్లు పన్ను విధించినను 3 కోట్లు లోటు కలిగినది. ఐదుసంవత్సరములలో 100 కోట్ల లోటు కలిగినది.

రెండు శాసనసభలును ప్రభుత్వ వ్యయమున పొదుపు చేయ వలెనని సలహానిచ్చెను. అంతట ఇంచ్కేపు కమిటీ నియమింప బడెను. సైనికవ్యయము తగ్గింపుమనిరి. రైల్వేవ్యయము తగ్గింపు మనిరి. సామాన్య పరిపాలనములో కూడతగ్గింపులు సూచిం చిరి, కాని దీనిప్రకారము జరుగలేదు.

మాంటేగ్యూ సంస్కరణచట్టము ప్రకారము ప్రభుత్వోద్యోగములందు భారతీయుల నధికముగా నియమించు టయే ఉద్దేశ్యమని చేసిన ప్రకటనను అమలులో పెట్టుటను గూర్చి విచారించి సలహానిచ్చుటకు "లీ కమీషన్" అను విచారణసంఘము వారు నియమింపబడిరి. వారు 1923లో తమ నివేదికను ప్రకటించిరి. అఖిల భారత ప్రభుత్వోద్యోగ పరీక్షలు చేసి అభ్యర్థులను నియమించుట కొరకు పబ్లిక్ సర్వీసు కమీషను ఏర్పాటు గావింపవలెననిరి. ఐ. సి. యస్. లో పోలీసుశాఖలోను ఇంగ్లీషు ఉద్యోగులతో సమానసంఖ్యగల భారతీయులు నియమింపబడవలెననిరి. అయితే వీరుచెప్పిన మార్గముద్వారా ఆ స్థితి వచ్చునప్పటికి ఐ. సి. యస్. లో 15 సంవత్సరములును, పోలీసు శాఖలో 25 సంవత్సరములును పట్టును. ఈ కమీషనువారు ఫారెస్టు సర్వీసులో నూటికి 75 మంది భారతీయులు, ఇంజనీరు శాఖలో 60 మంది ఉండవలె ననిరిగాని రాజకీయశాఖలో మాత్రము నూటికి 25 మంది మాత్రమే ఉండునట్లునిర్ణయించిరి. దీనికి కారణము బ్రిటిష్ సామ్రాజ్య తత్వమున కిది ఆయువుపట్టుగా నుండుటయే.

ఇట్లు భారత దేశ ఉద్యోగములందు భారతీయుల సంఖ్య

కొంత క్రమక్రమముగా వృద్ధిచేయబడునట్లు ఏర్పాటుగావింప బడెనుగాని ఎట్టి సంస్కరణమును జరుగలేదు. ఈ ఉద్యోగుల కివ్వబడు నత్యధిక జీతములు వేతనములు అలవెన్సులు దేశమునకు చాలా భారముగానున్నవి. ఉద్యోగులు సర్కారు నౌకరులుగానే ప్రవర్తించుచున్నారు గాని ప్రజాసేవకులుగా ప్రవర్తించుటలేదు. మన దేశములో నున్నంత హెచ్చు జీతములు ప్రపంచములో నెచ్చటను లేవు*. మాంటేగ్యూ సంస్కరణములు వచ్చినపిదప జీతములు తగ్గించుటకు బదులు హెచ్చిపోయెను. క్రొత్తయుద్యోగములు నిర్మింపబడెను. భారతీయ ఉద్యోగుల జీతములు హెచ్చుచేయబడెను. దీనికి కారణము లేకపోలేదు. రాజకీయాందోళనము నానాటికి ప్రబలుచున్నందున నీయుద్యోగులు ప్రభుభక్తి గలిగి యుండులాగునను ప్రభుత్వోద్యోగము తక్కిన అన్నివృత్తులకన్నను లాభకరముగా నుండులాగునను చేయదలంచిరి. దీనివలన ప్రభుత్వవ్యయము మితిమీరినది. పన్నులభారము వృద్ధియైనది. ఋణమధికమైనది. తరువాత జరిగిన రాజ్యాంగ సంస్కరణముల వలన ఈరాజ్యాంగ స్వరూపమున గొంత మార్పు చేయబడినదేగాని స్వభావమున నెట్టి మార్పులు జేయబడలేదు.

1931-32 లో నాటి ఇండియాప్రభుత్వ ఫైనాన్సు మెంబరు సర్ జార్జి షష్టరుగారు బడ్జెటు ఉపన్యాసములో రైళ్ళశాఖ తప్ప మిగతా అన్ని సివిలు శాఖలందుకలిపి గుమాస్తాలనుండి ఐ. సి. ఎస్. ఉద్యోగులదాకా చిన్న పెద్ద ఉద్యోగులందరి

* వివిధదేశముల ఉద్యోగుల జీతముల పట్టిక అనుబంధమున గలదు

జీతములక్రింద భారత దేశ కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వములవారు సాలుకు 57 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టుచున్నారనియు, దీనిలో ఇండియాప్రభుత్వము 16కోట్లు జీతములక్రింద వ్యయము చేయుచున్నదనియు, దీనిలో బ్రిటిష్ ఇండియను ఆఫీసర్ల జీతములు అలవెన్సులు కలిపి 16 కోట్ల రూపాయలనియు ఈ మొత్తములో 6 కోట్ల రూపాయలు కేవలము బ్రిటిష్ (ఆంగ్లేయ) ఆఫీసర్లకు చెల్లించబడుచున్నదనియు చెప్పినారు. మిలిటరీ రైళ్ళ శాఖలతో కలిపి సాలియానా జీతముల క్రింద 120 కోట్లు ఖర్చు చేయబడుచున్నది. పింఛను లింకొక 10,15 కోట్ల రూపాయలుండును. ఇక లెక్కలోనికి రాని వేతనములు బత్తెములు కలిపినచో సాలుకు 200 కోట్ల రూపాయలు ఖర్చుఅగుచున్నట్లు ఎంచవచ్చునని సుప్రసిద్ధ అర్థశాస్త్రజ్ఞుడగు ప్రొఫెసర్ కె. టి. షాగారు, అంచనా వేసినారు. ఇతర దేశములతో పోల్చి చూచినచో నీజీతము లత్యధికముగా నున్నవి. మన ప్రజలా దరిద్రులు. సాలు 1కి తలకు రు 80 రూపాయల దామాషా ఆదాయముగలిగి ఎంత ఎక్కువ మదింపు వేసిచూచినను సాలుకు వేయికోట్ల జాతియాదాయముగల మన దేశమున కీ జీతముల ఖర్చు దుర్భరముగా నున్నదనియు ఆయన విమర్శించియున్నారు.

## XI

### శాసన నిర్మాణాధికారము

భారత దేశ ప్రభుత్వముయొక్క శాసన నిర్మాణాధికారచరిత్ర చాలాచిత్రమైనది. 1833 కి పూర్వము భారత దేశ

ప్రభుత్వమునకు స్వతంత్రశాసన నిర్మాణాధికారము లేదు. పూర్వము "రెగ్యులేషను" లనబడునవి చేయబడుచుండెను. అంతట భారతదేశములోని శాసనాధికారములు కార్యనిర్వాహకసభాయుతుడగు గవర్నరు జనరల్ వల్లనే చలాయింపబడునట్లు 1833 లో తూర్పు ఇండియా కంపెనీవారికి రాజ్యాధికార సన్నదు లిచ్చుచూ పార్లమెంటువారు చేసిన రాజ్యాంగ చట్టమువలన శాసింపబడెను. తరువాత 1853 లో మరల కంపెనీవారికి రాజ్యాధికార సన్నదు నిచ్చునప్పుడు చేసిన రాజ్యాంగ చట్టమువలన శాసన నిర్మాణమున సలహానిచ్చు వ్యవహారమును కార్యాలోచన సభనుండి వేరుపరచి క్రొత్తగా నిర్మింపబడిన యింకొకసభకిచ్చిరి. ఈసభలో గవర్నరుజనరలు, సర్వసేనానియు, కార్యాలోచన సభలోని నలుగురు సభ్యులతో పాటు మద్రాసు, బొంబాయి, వంగరాష్ట్ర రాజధానుల నుండియు, తక్కిన లెఫ్టినెంటు గవర్నరుల పరగణాలనుండియు పంపబడు అనుభవజ్ఞులగు ఉద్యోగులును, కలకత్తా ప్రధాన న్యాయమూర్తియు, ఇంకొక సుప్రీమ్ కోర్టుజడ్జియు కలిసి పరివేష్టింతురు. ఈ శాసన నిర్మాణసభ నిర్మింపబడినప్పుడు దేశములో హిందూమహమ్మదీయ పెద్దమనుష్యులనుకూడ చేర్చుడని కొందరు ఆంగ్ల రాజనీతిజ్ఞులును కొందరు విద్యాధికులగు భారతీయులును కోరినను పార్లమెంటువారంగీకరింపలేదు. ఈ క్రొత్తశాసనసభ బహిరంగముగా సమావేశమగుచుండినందున ప్రజలుకూడావచ్చి ఇందలి చర్చలు వినుచుండిరి. ఈ క్రొత్తశాసనసభ కార్యనిర్వాహక వర్గము వారిచర్యలను

గూర్చి కూడా విమర్శింపసాగెను. 1853 లోని చట్టమువలన మదాసు బొంబాయి గవర్నరు కార్యాలోచనసభల ప్రత్యేక శాసనాధికారము తీసివేయబడెను.

'సిపాయిల' విప్లవానంతరము 1861 లో శాసననిర్మాణమునందు భారతీయులను తీర్చుకుచేయు సదుద్దేశ్యముతో మూడు క్రొత్తశాసనసభలు నిర్మించుచున్నామని చెప్పి ఒక చట్టము చేసిరి. గవర్నరు జనరలు శాసనసభ (సుప్రీంలెజిస్లేటివు కవున్సిలు) లో 6 మొదలు 12 మందివరకు అదనపు సభ్యులను నియమించు అధికారము వైస్రాయి కివ్వబడెను. ఆసంఖ్యలో సగముమందియైన నుద్యోగేతరులై యుండవలెననిరి. వారు ఆంగ్లేయులు కావచ్చును, భారతీయులు కావచ్చును. ఆయన కిష్టమైనవారిని నియమించి బహూకరించుచుండెను. అందువలన నీ సభ్యత్వము ఆశ్రయింపుమీాదనే ఆధారపడియుండెను. ఈ సభలైనను కేవలము సలహానిచ్చుట కేర్పడిన కమిటీలేగాని స్వతంత్రముగా శాసన నిర్మాణము చేయునవిగావు. నిజమున కానాడు చేయబడు శాసన నిర్మాణమనునది ప్రభుత్వమువారుచేయు ఒకవిధమగు ఉత్తరువులే యనిచెప్పవచ్చును.

1853లో మద్రాసుబొంబాయి రాష్ట్రములకు తీసివేయబడిన శాసననిర్మాణాధికారము 1861 లో మఱలనివ్వబడెను. ఈరెండు రాష్ట్రముల గవర్నరులు శాసననిర్మాణమునుగూర్చి ఆలోచించు నప్పుడు తమకార్యాలోచన సభలలో ఆరాష్ట్రములోని అడ్వకేటు జనరలును ఇంకను నలుగురు మొదలు ఎనిమిది మందివరకు అదనపు సభ్యులను (దీనిలో గూడ సగము మంది

యైన నుద్యోగేతరులను) నియమించి వేరుగా నింకొక ప్రత్యేక సభలో శాసనములు చేయునట్లు ఏర్పాటుచేసిరి. ఈ రాష్ట్రముల శాసనము లీ రాష్ట్రములకే వర్తించునట్లు శాసింపబడెను. భూముల సుంకము, ఇతరపన్నులకు సంబంధించిన శాసనములకు, కరెన్సీ, తపాల తంతి, పీనలు కోడ్డు, మతము, మిలిటరీ, పేటెంటు, కాపీరైటు, సంస్థానములనుగూర్చిన శాసనములకు వైస్రాయి అనుమతి ముందుగా గైకొనవలెను. ఈ రాష్ట్రీయసభలు కేంద్రశాసనములకు, పార్లమెంటు శాసనములకు విరుద్ధములగు శాసనములు చేయరాదు. ఇట్లు 1861 లో చేయబడిన సంస్కరణముల వలనగూడ మనకెట్టి ప్రజాప్రతినిధ్య పద్ధతులులేవు, సరికదా శాసనసభలకు నిజమైన శాసననిర్మాణాధికారముగూడా కలుగలేదు. కేవలము సలహాసంఘముగనే యుండెను. తరువాత నిబ్లీవంగరాష్ట్రమునను సంయుక్త రాష్ట్రములలోను శాసనసభలు నిర్మింపబడెను.

1892 లో నింకొక చట్టమువలన నీసుప్రీము శాసనసభలోని అదనపు సభ్యులసంఖ్య 10 మందికి తక్కువకాకుండా 16 మందికి మించకుండా పెంపుచేయుటకు వీలు కలిగింపబడెను. మఱియు నీసభ్యుల నియామకమును గూర్చి నిబంధనలు చేయుటకు గవర్నరు జనరలు కధికార మొసగబడెను. ఈసభ్యులలో 5 మందిని బొంబాయి మదాసు వంగరాష్ట్ర శాసనసభలలోని ఉద్యోగేతర సభ్యులే ఎన్నుకొనునట్లు తరువాత ఏర్పాటు జరిగినది. గవర్నరు జనరలు శాసనసభవారికి (బడ్జెటు) ఆదాయవ్యయపట్టికను చర్చించుట కవకాశ మొసగబడెను.

ప్రశ్నలువేసి ప్రభుత్వ వ్యవహారములు బహిరంగపరచుట-కవకాశము కలిగింపబడెను. నిజమైన శాసననిర్మాణాధికారము లేకపోయినను ప్రజాప్రతినిధులు దాని కెన్నుకొనబడక పోయినను భారతీయ ప్రతినిధు లనువారె నను, ఆశాసనసభయందుండుటకు మాత్రము అవకాశము కలిగెను. ఇట్లే రాష్ట్రీయ శాసనసభలుకూడా పెద్దవిచేయబడెను. బొంబాయి మదాసులలో అదనపుసభ్యుల సంఖ్య ఎనిమిదిమందికి పైగా ఇరువది మందివరకు పెంపు చేయవచ్చును. వంగరాష్ట్రమున 20 మందికిని, పశ్చిమోత్తర (నేటి ఆగ్రా అయోధ్య) పరగణాలలో 15 మందికిని పెంచవచ్చును. ఈ సభలకు సభ్యులను పేర్కొను అధికారము వర్తకసంఘములకు, విశ్వవిద్యాలయములకు, సెనేటు సభలకు, ఇంకను జిల్లాబోర్డులకు, మునిసిపలు సంఘములకు, పెద్ద జమీందారులకును ఇవ్వబడెను. మఱియు రాజధాని నగరములనుండి కూడ ఒక్కొక సభ్యుని నియమించుట కేర్పాటు చేయబడెను. ఇట్లు ప్రజానాయకులను శాసనసభలకు ప్రతినిధులుగా నియమించు పద్ధతివచ్చినను సరియైన ప్రాతినిధ్యపద్ధతులు స్థాపింపబడలేదు.

1909 లో మింటోమార్లే సంస్కరణలవలన శాసనసభలింకను పెద్దవిచేసి అందలి ఉద్యోగేతరులసంఖ్య హెచ్చు చేసి, కొంత సంకుచితములైన ప్రజాప్రాతినిధ్య పద్ధతులు స్థాపింపబడినను ఇంతవరకు నీసభలు కేవలము ప్రభుత్వమును విమర్శించుటకు చర్చించుటకు వీలుగల డిబేటింగు సొసైటీలు గానే యుండెనుగాని అధికారము లావంతయు వీని కివ్వబడ-

లేదు. ఇక 1919 లో చేయబడిన సంస్కరణములవలన శాసన సభలందు ప్రజాప్రతినిధుల సంఖ్యయు శాసన నిర్మాణాధికారమును హెచ్చుచేయబడినను కోశాధికారము ఒసగబడలేదు. గవర్నరుజనరలు సర్వాధికారియై సర్టిఫికేషను అధికారము ప్రయోగించుచుండెను. ఇట్లు 1919 వరకుగూడ ప్రజాప్రతినిధులకు నిజమైన శాసన నిర్మాణాధికారములు కలుగలేదు. *

## ఐదవ పరిచ్ఛేదము :

## బ్రిటీషు రాజ్యతంత్రమున భారతదేశ 'అభివృద్ధి'

### I

భారత దేశమునకు ప్రకృతిసంపద పుష్కలముగానున్నను ఆర్థికముగ మనప్రజ లధోగతిలో నున్నారనియు దారిద్ర్యమున మునిగియున్నారనియు దీనిని మాన్పుటకు వలసినప్రయత్నము లెల్ల చేయవలెననియు భారతజాతీయ నాయకులెల్లరును కోరుచుండగా, భారత దేశక్షేమలాభముల నాలోచించియే తామీ దేశమును పరిపాలించుచున్నామనియు దేశము క్రమ క్రమముగా నభివృద్ధిగాంచుచునే యున్నదనియు బ్రిటీషుసామ్రాజ్య తత్త్వవాదులు ప్రత్యుత్తరమిచ్చుచుందురు. తమ పరిపాలనా పద్ధతిని ఆదాయవ్యయపద్ధతినిసమర్థించుకొనుటకు కొందరుద్యోగులచేత కొన్ని నివేదికలను స్థితిగతిలెక్కలను తయారుచేయించి తమ ప్రభుత్వమునం దీ భారత దేశము. దినదినాభివృద్ధి

* 1909,1919 సంవత్సరముల సంస్కరణములకు అనుబంధము చూడుడు.

గాంచుచున్నదని గొప్పప్రచారము చేయుచున్నారు. 1858 మొదలు నేటివరకు కిట్టి నివేదికలు స్థితిగతిలెక్కలు అనేకములు తయారుచేయబడినవి. పూర్వపరిపాలనకన్న బ్రిటిష్‌పరిపాలన బాగున్నదని ప్రజ లభివృద్ధిగాంచుచున్నారని బ్రిటిష్ ప్రభుత్వాదాయ వ్యయాపద్ధతులు, పన్నులవిధానము న్యాయమైనవే యనిచూపుటయే వీరియుద్దేశము. అందుకనుగుణముగా ప్రాంత పరిస్థితులలోను, ఇతర దేశపరిస్థితులలోను, తమకనుకూలమైన అంకెలనుమాత్రమే వీరుగ్రహింతురు. వీరి లెక్కలలోని అంత రార్థము అనుభవజ్ఞులగు అర్థశాస్త్రజ్ఞులు తప్ప ఇతరులు కని పెట్టజాలనన్ని తికమకలు కల్పింపబడును.

ఈ కాలములో దేశమభివృద్ధి గాంచుచున్నదని తెలుపుటకును తమ పరిపాలనా పద్ధతిని సమర్థించుటకును ఇండియా గవర్నమెంటు రాష్ట్రీయ ప్రభుత్వములుగూడా వార్షిక లెక్కలనేగాక అప్పుడప్పుడు 'అభివృద్ధి' నివేదికలను స్థితిగతి లెక్కలను పార్లమెంటుకు సమర్పించుచుండిరి. కంపెనీపరిపాలనము రద్దుచేసిన పిదప 1858 మొదలు బ్రిటీషుసామ్రాజ్యపార్లమెంటు ప్రభుత్వముక్రింద అత్యంతాభివృద్ధి గాంచినట్లు లోకమునకు ప్రకటించుటకు ఇట్టి నివేదిక స్థితిగతులను తెలివి తేటలతో తయారుచేసిన ఉద్యోగులలో కొందరికి దివానుబహద్దరు, సి. ఐ. ఇ., సర్ బిరుదములుకూడ ఒసగబడియున్నవి. ఇది కూడ బ్రిటీషు రాజ్యతంత్రములో నొకభాగము.

1865 మొదలు భారత దేశ జనసంఖ్యనుగూర్చియు చారిత్రిక, ఆర్థిక, స్థితిగతులను గూర్చియు సమాచారములను

సేకరించుటకు సర్ విలియమ్ హాంటరుగారిని నియమింపగా 1880 నాటికి ఆయన ఇంపీరియల్ గెజటీరు అను గొప్ప సంపుటములను చాలా తయారుచేసిరి. తరువాత నివి అచ్చై అనేక సంస్కరణములు పొందినవి. 1871లో జనాభాలెక్క తయారు చేయబడినది. 1876 లోను 1893 లోను మదాసు ప్రభుత్వము వారును ఇతర ప్రభుత్వములవారును నివేదికలు ప్రకటించిరి. 1909 అక్టోబరులో ఇండియా గవర్నమెంటువారు పార్లిమెంటు వారికొక నివేదికను సమర్పించి దీనిలో భారతదేశ ప్రజలస్థితిని గూర్చి వర్ణించి గడచిన ఏబదేండ్లలోజరిగిన "అభివృద్ధి" ని వివరించిరి.

ఈ ప్రభుత్వములు భారతదేశ స్థితిగతులనుగూర్చి
ప్రకటించిన కొన్ని ముఖ్యాంశములు:—

i 1858లో తూర్పు ఇండియా కంపెనీ పరిపాలన రద్దు చేయబడి ఇంగ్లాండు పార్లమెంటువారి ప్రభుత్వము స్థాపింపబడిన పిదప రాజ్య విస్తీర్ణములో పెద్ద మార్పులేవియు జరుగలేదు.

ii 1858 నాటికి భారతదేశ జనసంఖ్య కేవలము ఊహాలపైననే ఆధారపడియుండెను. 1871 లో మొదటి జనాభా లెక్కలను తయారుచేసిరి. అప్పటికి తేలిన జనసంఖ్య 20,61,62,360. 1881లో రెండవ జనాభాలో సరియైన లెక్క 25,38,96,330. ఇది 1901 లో 29 కోట్లకు పెరిగినది.

iii 1856-1857 నాటికి భారతదేశ ప్రభుత్వము యొక్క మొత్తము ఆదాయము 3140 లక్షల రూపాయిలు; 1906-07 నాటికిది 10,840 లక్షలైనది. అనగా మూడురెట్లకు పెరిగినది. ఈ ఆదాయములో పన్నులవల్ల వసూలైన మొత్తము 1856-57 లో ఆనాటి 29 కోట్లరూపాయలును 1906-07 లో 64 కోట్ల 94 లక్షలకు అనగా రెట్టింపునకు పెరిగినది.

iv ప్రభుత్వముయొక్క మొత్తము వ్యయము 1856-57 లో 3,180 లక్షల రూపాయలు1906-07 లో 10,730 లక్షల రూపాయిలకు అనగా మూడురెట్లకు పెరిగినది. కేవలము భూమిశిస్తు ఈ కాలములో నూటికి 60 వంతులచొప్పున పెంచబడినది. ఎక్సైజు రివిన్యూ ఈమధ్యకాలములో 7 రెట్లకు పెరిగినది.

v. దేశముయొక్క విద్యాభివృద్ధి విషయములో 1833 కు 1853 మధ్య ఎట్టి కాలేజీలును లేవు. జాన్‌బ్రూస్ నార్టన్ గారి లెక్కప్రకారము 1853 నాటికున్న పాఠశాలలు:

| | ఇంగ్లీషు (వర్నాక్యులరు) దేశభాషల బడులు. | కేవలము దేశభాషలవి. |
|---|---|---|
| వంగరాష్ట్రము | 37 | 104 |
| ఆగ్రా (నేటి సంయుక్త రాష్ట్రము) | 7 | — |
| మద్రాసు | 1 | — |
| బొంబాయి | 14 | 288 |

మొత్తము విద్యార్థులసంఖ్య 26000. ప్రభుత్వము చేసిన మొత్తము ఖర్చు 990 వేల రూపాయిలు.

1856-57 లో విద్యకొరకు ప్రభుత్వము చేసిన ఖర్చు రు 3940000 లు. విద్యకొరకైన మొత్తము ఎన్నిరూపాయిలుగా లెక్కలలో జూపినను, దానిలో 4వ వంతు విద్యార్థుల స్కూలు జీతములవల్లను 5 వ వంతు ప్రజల ధర్మములవల్లను వచ్చిన సొమ్ము గాన చాలా తక్కువసొమ్ము మాత్రమే అసలు ఖర్చు. 1856-57 నాటికి 13 కాలేజీలుండెను. అన్ని పాఠశాలలందు చదువువిద్యార్థులసంఖ్య 4 లక్షలు. 1906-07 లో 179 కాలేజీలు అన్నివిధములైన పాఠశాలలందు కలిసి 57 లక్షల విద్యార్థులు నుండిరి. 1871 నాటిజనాభా లెక్క ప్రకారము దేశములో చదువువచ్చిన వారిసంఖ్య నూటికి 5 మంది. 1906-07 లో 5.3 మంది.

vi 1871 వరకు ఇంగ్లాండు పౌను నవరసుకు 10 రూపాయిలు విలువ; తరువాత 15 రూపాయిలు విలువ; అనగా మన మా దేశమునుండికొనిన వస్తువు ఖరీదులక్రింద ఆ దేశపుఉద్యోగుల జీతముక్రిందను ఋణములపైనవడ్డీలక్రిందను మనమిచ్చుకొనవలసియుండిన పౌనుల (నవరసు) ఒక్కొక్కదానికి పూర్వముకన్న 5 రూపాయిలు అధికముగా నిచ్చుకొనునట్లు నిర్ణయింపబడెను.

vii 1857 లో 300 మైళ్ళ రైల్వే. 1909లో 30983 మైళ్లు. ఇది నిర్మించినందుకైనఖర్చు 450 కోట్ల రూపాయిలు అయి తేవీని పైన ప్రతిసాలునవచ్చిన నష్టము ఈ క్రిందివిధముగానుండెను.

| సం॥ మొదలు | | వరకు | దామాషాగా నష్టము |
|---|---|---|---|
| 1876-77 | ,, | 1880-81 | రూ. 120 లక్షలు లు. |
| 1881-82 | ,, | 1885-86 | 74 ,, |
| 1886-87 | ,, | 1890-91 | 162 ,, |
| 1891-92 | ,, | 1895-96 | 153 ,, |
| 1896-97 | ,, | 1898-99 | 168 ,, |
| 1899-1900 | ,, | 1904-05 | 111 ,, |

viii ఈ కాలములోనే పల్లంసాగు నీటి పారుదలకు కాలువలు త్రవ్వుటకు పీనిమరమ్మతుకు చెరువులమరమ్మతుకు 45 కోట్ల రూపాయిలు ఖర్చు చేయబడెను.

రోడ్లు బిల్డింగులకు 1896-97—1901 మధ్య 4 కోట్లు 1901-04 మధ్య 5 కోట్ల రూపాయిలు ఖర్చు చేయబడెను.

1858 నాటికి పల్లంసాగు 1500000 యకరములు

1906-07 ........... 222 25000 "

దీనిపైనవచ్చు ఆదాయమువలన ఆ నిర్మాణముల ఖర్చు మళ్లినది. దీనివలన పండుపంటలో సాలుకు 60 కోట్ల రూపాయిల విలువగలపంట ప్రభుత్వమునకు చేరుచున్నది.

1871 లోని లెక్కలనుబట్టి ఇండియా రాజ్యాంగసహాయకార్యదర్శి సర్ లూయీమాలెట్ గారు 1875 లో తయారు చేసిన లెక్కలవలన చతురపుమైలుకు చూచినను తల 1కి మనిషి పైనచూచినను భూమిశిస్తు అతిభారముగ నుండినట్లు తేలుచున్నది. నికరపంటలో నూటికి 50-60 వంతులుండెను.

| భూమిపన్ను రాష్ట్రము | సాలు 1కి చతురపుమైలు పౌ.షి.పె | సాలు 1కి తల 1కి పౌ.షి.పె |
|---|---|---|
| వంగరాష్ట్రము, అస్సాము | 17- 14-3 | 0-1-1¼ |
| బొంబాయి, సింధు రాష్ట్రములు | 22- 0-11 | 0-3-4¼ |
| మదాసు రాష్ట్రము | 29- 0-9 | 0-2-6¾ |
| పశ్చిమోత్తర(ఆగ్రా)పరగణా | 45- 4-9 | 0-2-4¾ |
| పంజాబు రాష్ట్రము | 17- 6-4 | 0-2-0 |

ix 1858 లో ఈ దేశమునుండి ఎగుమతియైన సరకులవిలువ 255 లక్షల పౌనులు; దిగుమతుల విలువ 145 లక్షలపౌనులు. 1907-08 లో 1155 లక్షల ఎగుమతులు; 865 లక్షల దిగుమతులు. దిగుమతులకన్న మనము ఎక్కువగాచేసిన ఎగుమతులన్నియు ముడిపదార్థములలో పంపుచున్నాము. ఈ తేడావిలువ మనకు నష్టము, వారికి లాభము.

సుంకముల విధానము ఇంగ్లాండు కనుకూలముగా చేయబడినను కొంచెము పెరిగినది. ఆదాయపుపన్ను స్టాంపులు అడవులు పోస్టుతపాలా తక్కిన ఆదాయములుకూడ చాలా రెట్లు పెరిగినవి.

x ఇక వ్యయములలో సైనిక వ్యయము అత్యధికముగా పెరిగినది. 1861-1874 మధ్య దామాషాగా సాలు 1కి 16 కోట్ల రూపాయలనుండి 1899-1913 నాటికి 27 కోట్ల 40 లక్షలకు పెరిగినది.

సివిలు పరిపాలనవ్యయము 1861-1874 మధ్య సాలు1కి

దామాషా 10.28 కోట్లరూపాయల నుండి 1899-1913 నాటికి సాలు 1 కి దామాషాగా 24 కోట్ల రూపాయిలయినది.

ఉద్యోగుల జీతములు పింఛనులు మూడురెట్లకు పెరిగి పోయినవి (అనుబంధమునందలి అంకెల పట్టికలు చూడుడు.)

1861-74 మధ్య సాలు 1 కి దామాషా సీమఖర్చులు 10.47 కోట్లనుండి 28.35 కోట్ల రూపాయలకు పెరిగినది.

ప్రభుత్వఋణము 1871 లో 155 కోట్ల రూపాయలనుండి 1911 నాటికి 350 కోట్లకు పెరిగినది.

విద్యావిషయము చూచినచో 1854 కు పూర్వము మదార్సులో నొకే ఇంగ్లీషుపాఠశాల! దేశములో 1870 నాటికి నూటికి 5 మంది మాత్రమే చదువను వ్రాయనువచ్చి నట్లు లెక్కింపబడిన అక్షరాస్యులుగానుండగా 1909 నాటికి నూటికి 5.3 మంది యుండిరి. ఇక ప్రభుత్వముచేయు వ్యయము వివిధ దేశములతో పోల్చినచో 1908 నాటి కిట్లుండెనని గోఖలేగారు చెప్పినారు:—

| | తల 1 కి దేశాదాయము | తల 1 కి విద్యకొరకువ్యయము షిల్లింగులు పెన్నీలు |
|---|---|---|
| ఫ్రాన్సు | 25.7 | 5—4 |
| జర్మనీ | 18.7 | 4—0 |
| ఇటలీ | 12. | 1—8 |
| ఆస్ట్రియా | 16.3 | 2—4 |
| నెదర్లాండ్సు | 26.0 | 4—3 |
| భారతదేశము | 2 | 0—1½ పెన్నీలు |

## II

ఈ దేశాదాయము ఈ వ్యయము నిజముగా భారత దేశ ప్రజల క్షేమలాభములు దలంచియే బ్రిటీషువారు చేసిరా? నిజముగా మన దేశము అభివృద్ధి గాంచినదా? అను ప్రశ్నకు జవాబు రాజకీయములందు మితవాదిగనేయుండి గొప్ప దేశభక్తుడై ప్రభుత్వమువారి గౌరవమునకు పాత్రుడైన శ్రీ. శ్రీ. గోపాల కృష్ణ గోఖలేగారు 1908 లో శాసనసభయందు చెప్పిన సంగతులే ఇచ్చట నుదాహరించెదను.

| వివిధదేశముల ప్రజల దామాషా ఆదాయము తల 1 కి పాలకు | | దేశములో భూములపైన వచ్చు మొత్తము ఆదాయములో భూమిపన్ను నూటికెన్నివంతులు? | పాలు1కి తల1కి విధింపబడు ఉప్పు పన్ను ఎన్నిరోజుల ఆదాయమునకు సరిపడినది? |
|---|---|---|---|
| ఇంగ్లాండు | 42.0 | 8.3 | — |
| ఫ్రాన్సు | 25.7 | 4.8 | ½ రోజు |
| జర్మనీ | 18.7 | 3.0 | 1 రోజు |
| ఇటలీ | 12.0 | 7.0 | 4 రోజులు |
| ఆస్ట్రియా | 16.3 | 4.9 | 1½ రోజులు |
| నెదర్లాండ్సు | 26.0 | — | ½ రోజు |
| ఇండియా | 2.0 | 15 లేక 20 | 2 రోజులు |

"1902 మొదలు 1907 వరకు 5 సంవత్సరములకు అన్నిరాష్ట్రములందు కలిసి పల్లపుసాగు నీటివసతులు మురుగు

సౌకర్యముల కొరకు రు.17,68635 లు మాత్రము కర్చుపెట్టిరి. అనగా సాలుకు రు 3½ లక్షలు! ఆరోగ్యముకొరకు గూడ 17½ లక్షలే ఖర్చుపెట్టబడెను. అయితే 1901-02 సంవత్సరము కన్న హెచ్చుగా 27 కోట్ల రూపాయిలు సైన్యముక్రింద వ్యయము చేయబడెను!! 60 కోట్లు రైళ్ళకొరకు ఖర్చుపెట్టబడి దానిలో 19 కోట్ల రూపాయలు దేశాదాయములోనుండియే వ్యయము చేయబడినవి. ప్రజల వ్యవసాయాభివృద్ధి కుపయోగించు కాలువలు మున్నగు వానికన్న విదేశీయులకు లాభముకలిగించు ఈ రైళ్ళనిర్మాణమునకే ప్రాముఖ్య మియ్యబడినది."

గోఖలేగారే లండనులో 1905 నవంబరు 15 వ తేదిన నేషనల్‌లిబరల్ ఫెడరేషనులో నుపన్యసించుచు నీ దేశము యొక్క దారిద్ర్యము హెచ్చగుచుండుటయు ఇతర దేశములందు వేయిమందిలో మరణించువారిసంఖ్య క్రమక్రమముగా తగ్గుచుండగా నీ దేశములో విపరీతముగా పెరిగిపోవుచుండుటయు చెప్పి యీదిగువ అంకెల నుల్లేఖించిరి. ఈయన 1908 లో గవర్నరు జనరల్ శాసనసభలో గూడ నీ సంగతులనే మఱలచెప్పిరి. 1881-1886 మధ్య ప్రారంభములో నీ దేశములో 1000 మందికి మరణములు 24 మందిమాత్రమే. తరువాత నీసంఖ్య 25 మందికి పెరిగెను.

| | | |
|---|---|---|
| 1886-1888 | మధ్య ఈసంఖ్య | 28 కి పెరిగెను. |
| 1890-1895 | మధ్య | 30 కి పెరిగెను |
| 1896-1900 | మధ్య | 32.5 కి పెరిగెను. |
| 1900-1905 | మధ్య | 36.14 కి పెరిగెను. |

ఈ కాలములోనే ఇంగ్లాండుప్రజల మరణములు వేయి మందికి 20 నుండి క్రమక్రమముగా 16 కుతగ్గెను. దీనిభావమేమి?

1905 నాటికి ఇంగ్లాండుప్రజల ఆదాయము తల 1 కి 42పౌనులు; మన దేశప్రజల ఆదాయము ప్రభుత్వము అంచనా ప్రకారమే 2 పౌనులు; ఉద్యోగేతరుల అంచనా ప్రకారము 1 పౌను మాత్రమే! ఇంగ్లాండు దిగుమతులు తల 1 కి 13 పౌనులుండగా భారత దేశ దిగుమతులుతల 1కి 5షిల్లింగులు మాత్రమేయుండెను. ఆ దేశముతో వారికి 1480 లక్షలపౌనులు సేవింగ్సుబాంకీ నిలువలుండగా వారికన్న ఏడురెట్ల జనసంఖ్య గల మన దేశములో 70 లక్షలు మాత్రమేనిల్వ యున్నవి. వారి జాయింటుస్టాకు కంపెనీలపెట్టుబళ్లు 19000 లక్షల పౌనులుండగా మన వారికి 200లక్షలేయుండెను. ఈ దేశప్రజలలో 4/5 వంతులకు వ్యవసాయము పైన జీవనాధారము. ఈ వృత్తి నానాటికి క్షీణించి లాభము లేకున్నది. ఇంగ్లాండులో యకరమునకు పండుదానిలో నాలుగవవంతు మాత్రమే ఇచ్చట పండుచున్నది. గత 8 సంవత్సరములలోను కఱవుల వలన 20 కోట్ల పౌనుల విలువగలపశువులు పంటలు నాశనమైనవని కఱవుల విచారణసంఘమువారు నిర్ణయించినారు. ఇంపీరియల్ గెజిటీరు సంపాదకుడగు సర్ విలియమ్ హంటరు గారు ఈ దేశములో 4 కోట్ల ప్రజలకు రోజుకు 1 పూట మాత్రమే తిండితినుటకు శక్తి కలిగియున్నారని వ్రాసినారు. సర్ చార్లెస్ ఇలియట్ గారు 7 కోట్ల మంది ఎల్లప్పుడును అర్ధాకలితోనే మాడుచుందురని వ్రాసియున్నారు.

ఈదారిద్ర్యమునకు ముఖ్యకారణము ఇచ్చటి బ్రిటీషు పరిపాలనయొక్క స్వభావమే. భారత దేశమునకువచ్చిన ఇంగ్లీషు వారు లాభముపొంది ధనవంతులగుటకొరకే దేశ భాగ్యభోగ్యములు నిరంతరప్రవాహముగా తరలించుటయే కారణము.

1865-1905 మధ్య నలుబది ఏండ్లలో భారత దేశదిగుమతులకన్న హెచ్చుగా పంపిన ఎగుమతులయొక్క విలువ 10000 లక్షల పౌనులు, లేక 1500 కోట్ల రూపాయలుండెననియు ఈ దేశప్రభుత్వవిధానమున నికరాదాయములో సగము సైన్యమునకు మూడవవంతు సివిలు పరిపాలనోద్యోగుల కొరకు సీమ కంపబడుచున్నదనియు జీతముల మొత్తము పెరిగిపోయినదనియు వ్యవసాయ క్షేమమున కెట్టి పనులుచేయక ఆంగ్లేయ వర్తకుల లాభముకొరకు రైళ్ళు నిర్మించబడినవనియు దేశ ప్రజలకు విద్యలేదనియు ఈ దేశములోని ఏడు లక్షల గ్రామములలో ఐదింట నాలుగు గ్రామములకు ఒక పాఠశాల కూడా లేదనియు 8 మందిలో 7 మంది బాలురు నిరక్షరకుక్షులుగా జీవించుచున్నారనియు నీ ప్రభుత్వ యంత్రచలన విధానము తక్షణమే మార్పనిచో నింకను ఘోరాన్యాయమైన స్థితి వచ్చుననియు గోఖలేగారు స్పష్టముగా 15-11-1905 లో లండన్ నేషనల్ లిబరల్ క్లబ్బులో నుపన్యసించుచు చెప్పియున్నారు.

పరిభుత్వవ్యయములో *

| సంవత్సరము | మిలటరీ/సైనిక నికర వ్యయము | | సివిలుపరిపాలన నికర వ్యయము | | ఋణతీర్మాన నికరవ్యయము | |
|---|---|---|---|---|---|---|
| 1921-22 | 69.81 | కోట్లు | 8.64 | కోట్లు | 14.89 | కోట్లు |
| 1922-23 | 65.27 | ,, | 9.50 | ,, | 15.00 | ,, |
| 1923-24 | 56.23 | ,, | 8.65 | ,, | 14.17 | ,, |
| 1924-25 | 55.63 | ,, | 9.39 | ,, | 15.27 | ,, |
| 1926-27 | 55.97 | ,, | 10.28 | ,, | 12.06 | ,, |
| 1927-28 | 54.79 | ,, | 10.28 | ,, | 12.66 | ,, |
| 1928-29 | 55.10 | ,, | 10.43 | ,, | 12.82 | ,, |
| 1929-30 | 55.10 | ,, | 11.56 | ,, | 12.19 | ,, |
| 1930-31(బడ్జెటు) | 54.35 | ,, | 12.20 | ,, | 14.36 | ,, |

1922-23 లో విద్యకొరకు వైద్యము కొరకు రాష్ట్రములు ఖర్చుపెట్టిన దానికన్న 1929-30 లో కొంత హెచ్చు ఖర్చు పెట్టినట్లు సైమనుకమిటీవారినివేదికలో నొక లెక్క తయారు చేసినారుగాని ఈ లెక్కలపద్ధతి చాలాచిత్రమైనది. పూర్వము రెండు రూపాయిలు మొత్తము ఖర్చుచేయుచు నిప్పుడు నాలుగురూపాయిలు చేసినను అది రెట్టింపువృద్ధి యన వచ్చును కదా! జనసంఖ్య 318 కోట్లనుండి 353 కోట్లకు హెచ్చిన స్థితిలో దానివలన ప్రజలుపొందు లాభము కడు స్వల్పముగ నున్నది.

* అంకెలు సైమను కమిటీ నివేదికలోనివి.

1922 నాటినుండి 1929 నాటికి విద్యకొరకు వైద్యము కొరకు చేయబడిన ఖర్చులో అభివృద్ధి నూటికెన్నివంతులు? *

| రాష్ట్రము | విద్య | వైద్యము |
|---|---|---|
| మద్రాసు | 82 | 115 |
| పంజాబు | 78 | 94 |
| సంయుక్తరాష్ట్రము | 47 | 67 |
| బొంబాయి | 23 | 43 |
| వంగరాష్ట్రము | 21 | 24 |

వివిధ దేశప్రజల ఆదాయములో తల 1 కి వ్యవసాయము వలనను పరిశ్రమలవలనను వచ్చునది ఎంత? ♦

| | వ్యవసాయము వలన | పరిశ్రమల వలన |
|---|---|---|
| భారతదేశము | 59 రూ | 12 రూ |
| జపాను | 57 | 158 |
| స్వీడెను | 129 | 384 |
| ఇంగ్లాండు | 62 | 412 |
| కెనడా | 213 | 470 |
| అమెరికాసంయుక్తరాష్ట్రము | 175 | 721 |

* అంకెలు సైమను కమిటీ నివేదికలోనివి.

♦ అంకెలు సర్ విశ్వేశ్వరయ్యగారివి.

ఈవ్యవసాయము ఫలప్రదముగా లేదు. ఈపరిశ్రమ లధోగతిలో నున్నవి. నేడు మనప్రజలలో ధనికులతో పాటు బీదలపైన కేంద్రరాష్ట్రీయ స్థానిక ప్రభుత్వములన్నియు విధించు అన్ని బాపతులపన్నులభారము తల 1 కి సాలుకు రు 10-0-0 లుగనున్నదని అంచనా వేయబడినది. భారదేశము యొక్క ఆర్థికస్థితిగతులు జనులవిద్య ప్రభుత్వముయొక్క ఆదాయవ్యయములపద్ధతి ఋణము మొదలగువాని నితర దేశములవానితో పోల్చి చూచినచో మన ప్రజల దారిద్ర్యమును దేశముయొక్క దుస్థితియు ప్రతిమనుష్యునకును వెల్లడియగును.

## IV

సైనిక శాఖ బ్రిటిష్ రాజ్యతంత్రముయొక్క పునాది. ఐరోపాసంగ్రామము నాటివరకు 'భారత దేశ' సైన్యములో స్వల్పజీతములుగల భారతీయ సైనికులేగాని భారతీయ ఉద్యోగులు (ఆఫీసర్లు) లేరు! తరువాత భారతీయాందోళన ఫలితముగా కొందరి కుద్యోగము లిచ్చెదమని ప్రభుత్వము వారనిరి గాని నేటివరకు జరిగిన 'అభివృద్ధి' హాస్యాస్పదముగా నున్నది. 1929 వరకు కెప్టెనులకన్న హెచ్చుహోదా ఉద్యోగులులేరు. ఆసంవత్సరములో కెప్టెనుల సంఖ్య 39. 1936 లో సైన్యములో భారతీయ ఉద్యోగులు 233. నౌకాదళము లో 9 మంది. విమానదళములో 9 మంది. మొత్తము 251 మంది

మాత్రమే భారతీయులు! మన భారతీయ ఆఫీసర్లకన్న బ్రిటీషు ఆఫీసర్లకు 6-7 రెట్లు అధికవ్యయము. సైనికదళముల మొత్తము సంఖ్య సాలులో దామాషాగా 204000 లో స్వల్పజీతముల భారతీయులు మూడింట రెండువంతులుగా నున్నారు. మిగతా మూడవవంతువారు వీరికన్న మూడునాలుగురెట్లు అధికవ్యయమునకు కారణమైన బ్రిటీషు సోల్జరులు. *

సైన్యము, సివిలు పరిపాలన శాఖలలో
ఆంగ్లేయోద్యోగులు, భారతీయులు.

| | బ్రిటిషు సైనికులు | "నేటివులు" (భారతీయులు) | మొత్తం రూ | దామాషాఖర్చు కోట్లరూ. |
|---|---|---|---|---|
| 1837-38 మొదలు 1856-57వరకు 20సం॥ | 43,826 | 2,22,915 | 2,66,741 | 10.85 |
| 1861-62మొ॥1873-74 వరకు 13 సం॥లు | 62,458 | 1,23,881 | 1,86,340 | 15.68 |
| 1874-75మొ॥ 880-81 వరకు 7 సం॥లు | 61,884 | 1,22,556 | 1,84,441 | 16.17 |
| 1881-82మొ॥1884-85 వరకు 4 సం॥లు | 57,975 | 1,19,939 | 1,77,714 | 16.55 |
| 1885-86మొ॥1894-95 వరకు 10సం॥లు | 70 704 | 1,40,682 | 2,11.387 | 18.25 |
| 1894-95 | 74,040 | 1,45,738 | 2,19,778 | 20.1 |
| 1931 | 59.773 | 1,68,660 | 2,28,433 | 55 |

* వీరి జీతములు అలవెన్సులకు అనుబంధము చూడుడు.

1892 మే నెలలో పార్లమెంటు లెక్కల ప్రకారము సాలు 1కి 10 వేలరూపాయల జీతముగల సివిలు మిలిటరీ శాఖలందలి 2388 ఆఫీసర్లలో 60 మంది మాత్రమే భారతీయులు.

| | సంఖ్య. | | | జీతములు వేల రూ. లు | | |
|---|---|---|---|---|---|---|
| | నేటివులు | యూరేషియన్లు | ఆంగ్లేయులు | నేటివుల జీతముల మొత్తం | యూరేషియనుల జీతములు | ఆంగ్లేయుల జీతములు |
| సివిలుశాఖ | 55 | 10 | 1,211 | 947 | 151 | 25,274 |
| మిలిటరీశాఖ | 1 | 1 | 854 | 12 | 11 | 13,268 |
| పబ్లికువర్క్సు | 3 | 4 | 239 | 33 | 45 | 3,415 |
| ఇన్కార్పొరేటెడ్ లోకల్ ఫండ్సు | 1 | — | 9 | 10 | — | 113 |
| | 60 | 15 | 2313 | 2313 | 1002 | 42070 |

జాయింటు పార్లమెంటరీ కమిటీవారి నివేదిక ప్రకారము 1934 నాటికి భారతదేశములో ఐరోపా వారి

| | |
|---|---|
| జనసంఖ్య | 135000 |
| దీనిలో బ్రిటిషు సైనికులు | 60000 |
| ఉన్నతోద్యోగులందలి బ్రిటీషువారు | 3150 |
| దీనిలో ఐ. సి. యస్. లో | 800 |
| పోలీసులో | 500. |

సైమన్‌కమిటీవారు జనేవరి 1929 నాటికి వేసిన లెక్క

| | ఆంగ్లేయులు | భారతీయులు |
|---|---|---|
| ఐ. సి. ఎస్ | 894 | 367 |
| ఇండియన్ పోలీసువారు | 564 | 128 |
| ఇంజినీర్సు సర్వీసు రిజర్వుడు శాఖ | 255 | 240 |
| ఫారెస్టుసర్వీసు | 134 | 76 |

1933 జనేవరినాటికి పెద్దజీతముల ఉద్యోగులందు బ్రిటీషు వారిసంఖ్య భారతీయుల సంఖ్య (జాయింటు పార్లిమెంటరీ కమిటీవారి లెక్క)

| | ఐరోపావారు | భారతీయులు | మొత్తము |
|---|---|---|---|
| ఇండియన్ సివిలు సర్వీసు | 819 | 478 | 1297 |
| ,, పోలీసు | 505 | 152 | 665 |
| ,, ఫారెస్టు సర్వీస్ | 203 | 96 | 299 |
| ,, సర్వీస్ ఆఫ్ ఇంజనీర్సు | 394 | 232 | 596 |
| ,, మెడికల్‌సర్వీస్(సివిలు) | 200 | 98 | 298 |
| ,, విద్యాశాఖ | 96 | | |
| ,, అగ్రికల్చరల్ | 46 | 30 | 76 |
| ,, వెటర్నరీ | 20 | 2 | 22 |
| | 2193 | 1227 | 3428 |

ఈ ఉద్యోగులలో భారతీయులకన్న "ఐరోపా" వారిలో చేరిన ఆంగ్లేయోద్యోగులకు గల ప్రత్యేక సౌకర్యములు

'స్పెషల్'అలవెన్సులు లెక్కలేనన్ని గలవు మిలిటరిశాఖజీతములు అలవెన్సులుకలిసి 1913-14 నాటికి 1,34,554 వేల రూపాయిలు. 1922-23 నాటికి 2,69,972 వేలరూపాయిలకు పెరిగినది. సివిలుశాఖ జీతములు అలవెన్సులు కలిసి 1913-14 లో 67,512 వేలరూపాయిల నుండి 1922-23 నాటికి 1,37,523 వేలకు పెరిగినది. 1923లో లీ కమీషనువారు సివిలుశాఖోద్యోగుల అలవెన్సులను ఇంకొక కోటిరూపాయిలకు పెంచిరి.

V

భారతదేశమునందలి జాతీయనాయకులందరు మనదేశ దారిద్ర్యమునుగూర్చి వగచి దీనిని మాన్పుడని బ్రిటిష్‌ప్రభుత్వమును చిరకాలమునుండి కోరుచున్నను వారట్లుగావింపలేదు సరికదా తమ యుద్యోగులచేతను ఇంకను కొందరు ధనాపేక్షాపరులగుఅర్థశాస్త్రజ్ఞులచేతను తమపక్షమున ప్రచారముచేయించి తమ ఆర్థికవిధానమును వ్యయపద్ధతులను సమర్థించుకొనజూచుచున్నారు. ఈ ప్రచారములో వీరనేక విపరీతహేతువాదములు చేయుచుందురు. బ్రిటీషుప్రభుత్వమునకు పూర్వము మొగలాయి చక్రవర్తులకాలమున బ్రిటీషుసామ్రాజ్యముకన్న తక్కువవైశాల్యముగల రాజ్యభాగములనుండియే ఆచక్రవర్తులు ఇంతకంటె హెచ్చు భూమిశిస్తును వసూలు చేయుచుండిరనియు బ్రిటీషువారు వసూలుచేయుచున్న భూమిశిస్తు అత్యధికముగాదనియు వీరనుచుందురు; కాని మొగలాయిచక్రవర్తుల కాలమున పల్లపుసాగు నీటివసరుల కవసరమైన కాలువలు తటాకములు నూతులు ఎన్నో నిర్మింపబడి ఎప్పటికప్పుడు ఎంతోసొమ్ము

వెచ్చించి మరమ్మతు చేయబడుచుండెను. బ్రిటీషుప్రభుత్వము స్థాపించబడినపిదప ఆనిర్మాణములన్నియు శికస్తులోపడిపోయి క్రొత్తవి నిర్మింపబడక వ్యవసాయాభివృద్ధిలేకపోగా రైతుల దారిద్ర్యము హెచ్చసాగినది. 1769 లగాయతు 1902 వరకును రమారమి 32 పెద్దకఱవులువచ్చి దేశములో అమితమైన జననష్టము కలిగినది. విశేషధనము సీమ కంపబడినందునను ప్రజాసౌకర్యములు చేయబడక పోయినందునను దేశము యొక్క సంపద క్షీణించిపోయి నిరంతరక్షామస్థితి యేర్పడినది. 1870 నాటికి సాలుకు తల 1 కి యిరువది రూపాయిలు మాత్రమే మనప్రజల దామాషాఆదాయము. నాడు విధింపబడినపన్ను తల1కి రు1-13-9 లు. నేటికి రు80-0-0 దామాషా ఆదాయము రు6-1-8లు పన్ను. నాడు 50 కోట్లుగానుండిన భారతదేశప్రభుత్వాదాయము నేటికి 226 కోట్లకు పెంచబడినది. నాడు 15 కోట్ల సైనికవ్యయము నేడు 55 కోట్లయినది. నాటి 12 కోట్ల సివిలు పరిపాలనా వ్యయము నేడు 45 కోట్లయినది. నాడు 100 కోట్లుగ నుండిన ప్రభుత్వఋణము నేటికి 1200 కోట్లకుపెంచబడినది. ప్రజలుతలకు మించిన ఋణభారమువలన పన్నులభారమువలన కృంగిపోవుచున్నారు. రైతులు దరిద్రులయి నారు. నాడుదేశములోని రైతులందరికిని కలిపి 200 కోట్ల ఋణముండగా నేడది వెయ్యికోట్లు దాటినది. ఇట్టిస్థితిలో ప్రభుత్వము ప్రజలకు చేసిన మేలేమి? 1870 నాటికి అక్షరాస్యులు అనగా చదువను వ్రాయను నేర్చినట్లు లెక్కలోనికి వచ్చినవారు నూటికి అయిదుమంది యుండిరని ప్రభుత్వ

నివేదికలందే ప్రకటింపబడియున్నది. నేడు నూటికి 8 మంది మాత్రమే అక్షరాస్యులు. ఇది మన విద్యావిధానము లోని యభివృద్ధి! దీనిని సమర్థించుకొనుటకు ఒక సర్ బిరుదాంకితుడు మనదేశజనసంఖ్య 1870 లో 20 కోట్లనుండి ఇప్పుడు 35 కోట్ల యినదని ప్రత్యుత్తరము చెప్పుచున్నాడు. ఇది నాగరకతగల ప్రభుత్వము చెప్పవలసిన సమాధానమేనా!

| | | | |
|---|---|---|---|
| 1881-1891 | మధ్యజనసంఖ్యనూటికి | 9.6 | చొప్పునవృద్ధియైనది. |
| 1891-1901 | మధ్య నూటికి | 1.4 | ,, |
| 1901-1911 | మధ్య నూటికి | 6.4 | ,, |
| 1911-1921 | మధ్య నూటికి | 1.2 | ,, |
| 1921-31 | మధ్య నూటికి | 10.6 | ,, |

ఇట్టికాలమున నూటికి పదివంతులచొప్పున వృద్ధియగుట యొక హెచ్చులోనిది కాదని అర్థశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఆనాటికి మనకన్న వెనుకపడియున్న రష్యా దేశము, అమెరికా దేశములందు కూడ నేడు నూటికి 98 మంది విద్యావంతులుగ నున్నారు. ఇట్టి స్థితిలో మన దేశమునందు సాలుకు విద్యకొరకు చేయుబడు 8 కోట్ల రూపాయిల వ్యయ మేమూలకు సరిపోవును? అత్యంతవిద్యావంతులుగ నున్న ఆ దేశములలో నిప్పటికిని సాలుకు 40కోట్లు మొదలుకొని 80 కోట్లవరకు విద్యకు వ్యయము చేయుచున్నారు.

ఇక మన దేశప్రజల దామాషా ఆయుర్దాయము చూచి నచో 1870 నాటికిని నేటికిని విశేష తారతమ్యముకనబడుటలేదు.

ఇంగ్లాండు దేశములో 57సంవత్సరములునుజపానులో 44నుసగటు ఆయుర్దాయమయి యుండగా మన దేశమున దాహూహా ఆయుర్దాయము 23 మాత్రమె అయియున్నది. మన దేశములో వెయ్యిమందిలో 26 మందికి మరణములు తటస్థించుచుండగా ఇంగ్లండులో 12మంది, జపానులో 18మంది, మాత్రమె మరణించుచున్నారు. దీనికి జవాబుగా ప్రభుత్వని వేదికలందు మనజనసంఖ్య హెచ్చుగుచున్నదనియు జనసంఖ్య యొత్తిడి చతురపు మైలునకు మన దేశమున అధికముగనున్న దనియు చెప్పజూతురు. కాని 1881లో ఇంగ్లాండులో చతురపుమైలుకు 446 మంది ప్రజలును వేయింటికి 35 జననములును ఉండగా వేయింటికి 21 మరణములుమాత్రము తటస్థించుచున్నట్లును మన దేశములోఆనాటికి చతురపు మైలుకు 221 మంది జనులును వేయిమందికి 50 మంది జననములు నుండగా 44 మంది మరణములు నుండెనని, '40 సంవత్సరముల అభివృద్ధి'యను మదరాసు. నివేదికలోనే వివరింపబడినది. నేడు ఇంగ్లాండు దేశములో జనసాంద్రత చతురపు మైలుకు 490, వేయింటికి 16 జననములు, 12 మరణములు, నుండగా మన దేశములో చతురపుమైలుకు 195 మంది జనులు వేయింటికి 32 జననములు 24 మరణములు కనబడుచున్నవి. ఇట్లు చూచినను వారివాదన ఎంత అసందర్భముగనున్నదో కనపడగలదు.

ఇంకొక చిత్రమేమన ప్రజల విద్య, ఆరోగ్యము, ఆర్థిక క్షేమలాభములకు వలసిన ఖర్చులు ఎంతో హీనముగనున్నవని ప్రభుత్వ ఆదాయవ్యయవిధానమును జాగ్రత్తగా పరిశీ

లించినచో తెలియగలదు* సైన్యమునకు పెట్టు ఖర్చు, మొత్తము ఆదాయములో నూటికి 39.5 వంతులు. ఋణ తీర్మానము నిమిత్తము 15.2; విద్యకొరకు 7.6; వైద్యముకొరకు 2.28; ఆరోగ్యముకు 1.28; వ్యవసాయముకు 1.24 వంతులు చొప్పున ఖర్చుచేయబడు చున్నది.

నాగరకతాగ్రగణ్యులమని చెప్పుకొను నీ బ్రిటీషువారి వివిధరాష్ట్రీయ ప్రభుత్వములందున్న స్థితిగతులకన్న అనాగరకులును నిరంకుశులుననబడు భారతీయసంస్థానాధిపతుల రాజ్యములందే హెచ్చుమంది అక్షరాస్యులును, ఎక్కువ సంఖ్య పాఠశాలలును కనబడుటయే ప్రభుత్వనివేదికలయందలి విపరీతపు వాదనలకు తగిన జవాబుగా కనబడుచున్నది. బ్రిటీషు ఇండియాలో జనసంఖ్య పెరిగినట్లే సంస్థానములలోను పెరిగినది. అయితే సంస్థానాధీశులు ప్రజలక్షేమముకొఱకు కొంచెముగనో గొప్పగనో హెచ్చుసొమ్ము ఖర్చుపెట్టిరి. మనప్రభుత్వము అట్లు చేయలేదు.

## VI

భారతదేశ ఆర్థిక స్థితిగతులనుగూర్చియు బ్రిటీషు పరిపాలనములో నీదేశమున జరిగిన దనబడు "అభివృద్ధిని" గూర్చియు సర్ విశ్వేశ్వరయ్యగారు ఈదిగువ సంగతులనుతమ "ప్లాన్‌డ్ ఎకానమీ ఫర్ ఇండియా" అనుపుస్తకములో బహిరంగ పరచి యున్నారు.

---

* అనుబంధములోని అంకెల పట్టికలు చూడుడు.

భారతదేశము వ్యవసాయ దేశమనియు అందువలన నీదేశప్రజలు వ్యవసాయమునే నమ్ముకొనవలెననియు బ్రిటీషు అర్థశాస్త్రజ్ఞులును వారిననుకరించువారును చెప్పుమాటలు సరి కావు. వ్యవసాయమువలన నితరదేశములందువలె మనదేశ ప్రజలకు లాభము కలుగుటలేదు. సంపదను జాతీయాదాయ మును వృద్ధిచేయగల పరిశ్రమలు వాణిజ్య రవాణావృత్తులు వృద్ధిచేయ బడకపోవుట ఘోర అన్యాయము. అందువలననే యీ దేశము దారిద్ర్యమున మునిగియున్నది.

1881 లో మన దేశమున వ్యవసాయ దారులు జన సంఖ్యలో నూటికి 61 మంది యుండగా ఇప్పుడు 73 గురికి పెరుగుట వ్యవసాయములోని లాభమువలనగాక ఇతర జీవనాధా రములు లేకపోవుటచే. ఈ రైతులు జీవనము గడువక ఋణ ములలో మునిగియున్నారు.

దేశముయొక్క ఔన్నత్యము జాతీయాదాయము పైన నాధారపడి యుండును. మనదేశ ప్రజలకు తల 1 కి సాలు 1 కి రు 75-0-0 లు కన్న దామాషా ఆదాయములేదు. 1932-1933 లో ఇన్‌కంటాక్సు లెక్కలవల్ల బ్రిటీషు ఇండి యాలోని జనసంఖ్య 27 కోట్ల 20 లక్షలలో 5,64,434 మంది మాత్రమే సాలు 1కి వేయి రూపాయిల పైబడిన ఆదాయము కలిగి పన్ను విధింపబడినట్లు తేలినది. వీనిలో 2,71,171 మంది రెండువేల రూపాయలకు తక్కువ ఆదాయముగలవారు. 2,93,263 మంది రెండువేలు అంతకు పైబడిన ఆదాయముల వారు. వీరిలో 358 మంది మాత్రమే లక్షరూపాయలు ఆదా

యము గలవారుగా నున్నారు. అందువలన నీలెక్కప్రకారము నెల 1 కి రు 5-0-0కన్న మనిషికి ఆదాయము వచ్చుటలేదు.

ఇండియన్ మెడికల్‌సర్వీస్ డైక్టరు జనరలుగారైన సర్.జె. డబ్లియు.డి. మేగాగారు ఇటీవల చేసిన పరిశోధనల వలన నీక్రిందిసంగతులు బయల్పడినవి:—

(1) భారత దేశప్రజలలో నూటికి 39 మందికి మాత్రమే కడుపునిండకూడుకలదు. 41 మంది అర్ధాకలితో జీవించుచు న్నారు. 20 మంది పూర్తిగా మాడుచున్నారు.

(2) మనప్రజల సగటు ఆయుర్దాయము నిజముగా నుండవలసిన దానిలో సగముగానున్నది.

(3) కఱవులును అట్టిక్షామస్థితియు ప దేండ్లలో నైదూళ్లలో నొక యూరికి తటస్థించుచునే యున్నది.

(4) మరణసంఖ్య ఇంత హెచ్చుగానున్నను జననసంఖ్య హెచ్చుచునే యున్నది.

భారత దేశములో వేయిమందికి 24.5 మరణించు చున్నారు. కెనడాలో వేయింటికి 10.7 మంది మాత్రమే మరణించుచున్నారు.

మన దేశములోని ప్రజల దామాషా ఆయుర్దాయము 26.7. ఇంగ్లాండులోని జనుల దామాషా ఆయుర్దాయము 57.6.

ప్రపంచములోని నాగరకతగల దేశములం దన్నిటిలోను నూటికి 80 మంది చదువను వ్రాయను నేర్చియుండగా మన దేశములో నూటికి 8 మంది మాత్రమే అక్షరాస్యులు.

చాలా స్వల్పపు ఆదాయము నొసగగల వ్యవసాయము పశువుల మేత మొదలగు పనులందు కష్టించు వ్యవసాయదారులు మన దేశ జనసంఖ్యలో నూటికి 67 మంది. ఇంగ్లాండులో నిట్టివారు నూటికి 7 మంది మాత్రమే. చాలా ఎక్కువ ఆదాయము నివ్వగల పరిశ్రమలు, వ్యాపారము, రవాణా మొదలగు లాభసాటి వృత్తులవారు మన దేశములో నూటికి 17 మంది ఇంగ్లాండులో 68 మంది. వ్యవసాయమువలననే మన దేశములో సంపాదించు ఫలితము తల 1 కి రూ 59 లు; కెనడాలో నది తల 1 కి 213.

పరిశ్రమలవలన ప్రజలు సంపాదించు ఫలితము తల 1 కి 12 రూపాయీలు. అని అమెరికా సంయుక్తరాష్ట్రములలో 721 రూపాయిలు.

1932-33 లో మన దేశములో జరిగిన వ్యాపారము విలువ తల 1 కి 8 రూపాయలకన్న తక్కువ. ఆ సాలుననే ఇంగ్లాండులో వ్యాపారము విలువ తల 1 కి రూ. 324. భారత దేశములో బ్యాంకులలో ఉన్న నిలువసొమ్ము తల 1 కి 604. అమెరికాలో రు. 1123. లు

ఇట్లు జాతీయ అర్థసంపదలో భారతదేశము ఇతర దేశములతో పోల్ప వీలులేనంత అధోగతిలో నుండగా మన ప్రజలు 1212 కోట్లరూపాయిలు ప్రభుత్వ ఋణభారము వహించవలసి యున్నారు. దీనిలో 500 కోట్లు పరాయివారి కివ్వవలెను. వీనిపైన వడ్డీ పెరుగుచున్నది. ఇది గాక వేయి

కోట్ల రూపాయలు మన రైతులు చేసిన ఋణభారము కూడా కలదు. దీనిపైన వడ్డీలిచ్చుకోలేక కుంగిపోవుచున్నారు.

మన ప్రభుత్వాదాయవ్యయవిధానము ఈ దేశస్థితి గతుల కనుగుణముగా లేదు. అత్యధికజీతములుగల ప్రభుత్వయంత్రము; ఆర్థికాభివృద్ధి కలిగింపని పరిపాలనావిధానము; కేవలము పన్నులు వసూలుచేసి సైన్యము ఉద్యోగులను పోషించుట మాత్రమేగాక జనసంఖ్యావృద్ధితోపాటు దేశ ప్రజల విద్య ఆరోగ్యము ఆర్థికక్షేమము అభివృద్ధిచేయుటయు అవసరముగాని అది యీ నిర్భాగ్య భారతదేశమున బ్రిటిషు సామ్రాజ్య ప్రభుత్వమున జరుగుటలేదు.

## ఆరవ పరిచ్ఛేదము:

## నూతన ఇండియా రాజ్యాంగము

### I

### స్వరూప స్వభావములు

1935 సంవత్సరపు నూతన రాజ్యాంగ చట్టమువలన బర్మా విడదీయబడినది. 9 ప్రాతరాష్ట్రములుగాక సింధు ఒరిస్సాలనబడు రెండు క్రొత్తరాష్ట్రములు నిర్మింపబడినవి. ఈ బ్రిటీషు పరగణాలను 600 స్వదేశ సంస్థానములను కలిపి ఒక రాజ్యాంగసమాఖ్య (ఫెడరేషను)గా చేయుటకు క్రొత్త రాజ్యాంగచట్టము ప్రయత్నించుచున్నది. ఈ ఫెడరేషను యొక్క పరిపాలనాధికారము బ్రిటీషురాజు మకుటమునందే నెలకొల్పబడును. రాజుస్థానే భారతదేశ గవర్నరుజనరలు పరి

పాలన జరుపును. ఇత డెప్పటివలెనే ఇంగ్లాండు పార్లిమెంటు ప్రభుత్వము వారి ఇండియా రాజ్యాంగ కార్యదర్శి పెత్తనముక్రింద నుండి పార్లిమెంటుకు బాధ్యతవహించి మన దేశమును సర్వాధికారిగా పరిపాలించును. ఈ గవర్నరుజనరలుకు కొన్ని విషయములందు సలహానిచ్చుటకు సహాయము చేయుటకు ఒక మంత్రిసభ యుండును. కొన్ని షరతులకు లోబడి కొన్ని విషయములందు శాసననిర్మాణము చేయుటకు రెండు శాసనసభలుండును. ఈ శాసనసభలలో సంస్థానాధీశులు గొప్పపలుకుబడి కలిగియుండి గవర్నరు జనరలుయొక్క నిరంకుశ పరిపాలనకే ఎల్లప్పుడు తోడ్పడుచుందురు.

నూతనరాజ్యాంగము భారత దేశము యొక్క ఆర్థికపారతంత్రమును రాజకీయ దాస్యమును బానిసత్వమును చిరస్థాయిగా చేయుటకు ప్రయత్నించుచున్నది. దీనికి కారణము లేకపోలేదు.

"భారత దేశము బ్రిటీషుసామ్రాజ్యము యొక్క కొలికిపూస; ఏభాగము పోయినను మనసామ్రాజ్యమునిల్చును గాని భారత దేశము పోయినచో మన సామ్రాజ్య భానుడస్తమించవలసినదే" అని ఇండియా వైస్రాయిగానుండిన కర్జను ప్రభువు 1893 లో పలికినాడు. ఈ సంగతి బ్రిటిషు దీవుల పరిపాలనలో పలుకుబడిగల ప్రభువర్గము వారందరు నెఱుగుదురు.

బ్రిటీషుసామ్రాజ్యతత్వముయొక్క ప్రధానపురుషులలో నొకడగు బెర్కెంటుహెడ్డుప్రభువు కొన్నాళ్లక్రిందట "మనము భారత

దేశమును కత్తితోనే సంపాదించియున్నాము; దానిని మనము కత్తితోనే నిలుపుకొని తీరుదుము. మన బ్రిటీషునరకులను విడుదల చేసికొనుటకును ముఖ్యముగా లంకాషైరు బట్టలను చలామణి చేసుకొనుటకును ఉపయోగించుకొనుటకే మనము భారతదేశమును మనచేతులలో నుంచుకొన్నాము" అని స్పష్టముగా చెప్పివేసినాడు. నేటి అంతర్జాతీయ వ్యవహారముల ఒత్తిడిలో బ్రిటీషువారు తమ ముప్పు గడువబెట్టుకొనుటకు భారతదేశమును శాశ్వతముగా తమ కాధారముగా నుంచుకొనజూచుచున్నారు.

ఒకవంక ప్రపంచములోని క్లిష్టపరిస్థితులు తీవ్రరూపము దాల్చుచుండుట వలనను ఇంకొకవంక పారతంత్ర్యమును సహింపక పోరాడుచున్న భారతదేశప్రజల తిరస్కారము వర్ధిల్లుచున్నందువను, బ్రిటీషు వారు భయపడి, ఈ దేశములోని బ్రిటీషు పరిపాలనకు పునాదియగు పశుబలమును గట్టి చేసికొన జూచుచున్నారు.

అఖిలభారతకాంగ్రెస్ కమిటీవారు ప్రచురించిన పుస్తకమున డాక్టర్ అహమ్మదు గారిట్లు వ్రాసినారు:

"దేశములోని జనసామాన్యము స్వతంత్రులగుట కిష్టపడక వారిని శాశ్వతముగా అణచియుంచి స్వప్రయోజనము పొందజూచు మొగలాయి జాగీర్దారీ పద్ధతివంటి "ఫ్యూడల్" (Feudal) సంప్రదాయమునకు జెందిన నిరంకుశులగు సంస్థానాధీశులయొక్కయు జమీందారులయొక్కయు సహాయముతో సామ్రాజ్య ప్రభుత్వముయొక్క గట్టిపట్టును శాశ్వతముగా

నుంచుట కీ క్రొత్త రాజ్యాంగము ప్రయత్నించుచున్నది. అందు వల్లనే సంస్థానాధీశులకును జమీందారులకును ఈరాజ్యాంగ ప్రణాళికలో నింతప్రాముఖ్యత యొసగబడి వారికి విశేషహక్కు లివ్వబడినవి. ఈఉద్దేశముతోనే 'ఫెడరేషను' లేక సంయుక్త ప్రభుత్వములో ప్రజాసామాన్యపు ప్రతినిధులకు ప్రతిపక్షు లుగానుండుటకు సంస్థానాధీశులును వారినియామకులును నిలుప బడినారు. మఱియు ముఖ్యమైనరాష్ట్రములలో ప్రజాభిప్రాయ మును తృణీకరించుటకు మామూలు ప్రజాప్రతినిధుల శాసన సభలుగాక జమీందారులకు ధనికులకు ప్రవేశము కలిగించు టకు 'కవున్సిళ్ళు' అను పేరున అదనపు శాసనసభలు నిర్మింప బడి, వానికి ప్రజాప్రతినిధుల"అసెంబ్లి" సభలతో సమానమైన అధికారము లివ్వబడినవి. దేశముయొక్క ఆర్థికాభివృద్ధికి ఆటం కము: కలిగించుటకు మన దేశ ప్రజల సామాన్య స్వాతంత్ర్య ములు (సివిలు లిబర్టీస్) తీసివేయబడుటకు కారణమైనట్టియు బ్రిటీషు సామ్రాజ్యతత్వము వా రింతవరకు అవలంబించియున్న స్వాతంత్ర్య నిరోధక విధానముయొక్క సహజపరిణామమే యీ క్రొత్తరాజ్యాంగము.

బ్రిటీషువారి స్వప్రయోజనార్థము భారత దేశ ఆర్థి కాభివృద్ధి అరికట్టియుంచబడినది. బ్రిటీషు వస్తువులు చెల్లు బడిచేసికొనుటకును బ్రిటీషువారు మూలధనమును పెట్టుబళ్ళను పెట్టి వడ్డీని లాభమును ఆర్జించుకొరకును వారి పరిశ్రమలకు ముడివస్తువులు సరఫరా చేయుకొరకును భారత దేశము నుప యోగించుకొనుచున్నారు. గ్రామకుటీర పరిశ్రమలు చేతి

పనులు నాశనము చేయబడగా, యంత్రపరిశ్రమ లభివృద్ధి చేయబడకపోగా దేశప్రజలలో నూటికి 70 వంతులమంది జీవనార్థము చేయునదిలేక వ్యవసాయమునే నమ్ముకొనవలసి వచ్చినది. అందరును భూములపై కెగబడుటవలన ఈ పోటీలో వ్యవసాయముచేయు రైతులకు లాభము లేకపోవుచున్నది. దేశములో రైతులయొక్క ఘోరదారిద్ర్యము ఋణగ్రస్తతయు, భూస్వామిత్వములోని విపరీతపు పద్ధతులును, సాక్షాత్తుగా భూమిని దున్ని కాయకష్టము చేయు కృషీవలురును చిన్న రైతులును, పెద్దజమీందారులయొక్కయు భూస్వాములయొక్కయు అప్పులిచ్చు షావుకారులయొక్కయు చేతులలో పడియుండుటకు కారణములైనవి. దేశమునలక్షలకొలది జనులు శాశ్వతక్షుద్బాధతో బాధపడుచున్నారు. దేశములో మూడున్నరకోట్లకర్షకులకు భూములులేవు. అంతకన్న హెచ్చుమంది షావుకారుల చేతులలో శాశ్వత దాస్యము ననుభవించుచున్నారు. పట్టణవాసుల స్థితియు నింతకన్న బాగుగాలేదు. పట్టణములలోని బీదజనులు కేవలము నిరాధారులుగా నున్నారు. మన దేశములో కాయకష్టముచేయు కూలీజనమునకు వచ్చు కూలికన్న తక్కువకూలి, ప్రపంచములో నెక్కడను లేదు. మధ్యతరగతిజనులు నిర్వ్యాపారులుగా నున్నారు. వారికిగల జీవనాధారము సౌఖ్యము నానాటికి క్షీణించుచున్నవి. "ఎంత హెచ్చు అంచనా వేసిచూచినను కూడ 1929లో ఇండియాలో తల1కిసాలుకు సగటు అదాయము 8పౌనులుకన్న తక్కువగానున్నది. ఇంగ్లాండు దీవులలో ఆసాలుననే, సగటు ఆదాయము తల 1కి 95 పౌనులు. ఉభయ

దేశప్రజల జీవనావసరములోని తారతమ్యము చూచినను కూడా ఇది ఘోరముగానున్నది.* అని సైమనుకమిషనువారుకూడా వ్రాసియున్నారు. బ్రిటీషు సామ్రాజ్యతత్వము భారతీయులను నిరాధారులుగను దరిద్రులుగను మాత్రమేగాక నిరక్షరులుగను అజ్ఞానులుగనుకూడ చేసివైచినది. దేశములోని 35 కోట్ల 30 లక్షలప్రజలలో 32 కోట్ల ప్రజలకు చదువను వ్రాయను రాదు. జబ్బులవలన అంటు జాడ్యములవలన నివారింపవీలుగల రోగములవలన ప్రతిసాలున లక్షలకొలది మరణించుచున్నారు. ఈ దేశములోని శిశుమరణములు బాలెంతమరణములు ప్రపంచములోని అన్ని దేశములకన్నను అధికము.

బ్రిటీషువారు తమ సామ్రాజ్య విధానమును చిరస్థాయిగా నడుపుటకొరకు మనదేశములో మొదటినుండి ప్రజలయభిప్రాయమును లెక్కజేయక నిరంకుశముగా అధికారము చలాయించు ఉద్యోగవర్గముగల రాజకీయవ్యవస్థ నెలకొల్పినారు. గవర్నరుజనరలును, గవర్నరులును శాసనసభల తీర్మానములను త్రోసివేసి వ్యవహరించుటకు వీలుగా వారికి అమితములగు అధికారము లివ్వబడినవి. వారే శాసనమునైనను ప్రత్యాఖ్య(వీటో)-చేయవచ్చును. బ్రిటీషువారిప్రాబల్యమున కనుగుణముగా దేశాదాయ వ్యవహారములను నడుపవచ్చును. దేశాక్రమణ సైన్యమునకగు అత్యధికవ్యయమునకుగావలసిన సొమ్ముకొరకు దారిద్ర్యమున మునిగియున్న ప్రజలపైన అత్యధికమగు పన్నులభారము విధింపబడియున్నది. శాంతిభద్రతలను కాపాడుటకొరకు, అధిక వ్యయకారణమైన

పరిపాలన శాఖలను పోషించుటకొరకు విద్య మొదలగు జాతీయాభివృద్ధి కరములగు శాఖలు సొమ్ములేక మాడ్చియుంచబడుచున్నవి. దేశముయొక్క మొత్తము రివిన్యూ ఆదాయములో నూటికి 25 వంతులు సైన్యములకొరకు ఖర్చుచేయబడుచున్నది. దానితో సమాన మొత్తమే శాంతి భద్రితలకొరకని వినియోగము చేయబడుచున్నది. మొత్తము రెవిన్యూలో నూటికి 6 వంతులు మాత్రమే విద్యకొరకును 2 వంతులు మాత్రమే వైద్యము కొరకును ఖర్చు పెట్టబడుచున్నవి.

ప్రాత రాజ్యాంగములో ప్రచ్ఛన్నముగాను గోప్యముగాను నుంచబడిన ఉద్దేశములు క్రొత్త రాజ్యాంగమున ప్రత్యక్షముగా నుదాహరించబడినందున ఈ క్రొత్తరాజ్యాంగము 1919 సంవత్సరము నాటికి ప్రాత రాజ్యంగముకన్నను కఠినతరముగా నున్నదని చెప్పవచ్చును. ముఖ్యముగా వైస్రాయికిని గవర్నరులకును ఇకముందు "ప్రత్యేక బాధ్యతలు" అను పేరున అపరిమితములైన అధికారము లొసగబడినవి. శాసనములను ప్రత్యాఖ్య చేయుటకు వారికిగల 'వీటో' అధికారమునకు తోడు వారు శాసనసభలతో నిమిత్తములేకుండా స్వయముగాకూడా చట్టములు శాసింపగలుగుదురు. ఇట్టి అధికారము 1919 రాజ్యాంగములో వీరికి లేదు. ప్రాత రాజ్యాంగముక్రింద దేశ ద్రవ్య (ఫైనాన్సు) విషయములందు శాసనసభల అధికారముపైనగలహద్దులు అట్లే యుంచుటయెగాక, ఇకముందు ఏశాసన సభయుగూడ భారత దేశ వర్తక పరిశ్రమలకు సహాయముగాని ప్రోత్సాహముగాని చేయుటకు వీలులేకుండా నూతన రాజ్యాం

గమములో అనేక క్రొత్త నిరోధములు కల్పింపబడినవి. ఈదేశ ములో వర్తకముచేయు బ్రిటీషువారి విషయమున పెట్టుబళ్ళు పెట్టిన బ్రిటీషువారి విషయమున శాసనసభలు విచక్షణాయుత శాసనములు చేయకుండు నెపమున వారి కనేక ప్రత్యేక విశేషహక్కులు కలిగించబడినవి. దేశమునకు ఆర్థికముగా అనుపయోగమైన సైనిక వ్యయమును సివిలు పరిపాలన వ్యయ మును ఆవంతయైన తగ్గించుటకు క్రొత్తరాజ్యాంగమునుబట్టి వీలులేదు. జాతీయాభివృద్ధికరములగు శాఖలను వృద్ధిచేయు మార్గముల కిది దారిచూపుటలేదు. వీనియన్నిటికినితోడు సంస్థానాధీశులయొక్కయు పెద్దజమీందారీ భూస్వాములయొ క్కయు అధికారములను పలుకుబడిని గట్టిచేసి భారతదేశ రాజకీయములందు వారి కొక ప్రధానస్థానము నిచ్చుచున్నది.

ఇట్లు ఈక్రొత్తరాజ్యాంగము నేప్రక్కనుండి పరికించి నను గూడ అది భారతదేశ ప్రజలపైన నింగ్లీషు సామ్రాజ్య తత్వము తీసిన దెబ్బగానే కనబడుచున్నది. భారతదేశమును తన గుప్పిటిలో పెట్టుకొనిన బ్రిటీషు సామ్రాజ్యతత్వము యొక్క ఇనుప పిడికిలి నింకను బిగువుగాచేసి దేశమును బంధిం చుటకు క్రొత్తశృంఖలములను నిర్మించుచున్నది.

## II

## ఫెడరల్ రాజ్యతంత్రము

నూతన రాజ్యాంగ చట్టమునుబట్టి కొంతవరకైన బాధ్యతాయుత ప్రజాప్రభుత్వ పద్ధతులుగల బ్రిటీషు పరగణా

లును అసలే ప్రజాప్రభుత్వపద్ధతులులేని స్వదేశసంస్థానములును గలిసి ఒక ఫెడరలు రాజ్యాంగముగా చేయబడుచున్నవి. దీనివలన క్రొత్తరాజ్యాంగమునందలి కేంద్రశాసన సభల లోని ప్రజాప్రతినిధుల పలుకుబడికి భంగము వాటిల్లి తీరునను టకు సందియము లేదు. ఏలనన సామ్రాజ్యప్రభుత్వము వారికిని సంస్థానాధీశులకును సంధిసమయములు జరిగియున్నందున సంస్థా నములవారు శాసనసభలందు ప్రతి విషయమునను సామ్రాజ్య ప్రభుత్వమువారి పక్షమునే యవలంబించి తీరుదురు. పూర్వము నుండియు నున్న "నామినేటెడ్ మెంబర్లు"నబడు నియామక శాసనసభ్యులవలెనే ప్రజాప్రతినిధులకును, ప్రభుత్వ కార్య నిర్వాహక శాఖలకును, అభిప్రాయభేదము కలిగినప్పుడు సం స్థాన ప్రతినిధులు కార్యనిర్వాహక వర్గమునకు తోడ్పడి శాసనసభలలోని ప్రజా ప్రతినిధుల యభిప్రాయములను, తీర్మానములను, మన్నింపవలసిన యగత్యము లేకుండగ జేయ గలరు. బ్రిటీషు పరగణాలతోపాటు సంస్థానములును రాజ్యాంగ ధర్మబద్ధములై, ప్రజాహితైక ప్రభుత్వములై, కేంద్రశాసన సభలందలి ప్రజాప్రతినిధులకు కార్యనిర్వాహక వర్గమువారు అన్ని విషయములలోను బాధ్యత వహించిననే ఫెడరలు విధానము భారతీయులకు లాభకారి యగును గాని లేనిచో, జతకుదురని యెద్దుల వ్యవసాయమువలె నిదియు నుండును. ఫెడరలు రాజ్యాంగ విధానమున అన్ని సంస్థానములు కలిసిన సమ్మేళన మొకభాగముగను, బ్రిటీషు పరగణా లొకభాగము గను రాజ్యాంగ సమాఖ్యగా చేయబడినచో కొంతవరకునైన

పైనచెప్పబడిన చిక్కులు తొలగవచ్చును. గాని 600 స్వదేశ సంస్థానములలో ఎన్ని సంస్థానములు తమ ప్రజల మేలును తలచి, పరిపాలించగలవో చెప్పుట కష్టము. అప్పుడుకూడ తగవులు రాకమానవు. ఇండియా చట్టమునుబట్టి లెక్కలేనన్ని విశేషాధికారములు గవర్నరు జనరలున కొసగబడినవి. దేశ రక్షణపైన, దానికి సంబంధించిన ఆదాయవ్యయములపైన ఖజానాయొక్క తాళపు జెవులపైన, దేశముయొక్క అభివృద్ధికి గావలసిన సర్వ విషయములపైన, శాసనసభలకు మంత్రులకు ఆవశ్యకములగు అధికారములు లేకుండచేయుటయే గాక గవర్నరు జనరలును సర్వాంతర్యామిగ జేసిరి. నిరంకుశ పరి పాలకుడు తలచుకొన్నచో పరిపాలనమునందు శాంతిభద్రత లకు సంబంధించని విషయమేది? ఆర్థిక పరపతికి సంబంధించని శాసనమేది? ఆదాయవ్యయ ప్రణాళికయందు శాసన సభ్యు లేర్పరచిన పన్నులపద్ధతిని వ్యయ విధానమును గవర్నరు జనర లీ కారణమున విఫలము చేయవచ్చును. శాసనసభ యిష్టప డక పోయిన నేదో యొక సంస్థానమునగాని పరగణాలోగాని శాంతి భద్రతలకని అత్యధికధనము సేకరింపవచ్చును. నిజ ముగ నేడు భారతీయులు స్వరాజ్యమేల కోరుచున్నారో ఆయా ఆర్థిక సాంఘిక సంస్కరణములెల్ల పై కారణమువలననే గగన కుసుమములైపోవును.

నేడు ప్రభుత్వాదాయములో సగము మ్రింగివేయు చున్న సైనిక వ్యవస్థ, దేశరక్షణకు సంబంధించిన విషయము, గవర్నరు జనరలు వశముననుండు గోపురపుపెట్టె. దానికి సం

బంధించిన కోశముయొక్క ఆదాయ వ్యయవిధానమును శాసన సభ చేతులలో నుండదు. అట్లయిన సైనికవ్యయము తగ్గు టెట్లు? సైనికవ్యయము తగ్గనిచో తక్కిన ప్రజాక్షేమకర సౌకర్యములకు పైకమెక్కడిది? ఇట్టితరి తక్కిన శాఖలుప్రజల వశమైన లాభమేమి? భరతఖండముయొక్క ఆర్థిక పరపతిని గూర్చిన ప్రత్యేక బాధ్యతల నిర్వాహణమునకు వలసిన మినహా యింపులు రక్షణలునను పేరున భారతీయ శాసనసభల ఆర్థిక స్వాతంత్ర్యమును నిష్ప్రయోజనముగ జేసినచో, ప్రజల క్షేమ మున కావశ్యకములుగాని, వ్యయములను తగ్గించి వారి క్షేమ మున కావశ్యకమగు కార్యములకు హెచ్చుసొమ్ము వ్యయము చేయుటకు శాసనసభలకు శక్తి యెట్లు గలుగును? అట్టిశక్తి లేనిచో క్రొత్త ప్రభుత్వమువలన ప్రజలకేమి లాభము కలు గును? కోశాగారముయొక్క తాళపుజెవులు చేత నిడికొన్న నిరంకుశ ప్రభుత్వము నాశయించు పద్ధతులును అందువలని యరిష్టములును పోవునా? ఇట్లే కోశముయొక్క ముఖ్యాదాయ వ్యయములపైన నధికారములేని ఆర్థికశాఖ మంత్రియు దేశ రక్షణ వ్యవస్థపైన నావంతయు అధికారములేని స్వదేశ వ్యవ హారముల మంత్రియు, పేరునకు మంత్రులై యుందురుగాని నిజమైన అధికారములు వీరికుండవు. బాధ్యతాయుత ప్రజా ప్రభుత్వమునుబట్టి ప్రజా ప్రతినిధుల శాసనసభలకును, వారికి బాధ్యత వహించి పాలింపవలసిన మంత్రి మండలికిని ఉండ వలసిన శాసన నిర్మాణాధికారములందును పరిపాలనాధికారము లందును ముఖ్యమైన అధికారములెల్ల మినహాయింపు చేయబడి,

ఆయధికారములెల్ల రాజ్యాంగ చట్టమునందు బ్రిటీషు రాజ ప్రతినిధియగు గవర్నరుజనరలుకే యొసగబడి అతడు కేవలము సర్వాధికారిగా చేయబడినాడు. ఈ గవర్నరు జనరలు తన చర్యలకు భారత దేశీయులకు బాధ్యత వహింపక ఇంగ్లాండులోని బ్రిటిషు పార్లమెంటుయొక్క మంత్రియగు ఇండియా రాజ్యాంగ కార్యదర్శికే బాధ్యతవహించి బ్రిటీషు సామ్రాజ్యముయొక్క లాభము నిమిత్తము అతడు జారీచేయు శాఖదుల కనుగుణముగా ప్రవర్తించును. భారత దేశపు పరిపాలనలో పనిచేయు ఐ. సి. యస్. ఉద్యోగులు వారి యజమానులగు మంత్రులకన్న హెచ్చు పలుకుబడియు అధికారములు గలిగి యుందురు. వారు ఈ మంత్రులమాట వినకపోయినను అడుగువారు లేరు.

ఇట్లు అధికారవిహీనమై నామ మాత్రావశిష్టముగ నుండు మంత్రులు తాను చలాయించు స్వల్పపు అధికారములందైనను శాసనసభలందలి ప్రజాప్రతినిధులకు బాధ్యులై వారి యిష్టానుసారముగ ప్రవర్తింతురాయన్నచో, సర్వాధికారియైన గవర్నరు జనరలు కన్నుసన్నల మెలగినంతకాలము మంత్రిమండలి ప్రజాప్రతినిధులతో నిమిత్తములేకుండా వర్తించుటకే రాజ్యాంగము అవకాశము కల్పించుచున్నది.

శాసనసభలయందు జనసామాన్యముయొక్క ప్రతినిధులకన్న సంస్థానాధీశులయొక్కయు, ధనవంతులయొక్కయు ప్రతినిధులకు హెచ్చు పలుకుబడి యుండులాగున శాసనసభలు నిర్మింపబడినవి. ఈ సంస్థానాధీశులు, సీధనవంతులు గవ

ర్నరు జనరలుకు దాసానదాసులై యుండి అతని చెప్పుచేతల లోని మంత్రులకే అండమైయుండి అతని కెదురుదిరిగి ప్రజల యిష్టానుసారముగా వర్తించు మంత్రులను ప్రతిఘటింతురు.

ఈవిపరీతపు బాధ్యతాయుత ప్రజాప్రభుత్వమునందు ప్రజాప్రతినిధులకు, ప్రజలకు నిజమైన అధికారములుగాని పలుకుబడిగాని లేనందున నీరాజ్యాంగము దేశప్రజలు గాని ద్రవ్యమునుండి వెలువడి లాభము పొందుట కెట్టి యవకాశ మును కలిగింపకుండుటయేగాక దేశదాస్యబంధనములను మరింత గట్టిజేసి బ్రిటీషువారి లాభముకొరకే పాలింపబడు పద్ధతులను శాశ్వతముగా నిలిపి యుంచుచున్నది.

"నూతన యిండియా రాజ్యాంగచట్టము స్థాపింపజూచు ఫెడరేషనులో చేర్చబడనున్న బ్రిటీషు పరగణాలును స్వదేశ సంస్థానములును రాజ్యాంగస్వభావమునుబట్టి పరస్పరవిరుద్ధమైన రాజ్యభాగములు. బ్రిటిషు పరగణాలలోని ప్రజాప్రభుత్వ పద్ధతులందు బ్రిటిషు సామ్రాజ్యమునకు వ్యతిరేకములుగా పరిణమింపగల శక్తులను కొంతవరకైన సంస్థానములు ప్రతిఘ టించి ఆటంకములుల: గలిగించగలవను ఆశతోనే ఈఫెడరే షను నిర్మించుటకు బ్రిటిషువారిష్టపడియున్నారు. ఈఫెడరే షను నిర్మాణములో తమ అంతర్జాతీయ ప్రభుత్వ వ్యవహారము లందు కొంతవరకైన స్వేచ్ఛను స్వాతంత్ర్యమును సంపాదించు టకు సంస్థానాధీశులు ప్రయత్నించి తీరుదురు. బ్రిటిషు సార్వ భౌమత్వముక్రింద సామంత రాజ్యములుగా నుండుట యనగా తమ సంస్థానములో తమ పరిపాలనకు ఎదురు తిరుగువారినెల్ల

రను అణచివైచుటకు బ్రిటిషు సామ్రాజ్యము తమకు తోడ్ప డునను ధైర్యముతో నిరంకుశముగా దుష్పరిపాలనచేయుటయే యని ఈ సంస్థానాధీశుల యూహ.

భారత దేశ కేంద్రప్రభుత్వమునకు పరిపూర్ణమైన బాధ్య తాయుత ప్రజాపరిపాలనమును ప్రసాదింపక తప్పించుకొనుట కొరకే ఈ ఫెడరలురాజ్యాంగ ప్రణాళిక నిర్మింపబడినదని ఒప్పు కొనక తప్పదు. దేశరక్షణ, సైనిక వ్యవహారములు భారత దేశ ఫెడరలు రాజ్యాంగమునకు వశము చేయకపోవుట చారిత్రిక ముగా నెంతసమంజసముగా కనబడుచున్నను ఇట్లు మినహా యించుట వలన బాధ్యతాయుత ప్రజాపాలన మనునది ఎంత సారహీనమైనదిగా నున్నదో వేరే చెప్పనక్కరలేదు.

తమ సంస్థానములతో నెట్టి సంబంధమును లేక కేవలము బ్రిటీషు పరగణాలకే సంబంధించిన వ్యవహారముల చర్చలందు ఈ సంస్థానాధీశుల ప్రతినిధులు పాల్గొనుటను బ్రిటిషు పర గణాల ప్రతినిధు లెంతమాత్రము హర్షింపజాలరనుట నిశ్చ యము. ఈ సంస్థానాధీశుల ప్రతినిధు లట్లు పాల్గొనక పోయి నచో వీరిని కలుపుకొనగా మెజారిటీ పక్షముకలిగియుండు ప్రభుత్వవర్గము వీరులేనిచో మైనారిటీ పక్ష ప్రభుత్వమై పరిణ మించు విపరీతపు దృశ్యము తటస్థింపవచ్చును.

ఇట్టి విరుద్ధపు పద్ధతులపైన నిర్మింపబడిన ఫెడరేషన్ ఎంతవరకు చక్కగా నడచుననునది ఊహించుట సులభమైనపని కాదు. ఇది చక్కగా నడచినచో అది బహుశా బ్రిటిషు పర గణాలలోను సంస్థానములలోను అభివృద్ధికి వ్యతిరేకములగు

పక్షములవారి మద్దతుతో ప్రభుత్వమునందు సర్వాధికారిగా నుండు గవర్నరు జనరలు తన విశేషాధికారములను చలాయించి బందోబస్తు చేయుటవలన మామూలు బాధ్యతాయుత పరిపాలనమనునది అదృశ్యమగుటవలననే కావచ్చును.

బాధ్యతాయుత ప్రజాపరిపాలనకు ముఖ్యమైన ఆవశ్యకతలలో బలమైన రాజకీయపక్షముండుట యొకటి. ఒక్క కాంగ్రెసుతప్ప భారత దేశమందట్టి రాజకీయపక్షములేదు. ఈ కాంగ్రెసు ఈ రాజ్యాంగప్రణాళికను నడపుటకిష్టపడుటలేదు. తమలోని అధిక సంఖ్యాకపక్షీయుల పరిపాలనను హర్షించు జాతీయైక్యతగల ప్రజకూడ బాధ్యతాయుత ప్రజాపరిపాలన కత్యంతావశ్యకము జాతి మతభేదములు, కులకక్షలు నున్నప్పుడట్టి అధికసంఖ్యాకపక్ష ప్రభుత్వము (మెజారిటీ పరిపాలన) చాలా కష్టసాధ్యము. లేదా దుస్తరము కాక తప్పదు. అల్పసంఖ్యాకులను సంరక్షించుటకు చేయబడు రక్షణలు బాధ్యతాయుత ప్రజాప్రభుత్వమునకు పూర్తిగా భంగము కలిగింపకపోయినను చాలవరకు దానిలాభములను తగ్గించితీరును. రాష్ట్రీయ గవర్నరులు తమ ప్రత్యేక బాధ్యతలను, విశేషాధికారములను చలాయించినచో బాధ్యతాయుత ప్రజాపరిపాలనము వర్ధిల్లనే వర్ధిల్లదు. వారట్లు చలాయింపనిచో తమ వోటు హక్కును చక్కగా ఉపయోగించుకొనుటకు వలసినంత రాజకీయాభివృద్ధిని గాంచని జనసమూహములకు లేదా, పలుకుబడిని సంపాదించి లాభమును పొందలేని బీద ప్రజాసమూహములకును చాల అన్యాయముకలుగవచ్చును. అందువలన నిజమైన

బాధ్యతాయుత పరిపాలనమునే ఒసగియుండినగాని లేదా అట్టిది ఒసగుటకు వీలులేదని స్పష్టముగా చెప్పివైచియుండిన గాని చాలబాగుండి యుండును. ప్రత్యేక బాధ్యతలు విశేషాధికారములు గవర్నరు స్వబుద్ధి నుపయోగింపవలసిన రాజ్య వ్యవహారములుగల ఈ సంకరజాతి బాధ్యతాయుత ప్రజాపరిపాలనమును నెలకొల్పుటవలన భారతదేశమునందు కృతజ్ఞతగాని సహకారముగాని లేకపోవుటలో నాశ్చర్యము లేదు.* అని సుప్రసిద్ధ రాజ్యనీతిశాస్త్రజ్ఞుడగు బెరీడేల్ కిత్ పండితుడు తనఇండియా రాజ్యాంగచరిత్రలో వ్రాసియున్నారు.

## III

### బాధ్యతాయుత స్వపరిపాలనము

నూతన ఇండియా రాజ్యాంగచట్టము భారతదేశమునకు బాధ్యతాయుత స్వపరిపాలనము నొసగుచున్నదని కొంతమంది బ్రిటీషువారు వాదించుచుందురు. ఇదినిజమేనా? యనుసంగతి తెలిసికొనవలెనన్నచో బాధ్యతాయుత స్వపరిపాలన మనగా నేమో దానియందలి లక్షణములీ చట్టము నిర్మించిన కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వములం దున్నవాయనియు పరిశీలింపవలెను.

బ్రిటిషు సామ్రాజ్యములోని అధినివేశ రాజ్యములగు కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా రాజ్యములందున, ఇంకను మరికొన్ని రాజ్య భాగములందును బాధ్యతాయుత స్వపరిపాలనము అనబడు ప్రజాప్రభుత్వపద్ధతి అములులోనున్నది. ఆదేశముల పరిపాలనకొరకు బ్రిటీషు పార్లమెంటువారు చేసిన

రాజ్యాంగచట్టములను బట్టి ఆదేశములయొక్క ప్రభుత్వాధికారము ఇంగ్లాండు దేశరాజగు బ్రిటిషు చక్రవర్తియందే నెలకొల్పబడి, ఆయనప్రతినిధి యగుగవర్నరుజనరలు లేక గవర్నరువలన, ప్రజాప్రతినిధులగు మంత్రుల సలహాసహాయములతో చలాయింపబడునట్లు శాసింపబడినది. ఆగవర్నరు జనరలు లేక గవర్నరులు అన్ని ప్రభుత్వవ్యవహారములందును మంత్రులయొక్క సలహాసహాయములతోనే పరిపాలన చేయుదురు. ఇంగ్లాండు దేశ ప్రజాప్రభుత్వ పద్ధతులను బట్టి ఈ మంత్రిమండలివారు ప్రజలెన్నుకొనిన ప్రతినిధులుగల శాసనసభలోని అధికసంఖ్యాకుల పక్షమునకుజెంది, తమచర్యలకెల్ల ఆశాసనసభకే బాధ్యులైయుండి శాసనసభవారి విశ్వాసమునకు పాత్రులై యున్నంతకాలమే పరిపాలన చేయుదురు. దేశమునకు కావలసిన శాసనములన్నిటిని శాసనసభలే శాసించును. రాజ్యాంగధర్మమును బట్టి దేశపరిపాలనమంతయు చక్రవర్తి పేరునను అతని ప్రతినిధియగు గవర్నరు జనరలు లేక గవర్నరు పేరునను జరుగుచున్నను, సాక్షాత్తుగా ప్రభుత్వము వహించి కార్యనిర్వాహణము చేయువారు శాసన సభలకు బాధ్యులగు మంత్రులే. ఇంగ్లాండులోని రాజువలెనే ఈగవర్నరుజనరలును, గవర్నరులును, ఈ మంత్రుల సలహాను ఎన్నడు త్రోసిపుచ్చరు. వీరికార్యనిర్వాహణమునకు ఎన్నడును అడ్డుతగులరు. తామే వ్యవహారమును స్వాయముగాచేయరు. శాసనసభల యధికారమునకు ఆటంకము కలిగింపరు. పరిపాలనయెల్ల ప్రజాప్రతినిధుల యిష్టానుసారముగానే జరుగును.

ఇదియే ప్రజాప్రభుత్వపద్ధతి; బాధ్యతాయుత స్వపరిపాలనము యొక్క రాజ్యాంగమర్యాద.

నూతన ఇండియా రాజ్యాంగ చట్టము భారత దేశమునకు నిర్మించిన "ఫెడరల్" పరిపాలనా విధానమునందును రాష్ట్రము లందు స్థాపించిన రాష్ట్రీయస్వపరిపాలనా విధానములందును కెనడా మొదలగు అధినివేశ రాజ్యాంగములందలి ప్రజా ప్రభుత్వ పద్ధతులుగాని, రాజ్యాంగమర్యాదలుగాని కానరావు సరికదా ఈ రాజ్యాంగచట్టములోని కొన్ని పద్ధతులును, నిబంధ నలును ప్రజాప్రభుత్వపద్ధతులకు సిద్ధాంతములకును గూడ వ్యతిరేకములై గవర్నరుజనరలుయొక్కయు, గవర్నరుల యొక్కయు, నిరంకుశ పరిపాలననే స్థాపింపజూచుచున్నవి. ఇచ్చటి గవర్నరు జనరలును, గవర్నరులును, ఆ రాజ్యములందు వలె ప్రజాప్రతినిధుల యిష్టానుసారముగా అన్నివిషయము లందును శాసనసభలకు బాధ్యులగు మంత్రుల సలహా సహా యములతో పరిపాలింపవలసిన పనిలేదు. దేశరక్షణ అనగా సైనికవ్యవహారములు, విదేశవ్యవహారములు, గవర్నరు జనరలు స్వయముగా పరిపాలించువిషయములు. మిగిలిన ప్రభుత్వ వ్యవహారములలో అనేకములు గవర్నరు జనరలును, గవర్న రులును తమ స్వతంత్ర వివేచనను, స్వబుద్ధిని ఉపయోగించి స్వయముగా పరిపాలింపవలసినవిగా శాసింపబడి అందుకు కావలసిన విశేషాధికారములు వారికివ్వబడినవి. గవర్నరు జనరలును, గవర్నరులును తమ స్వతంత్రవివేచన నుపయో గింపవలసిన విషయములందు వారు మంత్రులతో ఆలోచింప

వలసిన పని యేలేదు. స్వబుద్ధినుపయోగించి వ్యవహరించ వలసిన విషయములందు వారు మంత్రులతో ఆలోచింతురు గాని మంత్రులసలహాప్రకారము పరిపాలింపవలెనను నియమము లేదు. అందువలన నీమంత్రులు అధినివేశ రాజ్యములందు వలె ప్రభుత్వమువహించి కార్యనిర్వహణముచేయు పరిపాలక వర్గముగా నుండరు.

ప్రజాప్రభుత్వ పద్ధతులననుసరించి మంత్రుల కుండ వలసిన పరిపాలనాధికారములు గవర్నరు జనరలు గవర్నరుల కునివ్వబడినట్లే శాసనసభల కుండవలసిన శాసననిర్మాణాధికారమునుగూడ గవర్నరు జనరలుకు గవర్నరులకు నివ్వబడినవి. రాజ్యాంగచట్టమునుబట్టి ఈశాసనసభలు కేంద్రమున గవర్నరు జనరలుయొక్కయు, రాష్ట్రములందు గవర్నరులయొక్కయు అనుజ్ఞను పొందనిది కొన్నివిషయములను గూర్చి శాసనములు చేయుటకు వీలులేదు. కొన్ని విషయములను గూర్చి శాసనములను చేయుటకసలే వీలులేదు. శాసనసభలు చేయగల చట్టములైనను గవర్నరు జనరలుయొక్క లేదా గవర్నరులయొక్క అంగీకారములేనిది అమలులోనికిరావు. గవర్నరు జనరలును గవర్నరులును తమకవసరమని తోచిన శాసనములను స్వయముగా చేయవచ్చును. వీరివిశేషాధికారములకు సంబంధించిన ఆదాయవ్యయములను గూర్చి కూడా శాసనసభలకు అధికారము లేదు.

దేశముయొక్క శాంతిభద్రతలు, ఆర్థికక్షేమము, అల్పసంఖ్యాకజనసంఘముల హక్కులు, ప్రభుత్వోద్యోగుల

హక్కులు, బ్రిటీషుసరకుల దిగుమతి, బ్రిటీషు వర్తకుల,వృత్తివంతులహక్కులు,సంస్థానములహక్కులు,గవర్నరుజనరలుక్రింద నుండు శాఖల అమలు వ్యవహారములును, గవర్నరుజనరలుకు ప్రత్యేకబాధ్యతగల అధికారమండలములుగా సృజియింపబడి అందుకు సంబంధించినంతవరకు అతడు తనస్వబుద్ధినే ఉపయోగించి చర్యతీసికొనవలెనని నిధింపబడి అందుకు గావలసిన విశేషాధికారములతని కొసగబడినవి. ఇక్లేరాష్ట్రములందలి శాంతిభద్రతలు, అల్పసంఖ్యాకజనసంఘములహక్కులు, ప్రభుత్వోద్యోగులహక్కులు, బ్రిటీషువర్తకముయొక్క హక్కులు, సంస్థానములహక్కులు, గవర్నరుజనరలు జారీచేయు ఆజ్ఞలను అమలుజరుపుట, గవర్నరుకు ప్రత్యేకబాధ్యతగల అధికారమండలములుగా చేయబడి ఆవిషయములకు సంబంధించినంతవరకు అతడు స్వబుద్ధినే వినియోగించి చర్యగైకొనవలెనని శాసింపబడి అందుకుగావలసిన విశేషాధికారము లతని కొసగబడినవి. అనగా ఈవిషయములందు వీరు మంత్రుల సలహాను తోసిరాజనవచ్చును. గవర్నరుజనరలుకును గవర్నరులకును ఇవ్వబడిన విశేషాధికారములకు సంబంధించినంతవరకు వీరు ఇంగ్లాండులోని బ్రిటీషుసామ్రాజ్యమంత్రియగు ఇండియాకార్యదర్శికి బాధ్యులై అతని యాజ్ఞలప్రకారము ప్రవర్తింతురు. అందువలన భారతదేశక్షేమముకొరకుగాక బ్రిటీషుసామ్రాజ్యక్షేమలాభములకొరకే వీరు తమ అధికారములను వినియోగింతురనుట నిశ్చయము.

ప్రభుత్వమంతయు ప్రజాప్రతినిధులయిష్టానుసారముగా మంత్రులసలహా సహాయములతో జరుగవలెనను ప్రజాప్రభుత్వ పద్ధతి, రాజ్యాంగచట్టమునుబట్టియే మనకు లేకపోగా చట్టము మినహాయింపగా మన ప్రజాప్రతినిధులకు మిగిలిన ప్రభుత్వాధికారములైనను మంత్రుల సలహాసహాయముల ప్రకారము ప్రజాప్రతినిధుల యిష్టానుసారముగా పరిపాలింపబడునా అనునది పై కారణములనుబట్టి కేవలము రాజ్యాంగకార్యదర్శి యొక్కయు అతనితాబేదారులగు గవర్నరుజనరలు, గవర్నరులయొక్కయు చిత్తములపై నాధారపడియుండును. సామాన్య పరిపాలనమునందు గూడ మంత్రులపరిపాలనయు, శాసనసభల చట్టములును తమప్రత్యేక బాధ్యతలకు భంగము కలిగించుననెపమున మంత్రులను శాసనసభలనుగూడ త్రోసిరాజని స్వబుద్ధి నుపయోగించి విశేషాధికారములను చలాయించి నిరంకుశ పరిపాలన జరుపవచ్చును. అందువలననే సామాన్య పరిపాలనమందైనను ప్రజాప్రభుత్వపద్ధతి పాటింపబడునని అనగా మంత్రులసలహా ప్రకారమే పరిపాలన జరుగుననియు చట్టముప్రకారము మంత్రులు ప్రవర్తించునంతవరకు గవర్నరులు తమవిశేషాధికారములను ప్రయోగించి నిరంకుశముగా ప్రవర్తింపరనియు, ఒక రాజ్యాంగమర్యాద ఏర్పడుట అత్యంతావశ్యకమైనది. ఇట్టి మర్యాద పాటింపబడునని బ్రిటీషు సామ్రాజ్యప్రభుత్వము తరఫున వారిరాజ్యాంగకార్యదర్శియు గవర్నరుజనరలును ప్రకటన చేయువరకును రాష్ట్రములందు కాంగ్రెసువారు మంత్రిత్వాధికారములను స్వీకరింపలేదు.

## IV

## బ్రిటిషు పార్లమెంటుయొక్క సర్వాధికారము

ప్రతిరాజ్యాంగములోను 'ప్రభుత' (Sovereignty) అను సర్వాధికారమే ప్రధానమగు విషయము. అన్ని స్వతంత్ర ప్రజాప్రభుత్వములందు ఈప్రభుత లేక సర్వాధికారము ప్రజలయందే యుండును. ఇది ప్రజలవలన ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధిసంస్థరూపము దాల్చును. ఈ సంస్థవలననే ప్రభుత్వశాఖ లన్నియు తమ యధికార సత్తాలను పొందును.

భారత దేశము బ్రిటీషు దీవుల అధికారమునకు లోబడిన పాలిత రాజ్యము. అందువలన 'ప్రభుత' భారత దేశ ప్రజలయందు గాక బ్రిటీషువారి పార్లమెంటులోనే నెలకొనియున్నది. కాబట్టి మన దేశముయొక్క ప్రభుత్వము ఏ రూపము కలదై యుండవలెనో నిర్ణయించునది బ్రిటీషు పార్లమెంటే * మఱియు బ్రిటీషు పార్లమెంటువారే తమ మంత్రియగు ఇండియా రాజ్యాంగ కార్యదర్శి ద్వారా భారత దేశ వ్యవహారములపైన అదుపు ఆజ్ఞలను పైతనిఖీని చెలాయించుచుందురు. భారత దేశ పరిపాలనము యొక్క అన్ని ముఖములందును గూడ జోక్యము కలిగించుకొనుటకు ఇండియా రాజ్యాంగ కార్యదర్శికి అపరిమితములగు సర్వాధికారము లొసగబడియున్నవి.

---

* బ్రిటీషు పార్లమెంటు ఇంగ్లీషు ప్రజాప్రతినిధుల సంస్థగాని మన ప్రతినిధి కాదు. అందువలన వది భారతదేశమును బ్రిటీషు ప్రజల అర్థిక క్షేమము కొరకే ఉపయోగించి తీరును.

భారత దేశ ప్రభుత్వముయొక్క అన్ని ముఖ్యవిషయములందలి పరిపాలనాపద్ధతిని అతడే నిర్ణయించి అతడే నడుపును. భారత దేశములోని బ్రిటీషు సివిలు మిలిటరీ ఉద్యోగవర్గములోని పెద్దపెద్ద ఉద్యోగులను అతడే నియమించును. వారి ఉద్యోగషరతులను గూడ అతడే నిర్ణయించును. భారత దేశముయొక్క ముఖ్య పరిపాలనాధికారి (Executive) యగు గవర్నరుజనరలు అన్ని విషయములందును ఇండియా కార్యదర్శికే బాధ్యత వహించును. బ్రిటీషు పార్లమెంటుయొక్క ప్రభుతను సర్వాధికారము నీక్రొత్త రాజ్యాంగ మావంతయైన కదల్పలేదు. రాజ్యాంగచట్టముయొక్క 2 వ సెక్షను భారత దేశమునకు సర్వాధికారి బ్రిటీషుపార్లమెంటే యను సంగతిని స్పష్టముగా సూచించుచునే యున్నది. ఈ సంగతిని 110 వ సెక్షను ఇంకను స్పష్టపరచుచున్నది.

ఈ చట్టములోని సంగతులెవ్వియు, (1) బ్రిటీషు ఇండియాకు, అనగా భారత దేశములోని బ్రిటీషుపరగణాలకుగాని అందులోని భాగములకుగాని చట్టములు చేయుటకు బ్రిటీషు పార్లమెంటువారికి గల అధికారమునకు భంగము కలిగించుచున్నట్లు ఎంచబడరాదు.

(2) ఆంగ్లరాజును గూర్చి, రాజకుటుంబమునుగూర్చి, రాజవారసత్వమునుగూర్చి భారత దేశములో ఏభాగమునందుగాని చక్రవర్తి మకుటమునకుగల అధికారమునకు ప్రభుతకు భంగము కలిగించునట్టి లేదా బ్రిటిషు జాతీయతకు సైనిక చట్టమునకు వైమానికదళ చట్టమునకు, నావికాక్రమశిక్షణా

చట్టమునకు పై్రజులా పై్రజుకోర్టులకు భంగకరమగు నట్టియు శాసనములను చేయుటకు ఫెడరలు సంయుక్తరాష్ట్రీయ శాసన సభల కధికారమున్నట్లుగా అన్వయింపబడరాదు.

రాజ్యాంగములో నెట్టి మార్పుచేయుటకును భారతదేశ శాసనసభల కధికారము లేదనుసంగతి 308 వ సెక్షను స్పష్టముగా బయల్పరచుచున్నది. ఎన్నికలలో వోటుచేయు హక్కును హెచ్చుమంది కివ్వవలసినదనిగాని ఎన్నికలపద్ధతిలో కొన్ని మార్పులు కలిగించవలసినదని గాని శాసనసభలయొక్క నిర్మాణమునందు ప్రమాణమునందు కొంతమార్పు కలిగించవలసిన దనిగాని ఈ రాజ్యాంగము స్థాపింపబడిన పదిసంవత్సరములైన తరువాత మనశాసనసభలు శిఫారసుచేయుచు కొన్నితీర్మానములను గావింపవచ్చును. అయితే అట్టి ప్రతిమార్పును బ్రిటీషు పార్లమెంటువారివలన ఆమోదింపబడవలెను.

భారతదేశ వ్యవహారములను నడుపుటకు, పైతనిఖీ చేయుటకు, అదుపులోనుంచుటకు ఇండియా రాజ్యాంగ కార్యదర్శికిగల అధికారముల ద్వారా బ్రిటిషుపార్లమెంటు తన సర్వాధికార ప్రభుతను చలాయించును. భారతదేశ వ్యవహారములకు సంబంధించినంతవరకు ఆంగ్లచక్రవర్తి మకుటమునకుగల అధికారములనెల్ల అమలు జరుపుటకు బాధ్యత వహించు ప్రతినిధి, ఇండియారాజ్యాంగ కార్యదర్శియై యుండును. గవర్నరు జనరలు అతని అదుపు ఆజ్ఞలకిందనే యుండి అతని సూచనలనెల్ల శిరసావహించవలెను. ఇందువలన భారత దేశమునకు బ్రిటీషు దీవులకు గలప్రధానరాజకీయ సంబంధము

నందీ క్రొత్త రాజ్యాంగ మెట్టి మార్పును కలిగించియుండ లేదను సంగతి స్పష్టమగుచున్నది. సామ్రాజ్యతత్వప్రాబల్యము యొక్క పునాదిరాయి ఎప్పటివలెనే స్థిరముగా నుండును. భారతదేశ మెప్పటివలెనే పారతంత్ర్యమున పాలిత రాజ్యముగానుండి విదేశసామ్రాజ్య ప్రభుత్వమువలన పరిపాలింపబడుచు కొల్లగొనబడుచుండును.

## ఏడవ పరిచ్ఛేదము :

## నూతన ఇండియా ఫెడరల్ రాజ్యాంగము

### I

### ఫెడరేషను - అఖిలభారత రాజ్యాంగసమాఖ్య.

నూతనరాజ్యాంగచట్టము బ్రిటీషు పరగణాలును స్వదేశసంస్థానములును కలిసినఒక రాజ్యాంగ సమాఖ్యగావించి అఖిల భారత సంయుక్త ప్రభుత్వము లేక "ఫెడరేషను" అను క్రొత్త రాజ్యాంగమును స్థాపించుచున్నది. "ఫెడరలు" లేక సంయుక్త శాసననిర్మాణ సంస్థలో "అసెంబ్లీ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్" అన బడు రెండుశాసన సభలుండును. సంయుక్తరాజ్యముయొక్క పరిపాలనాధికారము ఆంగ్లరాజప్రతినిధియగు గవర్నరు జనరలువలన చలాయింపబడును.

7 వ సెక్షను ప్రకారము భారతదేశ పరిపాలనాధికారము (కార్యనిర్వహణము) గవర్నరు జనరలునందు నెల కొల్పబడినది. ఈ అధికారము నతడు తన 'స్వతంత్ర వివేచ

నను స్వబుద్ధిని' ఉపయోగించి చలాయించవలెనట. చట్టము నందతని కొసగబడిన అన్ని అధికారములను గూడ నతడట్లే చలాయించును. ఒక అధికారము తానట్లు చలాయించవలసినదగునా కాదా యని నిర్ణయించు నాతడుకూడ గవర్నరు జనరలే.

ఫెడరలువ్యవహారముల పరిపాలనలో గవర్నరు జనరలు ఈచట్టముక్రింద స్వతంత్రవివేచనను స్వబుద్ధిని ఉపయోగించవలసిన విషయములందు తప్ప తక్కినవానిలో అతనికి సలహా యిచ్చుటకు, సహాయము చేయుటకు, 9 వ సెక్షను ప్రకారము 10 మందికి మించని మంత్రులసభ యొకటి నెలకొల్పబడినది. ఈ మంత్రులసభ పరిపాలనముచేయు కార్యనిర్వాహక వర్గము (Executive body) కాదు. ఇది కేవలము కొన్నివిషయములందు గవర్నరుజనరలుకు సలహాసహాయము లొనరించుట కేర్పడినది.

11 వ సెక్షను ప్రకారము దేశరక్షణ, క్రైస్తవమతము, విదేశవ్యవహారములు, గవర్నరు జనరలు స్వతంత్రవివేచనను స్వబుద్ధిని ఉపయోగించు విషయములు - వీనిని గూర్చి అతడు మంత్రులతో ఆలోచింపడు. శాంతిభద్రతలు, ద్రవ్యపద్ధతియొక్క క్షేమము - అనగా అన్ని విధములయిన పన్నులవిధానము, ఫెడరలు ప్రభుత్వముయొక్క పరపతి - అనగా ఎక్కడనైనను ఎంత వడ్డీకైనను ఎప్పుడైనను ఋణము తెచ్చుట, అల్పసంఖ్యాకులయొక్క హక్కులనుకాపాడుట, ప్రభుత్వోద్యోగుల హక్కులు కాపాడుట, బ్రిటిషు

వారియొక్కయు, బర్మావారియొక్కయు వస్తువులకు బాధకరముగను విచక్షణ చూపునట్లుగను సుంకములు విధించకుండ జూచుట, భారతదేశ సంస్థానాధిపతులయొక్క హక్కులను కాపాడుట, ఇవన్నియు గవర్నరు జనరలుయొక్క ప్రత్యేక బాధ్యతలకు సంబంధించిన విషయములుగా 12 వ సెక్షను శాసించుచున్నది. ఈవిషయములందెల్ల గవర్నరు జనరలు తన స్వతంత్రవివేచననే ఉపయోగించునుగాని, మంత్రులతో ఆలోచించి పనిచేయడు. ఇట్లు ఆర్థిక నీతియావత్తు గవర్నరు జనరలు హస్తగతము చేయబడినది. ఈవిషయములపైన మంత్రులసభకు ఎట్టిఅధికారమునుండదు. ఈవిషయముల కొరకు గవర్నరు జనరలు ముగ్గురు 'కౌన్సెలర్లు' అనబడు సచివులను నియమించును. వీరిజీతములును ఉద్యోగపుషరతులును సభాయుతుడగు ఆంగ్ల నృపాలుడు నిర్ణయించునని 11 వ సెక్షనుయొక్క 2 వ ఉపనిబంధన విధించుచున్నది.

ద్రవ్యసంబంధ విషయములందు అధికారములు చలాయించుట కొరకు "ఫైనాన్షియల్ అడ్వైజరు"ను గూడ గవర్నరు జనరలు నియమించును. ఈఉద్యోగి ఫెడరలు శాసనసభలకు జవాబుదారీ వహింపడు. (15వ సెక్షను). ఈకౌన్సెలర్లును ఫైనాన్షల్ అడ్వైజరును ఇంగ్లాండులోని రాజ్యాంగకార్యదర్శి చెప్పినట్లే వ్యవహరింతురుగాని మనమంత్రులమాట వినరు (14 వ సెక్షను). మంత్రులను పేర్కొనుటలోనేగాక వారి నుద్యోగమునుండి తొలగించుటలోను, వారి జీతములు నిర్ణయించుటలోను గూడ గవర్నరు జనరలు తన స్వతంత్రవివేచన నుప

యోగించవలెనని 10 వ సెక్షను విధించుచున్నందున అతడు తన ప్రాపకము నుపయోగించి దేశములోని, రాజకీయపక్షము లందొకరితో నింకొకరికి స్పర్థలను, వైరములను కలిగింపగలుగును. ఈమంత్రులసభ ఎట్టి అధికారములుగాని లేని పనికిమాలినసంస్థయై యుండును. మన దేశముయొక్క ఘోరదారిద్ర్యమును తొలగించుటకు దీని కావంతయైన శక్తియుండదు. మన రాజ్యాంగనిర్మాణమున నీఘోరసామస్యా పరిష్కారమే ప్రాధాన్యత వహించియుండవలసినను నేడు మనకు దాపరించిన రాజ్యాంగమునుబట్టి అధికారములెల్ల భారతీయుల క్షేమమునకు విరుద్ధముగా బ్రిటీషువర్తకునికి, ఉద్యోగికి లాభము కలిగించునట్లుగనే నిర్ణయింపబడినవి. గవర్నరుజనరలు తన స్వతంత్ర వివేచనను, స్వబుద్ధిని వినియోగించునట్లు చట్టములో నిర్ణయింపబడిన సందర్భములందెల్ల ఆతడు ఇంగ్లాండులోని రాజ్యాంగ కార్యదర్శి పెత్తనముక్రింద వ్యవహారించుచు, ఆయనపంపు సూచనలకెల్ల బద్ధుడై ప్రవర్తింపవలెనని 14 వ సెక్షను విధించుటనుబట్టియే ఈ యుద్దేశము స్పష్టమగుచున్నది. కరుణార్ద్రహృదయుడగు గవర్నరుజనర లెవ్వడైన మన కుపకారము చేయదలచినను గూడ చేయజాలడు. ఇట్లు భారత దేశ రాజ్యతంత్రమెల్ల ఇంగ్లాండునుండియే నడుపబడును. రాజ్యాంగ కార్యదర్శి పెత్తనము అనునది గవర్నరు జనరలుకు పంపబడు రాజనిర్దేశ పత్రమున స్పష్టీకరింప బడిన హద్దులుకలిగి యుండునని చెప్పబడినను ఆచరణలో గవర్నరు జనరలు రాజ్యాంగ కార్యదర్శి చెప్పుచేతలలోని తాబేదారుడు కాకతప్పదు.

## II

### ఫెడరలు శాసన నిర్మాణసంస్థ

ఫెడరలు అసెంబ్లీలో బ్రిటీషు పరగణాలనుండి 250 మంది ప్రతినిధు లుందురు. స్వదేశసంస్థానములనుండి 125 మందికి మించని ప్రతినిధు లుందురు. స్టేటుకవున్సిలులో బ్రిటీషు పరగణాలనుండి 156 మంది ప్రతినిధులును సంస్థానములనుండి 104 మందికి మించని ప్రతినిధులు నుందురు. గొప్ప ఆస్తి హక్కులుగల ధనికులు జమీందారులు వర్తకపారిశ్రామిక శ్రేష్ఠులే స్టేటుకవున్సిలుకు ప్రతినిధుల నెన్నుకొందురు. ఫెడరలు అసెంబ్లి రాష్ట్రశాసనసభల సభ్యులవలన ఎన్నుకొనబడును. రెండుసభలందును బ్రిటీషు పరగణాలనుండి ఎన్నుకొనబడు ప్రతినిధులు హిందు ముసల్మాను సిక్కు క్రైస్తవ ఆంగ్లో ఇండియను మొదలగు జనసంఘముల ప్రత్యేకనియోజక వర్గములవలన ఎన్నుకొనబడినవారై యుందురు. కొన్ని స్థానములు మాత్రము వాణిజ్యసంస్థల, పరిశ్రమల, భూస్వాముల, కార్మికుల, స్త్రీల ప్రతినిధులకు ప్రత్యేకింపబడినవి.

ఫెడరలు అసెంబ్లీలోని కులములవారీ స్థానములకన్నిటికి రాష్ట్రశాసనసభలలోని ఆ యా వర్గములకు చెందిన వారివలన వేరువేరుగా ఎన్నుకొనబడుదురు. స్టేటుకవున్సిలులోని స్థానములు ఆయావర్గముల ప్రకారము దేశములో నలుప్రక్కల తయారు చేయబడిన ఎన్నిక పట్టికలో చేరిన ఆస్తిపరులగు వోటరులవలననే ఎన్నుకొనబడుదురు. ఉభయ సభలయందు

నుండు సంస్థానప్రతినిధులు ఆ యా సంస్థానాధీశులవలననే నియమింపబడుదురు. 600 సంస్థానములకును వాని వాని ప్రాముఖ్యత గౌరవమునుబట్టి స్థానము లొసగబడినవి. ఇందు ముఖ్యముగా గమనింపవలసిన విషయమేమనగా: దేశములోని స్వాతంత్ర్యోద్యమమునకు విముఖులగువారే ఈ శాసన సభల యందు ప్రవేశించుటకును బలవంతులగుటకును ఎక్కుడు వీలుగా నుండునట్లు ఇవి నిర్మింపబడినవి. వివిధ జనసంఘముల ప్రత్యేక నియోజకవర్గములే ప్రతినిధుల నెన్నుకొనుపద్ధతియు రాష్ట్రీయ అసెంబ్లీ సభలనుండి ఫెడరలు అసెంబ్లీ శాసనసభకు అప్రత్యక్షము (ఇండైరెక్టు)గా ఎన్నుకొను పద్ధతియు ఆస్తిగలవారు భాగ్యవంతులు స్టేటుకవున్సిలులో స్థిరముగా ప్రతిష్ఠింపబడుటయు ఉభయసభలందును సంస్థానములకు హెచ్చు స్థానము లొసగబడుటయు-ఇవియన్నియు దేశాభివృద్ధికాటంకము కలిగించువారును సామ్రాజ్యాభిమానులును శాసన నిర్మాణ సంస్థయందు ప్రాబల్యము కలిగియుండులాగున చేసితీరును. కులముల వారీ వర్గములవారీ ప్రత్యేక నియోజక వర్గములు అనునవి బ్రిటీషు పరిపాలనను చిరస్థాయిగా నొనరించుకొరకు ప్రథమమునుండియు అవలంబింపబడిన 'విడదీసి పాలించు' కుటిల రాజనీతిలో నొక భాగముగా నున్నవి. కులకక్షలకు మత భేదములకు సంబంధించిన సమస్యలు ప్రభుత్వమువలన బుద్ధిపూర్వకముగా లేవనెత్తబడి వృద్ధిచేయబడినవి. వీలున్నప్పుడెల్ల వివిధ జాతులు, జనసంఘములు, ఒకదానిపై నొకటి ప్రయోగింపబడినవి. రాజ్యాంగములో నొక భాగముగా చేయబడిన

ప్రత్యేక జనసంఘముల జాతిమతభేదములు, అనవసరముగా అమితము లగుటయేగాక మధ్య తరగతి జన సామాన్యములో నొకభాగమునందు గల జాతిమతభేదములను అతి తీవ్రముగా వర్ధిల్లునట్లు చేయబడినవి. ఇందువలన దేశములోని కుల కక్షల వ్యసనమును మరింత పెంచి కులకక్షలకు మత వైరములకు శాసన సభలను రంగస్థలములుగా చేయు పరిస్థితులు కల్పించినవి. నిజముగా వివిధమతములయందు జాతులందుగల స్వార్థపరులును దేశస్వాతంత్ర్యమునకు విరోధులును విజృంభించుటకును ఈమత వైరములను కులకక్షలను పెంచి జనసామాన్యముమీద పలుకుబడి సంపాదించుటకును ఈ ప్రత్యేక నియోజకవర్గములనుబట్టి వీలుకలుగును.

క్రింది సభయగు ఫెడరలు అసెంబ్లీ సభకు రాష్ట్రశాసన సభలందలి ఆయా కులముల సభ్యులే ప్రతినిధుల నెన్నుకొను అప్రత్యక్షపు ఎన్నికపద్ధతి, పై సభయగు స్టేటు కౌన్సిలుకు ప్రజలుతిన్నగా ఎన్నుకొను పద్ధతియు నిర్ణయింపబడుటకు నొక కారణముకలదు. సాధారణముగా రెండు శాసనసభలున్నప్పుడు జనసామాన్యము కొరకేర్పడిన మొదటిసభ ప్రజలచే తిన్నగా నెన్నుకొనబడు ప్రజాప్రతినిధుల సభగా నుండవలెననుటయు భూస్వాములు, వ్యాపారులు, ఇతర తరగతుల కొరకు ఏర్పడిన రెండవ సభకు ఆయాతరగతి జనులుగల నియోజకవర్గములో వారి ప్రతినిధులలో ఎన్నుకొనవచ్చుననుటయు లేదా ఇంగ్లాండులోవలె ఎన్నికలులేకుండానే ప్రభువుల సభయే కావచ్చుననుటయు రాజనీతిశాస్త్రములో నొక

ప్రాథమిక సూత్రము. అయితే బ్రిటీషుసామ్రాజ్య తత్వము నకు భారతదేశ ప్రజలన్న చాలాభయము. ప్రజాభిప్రాయ ముయొక్క ఒత్తిడివలన రాష్ట్రీయ అసెంబ్లీ సభలకు మాత్ర ము తిన్నని (డైరెక్టు) ఎన్నిక నొసగవలసి వచ్చినది. అయితే బ్రిటీషు సామ్రాజ్యతత్వము పోవలెనను వారి పలుకుబడి దేశ ములో నానాటికి హెచ్చుచున్నందున అందుకు ప్రతిక్రియగ కొంత జాగ్రత్త దీసికొన దలచిరి. ఇట్లు రాష్ట్రశాసనసభలకు ప్రత్యేక నియోజకవర్గములనుండి ఎన్నికలను నిర్ణయించి ఈ శాసనసభ్యులే కేంద్రఅసెంబ్లీకి ప్రతినిధుల నెన్నుకొను నియో జకులుగా నిర్ణయించుటలోని రహస్యము, ఫెడరలు అసెంబ్లీని జాతీయ కాంగ్రెసు వశపరచుకొనకుండ జేయవలెననియే! ఆసభకుకూడా ప్రజలే తిన్నగా ఎన్నుకొను నెడల ప్రజలు కాంగ్రెసువాదులనే ఎన్నుకొని తీరుదురు. ఇట్టి అప్రత్యక్షపు ఎన్నిక కల్పింపబడినచో రాష్ట్రశాసనసభలయందు కాంగ్రెసు అధిక సంఖ్య సంపాదించిన రాష్ట్రములనుండి మాత్రమే కేంద్ర అసెంబ్లీసభకు కాంగ్రెసు సభ్యులు ఎన్నుకొనబడగలు గుదురు. మఱియు ప్రజా సామాన్యముపైన కాంగ్రెసుకు హెచ్చు పలుకుబడి యున్నందున ఎన్నికలందు సులభముగా నెగ్గును. ప్రత్యేక నియోజక వర్గముల వలన శాసనసభల కెన్నుకొనబడిన శాసనసభ్యులలో వివిధరకములవా రుందురు. వివిధ జాతిమతములకు చెందినవారుందురు. వారిలో ఐకమత్య ముండదు. కొంతమంది కేవలము ప్రభుత్వమునకు జోహుకుము లుందురు. కొందరు ప్రభుత్వాధికారమునకు పలుకుబడికి

లోబడుదురు. ఇట్టి నియోజకవర్గమువలన కేంద్రఅసెంబ్లీకి హెచ్చుమంది కాంగ్రెసు సభ్యు లెన్నుకొనబడకపోవచ్చును. నిజముగా సామ్రాజ్యతత్వమునకు విరోధులెవ్వరు నీ కేంద్ర శాసనసభలో ప్రవేశించుటకు వీలులేకుండా చాలా కట్టుదిట్ట ములుచేయుబడినవి. దేశములో స్వార్థముకొరకు పాటుపడుతర గతులు స్టేటుకవున్సిలులో స్థిరముగా ప్రతిష్ఠింపబడుటయేగాక క్రింది సభతోపాటు ఈ స్టేటుకవున్సిలుకు ద్రవ్యవిషయము లందు శాసననిర్మాణమునందు సమానములగు అధికారము లివ్వబడినందున ఫెడరలు శాసనసంస్థలో వీరు అభివృద్ధికి గొప్ప ఆటంకముగా నుందురు. ధనికులయొక్కయు భూస్వా ములయొక్కయు ప్రతినిధియగు స్టేటుకవున్సిలువంటి సభకు జనసామాన్యముయొక్క ప్రతినిధుల సభయగు అసెంబ్లీ సభతో సమానమైన అధికారము లివ్వబడుటగూడా రాజనీతి శాస్త్రముయొక్క ప్రాథమిక సూత్రమునకు విరుద్ధమే. అయితే భారతదేశప్రజలను కొల్లగొను బ్రిటీషు సామ్రాజ్య తత్వము దేశీయ ప్రజా సమూహము లెల్ల తనకు వ్యతిరేక ముగా నుండుటను గ్రహించి, తమ ప్రభుత్వముమీదనే ఆధారపడి తమ్మే ఆశ్రయించి తమతోపాటు ప్రజలను కొల్ల గొను ధనికులను భూస్వాములను జేరదీసి వారికి తగు మద్దతు చేయుదలచుచున్నారు. అందువలననే బ్రిటీషు పార్లమెంటు వారు స్వదేశసంస్థానములకు ఫెడరేషనులో అత్యంత ప్రాము ఖ్యత నిచ్చినారు. ఫెడరలు అసెంబ్లీలో మొత్తము స్థానములలో నూటికి ౩౩ మందిచొప్పునను స్టేటుకవున్సిలులో నూటికి నలు

బదిమంది చో॥ సంస్థానముల ప్రతినిధులుగానున్నారు. ఈరెండు శాసనసభలు కలిసిన సంయుక్తసమావేశములో మొత్తము సంఖ్యలో 406 మంది బ్రిటీషు పరగణాల ప్రతినిధులుగను 229 మంది సంస్థాన ప్రతినిధులుగ నున్నారు. అందువలన నీకేంద్ర ఫెడరలు శాసనసంస్థ దేశప్రజల అభిప్రాయమును ప్రతిబింబించగలదనుమాట కల్ల. ఈ సంస్థలో సంస్థానాధీశులు, జమీందారి భూస్వాములు, కులతత్వాభిమానులు, ప్రాబల్యము వహించి ఒక సామ్రాజ్యాభిమానుల 'బ్లాకు'ముఠాగా, ఏకమై గవర్నరు జనరలుయొక్క అపరిమితములైన సర్వాధికారములను ప్రజలకు వ్యతిరేకముగా చలాయించుటకు వీలుకల్గింతురు

సంస్థానాధీశులు:

భారత దేశ ప్రజలకు సామ్రాజ్య తత్వముపైన గల రోతకు ప్రతిక్రియగా జాగీర్దారీ (ఫ్యూడలు) విధానముయొక్క అవశిష్టములనదగిన సంస్థానములతో సామ్రాజ్య తత్వము మచ్చిక చేసికొని దాని నుపయోగింపదలచినది.

ఈ సంస్థానములు ఫెడరేషనులో చేరుటవలన వానికిని బ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వమునకును జరిగినఒడంబడికలమరతులవలన ఏర్పడిన హక్కులకు భంగము కలుగదు. బ్రిటిషు సామ్రాజ్య ప్రభుత్వమునకు వారితో అట్టిసంధియొడంబడికలున్నందున సార్వభౌమత్వపు అధికారములును, హక్కులును ఫెడరలు ప్రభుత్వము చలాయింప వీలులేదనియు బ్రిటీషుచక్రవర్తియొక్క ప్రతినిధిహోదాలో వైస్రాయితో

ఆ యధికారములను చలాయించ వలెననియు స్పష్టీకరింపబడియే యున్నది. ఇక సంస్థానములఆంతరంగిక ప్రభుత్వాధికారములందు ఏవైన మార్పులుండునా? ఒక సంస్థానాధీశుడు ఫెడరేషనులో చేరునప్పుడు వ్రాయుబడంబడికపత్రములో ఫెడరలు ప్రభుత్వము, తనసంస్థానమునకు వర్తించు శాసనములు చేయుటకు తానంగీకరించు విషయములనెల్ల స్పష్టముగా వివరించును. అట్లు అంగీకరింపని విషయములందు ఫెడరలు ప్రభుత్వము చేసిన శాసనములకు ఆ సంస్థానము లోబడదు. మఱియు ఫెడరలు శాసనములను ఆసంస్థానములో అమలుచేయునది ఫెడరలు ప్రభుత్వోద్యోగులుగాక సంస్థానోద్యోగులే. ఇందు విపరీతమే మనగా అసెంబ్లీశాసనసభలో నూటికి 33 మంది, కవున్సిలు సభలో నూటికి 40 మంది, ప్రతినిధులు గలిగిన సంస్థానములు బ్రిటీషుపరగణాలకుచేయుబడు శాసన నిర్మాణమున పాల్గొనవచ్చును గాని ఆశాసనసభలే యీసంస్థానములకు అవి అంగీకరించిన విషయములందుతప్ప తక్కిన విషయములందు శాసనములు చేయరాదు!

అనగా ఈసంస్థానాధీశులు బ్రిటిషు పరగణాలలో చేయుబడు ప్రజాప్రభుత్వశాసనముల నోడించుట కధికారము కలిగియుందురు; మరియు, తమసంస్థానములలో నిరంకుశాధికారములును కలిగియుందురు. సంస్థానములందలి ప్రజలమాట రాజ్యాంగము తలపెట్టనే లేదు! ఇంకొకవిశేషమేమనగా ఫెడరేషనుప్రారంభములో సంస్థానములు చేరకపోయినచో శాసనసభలందుండవలసిన నిర్ణీతసంఖ్యను అప్పటికి చేరినసంస్థానములే

నింప వచ్చునని జాయింటు పార్లమెంటరీ కమిటీవారు సెల విచ్చుటలోనే వారియొక్క నిజోద్దేశములు బయల్పడుచున్నవి.

ఈసంస్థానాధీశులపైన ఇతరులు దాడివెడలకుండగను దేశములో కల్లోలము కలుగకుండగను సంరక్షించు బాధ్యతను బ్రిటిషువారు వహించియున్నారు. ఈసంస్థానాధీశులు ఎంత నిరంకుశముగ పరిపాలించినను అడుగువారు లేరు. సంస్థానాధీశునిగౌరవమునకు హక్కులకు భంగము కలుగకుండ చూచు బాధ్యత గవర్నరుజనరలుదే. ఈనూతనమైన ప్రత్యేక బాధ్యతయు దేశరక్షణ విషయములో గవర్నరు జనరలుకు గల ప్రత్యేక బాధ్యతయు కలసి ఈ 'ఫ్యూడలు' పరిపాలకవర్గము వారికి క్రొత్తబలమును, సంరక్షణయు కలిగించినవి.

## IV

### ఫెడరలు శాసననిర్మాణ సంస్థయొక్క అధికారములు.

శాసనసభలందు తమ వశవర్తులే అధిక సంఖ్యాకులుగా నుండునట్లు చేసికొనియుకూడ బ్రిటీషు సామ్రాజ్య తత్వజ్ఞులు ఈసంస్థకు నిజముగా ఉపయోగింపగల శాసన నిర్మాణము నందుగాని ద్రవ్యవ్యవహారములందుగాని నిజమైన అధికారము నిచ్చుటకు వెనుదీసినారు. రాజకీయముగా అత్యంతప్రధానములైన రెండుశాఖలగు దేశరక్షణ (సైన్యము) విదేశవ్యవహారములు ఫెడరలు శాసన నిర్మాణసంస్థయొక్క అధికారమునకు లోబడియుండవు. శాసనసభలకు ఈవిషయములను గూర్చి శాసనములు చేయుట కధికారము లేకపోవుటయేగాక

వీనికగు వ్యయములనుగూర్చి నిర్ణయించుటలో పార్లమెంటు కైనను అధికారములేదు. దేశరక్షణ, విదేశవ్యవహారములు క్రైస్తవ మతవ్యవహారముల పరిపాలనను గవర్నరు జనరలే స్వయముగానడుపవలెను. దాని కతడే పెత్తనమువహించవలెను. గవర్నరుజనరలు ఆమోదించనిదే ఏచిత్తుచట్టము శాసనము కాగూడదు. ఉభయశాసనసభలలోను ఈక్రింద వివరింపబడిన ముఖ్యవిషయములనుగూర్చిన చిత్తుచట్టముగాని సవరణగాని ప్రవేశపెట్టుటకు ముందుగా గవర్నరు జనరలు అనుజ్ఞను పొంది యుండవలెను.

1. బ్రిటీషు ఇండియాకు వర్తించు ఏపార్లమెంటు శాసనమునుగాని రద్దుపర్చునట్టియు లేదా మార్చునట్టియు లేక అట్టి శాసన నియమములకు విరుద్ధమగునట్టి,

2. గవర్నరు జనరలు చట్టమునుగాని ఆర్డినెన్సు శాసనమునుగాని రద్దుచేయునట్టి లేదా మార్చునట్టి లేదా అట్టిశాసన చట్టనియమములకు విరుద్ధముగా నుండునట్టి,

3. గవర్నరు జనరలు తనస్వతంత్రవివేచన నుపయోగించి చర్యతీసుకొనవలసిన విషయములకు సంబంధించినట్టి,

4. పోలీసు సిబ్బందికి సంబంధించినట్టి లేదా ఐరోపా వారికి సంబంధించిన క్రిమినలు ప్రొసీజరుకు సంబంధించినట్టి చట్టమును రద్దుచేయునట్టి లేదా మార్చునట్టి లేదా అందుకు సంబంధించినట్టి,

5. ఇండియాలో నివసించని వారిపైన దేశవాసుల పైన కన్న హెచ్చుపన్ను విధించునట్టి లేక ఇండియాలో రిజిస్టరై యుండనట్టి కంపెనీలపైన ఇండియాలోనే పూర్తిగా మేనేజిచేయ బడని కంపెనీలపైన ఇండియాలోనే రిజిస్టరై మేనేజిచేయబడు కంపెనీల కన్న హెచ్చుపన్ను విధించునట్టి,

6. ఇంగ్లాండులో పన్ను విధింపబడ తగియున్న కారణమున ఫెడరలు ఆదాయపుపన్ను భారము తొలగించుటకు సంబంధించినట్టి శాసనములు.

ఇట్లు ఫెడరలు శాసన నిర్మాణసంస్థ కేవలము అధికార విహీనమగు సంస్థగా నున్నది. దేశముయొక్క ద్రవ్యపద్ధతి యందుగాని విదేశవ్యవహారములందుగాని ఈ సంస్థకు పలుకు బడి యుండదు. గవర్నరు జనరలు అనుజ్ఞను ముందుగా పొందనిదే ఏముఖ్య విషయమును గూర్చియు శాసించుటకు వీలు లేదు. అట్టి అనుజ్ఞ అవసరములేని విషయములందు గూడ గవర్నరు జనరలు తన స్వతంత్రి వివేచన నుపయోగించి శాసన నిర్మాణ సంస్థయొక్క తీర్మానమును ప్రత్యాఖ్య (వీటో) చేసి త్రోసివేయువచ్చును. పొరబాటున ఆత డట్లుచేయక విడిచినను శాసన మైన 12 నెలలలో ఆంగ్లరాజు దానిని ప్రత్యాఖ్యచేసి త్రోసివేయువచ్చును.

ద్రవ్యవిషయములందు ఫెడరలు శాసన నిర్మాణ సంస్థ యొక్క అధికారము లింకను సారహీనములై యున్నవి. దేశముయొక్క వార్షిక వ్యయము రెండుభాగములుగా విభజింప

బడినది. (1) ఫెడరలు రివిన్యూ ఆదాయముపై నబద్ధత (చార్జి) చేయబడినట్టిది. (2) ఫెడరేషనుయొక్క రివిన్యూఆదాయములో నుండి ఖర్చు పెట్టదలచినది.

మొదటితరగతి వ్యయమునుగూర్చి ఫెడరలు శాసన నిర్మాణ సంస్థ వోటుచేయుటకు వీలులేదు. అట్టితరగతిలో ఈ క్రిందివి చేరును.

1. గవర్నరు జనరలుయొక్క జీతము, అలవెన్సులు, ఆ హోదాకు సంబంధించిన ఇతరవ్యయములు.

2. ఫెడరేషను బాధ్యత వహించు ఋణవ్యయములు, వడ్డీ, ఋణతీర్మానపుఖర్చులు, తీర్మానవ్యయములు.

3. మంత్రులయొక్కయు, కౌన్సిలర్లయొక్కయు, ఫైనాన్షియల్ అడ్వైజరుయొక్కయు, అడ్వకేటు జనరలుయొక్కయు జీతములు, అలవెన్సులు.

4. ఫెడరలుకోర్టు జడ్జీలజీతములు, అలవెన్సులు, ఇతర హైకోర్టుజడ్జీల పించనులు.

5. దేశరక్షణ, విదేశవ్యవహారములు, క్రైస్తవమత వ్యవహారములకు అగు వ్యయము.

6. స్వదేశసంస్థానములకును చక్రవర్తిమకుటమునకును గల సంబంధవ్యవహారములందు చేయబడుఖర్చులు.

7. ఫెడరలు రివిన్యూపై నబద్ధత (చార్జి) చేయబడునట్లు గవర్నరు జనరలు నిర్ణయించు ఇతరవ్యయములు.

రెండవతరగతి వ్యయములు అనగా ఫెడరేషనుయొక్క రివిన్యూలోనుండి ఖర్చుపెట్టదలచు వ్యయముల విషయమై వోటుచేయుటకు శాసనసభలకు వీలుకలదు. అయితే వారు తగ్గించినట్టి లేక తీసివేసినట్టి వ్యయములను మరలచేర్చి మంజూరు (శాంక్షను) చేయు అధికారము గవర్నరు జనరలుకు కలదు. దీనిలో గమనించవలసిన ముఖ్యవిషయ మేమనగా శాసనసభ వోటుచేయుటకు వీలులేని వ్యయము మొత్తము ఫెడరల్ వ్యయములో నూటికి ఎనుబదివంతులైనను ఉండును. మిగిలిన ఇరువదివంతులైనను ఫెడరలు శాసనసభలకుపూర్ణ అధికారముండదు. ఏలన, గవర్నరుజనరలు తన స్వ వివేచన నుపయోగించి రెండుశాసనసభలయొక్క అభిప్రాయమును త్రోసిరాజనవచ్చును.

గవర్నరు జనరలుయొక్కయు, శాసనసభలకు బాధ్యత వహింపని అతని తాబేదారులయొక్కయు జీతములు శాసనసభ వోటుకు లోబడకపోవుట బాగుగనే యున్నదిగాని శాసనసభలకు బాధ్యత వహింపవలసిన మంత్రులయొక్క జీతబత్తెములు గూడ ఆ శాసనసభవారి వోటుకు లోబడకపోవుటలోని అంతరార్థ మేమిటో! రాజ్యాంగచట్టముయొక్క 10-వ శెక్షను, ఈమంత్రులు గవర్నరు జనరలుయొక్క చిత్తము వచ్చినంతకాలము మాత్రమే ఉద్యోగమున నుందురని శాసించుటను బట్టియే దీనిభావము విదితమగుచున్నది. మంత్రులు, ప్రజాభిప్రాయము ప్రకారము నడుచుకొనుటకుగాని ప్రజాశ్రేయముకొరకు పాటుపడుటకుగాని, దేశముయొక్క ఆర్థిక

క్షేమలాభములను గూర్చిన ప్రణాళికలను శాసించుటకుగాని అమలుపరచుటకు గాని ఏల ప్రయత్నింతురు? సహజముగా వారు గవర్నరు జనరలునే ఆశ్రయించి అతనిపైననే ఆధారపడి అతని చిత్తానుసారమే ప్రవర్తింతురు. గవర్నరు జనరలన్ననో బ్రిటిషు వారి కీదేశమున వేళ్లు పారి పాతుకొని యున్న హక్కులను కాపాడుటయే తన పనిగా ప్రవర్తించును. మంత్రులు గూడ అందు కనుగుణముగా ప్రవర్తించునట్లు చేయును.

ఒక వ్యయము శాసనసభయొక్క వోటుకు పెట్టవలసిన తరగతిలోనిదా కాదా యని నిర్ణయించు నధికారి కూడ గవర్నరు జనరలే. అట్లు నిర్ణయించుటలో నతడు మంత్రులతో ఆలోచింపకయే తన స్వతంత్ర వివేచననే ఉపయోగింపవలెనని 33-వ శెక్షను విధించుచున్నది. ఈ విపరీతాధికారము నతడు యథేచ్ఛముగా చలాయించవచ్చును.

చట్టముయొక్క 34-వ శెక్షనును బట్టి అసెంబ్లీ శాసనసభ వోటుకు లోబడిన ఇతర వ్యయములుగూడ గవర్నరు జనరలే ప్రతిపాదింపవచ్చును. 35-వ సెక్షను ప్రకారము శాసనసభవారు నిరాకరించిన వ్యయము తన ప్రత్యేక బాధ్యతను నిర్వహించుటకొరకు అవసరమని చెప్పి గవర్నరు జనరలా వ్యయపు మొత్తమును కోశపట్టికలో మరల చేర్చవచ్చును. ఈ ప్రత్యేక బాధ్యత లనునవి 12 వ శెక్షనునుబట్టి అనిర్ణీతములుగా నున్నవి. గవర్నరుజనరలు చలాయించు ప్రత్యేక విషయముగాక ప్రత్యేక అధికారమండలములు సృజియింప

బడినవి. వీనిని ఇండియారబ్బరువలె గవర్నరు జనరలు తన యిచ్చవచ్చినట్లు విపరీతముగా సాగదీసి అన్వయించి, వ్యవహరించవచ్చును. (9వ శెక్షను 3వ సబుశెక్షను). 37వ శెక్షను ప్రకారము ఫెడరలు శాసనసభలు గవర్నరు జనరలుయొక్క అనుజ్ఞను ముందుగా పొందనిది ద్రవ్యసంబంధములగు శాసనాధికారములు చలాయింపవీలులేదు. ఇట్లు నిషేధింపబడిన వానిలో పన్నులు విధించుట, వ్యయములుచేయుట, అప్పులు తెచ్చుట, పూర్వపుద్రవ్య వ్యవహారములును చేరియున్నవి. కోశాధికారములేని ఇట్టి బాధ్యతాయుత ప్రభుత్వము ప్రపంచములో కని విని యెరుగనిదిగ నున్నది.

ఈవిషయములో నీక్రొత్తరాజ్యాంగము 1919 నాటి పాత రాజ్యాంగము చేసిన యేర్పాటులనే నిలిపి యుంచినది. ఇంక నితర ఆర్థిక ద్రవ్యవిషయములందు శాసనసభలను కట్టిపెట్టుటకు క్రొత్త బంధనములను నిర్మించుచున్నది. అందు ముఖ్యమైనది బ్రిటీషువర్తకులకు పెట్టుబడిదారులకు ప్రత్యక్షముగా గాని ప్రచ్ఛన్నముగాగాని ఏమాత్రమైన హాని కలిగింప గల శాసనము దేనినైనను శాసనసభలు చేయుటకు వీలులేకుండ గావింపబడిననిషేధము.

రాజ్యాంగచట్టముయొక్క 12వ శెక్షనునుబట్టి గవర్నరు జనరలుయొక్క ప్రత్యేక బాధ్యతలలో బ్రిటీషుదీవుల నుండి ఇండియాలోనికి దిగుమతి చేయువస్తువుల విషయమై విచక్షణ చూపునట్టి లేదా, కష్టనష్టములు కలిగించునట్టి చర్యలు జరుపకుండా కాపాడుట యొకటి. అట్టిప్రత్యేక బాధ్యతను నిర్వ

హించుటలో గవర్నరు జనరలు తనస్వతంత్రవివేచననే ఉప యోగించును. అందువలన దిగుమతి సుంకముల 'నిరకునామా' (టారిఫ్) విషయములో ప్రత్యక్షముగాగాని ప్రచ్ఛన్నముగా గాని ఎట్టివిచక్షణ చూపబడకుండులాగున అతడుకనిపెట్టి చర్య గైకొనును. స్వదేశపరిశ్రములను బ్రిటీషు పోటీనుండి సంర క్షించుకొరకు శాసనసభ లేమైన చట్టములు చేయుదలచినచో గవర్నరుజనరలు పై యధికారమును పురస్కరించుకొని దానిని నిషేధించి తీరును.

హిందూదేశములో బ్రిటిషుపరిపాలనమును దృఢపరచి దానిని చిరస్థాయిగాచేయుట కేర్పడిన విశ్వప్రయత్నఫలితమే ఈచట్టము. దీనికి రాజకీయ ఆర్థికస్వరూపము లనురెండుముఖ ములుగలవు. దీని రాజకీయ స్వరూపముకన్న ఆర్థిక స్వరూపమే అధికతరప్రాముఖ్యము గలయట్టిది. మహామ్మదీ యుల కులతత్వమును గూర్చియు, ఇంగ్లీషువారి సామ్రాజ్య తత్వమును గూర్చియు పత్రికలందు మనము చదువుచునే యున్నాము. ఈరెండు తత్వములు తలలెత్తుటకుగల మూల కారణము మన తెలివితక్కువయే యనుటకు సందియములేదు. రాజకీయాధికారము ఆర్థికవిషయములం దుపయోగించుపట్ల తప్ప నిజముగా రాజకీయములకు ప్రాముఖ్యత యుండవలసిన అగత్యములేదు.

అందువలన నీరాజ్యాంగమువలన ఆర్థికక్షేమలాభముల కెట్టిఫలితములు కలుగునో తెలిసికొనవలెను. ఇంగ్లీషువర్తకులు పెట్టుబడిదారులు, పారిశ్రామికులు, వస్తునిర్మాతలు, ఇంకను

ఇండియాలో చేరి లాభములార్జించు ఇతరవర్గములవారు — వీరికిగల స్వజాత్యభిమానము కన్నను వీరాశించు ఆర్థిక సర్వాధిపత్యముకన్నను ఇంగ్లీషువారి సామ్రాజ్యతత్వముగాని, ముసల్మానులకులతత్వముగాని మనకెక్కుడు భయంకరములుగావు. నూతన ఇండియారాజ్యాంగచట్ట మీఆర్థిక సర్వాధిపత్యమును బలవత్తరముగ చేయుచున్నది. భారతీయులు తమ రాజకీయాధికారములను బ్రిటీషు వారి యార్థిక లాభములకు హానికరముగా నుపయోగింతురనియే ఇంగ్లీషువారిభయము. అందువలననే, ఈక్రొత్తచట్టము 1919 సంవత్సరపు ప్రాతచట్టముకన్నను తీసికట్టుగ నున్నది.

## V

## గవర్నరు జనరలు అధికారములు

ఇట్లు ఫెడరలు శాసననిర్మాణసంస్థ అధికారవిహీనమగు పనికిమాలినసంస్థగా చేయబడియుండగా అన్ని అధికారములు గవర్నరు జనరలు చేతులలో కేంద్రీకరింపబడినవి. పైన చెప్పబడిన రీతిగా దేశరక్షణశాఖను విదేశ వ్యవహారములను క్రైస్తవమత వ్యవహారములను గవర్నరు జనరలుస్వయముగానే పరిపాలించును. వీని విషయములో అతడు ఇండియా రాజ్యాంగ కార్యదర్శికి బాధ్యత వహించును. దీనికితోడు గవర్నరు జనరలు క్రింది యధికారములు కలవు:

1\. శాసన సభలు తీర్మానించిన ఏచిత్తుచట్టమునకైనను అనుమతి నివ్వక నిరాకరించి అది శాసనము కాకుండచేయుట. ప్రజలయొక్క ఆర్థికస్థితిని చక్కబరచుటకు శాసనసభవా రే

దైన ప్రయత్నముచేసినచో గవర్నరు జనరలీయధికారమును బట్టి విఫలముచేయగలడు.

2. కొన్ని రకముల చిత్తుచట్టములను శాసనసభలందు ప్రవేశపెట్టుటకు అనుజ్ఞనిచ్చుట, ఇవ్వకపోవుట.

3. ఒక చిత్తుచట్టమును ఆంగ్లరాజుయొక్క అనుమతి కొరకు నిలుపుదలజేయుట.

4. శాసనసభలు ద్రవ్యవ్యవహారముల విషయమై చేసిన తీర్మానములను త్రోసిరాజనుట.

5. ఆర్డినెన్సులను జారీచేయుట.

(రాజకీయ విషయములందు ఇదివరకే ఆర్డినెన్సు శాసనాధికారమును గవర్నరు జనరలెన్నెన్ని విధములుగా నుపయోగించెనో అందరికిని తెలియును. అయితే ఆర్థికముగా నిది యెట్లు ప్రయోగింపబడినదో చాలమంది గమనింపలేదు. 1927 వ సంవత్సరపు కరెన్సీచట్టమును గవర్నరు జనరలు 1931 వ సెప్టెంబరునెలలో నిరంకుశముగా సవరణచేయుచు నొక ఆర్డినెన్సును జారీచేసినాడు. ఈ ఆర్డినెన్సే మన దేశము నుండి 300 కోట్ల రూపాయల బంగారము ఇంగ్లాండుకు తరలి పోవుటకు గారణమైనదని అర్థశాస్త్రజ్ఞులు నిర్ణయించినారు. మన రూపాయ ఇంగ్లాండు సవరనుకు ముడిపెట్టబడి సవరనుయొక్క విలువ పడిపోయిన సందర్భములో ఆ తేడా విలువ వరకు బ్రిటీషు వర్తకునికి లాభము చేకూర్చినది. రాబోవు పరిపాలనలో నిట్టి వెన్ని జరుగనున్నవో!)

6. శాసన సభలతో నిమిత్తము లేకుండా 'గవర్నరు జనరలు చట్టము' లను పేరుతో శాసనములనే చేయుట.

7. శాసనసభలను సమావేశ పరచుట, సమావేశముల నింకొక తేదీకి వాయిదావేయుట, సభలను చాలింపుచేయుట.

8. రెండు శాసనసభలను కలిపి సమావేశ పరచుట.

9. ఏచిత్తు చట్టవు చర్చనైనను శాసన సభయందు ఆపుట.

10. శాసన సభవారు వ్యతిరేకముగా తీర్మానించినను గూడ ఏచర్యనైనను జరుపుట.

11. రాజ్యాంగయంత్రము నడువని సందర్భము వచ్చినచో అందు ఏభాగమునైనగాని సర్వసంస్థలనుగాని మాపుచేసి ఆయధికారము లెల్ల తానే వహించి చలాయించుట.

ఈ అధికారము లన్నియుగాక గవర్నరు జనరలుకు కొన్ని ప్రత్యేక బాధ్యతలు ప్రసాదింపబడినవి. వీనిని నిర్వహించుటలో నతడు కేవలము నిరంకుశాధికారములను చలాయించును. అవి యేవియన:

1. యావద్భారత దేశముయొక్క లేదా అందే దైన నొక ప్రదేశముయొక్క శాంతి భద్రతలకు తీవ్రమైన అపాయము వాటిల్లకుండ కాపాడుట.

2. ఫెడరలు సంయుక్త ప్రభుత్వముయొక్క ఆర్థిక క్షేమమును పరపతిని సంరక్షించుట.

3. మైనారిటీల (అల్పసంఖ్యాక జన సంఘముల)యొక్క న్యాయమైన హక్కులను కాపాడుట.

4. సర్కారు ఉద్యోగులకీ రాజ్యాంగ చట్టమువలన నివ్వబడిన హక్కులను ఇంకను న్యాయమైన హక్కులను కాపాడుట.

5. భారతదేశములోనికి దిగుమతియగు బ్రిటీషుదీవుల సరకుల విషయమై ఎట్టి విచక్షణనుచూపి కష్టనష్టములు కలిగింపకుండ కాపాడుట.

6. బ్రిటీషు వర్తకులపట్ల పారిశ్రామికులపట్ల విచక్షణ చూపి కష్టనష్టములు కలిగింపకుండ కాపాడుట. [చట్టము యొక్క 5 వ భాగములోని 3 వ ప్రకరణమున చెప్పబడిన విషయములు.]

7. ఏ స్వదేశ సంస్థానముయొక్క హక్కులకుగాని ఏ సంస్థానాధీశునియొక్క గౌరవమునకును హక్కులకును గాని భంగము కలుగకుండ కాపాడుట.

8. గవర్నరు జనరలు అధికారము క్రిందనే యుండు పరిపాలన శాఖల కార్యములెల్ల అమలు జరుగునట్లు చూచుట.

గవర్నరు జనరలుయొక్క ప్రత్యేక బాధ్యతలకు సంబంధించినంతవరకు ఆ యధికారములను చలాయించి చర్య తీసికొనుటలో అతడు తన స్వబుద్ధినే ఉపయోగింపవలెను. అట్టి ప్రతివిషయమందును అతని నిర్ణయమునకు తిరుగులేదు. అతని నిర్ణయము లాప్రకారము చెల్లదనిగాని అతడు తన

స్వతంత్ర వివేచన నుపయోగించి యుండవలెననిగాని స్వతంత్ర వివేచననుపయోగించియుండకూడదనిగాని స్వబుద్ధి నుపయోగించి యుండవలెననిగాని ఉపయోగించియుండరాదని గాని అతనినిర్ణయముయొక్క క్రమానుగుణ్యాత విమర్శింపబడరాదు. అతనినిర్ణయము రాజ్యాంగచట్టనిబంధన ప్రకారముగా లేదనికూడత్రోసిపుచ్చింప బడరాదు. అతని ప్రత్యేక బాధ్యతలకు సంబంధించిన విషయములందెల్ల గవర్నరుజనరలు ఇండియారాజ్యాంగ కార్యదర్శి యొక్క సామాన్యపెత్తనముక్రింద నుండవలెను. ఈ ప్రత్యేక బాధ్యతలనునవి పలువిధములైనవై యున్నందునను, వాని అన్వయావకాశము రబ్బరువలె ఎంత సాగదీసిన అంతదీర్ఘముగ విస్తరింపగలట్టివియునై యున్నందునను శాసనసభల అభిప్రాయముతో నిమిత్తములేకుండా వానినొక్కదానినిగాని అన్నింటినిగాని పురస్కరించుకొని గవర్నరుజనరలు ఏకార్యమునకైనను గడంగవచ్చును. గవర్నరుజనరలునందు నెలకొల్పబడిన అనియంత్రణములగు సర్వాధికారములు ప్రాగ్దేశవుల నిరంకుశదేశాధీశులను సైతము మరపింపగలంత పరిపూర్ణములును తీవ్రములునై యున్నవి.

ఈ ప్రత్యేకబాధ్యతలయొక్క అంతరార్థమును మనము మఱువకూడదు. దేశముయొక్క శాంతిభద్రతలను కాపాడు బాధ్యత అనునది దేశస్వాతంత్ర్యముకొరకు లేవదీయబడు ఏ ఉద్యమము నైనను అణచుట కుపయోగింపబడితీరును.

శాసనధర్మము క్రమపరిపాలనము (Law and Order)

అను పేరున భారతదేశప్రజలు తలపెట్టునట్టి సామ్రాజ్యమునకు ప్రతికూలమగు ప్రతి ప్రయత్నము కూడ అణచివేయబడును.

దేశద్రవ్యపద్ధతి (ఫైనాన్సు)యొక్క స్థాయిత్వము(ఆర్థిక క్షేమము) కొరకేర్పడిన బాధ్యత అనునది మనదేశముపైన వేయబడిన భరింపశక్యముగాని ఋణభారమును చిరస్థాయిగా నుంచుటకేర్పడినది. ఈఋణభారము ప్రభుత్వమువారిదుబారా తనముువలన నీవందసంవత్సరములలో పాపము పెరిగినట్లు పెరిగినది. ముఖ్యముగా బ్రిటిషువారి లాభముకొరకును ఆర్థికముగా మనకుపయోగింపని వ్యయములక్రిందను చాలసొమ్ము అప్పు తేబడినది. 1934 నాటికి భారతదేశప్రభుత్వము చేసినఋణము 1212 కోట్లరూపాయలుగ నుండెను. ఇందు 512 కోట్లుఋణము ఇంగ్లండులోనే చేయబడినది. ఇది భారతదేశములో పన్నులు భరించువానిపైనబడిన గొప్పభారము! వడ్డీరూపముగా ప్రతిసాలున కోట్లకొలది చెల్లించవలసి వచ్చుచున్నాము. ఈఋణము లోచాలవరకు బ్రిటీషుసామ్రాజ్యము లాభనిమిత్తమే చేయబడినందున దీనిని పరిశీలించి ఎంతవరకుమనమిచ్చుకోతగినదో నిర్ణయించవలసినదని కాంగ్రెసువారు స్పష్టముగా కోరుచున్నందున క్రొత్తరాజ్యాంగములో నీ ప్రత్యేక బాధ్యత నిర్మింపబడి బ్రిటీషు పెట్టుబడిదారుని లాభముకొరకు మనవారిపైన నీభారము వేయబడుచున్నది.

బ్రిటీషు వర్తకముపట్ల పరిశ్రమలపట్ల విచక్షణచూపకుండగ చేయుబడిన ప్రత్యేకబాధ్యత, భారతదేశఆర్థికజీవనమున బ్రిటిషు పెట్టుబడిదారుల యొక్కయు వర్తకులయొక్కయు

ప్రాబల్యమును చిరస్థాయి యొనరించుటకు భారతీయ వర్తకము నకు, పరిశ్రమలకు, ఓడలకు ప్రత్యేకరక్షణ మొసగ వీలులే కుండ చేయుటకును నిర్మింపబడినది.

భారతదేశ స్వదేశ సంస్థానములకు సంస్థానాధీశులకు గల హక్కులను కాపాడుటకేర్పడిన ప్రత్యేక బాధ్యత బ్రిటిషు సామ్రాజ్య విధానమునకు పట్టుగొమ్మయగు సంస్థానాధీశుల జాగీర్దారీ 'ఫ్యూడలు' పద్ధతిని శాశ్వతముగా నిలిపియుంచుట కొరకేర్పడినదే.

అల్పసంఖ్యాక జనసంఘముల (మైనారిటీల) హక్కులను రక్షించుట కేర్పడిన ప్రత్యేక బాధ్యత యనునది, ఒక జనసంఘము నింకొక జనసంఘముపైన ప్రయోగించి జాతి మత ద్వేషములను కులకక్షలను వైరములను పెంపొందించుటకు గవర్నరు జనరలుచేతిలో నొక ప్రధానాయుధముగా నుపయోగించును.

సర్కారు ఉద్యోగుల హక్కులను కాపాడుట కొరకేర్పడిన ప్రత్యేక బాధ్యత, ప్రజలయెడల నేమాత్రము సానుభూతిలేక ప్రవర్తించుచు అత్యధిక వ్యయహేతువులైన ఐ. సి. ఎస్. మున్నగు అధికారివర్గముయొక్క ఉక్కుచట్రము నెప్పటివలెనే యుంచుట కేర్పడినది.

దేశరక్షణ విదేశవ్యవహారములకు సంబంధించినప్రత్యేక బాధ్యతయొక్క పరమరహస్యమేమన: భారతదేశ పరిపాలనకు పునాదియగు పశుబలము నెప్పటివలెనే చలాయించవలెననియు

ప్రదేశములందు బ్రిటిషు సామ్రాజ్య ప్రాబల్యమునకు ప్రాకులాటకు రంగస్థలముగా నుపయోగించుటకు దీనిని తమ చేతిలో నుంచుకొనుటయే. ప్రతిసాలున 50 కోట్ల రూపాయిలు తినుచు మనదేశము నాక్రమించియున్న బ్రిటీషు సైన్యము ఎల్లప్పుడు యుద్ధసన్నద్ధమై యుండును. దేశములో అశాంతి లేకుండ అణచుటకు బ్రిటిషువారికి విదేశములందు సహాయము చేయుటకు ఎల్లప్పుడు నిది సంసిద్ధముగా నుండును. సామాన్యముగా మనదేశముయొక్క రక్షణకు కావలసిన అవసరసైన్యముకంటె చాలా హెచ్చుసైన్యమును అపరిమిత వ్యయముతో నుంచి మన జాతీయాభివృద్ధి కావశ్యకములగు కార్యములకు గావలసినసొమ్ము లేకుండచేయుచున్నారు. ఈ సైనికవ్యయము తగ్గనంతవరకు విద్యగాని వైద్యము ప్రజారోగ్యముగాని ప్రజాక్షేమలాభములు కలిగించు ఏఇతరపనులుగాని అభివృద్ధిజెందుట కవకాశములేదు. ఏమైనను సరియే బ్రిటీషు సామ్రాజ్య తత్వము తనసైన్యము తగ్గింపదు. బ్రిటీషు సామ్రాజ్య తత్వమునకు భారత దేశమునం దుండవలసిన సైనికబలమునం దావంతయైన తగ్గకుండ తగిన బందోబస్తును అతిజాగ్రతగా చేయుటకు గవర్నరు జనరలు తన ప్రత్యేక బాధ్యత నుపయోగించితీరును.

## ఎనిమిదవ పరిచ్ఛేదము:

## రాజ్యాంగ చట్టములోని కట్టుదిట్టములు.

### I

### శాసన నిర్మాణాధికారములో మినహాయింపులు

పైన చెప్పబడిన అన్యాయపు నియమములు చాలక కాబోలు, ఫెడరలు రాష్ట్రీయ శాసనాధికారములపైన ఇంకను చాలా హద్దులేర్పరుపబడినవి. 109 వ శెక్షనులోని హద్దులు ఆర్థిక స్వాతంత్ర్యము నింకను సంకుచితపరచుచున్నవి. బ్రిటీషు ఇండియాలో కాపురముండువారిపైనకన్న కాపురముండనివారిపైన హెచ్చుపన్నులు వేయుటను గూర్చికాని బ్రిటీషు ఇండియాలోనే పూర్ణముగా నిర్వహింపబడని, లేదా నడుపబడని కంపెనీలపైన హెచ్చుపన్ను విధించుటనుగూర్చికాని గవర్నరు జనరలుయొక్క అనుమతిని ముందుగా పొందనిదీ ఫెడరలు శాసనసభలు చర్యదీసికొనరాదట. ఇందువలన మన దేశములోనికి వచ్చి కొన్నాళ్లుండి లాభము లార్జించిపోవు విదేశీయులపైనగాని మన దేశములో స్థాపించినదుపు కంపెనీలవిషయములోగాని మనశాసనసభలు మన దేశీయ వ్యాపారక్షేమములకొరకు గూడ పన్నులువేయ వీలులేదన్నమాట! ఇక మన వర్తక వ్యాపారములు బాగుపడుటెట్లు?

ఈ 108 వ శెక్షనులోని జి. 1. గురుతు ఉపపరిచ్ఛేదము ప్రపంచములోని అంతర్జాతీయ ఆచారమునకును ధర్మమునకును గూడ విరుద్ధముగానున్నది. ఇంగ్లాండు వేల్సు స్కాట్లాండులలో

పన్ను విధింపబడినట్టికాని, పన్ను విధింపతగినట్టికాని ఆదాయముల విషయములో మన ఫెడరలుపన్ను యొక్క భారమును తగ్గించుటనుగూర్చి బాధింపగల ఏశాసనముగానిసవరణగాని గవర్నరు జనరలు అనుజ్ఞను ముందుగా పొందనిది ఫెడరలు శాసన సభలు చేయుటకు వీలులేదు. సాధారణముగా ఒక దేశములో స్థాపింపబడిన సంస్థ ఇంకొక దేశములో వ్యాపారము చేయునప్పుడు, రెండుమారులు పన్నులు భరించి నష్టపడ కుండ ఒక చోట వసూలుచేయబడినపన్ను మొత్తమును రెండు దేశముల ప్రభుత్వములు పంచుకొను అంతర్జాతీయ ఏర్పాటులు చేయబడియున్నవి. ఈమర్యాద ననుసరించియే అధినివేశరాజ్యములందు అదేవిధమగు పన్నులు వసూలుచేయబడిన ఆదాయముల విషయములో ఇంగ్లాండు ప్రభుత్వము పన్నులో మినహాయింపులు చేయుచున్నది. ఇండియానుండి సొమ్ముపుచ్చుకొను (బాండు) ఋణపత్రిదారులు, పింఛనుదారులు, ఉద్యోగులు, వ్యాపారము నడుపువారు ఆయా మొత్తములను ఇంగ్లీషుసవరనులలో మనవల్ల పుచ్చుకొనుచు ఆయాదాయముల పైన ఇంగ్లాండుప్రభుత్వమునకు ఆదాయపుపన్ను చెల్లించుచున్నారు. ఇట్లు మనప్రభుత్వమునకు రావలసినపన్ను రాకుండపోవుచున్నది. ఆ పన్నులబాపతు అమిత మొత్తము మనకే యున్న చో ప్రభుత్వాదాయము కొరకు మనము భరించవలసి వచ్చుచున్న భారములో కొంతవరకైన తగ్గింప వీలుండెడిది. ఇట్టి సవరనుబాండు పత్రములపైన భారతదేశము సాలీనా4కోట్లు

చెల్లించుచున్నదని ఆర్థికశాస్త్రజ్ఞులగు ప్రొఫెసరు కె. టి. షా గారు అంచనా వేసియున్నారు.

బ్రిటిషు పింఛనుదారులయొక్కయు, వర్తకులయొక్కయు ఆదాయములరీత్యా మనకు వచ్చుచున్న నష్టము అపారము. పన్నులనునవి ప్రభుత్వముచేయు సేవ కొకవిధమగు ప్రతిఫలముగా చెల్లింపబడుచున్నవి. ఇంగ్లీషువర్తకులు మన కేవిధములైనపన్నులు చెల్లించకుండగనే మనప్రభుత్వమువలన క్షేమలాభములను పొంద జూచుచున్నారు. ఇండియాచట్ట మీయన్యాయమును శాశ్వతముగా నిలిపినది.

## II

## బ్రిటీషువారి శాశ్వత హక్కులు

రాజ్యాంగచట్టము యొక్క 5 వ భాగములోని 3 వ "ప్రకరణము" "విచక్షణల" కు సంబంధించిన దైనందున ఆర్థికముగా చాల ముఖ్యమైనది. 111 వ శెక్షను బ్రిటిష్ వారీ దేశములోనికి స్వేచ్ఛగా వలన వచ్చుటకు అవకాశమిచ్చుచున్నది. బ్రిటీషువా రిచ్చట ఆస్తిని సంపాదించుటకు ఆస్తిని కలిగి అనుభవించుటకును దాని నన్యాక్రాంతము చేయుటకును, ఉద్యోగములు చేయుటకు, వృత్తినిగాని, వ్యాపారమునుగాని, పనినిగాని చేసికొనుటకును బ్రిటీషువారికి సంపూర్ణ స్వాతంత్ర్యము నొసగుచున్నది. ఈ శెక్షనును పురస్కరించుకొని ఉద్యోగములు హెచ్చుగా భారతీయుల వశము చేయవలెనను విధానమును సైతము వృథ చేయు

వచ్చును. ప్రతి దేశమువారును తమ దేశముయొక్క వృత్తులు, ఉద్యోగములు, వ్యాపారములు నా దేశవాసులకే ప్రత్యేకించి యుంచుచుండగా మన దేశములో నీ విపరీతపు పద్ధతి నెలకొల్పబడుచున్నది. నేడు బ్రిటీషువారి హస్తగతమై యున్న ఆర్థికవ్యవస్థను వారిచేతులలోనుండి తప్పించుటకు మనకు వీలు లేకుండ నిరోధించుచున్నది. భీమా వ్యాపారము, బ్యాంకింగు, విదేశ మారకపద్ధతి, విదేశవ్యాపారము, కోస్తా ఓడలవర్తకము, నౌకావ్యాపారము, ప్రజోపయుక్త సేవలును బ్రిటీషువారి చేతులలోని శాశ్వత యిజారాలయి యుండును. భారతీయ సంస్థలపైన బ్రిటీషువారధికారమును సంపాదించు పద్ధతియు మార్పుజెందదు. పూర్వము భారతీయుల చేతులలో నుండిన అలహాబాదు బ్యాంకును ఇంగ్లీషు ఓడల కంపెనీయగు పి. అండ్. ఓ. కంపెనీవారు కొనివేసినారు. మన దేశసంపద నెల్ల బ్రిటీషువారు తనఖా పెట్టుకొనుచున్నను గూడ మనమేమి చేయుటకును వీలులేకుండ ఈ సెక్షను మన కాలుసేతులు కట్టివైచుచున్నది. వ్యాపార రక్షణకొరకు మన మిదివరకేదైన చర్య దీసికొన్నచో విదేశీయులు వానిని తప్పించుకొనుటకు వెంటనే ఈ దేశములోనే కంపెనీలను స్థాపించుట ప్రారంభింపసాగిరి. 'పరస్పరమర్యాద' లను నొక క్రొత్త సిద్ధాంతమును మిషగా గయికొని మన మేచర్యయు దీసికొనరాదనుచున్నారు! ఉదాహరణమునకు: ఇంగ్లాండులో మన పయిన లేనిఅడ్డంకులు వారికి మనమిచట కలిగింపరాదని సెక్షను విధించుచున్నది. నిజముగా మన దేశమునుండి ఆ దేశ

మునకు పోయి అచ్చట ఆస్తిని సంపాదించినకాని, ఉద్యోగము చేసికాని, వర్తకముచేసికాని జీవించువా రరుదుగా నున్నారు. అక్కడనుండి యీ దేశమునకు వచ్చి పడువారి సంఖ్యయే లెక్కకు మీరియున్నది. ఇట్టితరి పరస్పరమర్యాదలసూత్రము ఎంతఅన్యాయమో యూహింపుడు. మరియు బహిరంగముగా మనవారిపైన ప్రత్యక్షపు నిషేధములు లేకపోయినను ఇంగ్లాండులోని ఆచారవ్యవహారములే మనవారి కచ్చటకు బోయి ధనార్జనచేయ వీలులేకుండ చేయుచున్నవి.

మనకంపెనీ "లా" (ధర్మశాస్త్రవిధులు) ఇంగ్లీషుకంపెనీలకు వాని వాటాదారులకు, ఉద్యోగులకు, ఏజెంట్లకు, వాని నౌకర్లకుగూడ వర్తించదని 113 వ శెక్షను శాసించివైచినది. మన ఫెడరలు శాసనసభలవారు వారి నిండియాలోనే కంపెనీ స్థాపించమనికాని, వారి కార్యస్థానముల నిచ్చటనే పెట్టుకొనమనికాని, వానిమూలధనము నీదేశపు రూపాయలలోనే యుంచుకొనవలసినదని గాని ఎట్టి నిరోధమునుగాని చేయుచు శాసింప రాదనియు నీశెక్షను విధించుచున్నది. ఇందువలన నీకంపెనీలతో వ్యవహారము జరుపు మనదేశీయులకు ఆ కంపెనీల లోతుపాతులుగాని, మంచిచెడ్డలుగాని తెలియుట కెట్టి యవకాశము నుండదు. ఆ కంపెనీలు దివాలా తీసినప్పుడు వాని అస్తిపయిన విదేశ ఋణదాతలకే (చార్జీ) హామీలుండును గాన మన ఋణదాతలకు మిగులున దేమియు నుండదు. ఈ విదేశపుకంపెనీలన్నియు మన దేశవర్తకమునెల్ల విదేశీయుల చేతులలోనుంచుటకే తమ అపారమగు బలము నుపయోగిం

చుచు మనకు హానికలిగించుచున్న వని సెంట్రలుబ్యాంకింగు ఎంక్వైరీ కమిటీవారి నివేదికలలో శ్రీ మనూ సుబేదారుగారు తమ ఆక్షేపణలో చెప్పియున్నారు. మర్కెంటైల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాయొక్క సభాపతియగు బ్యూమాంట్ పీస్‌గారు ఈ దేశములోని మూలధనము మనదేశమునుండి బయటకు ప్రవహించుటకు బ్రిటిష్‌బ్యాంకులే కారణముగ నున్నవని చెప్పిరనియు శ్రీమనూ సుబేదారుగారు బయల్పరచినారు. ఇండియా దేశీయు లెంత విద్యా పారంగతులయినను, ఎంత తెలివికలవారయిననుగూడ వారిని త్రోసిపుచ్చి ఇంగ్లాండు బ్యాంకులలోని రెండవరకపు ఆంగ్లేయ గుమాస్తాలకే బ్రిటిషుబ్యాంకు లవకాశ మిచ్చుచుండునని ఠాకూరు గారు తమగ్రంథమున వ్రాసియున్నారు. ఈ శ్లేక్షను ప్రకారము ఫెడరలుకంపెనీ 'లా' ధర్మములో బ్రిటీషుకంపెనీలు సర్వాధికారముగల స్వతంత్రసంస్థలుగా చేయబడినట్లు తోచగలదు. రాజ్యాంగచట్టముద్వారా గవర్నరు జనరలునకీయబడిన సర్వాధికారములకన్న గూడ ఈనిరంకుశ ఆర్థికసామ్రాజ్యతత్వమే అత్యంతభయంకరముగ నున్నది. ఏలననిది మన సంపదలనెల్ల తోడివేయుటకు కారణమగుచున్నది. 11లవ శ్లేక్షను యొక్క 2 వ ఉపపరిచ్ఛేదము ప్రకారము ప్రతి బ్రిటీషుకంపెనీకిని మన కంపెనీలకువలెనే పన్నుల విషయములో అంతగాని, కొంతగాని మినహాయింపులుచేసి అధికాదరము జూపవలసిన బాధ్యత మనపైన మోపబడినది. ఈ శ్లేక్షనులోకూడ ఒక 'పరస్పర మర్యాదల' సూత్రము చేర్చబడినది. ఇదియంతయు

బాగుగనే యున్నది. కాని ఇంగ్లీషువారి కంపెనీలను ప్రోత్స హించుటకొరకు ఇండియా ప్రభుత్వపు బొక్కసమేల నష్టపడవల యునో తెలియుటలేదు. మన పరిశ్రమలను నాశనముచేయుట తప్ప ఆకంపెనీలు మనకు చేయు మేలేమి? ఇండియాలోని పారి శ్రామికుని ప్రోత్సహించుటకొరకేగదా అతనిపైన తక్కువ పన్నులే విధించి తక్కిన జనసామాన్యము హెచ్చుపన్ను భరిం చుట? బ్రిటిషుపారిశ్రామికునికొరకును కంపెనీలకొరకునుగూడ మనము హెచ్చుపన్నులనేల భరించవలె? ఇది యన్యాయమేగాని మనము నోరెత్తుటకు వీలులేదు. ఒక్క స్త్రీపురుషులయొక్క లింగభేదములోతప్ప తక్కిన అన్నిమార్పులనుకూడచేయుటకు అన్నివిషయములందు ఇంగ్లీషు పార్లమెంటుకు సర్వాధికార ములుగలవని రాజ్యాంగధర్మశాస్త్రజ్ఞు లుద్ఘోషించు మాట నిజమేకదా!

115 వ శెక్షను ప్రకారము మనకోస్తా ఓడల విషయ ములోకూడ మనమేమి చేసికొనుటకు వీలులేదు. ఓడవిషయ ములోగాని కెప్తానును గూర్చికాని ఉద్యోగులను గూర్చికాని ప్రయాణికులనుగూర్చికానిసరకువిషయములోగానిమనవారిపట్ల పక్షపాతము చూపించు శాసనము లెవ్వియుగూడ మనము చేసికొనరాదట! ఇక్కడకూడ మనకన్నులు మూయుటకొరకు పరస్పరమర్యాదలసూత్రమును వ్రాసినారు. ఇంగ్లాండువారు మనపైనవిధింపనిహద్దులను వారిపైన మనమువిధింపరాదట! మనయోడలేవైనను వారితీరములందుతిరుగుచున్నగదా, వారు మనపై నేవైన నిషేధములు ప్రయోగించినారని చెప్పుకొనుట

కైన అవకాశముండుట! నిజమునకు ఇంగ్లాండుతీరము చుట్టును ఇంగ్లీషువారు తప్ప ఇతరు లెవ్వరునుగూడ ఏఓడలు నడుపుటకును ఎట్టి అవకాశమును లేదు. ఇంగ్లాండువారే తమ నౌకావ్యాపారమును వృద్ధిచేసికొనుటలో నెన్నినావిగేషను చట్టములను చేసికొనలేదు? ఈ సంగతిని గమనించువా రెవ్వరు?

116 వ సెక్షనుప్రకారము ఇండియాలో భారతీయ కంపెనీల కేయేధనసహాయము, ధనదానములు (గ్రాంటులు, బౌంటీలు, సబ్సిడీలు) ఒసగబడునో అట్టివి ఇంగ్లీషుకంపెనీలకుగూడ ఒసగబడవలెననియు, అధికాదరణ చూపబడవలెననియు శాసింపబడినది. (సర్వాధికారులగు గవర్నరు జనరలుల మెప్పుకొరకు) మెహర్బానీకొరకు, మనవారే, ఇంగ్లీషుకంపెనీల కివి యర్పింతురనుటలో నాశ్చర్యమేమి కలదు?

దీనియర్థ మేమనగా, మనము స్వదేశ పరిశ్రమలను ప్రోత్సహించుట నైనను మానుకొనవలెను; లేదా వానిగొంతును నులిమి నశింపజేయు విదేశీపరిశ్రమలనుకూడ సత్కరించిరైన తీరవలెను! 'పరస్పర మర్యాదల' విషయములో ఇండియాగవర్నమెంటును ఇంగ్లీషు ప్రభుత్వమును ఏదైన ఒడంబడికను చేసికొన్నచో నీభాగములోనివిధులు నిలుపుదలచేయుచు సభాయుతుడగు రాజాజ్ఞ జారీచేయబడునని 118 వ సెక్షను చెప్పుచున్నది. మనకును వారికిని న్యాయముగ నుండగల ఒడంబడిక జరుగుటయనునది గగనకుసుమము. ఈఘోర నిబంధనలు నిలుపుదల యగుటయు అసంభవమే.

బ్రిటిషువారికి దేశమునగల పెట్టుబళ్ళయొక్క మొత్తము గమనించినతప్ప ఈశాసన నిబంధలయొక్క అంతరార్థము తెలియదు. బ్రిటిషువారీ దేశములో పెట్టినపెట్టుబడి యొక్క మొత్తము 1300 కోట్లరూపాయిలు. 1931-32లో ఈ దేశములో వ్యాపారము చేయుచుండిన బ్రిటీషుకంపెనీల సంఖ్య 911. చెల్లింపబడిన మొత్తము మూలధనము 1008 కోట్లరూపాయిలు. ఈకంపెనీలలో ముఖ్యమైనవి బ్యాంకులు, భీమాకంపెనీలు, రైళ్లు, ట్రాముదారులు, వ్యాపారపారిశ్రామికకంపెనీలు, జూటుమిల్లులు, గనులు, ఈపెట్టుబళ్ళపైన ప్రతిసాలున 161 కోట్ల రూపాయిలు వడ్డీరూపముగాను లాభముగాను మన దేశము నుండి పోవుచున్నవి. దేశముయొక్క ఓడవ్యాపారమంతయు బ్రిటీషు ఓడలపైననే చేయబడుచున్నది. నూటికి 2 వంతులు సముద్రవ్యాపారము 8 వంతులు కోస్తా వ్యాపారముమాత్రము మన ఓడలపైన జరుగుచున్నది.

మన దేశముయొక్క ఆర్థికోత్పత్తి మార్గములపైన ఈబ్రిటీషు వాణిజ్యవ్యాపార బాధ్యస్థులే పెత్తనము వహించి భారతీయ కంపెనీలపట్లను, వ్యాపారులపట్లను బాహాటముగా విచక్షణ చూపుచున్నారు. భారతీయ వాణిజ్యవ్యాపారములు పరిశ్రమలు అభివృద్ధికావలెనన్నచో బలవంతులగు ఈపోటీదారుల బారినుండి సంరక్షింపబడి తీరవలెను. అయితే ఇది చేయుటకు వీలు లేకుండా క్రొత్తరాజ్యాంగము అరికట్టుచున్నది. బ్రిటీషు వాణిజ్యవ్యాపారులతో నిమిత్తములేకుండ భారతీయపరిశ్రమలను వాణిజ్యమును ప్రోత్సహించునట్టి ఏశాస

నముగాని తత్క్షణమే గవర్నరు జనరలువలన తొలగింపబడుట తోసివేయ బడును. అతని తీర్పునకు తిరుగులేదు.

ఇట్లు భారతదేశమునకు తగిలింపబడిన బ్రిటీషువారి మూలధనముయొక్క ఉరితాళ్లు ఎప్పటివలెనే గట్టిగా బిగి యించి యుంచబడి దేశమును ఆర్థికముగా అభివృద్ధిలేకుండ వెనుకబడియుండులాగున జేయుచున్నవి.

119 వ సెక్షను సాంకేతికవృత్తివిద్యల ప్రావీణ్యతకు, అర్హతలకు సంబంధించినది. 120 వ సెక్షను వైద్యవృత్తికి సంబంధించినది. కంపెనీల విషయములో ఇంగ్లీషువారి శ్రేయము కొరకే యేశాసనవిధులు శాసింపబడినవో ఆవిధులే ఈవృత్తుల విషయమునగూడ ఏకరవుపెట్టబడి మనకపారనష్టమును కలిగిం చునవిగను వారికి లాభము కలిగించునవిగను నున్నవి.

## III

చట్టములోని ఏడవభాగముయొక్క మొదటిప్రకరణము ద్రవ్య సంబంధమైనది. 137 వ శెక్షనునుబట్టి కొన్ని వార సత్వపు బన్నులు, "టర్మినలు" పన్నులు, కేవురుసుములు ఫెడరేషను విధించివసూలుచేసి రాష్ట్రములకు పంచియివ్వవలసి యున్నది. తన ఉపయోగనిమిత్తము నిలిపి యుంచుకొనుటకు వానిపైన "సర్చార్జీలను" కూడ ఫెడరేషను విధించవచ్చును. 168 వ సెక్షను వ్యవసాయేతర ఆదాయములపైన పన్నులను గూర్చినది. దీనిప్రకారము ఆదాయపుపన్ను ఫెడరేషనే విధించి వసూలుపరచి సభాయుతుడగు రాజు జారీచేయు కవున్సిలు ఆర్డ

రులో విధింపబడిన ప్రకారము నూటికింతయని నిర్ణయింపబడిన కొన్నివంతులు నిలువయుంచి మిగతమొత్తము ఆయారాష్ట్రముల కొసగబడును. నిలువయుంచుకొనునది క్రమక్రమముగా తగ్గించబడును. ఆదాయపుపన్నుపైన సర్చార్జీలు విధించుటకు తన ఉపయోగముకొరకు నిలువయుంచుకొనుటకు ఫెడరేషను కధికారమున్నది. (ఈపంపిణీలవిధానములో గవర్నరు జనరలు కొంతరాజ్యతంత్రము ప్రయోగింప గలుగును.)

140 వ సెక్షనుప్రకారము ఉప్పుపన్ను అబ్కారీపన్ను ఎగుమతిసుంకములు, ఫెడరేషను విధించి వసూలు చేయును. అయితే ఫెడరలు శాసనసభ నిర్ణయించిన ప్రకారము, ఈ సొమ్ము అంతయుగాని కొంతగాని రాష్ట్రములకు పంచియివ్వవచ్చును. రాష్ట్రములకు సంబంధముగల పన్నులు విధించుటను గూర్చిన శాసనములు ప్రవేశపెట్టుటకు ముందుగా గవర్నరు జనరలు అనుమతిని పొందితీరవలెనని 141 వ సెక్షనుశాసించుచున్నది. దేశములోని ఒకతరగతికి నింకొకతరగతికిని రాజకీయ హక్కుల విషయమున ఉద్యోగములవిషయమున స్పర్థ వైషమ్యము పుట్టునట్లు చాణక్యనీతిని ప్రయోగించు రీతిగనే రాజ్యతంత్ర నిపుణుడగు గవర్నరుజనరలు ఒకరాష్ట్రమునకింకొక రాష్ట్రముతో కలహములు వైషమ్యములు కలిగించి అన్ని విషయములందు తనపంతము నెరవేర్చుకొనగలుగును. మత ప్రధానమగు సాంఘిక వైషమ్యములే గాక రాష్ట్రభక్తి ప్రధానమగు సాంఘిక వైషమ్యములుగూడ ప్రజ్వరిల్లుటకీ ఫెడరలు ద్రవ్యపద్ధతి పునాదులు వేయుచున్నది.

**రిజర్వు బ్యాంకు:**

152 వ శెక్షనుగూడ దేశముయొక్క ఆర్థికవిధానము నకు సంబంధించినదే. దీనినిబట్టి రిజర్వు బ్యాంకియొక్క గవర్నరులను డిప్యూటీ గవర్నరులను నియమించుటకును, తొలగించుటకును సెంట్రల్ బోర్డును రద్దుపరచుటకును అందుకు సంబంధించిన ఇతరచర్యలు తీసికొనుటకును, తుద కాబ్యాంకిని విలయము చేయుటకునుగూడ గవర్నరుజనరలుకు అధికారము కలదు. 153 వ శెక్షనుప్రకారము ఫెడరేషనుయొక్క చలామణి నాణెములకు సంబంధించిన చిత్తుచట్టములు, సవరణలు, గవర్నరుజనరలుయొక్క అనుమతిని ముందుగా పొందియుండవలెను. ఈరెండు శెక్షనులు కలిపి చదివినచో మన కొనుగోలు శక్తియు, పరపతియు గవర్నరుజనరలు చిత్తముపైన నాధారపడియుండునని తెలియగలదు. కేంద్రబ్యాంకి వ్యవస్థయొక్క ఆర్థికపద్ధతులను పరిశీలించినచో దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించుటకొరకుగాని, వానిని నిర్మూలనము చేయుటకొరకుగాని ఈ అధికారముల నెట్లెట్లుపయోగింప వీలుకలదో తెలియును. దేశముయొక్క సంపదను కొల్లగొనుటలో నీక్రియాధికారశక్తి యెంతబలవంతమగు ఆయుధమో అర్థశాస్త్రజ్ఞు లెరుగుదురు. బంగారును దేశమువెలుపలికి తరలించునట్లుగాని, దేశములోని కాకర్షించి రప్పించునట్లుగాని చేయగలదీ శక్తియే. 1933 వ సంవత్సరపు ఆర్థికమహాసభలో "కాలు" గారు సెలవిచ్చినట్లు మనదేశములోనుండి బంగారు ప్రవహించిపోవుటకు గల కారణము ఇండియాప్రభుత్వ మీతరుణమున చలామణిని

సంకుచితపరచుపద్ధతిని బుద్ధిపూర్వకముగా ప్రయోగించి యుండుటయే. చలామణి- మారకము, ద్రవ్యపద్ధతులపైన గవర్నరు జనరలుకు ఇవ్వబడిన సర్వాధికారము, ఇంగ్లీషు పారిశ్రామికులకు అమితముగా తోడ్పడునటుల నుపయోగింపబడుననుటకు సందియములేదు.

ప్రభుత్వ ఋణము:

రెండవప్రకరణము ఋణములు చేయుట, లెక్కల తనిఖీ ( ఆడిటు ) కిని సంబంధించినది. 161 వ శెక్షను ప్రకారము, భారత దేశ రివిన్యూ ఆదాయపు హామీపైన ఋణము తెచ్చుటకు ఇండియారాజ్యాంగ కార్యదర్శికిగల అధికారము ఫెడరేషను స్థాపింపబడగనే నిలిచిపోవును. భారత దేశ ఋణములలో చాలవరకు మనము భరింపనక్కరలేనివని కరాచీ కాంగ్రెసుమహాసభ చేసిన తీర్మానమునకు భయపడి యీ శెక్షను నిర్మించియుందురు. నిజమునకు ఇంగ్లీషువారి కిక్కడ శాశ్వతముగా ఘనీభవించియున్న హక్కులు పోవునేమో యనుభయము, వానిని కాపాడుకొను ఆతృతయు, ఇండియా చట్టమునందెల్లయెడల గానవచ్చుచున్నవి. ఋణముల విషయమున రాజ్యాంగకార్యదర్శి యధికారము పోయినదని పేరే గాని, 315 వ సెక్షను ప్రకారము ఫెడరేషను స్థాపింపబడువరకు అనిర్ణీతమగు నీమధ్యకాలమున రాజ్యాంగకార్యదర్శి యెంత సొమ్మైనను వెనుకటివలెనే అప్పు చేయుచుండ వచ్చునని శాసింపబడినది. 162 వ సెక్షను ప్రకారము ఫెడరలు శాసన సభ నిర్ణయించు పరిమితిలోపల, వారునిర్ణయించు హామీల

నొసగి గవర్నరుజనరలే అప్పుచేయవచ్చునని నిర్ణయింపబడినది. 163 వ సెక్షనుగూడ అట్లే రాష్ట్రముల విషయములో రాష్ట్రీయగవర్నరులును, రాష్ట్రశాసన సభలును నిర్ణయించు హద్దులలో అప్పుచేయవచ్చునని విధించుచున్నది. సొమ్ము లేనప్పుడు గవర్నరుజనరలుల యిష్టప్రకారము అప్పుచేయకుండ ఏశాసనసభ నిరోధించును? గవర్నరును గవర్నరుజనరలు నిందు తెలివితేటల నుపయోగించి పనిచేయగలరు.

ఆడిటు (లెక్కలతనిఖీ):

166 వ సెక్షనుప్రకారము భారతదేశమున కొక ఆడిటరు జనరలు ఆంగ్లరాజువలన నియమింపబడును. ఈఉద్యోగనిర్మాణము దీని పుట్టుపూర్వోత్తరములనుబట్టిఇది కేవలముఇంగ్లీషువారి కొరకేర్పడినకోటబురుజేయనియూహింపవచ్చును.. 170వసెక్షనుప్రకారముగవర్నరుజనరలు స్వతంత్రవివేచన నుపయోగించి ఇండియన్ హోంఅకౌంటుల ఆడిటరనబడునింకొక యుద్యోగిని నియమించునట! ఫెడరేషనుయొక్క రివిన్యూఆదాయముకుసంబంధించినట్టియు- రైల్వేఅథారిటీ యొక్కయు,రాష్ట్రములయొక్కయు, వ్యవహారములలో ఇంగ్లాండులో జరుపబడు వ్యవహారములనుగూర్చిన (ఆడిటు) లెక్కతనిఖీపనులు నిర్వహించును. ఈపనులన్నియు నిర్వహించతగినఆడిటరుజనరలొకడునియమింపబడుచునేయుండగా మరల నీయదనపుఉద్యోగమేల సృజియించవలెను? దీనివలన మనకు అధికధనవ్యయము తప్ప వేరు లాభము లేదు. 'రాజ్యాంగ సంస్కరణము' అనగనే అధికవ్యయము లుండును సుడీయను ఆంగ్లరాజ్యనీతివిధానమే బ్రిటిషు

వారిసౌఖ్యముకొరకేర్పడిన ఇటువంటి అనవసరపు ఉద్యోగములు నిర్మింపబడుటకు గల కారణము. మనసామ్మును వాడునప్పుడు, మన ఇంగ్లీషుప్రభువులు సామాన్యపు పొదుపును గూడ గమనింపరు. ఈదరిద్రభూమికి చౌకయగు పరిపాలనా పద్ధతులత్యంతావశ్యకములై యుండగా ఈరాజ్యాంగ చట్టము మితిమీరిన ఖర్చులను దెచ్చిపెట్టుచున్నది.

ప్రస్తుతము అమలులోనున్న ఋణములకు పూచీలు, ఇతరబాధ్యతలు, ఫెడరేషను భరించి తీరవలెనని 178 వ సెక్షను శాసించుచున్నది. 729 కోట్లరూపాయిలు ఋణము మనము భరించనక్కరలే దని కాంగ్రెసువా రుద్ఘోషించినందున బ్రిటీషువారీసెక్షనుద్వారా తగుజాగ్రత్తను దీసికొనినారు.

ఫెడరలురైల్వే అథారిటీ :

చట్టమురొయొక్క 8 వ భాగము ఫెడరల్ రైల్వే అథారిటీకి సంబంధించినది. రైల్వేలను నిర్మించుట, భరించుట, నడుపుట, కట్టుదిట్టపరచుట, ఈక్రొత్తఅధికారసంస్థక్రిందనుండును. ఫెడరలురైల్వేల విషయములో ఏకార్యభారముగానివహించుటయావసరమని వీరు తలచినచో అందుకు వలసిన సర్వాధికారములును వీరికుండును. ఆసందర్భములో ఇతరులతో ఏవైన ఏర్పాటులు చేయుట అవసరమని తోచినచో అట్టి ఏర్పాటులు చేయుటకును, వీరికధికారముండును. ఈశెక్షనులో గూఢముగా చెప్పబడిన "ఇతరులు" అనునది బ్రిటీషురైళ్లకంపెనీలవారు

ఆకంపెనీలవారును ఆకంపెనీల కంట్రాక్టరులు నని వేరుగా చెప్పవలెనా ?

182 వ శెక్షను ప్రకారము ఈ నూతన అధికార సంస్థలో 7 మందికి ముగ్గురుచొప్పున సభ్యులను, వారిసభాపతిని గూడ గవర్నరుజనరలే నియమించవచ్చును. 8 వ షెడ్యూలు యొక్క 1 వ శెక్షను ప్రకారము ప్రస్తుతము గవర్నరుజనరలు ఈరైల్వే అథారిటీలోని అందరి సభ్యులను గూడ నియమించుట కధికారమీయబడినది. ఫెడరలు శాసనసభ ఈ షెడ్యూలును పైవిధముగా మార్పుచేయవలెనన్నచో గవర్నరు జనరలు యొక్క అనుమతిని ముందుగా పొందవలెను. ఈ అథారిటీలో అన్నివిషయములు మెజారిటీవోట్ల తీర్మానము ప్రకారము పరిష్కరింపబడును. (8వ షెడ్యూలు 6వ విధి) అందువల్ల గవర్నరు జనరలుయొక్క మనుష్యులే అనగా బ్రిటిషువారిశ్రేయము గోరువారే దీనిలో హెచ్చుపలుకుబడిని కలిగియుందురు. మన రైల్వేపాలనము పరాయివారి పెత్తనముక్రింద చేయుబడుట వలన చాలా అనర్థకములు కలవు. సరకులరవాణాలో మనసరకులకు హెచ్చు రేటులను విదేశీయ సరకులకు అతిచౌక రేటులను నిర్ణయించి మన వ్యాపారమునకు ఆటంకములు కలిగించుచుండవచ్చును. ఇక ఇంజనులు, రైలుబండ్లు ఇతర యినుప సామానులు, ఉక్కుసామానులు విరివిగా ఉపయోగించునది రైళ్ళవారే. అందువలన మన ఇనుప ఉక్కుపరిశ్రమలను వృద్ధి చేయవలెనన్నచో రైళ్ళపరిపాలన మనకు అనుకూలమైనదిగా నుండవలెను. అందు బ్రిటీషుపక్షపాతులే యున్నచో సహజ

ముగా మన పరిశ్రమలకు వ్యతిరేకముగాను, వారిపరిశ్రమలకు వీలుగాను పరిపాలన జరుగుననుటలో నాశ్చర్యమేమి? రైళ్ళ సామగ్రికి కేంద్ర ప్రభుత్వమువారేటేట రమారమి 30 కోట్ల రూపాయలు ఖర్చుచేయుచున్నారు. ఈ వ్యయమింకను వృద్ధి గాగలదు. ఈ మొత్తము దేశీయపరిశ్రమలను వృద్ధిచేయుట కుపయోగించవచ్చునుకదా! అయితే 183 వ శెక్షనులోని సూచనలనుబట్టి ఆమొత్తము అట్లు వినియోగింపబడు లక్షణములు గానరావు. రైల్వే ఆథారిటీవారు వ్యవసాయము, పరిశ్రమలు, వాణిజ్యము, మఱియు ప్రజలయొక్క క్షేమము నాలోచించి, వ్యాపారధర్మములను (Business Principles) గూడ అనుసరించి తమకర్తవ్యమును నిర్వర్తించవలెనని ఆశెక్షను శాసించుచున్నది. "వ్యాపారధర్మములు" అనుమాటకు గల అంతరార్థము, "బ్రిటిషువస్తువులనే కొనుడు" అనుసూత్రము ననుసరించి బ్రిటీషువస్తువులనే ప్రజలు కొనునట్లు చేయుగల రవాణాకేవుల పద్ధతులను నిర్ణయించవలసినదనియే. కార్యాచరణ నీతివిధానములందు రైల్వే అథారిటీ ఫెడరలు ప్రభుత్వముయొక్క సలహానను సరించి నడుపవలెనని యున్నను, ఒక వ్యవహార మట్టిస్థితికి సంబంధించినదగునా కాదా యని ఉభయసంస్థలకు తగాదా వచ్చినచో దానిపైన గవర్నరు జనరలు తీర్మానమే తిరుగులేని కట్టకడపటి నిర్ణయమనియు విధింపబడినది. బ్రిటీషు శ్రేయము, భారతీయ క్షేమమునకు వ్యతిరేకముగనున్న సందర్భములో ఆతగవులు తీర్మానించుటలో గవర్నరుజనరలు సహజముగా బ్రిటీషుపక్షమునే యవ

లంబించి తీర్మానించుటలో నాశ్చర్యమేమి! ఈ సెక్షనులోని 4 వ ఉపవిధి ఈరైల్వే అధారిటీని ఫెడరలుప్రభుత్వాధికారమునకుగాక గవర్నరుజనరలుయొక్క అధికారమునకే లోబరచుచున్నది. అందుకు సంబంధించినంతవరకు అతనికి సర్వాధికారములు నొసగబడినవి. అందువలన రైల్వేఅథారిటీ అతనియాజ్ఞానువర్తియై తీరవలెను. ఈరైల్వేరాజ్యము కేవలము ఇంగ్లీషుపెట్టుబడిదారులకును వారిపనివారికిని ఇంగ్లీషు ఇనుపవ్యాపారులకును ఇజారా భూమిగా చేయుటకును, ఇంగ్లీషు సరకులను విరివిగా దేశములోనికి ప్రవేశపెట్టుటకును వీలుకలిగించవలెనను ఉద్దేశముతోనే ఈ నిబంధనలెల్ల చేయబడినవిగాని వేరుకాదు. ఇందుకొరకే రైల్వేఅథారిటీపైన మన ప్రజాప్రతినిధుల కట్టి పలుకుబడియు లేకుండచేయబడి బ్రిటిషువారి హక్కులనెల్ల చిరస్థాయిగా నుంచి కాపాడగల సర్వాధికారములు గవర్నరు జనరలునకీయబడినవి. 8 వ షెడ్యూలుయొక్క 12 వ ఉపవిధినిబట్టి కేంద్రరాష్ట్రీయ శాసన సభలందు గత 12 నెలలలోపుగా సభ్యులుగ నుండినవా రెవ్వరును ఫెడరలు రైల్వే అథారిటీలో సభ్యులుగానుండరాదని శాసింపబడుటయుకూడ నిందుకొరకే. 192 వ సెక్షనుప్రకారము గవర్నరుజనరలు శిఫారసుపైనతప్ప ఫెడరలు శాసనసభలు ఏరైలుదారిపైనను కేవులను రేట్లను మార్చుటకు వీలులేదు. ఇండియాలోని రైల్వేకంపెనీలకు డైరెక్టర్లను, డిప్యూటీడైరెక్టర్లను నియమించు అధికారము 199 వ సెక్షనునుబట్టి గవర్నరుజనరలునకే గలదు.

## IV

## సైనిక ఉద్యోగులు

చట్టముయొక్క 10వ భాగము, ఇండియా ప్రభుత్వోద్యోగ ములను గూర్చినది. దీనిలో ఒకటవ ప్రకరణము దేశరక్షణకు సంబంధించిన ఉద్యోగములను గూర్చినది. 232వ శెక్షనునుబట్టి సర్వసేనాని (కమాండరు ఇన్ చీఫ్) యొక్క విపరీతపుజీతము అలవెన్సులు ఎప్పటివలెనే ఇండియారివిన్యూ ఆదాయము నుండియే ఒసగబడును. నిజముగా ఈ దేశములోని సైన్యము సామ్రాజ్యసైన్యమే యని కొంతకాలముక్రిందట నింగ్లీషు ప్రధానిగానుండిన రాంశే మెక్డానల్డుగారే చెప్పియున్నారు. అయినప్పటికిని దీని సర్వసేనానిఖర్చులు మనపైననే వేయ బడినవి. 233 వ శెక్షనుప్రకారము చక్రవర్తి తన యిష్టాను సారముగ సైనికోద్యోగులను నియమింపవచ్చును. 235 వ శెక్షనుప్రకారము ఇండియా సైన్యములలో నెవ్వరికైనను చక్రవర్తి 'కమీషను' పదవులను ఇవ్వవచ్చును. ఈ సైన్య ముల కొలువునుగూర్చిన షరతులను రాజ్యాంగ కార్యదర్శియే నిర్ణయించును. 236 వ శెక్షనునుబట్టి ఈ సైన్యములోని వారి కెల్లరికిని ఇండియా గవర్నమెంటువారి ఉత్తర్వులపైన రాజ్యాంగకార్యదర్శికి అపీలు చేసుకొనుహక్కు 237 వ సెక్షను వల్ల ఇవ్వబడినది. ఈ కొలువులో నుండినవారి యొక్కయు, ఉన్నవారియొక్కయు జీతబత్తెములు అలవెన్సులు, ఫెడరేషను యొక్కయురివిన్యూపైన బద్ధతచేయబడినవి. సైన్యమునకు సం బంధించిన యేవ్యయములను గాని, రివిన్యూపైన ఆధార

పరచుటకు ఎట్టి ఆటంకములు లేవనియు శాసింపబడినది. ఈ అవకాశమును పురస్కరించుకొని ఇంగ్లాండు ప్రారంభించిన ఏ సామ్రాజ్యయుద్ధవ్యయములుగాని మనపైన రుద్దుటకు వీలుకలదు. ఈ ఉద్యోగములందు భారతీయులు నియమింపబడుటను గూర్చిన తలంపు సైతము ఈప్రకరణమున గానరాదు. భారతీయుల చేతులందుగాక పరాయివారి అధికారముక్రింద పనిచేయుచు ఇంగ్లీషువర్తకుని ధనార్జనకు మంచి రక్షణ గలుగజేయు ఈ సైన్యభారము మనపైన వేయబడినది.

ఐ. సి. ఎస్. వగైరా ఉద్యోగులు :

భారత దేశమునకు ఉక్కుచట్రముగా పనిచేసిన ఇండియన్ సివిల్ సర్వీసులోను, ఇండియను మెడికల్ సర్వీసులోను ఇండియన్ పోలీసు సర్వీసులోను, ఉద్యోగులను నియమించు అధికారము 244 వ శెక్షనుప్రకారము ఇంగ్లాండులోని రాజ్యాంగకార్యదర్శి కివ్వబడినది. ప్రజామోదమును పొందు మంత్రులు, ఈమంత్రులకే యజమానులుగా నుండు సేవకులునుగల విపరీతపువిధాన మెప్పటివలెనే యుండును. మన ఉద్యోగవర్గమునందు బ్రిటీషువారు ఇప్పుడు చలాయించుచున్న అనేకపదవులను, అత్యంతసమర్థతతోను గౌరవముతోను నిర్వహింపగల భారతీయులనేకు లున్నప్పటికిని బ్రిటిషువారినే ఉద్యోగములందు నిలుపుటకు తోడ్పడునట్టి యీపద్ధతి చాలా అన్యాయముగా నున్నది. రాజ్యాంగకార్యదర్శి సాధారణముగా ఇంగ్లీషువారినే నియమించును. ఇంగ్లీషువారితో పోటీ

చేయవలెనన్నచో భారతీయాభ్యర్థులు ఇంగ్లాండుకు పయనమై వ్యయప్రయాసలకు లోను కావలసియుండును. భారతీయ మంత్రులు తమ సేవకులగు ఐ. సి. ఎస్. ఉద్యోగులను పనిలోనుండి తొలగింపలేరు. (240వ సెక్షనులో ఆయుద్యోగులను నియమించిన హోదాగల అధికారులకుతక్కువహోదాగల అధికారులు వారిని తొలగింపవీలులేదని శాసింపబడినది.) ఒక మంత్రియొక ఐ. సి. ఎస్. ఉద్యోగిని దండించినగాని మందలించినగాని అతనిఉద్యోగషరతులనుబట్టి యతనికి గల అవకాశములకు నష్టకరముగానుండునట్లుఏనిబంధననుగాని మార్చినయెడలను, అతనికి పూర్తియగు ఉపకారవేతనము లభించు కాలపరిమితిలోపుగా అతనిపదవిని తీసివేసినను, ఈమంత్రితీర్పుపైన ఆయుద్యోగి అపీలు చేసుకొనవచ్చునని 241 వ శెక్షను శాసించుచున్నది. 247 వ శెక్షను ఈ ఐ. సి. ఎస్. ఉద్యోగులజీతమునుగూర్చియు సెలవునుగూర్చియు ఉపకారవేతనమునుగూర్చియు మఱియు వారియొక్క ఇతరహక్కులనుగూర్చియు నిబంధనలను చేయుటకు రాజ్యాంగ కార్యదర్శికే అధికారమిచ్చుచున్నది. ఈ శెక్షనుపర్యవసానమేమనగా భారతీయ ప్రజాప్రతినిధులు ఏ పదవియందైననుండి ప్రజాసేవ చేయవలెనని తలచిననుగూడ ఆయా పదవులక్రిందస్థిరసేవకులుగానిలిపియుంచబడిన ఈ ఐ. సి. ఎస్. ఉద్యోగులు, మనప్రజాప్రతినిధులకన్న బలవంతులై వారికి ఆటంకములు కలిగించుచునేయుందురు. ఒక భారతీయ మంత్రి చేయదలచిన కార్యముయొక్క రాజకీయపరిణామము భారతీయులకు క్షేమకరమును, బ్రిటీషువారికినష్టకరమునైనచో

అతనికిక్రింద పనిచేయవలసిన సివిలుఉద్యోగి ఆవనినిచేయక అవిధేయుడైననుగూడ ఆమంత్రి యాతనిని దండింపజాలడు, మందలింపలేడు, పనిలోనుండి తీసివేయలేడు. ఇక మన కీయబడిన రాష్ట్రీయస్వాతంత్ర్యమనునది యేమిటో ఊహింపుడు. 244 వ శెక్షను ప్రకారము గవర్నరు జనరలు స్వతంత్రవివేచన నుపయోగించవలసిన విషయములను నిర్వహించుటలో పనిచేయుటకు రాజ్యాంగకార్యదర్శి తగినవారిని నియమించునధికారము కలిగియున్నాడు. సహజముగా ఈ యుద్యోగములందు ఇంగ్లీషువారే నియమింపబడుదురు. ఈ క్రొత్తఉద్యోగములు, మనబంధముల నింకను బిగియించుటయే గాక మన వ్యయభారము నింకను భరింపశక్యముకానిదిగ జేయును. 272వ శెక్షను ఆర్థికరీత్యా చాలా అన్యాయమైనది. శాశ్వతముగా హిందూ దేశము వెలుపల నివసించు బ్రిటీషు పింఛనుదారులకు చెల్లించు ఉపకారవేతనములును వారవిషయములో చెల్లించవలసిన పింఛను మొత్తములును, ఇండియా దేశపు పన్నులకు లోబడవట!

ఇంగ్లాండులోని ఇండియా ఆఫీసు ఖర్చులలో కొంతభాగము 'ఇండియా దేశాదాయములోనుండి చెల్లించవలసినట్లు 280వ శెక్షను విధించుచున్నది. ఇండియాఆఫీసు, మనఫెడరేషను తరపున చేయుపనులకొరకే యట యీ వ్యయమును మనము భరించవలసినది! ఈవ్యయపు మొత్తమును బ్రిటీషు కోశశాఖవారును, గవర్నరుజనరలును కలిసి ఆలోచించి నిర్ణయింతురట. అనగా ఇంగ్లీషువారు మనరివిన్యూనుండి యీ పేరున

తమకిచ్చువచ్చినంత పైకముతీసికొందురన్న మాట. 281వ సెక్షను నేడు రాజ్యాంగ కార్యదర్శిక్రింద బనిచేయు శాశ్వత సిబ్బంది నెల్ల ఇకముందు అతని కార్యాలయశాఖక్రిందకి మార్చుచున్నది. అయితే యీ మార్పుకు ముందుగా వారి కివ్వవలసిన పింఛనులు, అదనపు అలవెన్సులు, నష్టపరిహారములు, పని చాలియుకొనునప్పుడిచ్చు రిటైరింగు అలవెన్సులు, యినాముగా నిచ్చు ఉపకార వేతనములు కలిసిన సొమ్ములో కొంతభాగము మన రివిన్యూనుండి భరించవలెను.

## V
## ఫె డ ర ల్ కో ర్టు

కేంద్రమున స్థాపింపబడు ఫెడరల్ ప్రభుత్వమునకును వివిధ రాష్ట్రములకును, సంస్థానములకును మధ్యవచ్చుతగవులు పరిష్కరించుటకును, రాజ్యాంగధర్మమునుగూర్చి గవర్నరుజనర లే దైనను సలహా అడిగినచో అట్టి సలహానిచ్చుటకును, రాజ్యాంగ చట్టము యొక్క 9 వ భాగము 200-218 శెక్షను ఒక ఫెడరల్ కోర్టును స్థాపించుచున్నది. ఇది 1937 వ సంవత్సరము అక్టోబరు 1 వ తేదీనుండి అమలులోనికి వచ్చినది.

ఈకోర్టుకు ఒక ప్రధానన్యాయాధిపతిని ఇరువురు సామాన్యన్యాయాధిపతులను ఆంగ్ల చక్రవర్తియే నియమించును. ఈకోర్టువారు సాధారణముగా ఢిల్లీలో సమావేశమై పరివేష్టింతురు. ఫెడరేషనుకు రాష్ట్రములకు సంస్థానములకు మధ్య ఏదైన ఒకహక్కునుగూర్చిన తగవును ఈకోర్టుపరిష్కరించును. అయితే సంస్థానముకుసంబంధించినంతవరకు ఆతగవు చట్టము

యొక్క లేక చక్రవర్తి జారీచేసిన ఆర్డర్ ఇన్ కవున్సిలు యొక్క లేదా సంస్థానము ఫెడరేషనుతో చేసికొనిన ఒడంబడిక యొక్క అర్థాన్వయమును గూర్చినదై యుండవలెను.

దేశములోని హైకోర్టు తీర్మానించిన వివాదలందు రాజ్యాంగచట్టములేదా ఆర్డర్ ఇన్ కవున్సిల్ యొక్క అర్థాన్వయమునుగూర్చిన న్యాయశాస్త్రాంశ మేదైన నున్నదని ఆహైకోర్టులు నిర్ణయించినచో వాని తీర్పులపైన ఫెడరల్ కోర్టు అప్పీళ్ళను విచారించుట కధికారముకలదు. కేంద్రశాసన సభలు చట్టము ద్వారా కొన్ని పెద్ద సివిలుదావాలలో హైకోర్టు తీర్పులపైన ఫెడరల్ కోర్టుకు అప్పీళ్ళను విచారించు అధికార మొసగ వచ్చును. అట్టి విషయములందు హైకోర్టు తీర్పులపైన ప్రీవి కవున్సిలుకు అప్పీళ్లుతీసికొనిపోవు అధికారము తీసివేయవచ్చును. సంస్థానములందలి హైకోర్టులు చేసిన తీర్పులందు చట్టమును గూర్చినట్టి లేదా ఆర్డర్ ఇన్ కవున్సిలును గూర్చినట్టి అర్థాన్వయమునందు పొరబాటున్నదను కారణమున ఫెడరలు కోర్టుకు అప్పీలు చేయవచ్చును. ఫెడరలు కోర్టుతీర్పులపైన ఇంగ్లాండు లోని ప్రీవికవున్సిలుకు అప్పీలుండును.

## VI

288 వ సెక్షనుప్రకారము ఏడెను మన దేశ ప్రభుత్వము నుండి వేరుచేయబడి ఇంగ్లాండులోని కాలనీల కార్యదర్శికి వశ పరచబడును. ఇది పూర్వము బొంబాయిరాజధానిక్రింద నుండ గా దానిని వృద్ధిచేయుటకు మన సొమ్మంతో వ్యయము చేయ బడినది. అందనేక భారతీయులు వలస నెలకొని వర్తకము

చేయుచు పెట్టుబడులు పెట్టియున్నారు. వీరి క్షేమమునుగూర్చి ఇండియాచట్ట మేమియు చెప్పుటలేదు. ఇండియారాజ్యాంగము నిర్మించుటలో నిచ్చటబ్రిటీషు వారికి గలహక్కులవిషయములో శ్రద్ధవహించినట్లు ఏడెనులోని భారతీయులహక్కులనుగూర్చి ఏల శ్రద్ధవహింపరో!

## సింధు రాష్ట్రము :

289 వ శ్లోకను ప్రకారము బొంబాయిరాజధానినుండి సింధురాష్ట్రము వేరుచేయబడినది. పైకి మహమ్మదీయుల పక్షమువారి కోర్కెలను దీర్చుటకే ఇట్లు విడదీయబడినట్లు కనబడును. కాని నిజముగా దీనిని విడదీయుటలో బ్రిటిషు వారి యుద్దేశము వేరు. ఈ ఆర్థిక దుస్థితిలో సింధురాష్ట్రము లోని భూఖామందులవద్ద నుండియు, రైతులవద్ద నుండియు వేలకొలది యెకరముల భూమిని అతిచౌకధరలకు బ్రిటీషు వర్తకులు పెట్టుబడిదారులు కొనివేసినారు; ఇంకను కొను చున్నారు. వారి యుద్దేశము, ఈసింధురాష్ట్రమును ఇంగ్లాండు వర్తకమునకు పట్టుకొమ్మగా జేసికొనవలెననియే. సింధు రాష్ట్రమున విరివిగా ప్రత్తిని పండించి దానిని ఇంగ్లాండునకు పంపి అచ్చటినూలుపరిశ్రమకు తోడ్పడ గలందులకు వలసిన ప్రయత్నములెల్ల బ్రిటీషువర్తకులతోపాటు మన ప్రభుత్వము వారుకూడ చేయుచున్నారు. వల్లపువరిసాగుపైన హెచ్చుపన్ను విధించుచు దానికి బదులుగా ప్రత్తిపంటను వేసినచో తక్కువ పన్ను విధించుచు ప్రత్తిపంటను ప్రోత్సహించు చున్నారు. సుక్కూరు బారేజి అనబడు ఆనకట్టనుండి నీటి సరఫరా

విషయములోకూడ ఈ విధానమునే యవలంబించినారు. ప్రత్తిపంటకు చౌకగాను పరిసాగుకు ప్రియముగాను నీటితీరువ నిర్ణయింపబడినది. సింధురాష్ట్రములో కొన్నికోట్ల రూపాయిల పెట్టుబడితో నొకబ్రిటీషు వర్తక సమ్మేళన సంస్థ స్థాపింపబడి అనేక ఫ్యాక్టరీలను లేవదీసి దేశములోని ప్రజోపయుక్త సేవల నెల్ల ఇజారాపొందు ప్రయత్నములు జరుగుచున్నట్లుకూడ వదంతులు ప్రబలినవి. నిజముగా సింధురాష్ట్రము బ్రిటీషు వర్తకుల లాభముకొరకే విడదీయబడినది.

## బర్మాదేశము :

46 వ శెక్షనుప్రకారము బర్మాదేశముకూడా మన ప్రభుత్వమునుండి వేరుచేయబడినది. బర్మాలోగల ఖనిజసంపదను బ్రిటీషువారు తనరపు చేసికొనుటకు పూర్ణావకాశము లుండుటకొరకే ఇట్లు వేరుచేయబడినది. బర్మాను బ్రిటీషువారు స్వప్రయోజనముకొరకు వినియోగించుటకు వీలుండునట్లు చట్టమునం దనేక కట్టుదిట్టములు చేయబడినవి. 321 వ శెక్షను బర్మాయొక్క (పరిపాలన) కార్యనిర్వహణాధికారమెల్ల గవర్నరునందు నెలకొల్పినది. ఈచట్టమునందు చెప్పబడిన అధికారములు కర్తవ్యములు మాత్రమేగాక, ఆంగ్లరాజుయొక్క చిత్తప్రకార మొసగబడు ఇతర అధికారములుకూడ గవర్నరునకుండునట! 321 వ శెక్షనుయొక్క 2 వ ఉపవిధిప్రకారము ఈఇతరఅధికారము లనునవి చట్టములో చెప్పబడిన హద్దులకు లోబడి చలాయింపబడునవికావు. భారతీయగవర్నరుకనతలుకన్నగూడ ఈబర్మాగవర్నరుకు అధికాధికారములు

కలవు. అందరికిని విదితమైన కారణములనుబట్టి భారత దేశ రాష్ట్రముల కివ్వబడిన అల్పపు రాష్ట్రీయస్వాతంత్ర్యము సైతము బర్మా కివ్వబడలేదు. 323వ శెక్షను గవర్నరుకు సలహా నిచ్చు ఒక మంత్రిసభను నిర్మించుచున్నదిగాని ఆమంత్రులు గవర్నరుయొక్క స్వతంత్ర వివేచనకు సంబంధించినట్టి విషయములందును ప్రత్యేక బాధ్యతలకు సంబంధించినట్టి విషయములందును సలహానిచ్చుటకు వీలులేదు. మంత్రులను పేర్కొనుట, నియమించుట, తొలగించుట, వారిజీతములు నిర్ణయించుట—గవర్నరుచిత్తానుసారముగ స్వతంత్రవివేచనతో జరుగవలసినవే యని 324వ శెక్షను విధించుచున్నది. ఈమంత్రులితని చేతులలోనికీలుబొమ్మలు. 325వ సెక్షను అతనిస్వతంత్ర వివేచనకుసంబంధించినవిషయములను వివరించుచున్నది. దేశ రక్షణ, క్రైస్తవమతము, మినహాయింపబడిన ప్రదేశములు (ఇవన్నియు ముఖ్యముగా ఖనిజసంపదయున్న ప్రదేశములే) ద్రవ్యపద్ధతి, విదేశవ్యవహారములు, బర్మాకును తక్కిన అధినివేశములకునుగల సంబంధములు. గవర్నరు ఈ కార్యములకొఱకు ముగ్గురు 'కౌన్సెలర్ల'ను నియమించును. మఱియు ద్రవ్యసంబంధవిషయములకొరకు కొక అడ్వైజరునుగూడ నియమించును. వీరందరు నతనికి బాధ్యులుగ నుందురు. 326వ సెక్షను గవర్నరుయొక్కప్రత్యేకబాధ్యతలను వివరించుచున్నది. ఇవి యిండియా గవర్నరుజనరలుకున్న బాధ్యతల వంటివే. గవర్నరు తన స్వతంత్ర వివేచనకు సంబంధించిన విషయములలో రాజ్యాంగ కార్యదర్శి అధికారముక్రింద

నుండును. శాసన నిర్మాణము, విచక్షణలు, నిరోధములు, ద్రవ్యవిషయములు, అప్పులు తెచ్చుట, బర్మారైల్వేబోర్డు, బర్మా ప్రభుత్వోద్యోగముల విషయమున బర్మాగవర్నరుకు గల అధికారములన్నియు ఆయావిషయములం దిండియాలో గవర్నరుజనరలుకు గలట్టివే. బర్మా బ్రిటిషువారు తమలాభము కొరకు పయోగించుకొను ఒక వలసరాజ్యముగా చేయబడినది.

1935 సం॥ ఇండియా రాజ్యాంగ చట్టము మనలను ఏరోపా మహాసంగ్రామమునాటికి పూర్వముండిన రోజులకు తీసికొని పోవుచున్నది. 1919వ సంవత్సరపుచట్టముక్రింద నియమింపబడిన గవర్నరుజనరలుకన్న ఈక్రొత్త చట్టముక్రింద నియమింపబడిన యతనికి హెచ్చు అధికారము లుండును. 1919వ నాటి ద్వంద్వపరిపాలనము డయార్కి క్రింద గవర్నరుకుండిన అధికారముకన్న ఈక్రొత్తరాష్ట్రీయ స్వపరిపాలనములోని గవర్నరు కధికనిరంకుశాధికారములు కలవు.

## తొమ్మిదవ పరిచ్ఛేదము : "రాష్ట్రీయ స్వపరిపాలనము"

### I

ఇండియారాజ్యాంగచట్టముయొక్క మూడవభాగమున రాష్ట్రీయ స్వపరిపాలన మనబడు ప్రణాళిక విపరింపబడినది. చట్టములోని నిబంధనలను జూచినచో నిది రాష్ట్రీయ స్వపరిపాలనముగాక గవర్నరుకొయొక్క నిరంకుశపరిపాలనమే యని తెలుసు. 40 వ శెక్షనుప్రకారము రాష్ట్రముయొక్క (కార్య నిర్వాహక) పరిపాలనాధికారము గవర్నరునందు నెలకొల్ప

బడినది. 50వ శెక్షను అతనికి సలహానిచ్చి సహాయముచేయుట కొక మంత్రుల సభను నిర్మించుచున్నది. అయితే గవర్నరు యొక్క స్వతంత్రవివేచన నుపయోగించవలసిన వ్యవహారము లను గూర్చి వీరతనికి సలహానిచ్చుటకుగూడ వీలులేకుండ చేయ బడినది. 51వ శెక్షనునుబట్టి ఈ మంత్రులు, గవర్నరువలననే పేర్కొనబడి అతనివలననే నియమింపబడి అతనిచిత్తము వచ్చి నంత కాలమే ఉద్యోగమున నుండునట్లు శాసింపబడినది. 52వ శెక్షను గవర్నరుయొక్క ప్రత్యేక బాధ్యతగల అధికారమం డలములను వివరించుచున్నది. శాంతి, భద్రతలు, అల్పసంఖ్యా కులు, ప్రభుత్వోద్యోగులు, సంస్థానములు, బ్రిటీషువర్తకులు గవర్నరు జనరలు ఆజ్ఞలు మినహాయింపబడిన ప్రదేశములు. సింధురాష్ట్రమున సుక్కూరు బారేజి అనకట్ట మధ్యరాష్ట్రము లందు బేరారు ఈ విషయములందు గవర్నరు మంత్రులతో ఆలోచించునుగాని కార్యాచరణమున తనస్వబుద్ధినే ఉపయో గించును. అనగా మంత్రుల సలహాను త్రోసివేయవచ్చును. ప్రజాప్రభుత్వ పద్ధతుల ప్రకారము పరిపాలన జరుగునని రాజ్యాంగనాటకము నాడుట కుపయోగింపబడు రాజనిర్దేశ పత్రము * ( Instrument of instructions) అనగా గవర్న

* రాజనిర్దేశపత్రము (Instrument of instructions) యొక్క 7వ పేరాలో శాసనసభలో దృఢమైన (మెజారిటీ) అధికసంఖ్యాక పక్షమును గలిగిన రాజకీయనాయకునితో సంప్రతించి శాసనసభ విశ్వాసమునకు పాత్రులగువారిని మంత్రివర్గముగ నేర్పాటుచేయవలెననియు సాధ్యమైనంతవరకు మైనారిటీలకు అనగా అల్పసంఖ్యాక జనసంఘములకు గూడ మంత్రిసభలో ప్రాతినిధ్య మొసగబడునట్లు కనిపెట్టవలెననియు గవ

రునకు ఆంగ్లచక్రవర్తి, వంపుఫర్మానా గవర్నరు ఉల్లంఘింప వీలు లేని రాజశాసనము కాదని ౬౩ వ శెక్షను చెప్పుచున్నది. అనగా గవర్న రేమిచేసినను చెల్లును.

రాష్ట్రీయ స్వాతంత్ర్యముద్వారా స్వపరిపాలన మొసగ బడినదని నూతన రాజ్యాంగమును సమర్థించువారు పలుకు చుందురు. అట్లనుటలో వారియభిప్రాయ మేమనగా ఇదివరకు కేంద్రప్రభుత్వమునకు రాష్ట్రవ్యవహారములపై ననుండిన అధి కారము కొంత సడలింపబడినదనియు ఈ పదునై దేండ్లనుండి

---

ర్నరుకు సూచన చేయబడినది. ౮ వ పేరాలో గవర్నరులు తమ స్వతంత్రవివే చన నుపయోగించి జరుపు వ్యవహారములలోతప్ప మిగిలినవ్యవహారములలో మంత్రులుచెప్పిన సలహాప్రకారమె జరుపవలెననియు, అయితే వారిసలహా ప్రకారము నడచుకొనినచో తనకుగల ప్రత్యేకబాధ్యతలకు భంగముకలుగు నని తోచినచో వారిసలహాను త్రోసివేయవచ్చుననియు చెప్పబడినది. మఱియు గవర్నరు తన ప్రత్యేకాధికారములను బహుజాగ్రత్తగా ఉప యోగించవలెననియు, సాధ్యమైనంతవరకు వానితో నిమిత్తము లేకుండ నుండునట్లుగా ప్రవర్తింప వలెననియు సూచింపబడినది. ఇట్టిస్థితిలో కాం గ్రెసు మంత్రిపదవులను స్వీకరింపదలపగా ఈచట్టములోనినిబంధనలు, ఈ రాజనిర్దేశపత్రములోని సూచనలు ఆచరణరూపమున జూపవలసివచ్చు నప్పటికి గవర్నరులు కాంగ్రెసునాయకులతో అంతర్యమునిచ్చి సంప్ర తింపకపోవుటయు, సామాన్య పరిపాలనమైనను మంత్రుల సలహాతోనే చేయుదుమని వాగ్దానము చేయకపోవుటయు తటస్థించినది. అంతటితో పోవక చట్టమునకు రాజనిర్దేశ పత్రమునకుగూడ విరుద్ధముగా పైనారిటీ పక్షములలోనుండి మధ్యాంతరీయ (ఇంటరిం) మంత్రులను నియమించుట గూడ జరిగినది. అందువలననే సామాన్యపరిపాలనమైనను మంత్రులసలహా ప్రకారము ప్రజా ప్రతినిధుల యిష్టానుసారము జరుగురాజ్యాంగ మర్యాద ఏర్పడుట అత్యంతావశ్యకమైనది.

యును జరిగిన ద్వంద్వపరిపాలనము మార్చబడినదనియు, రాష్ట్రీయ స్వాతంత్ర్యమనగా ఇదియే అనుకొనుట తప్పు. ఇది నిజమైన రాష్ట్రీయ స్వాతంత్ర్యమగునా కాదా యని చూచుటలో ప్రజాప్రభుత్వ పద్ధతిగల పరిపాలనము స్థాపింపబడినదా శాసననిర్మాణమందు ద్రవ్యవ్యవహారములందు ప్రజాప్రతినిధుల శాసనసభలకు సంపూర్ణాధికార మివ్వబడినదా అను విషయములనే మనము జాగ్రత్తగా గమనింపవలెను.

ఈక్రొత్తరాజ్యాంగ మిట్టిమార్పును కలుగజేసియుండలేదు. నిజమునకు క్రొత్తరాజ్యాంగము గవర్నరుల నిరంకుశాధికారములను మరింత స్పష్టముగ నిర్వచించి శాసనసభల స్థితిని మఱింత అధోగతిలోనికి తెచ్చినది. ఇదివరకుకన్న నికముందు గవర్నరులు మరింత నిరంకుశముగా పరిపాలింప గలుగుదురు. స్వతంత్రాధికారము లేమైననున్నచో నవి ప్రజాప్రతినిధులకు గాక గవర్నరులకే ఒనగబడినవి.

## II

### రాష్ట్రీయ శాసననిర్మాణ సంస్థలు :

ప్రతిరాష్ట్రమునందును ప్రజా ప్రతినిధుల శాసననిర్మాణసభయగు లెజిస్లేటివు అసెంబ్లీ యొకటి యుండును. అయితే ముఖ్యమైన ఆరురాష్ట్రములలో అనగా బొంబాయి, మదాసు, బెంగాలు, సంయుక్తపరగణాలు, బీహారు, అస్సాము రాష్ట్రములలో అసెంబ్లీసభతో పాటు లెజిస్లేటివు కౌన్సిలు అనబడు రెండవశాసనసభ యొకటియుండును. ఈపై సభకు

ప్రతినిధుల నెన్నుకొను హక్కు హెచ్చు ఆస్తిపరులకుమాత్రమే యుండును. అసెంబ్లీసభకు సామాన్య ఆస్తిపరులు చదువు వచ్చినవారు ప్రతినిధుల నెన్నుకొనవచ్చును.

బెంగాలు లెజిస్లేటివు కవున్సిలులో 65 మంది సభ్యు లుందురు. మద్రాసులో 56 మంది యుందురు. అన్నిటికన్న చిన్నదగు అస్సాముసభలో 25 మంది యుందురు. ఈసభలకు కొంతమంది సభ్యులను గవర్నరు నియమించవచ్చును. మద్రాసులో 8 మందిని గవర్నరు నియమించినాడు. బెంగాలులో 27 గురు సభ్యులు, బీహారులో 12 మంది సభ్యులు క్రిందిశాసనసభ వారివలన పైసభకు ఎన్నుకొనునట్లు విధింపబడినది.

లెజిస్లేటివు అసెంబ్లీసభలో బెంగాలులో 250 మంది, మద్రాసులో 215 మంది యుందురు. ఇట్లేతక్కిన పరగణా లలో నుందురు. చిన్నదగు పశ్చిమోత్తర పరగణాల శాసన సభలో 50 మంది యుందురు. ఈసభకు ప్రజలనియోజకవర్గ ములే ప్రతినిధుల నెన్నుకొనును. అయితే ఎన్నికహక్కు జాతి మతకులవివక్షతల నాధారపరచుకొని ప్రత్యేక నియోజకవర్గ ముల కివ్వబడిన శాసనసభలలో ఆయా జనసంఘముల ప్రతి నిధుల సంఖ్యకూడా నిర్ణయింపబడినది. కొన్ని స్థానములు వర్తకసంస్థలకు కార్మికులకు భూస్వాములకు స్త్రీలకునిర్ణయింప బడినవి. ఇందు ముఖ్యముగా గమనింపదగిన మొదటివిష యము: ఎన్నికలహక్కు ముఖ్యముగా ఆస్తిగలవారికి, చదువు కొన్నవారికి మాత్రమె ఒసగబడుట. అందువలన నిరాధారులు నిరక్షరులునగు అమితసంఖ్యాకులగు జనసామాన్యమునకు

వోటుహక్కు లేకుండపోయినది. దేశపు మొత్తముజనసంఖ్యలో నూటికి 14 వంతులు ప్రజలకు మాత్రమే వోటుహక్కు కలదు. రెండవవిషయము: పైసభలగు కౌన్సిళ్ళు దేశాభివృద్ధి యన్న గిట్టనిఆస్తిపరులతో నిండియుండును. జనసామాన్యముయొక్క ప్రజాప్రతినిధులసభలు ప్రజాప్రభుత్వమునకు, దేశాభివృద్ధికి ఉపయోగించు శాసనముల నేవైన చేయకుండ వానికి కొంత ఆటంకము కలిగించుకొరకు ముఖ్యమైన రాష్ట్రములందెల్ల జమీందారీ ధనికాధీనములగు కౌన్సిళ్లు నిర్మింపబడినవి. మూడవ విషయము: జాతి మత కులములవారీగా నిర్ణయింప బడిన నియోజకవర్గములవారివలన ఎన్నుకొనబడిన నభ్యులు పరస్పరము పోరాడుకొనుచు ప్రభుత్వము నెదిరింపలేకపోవుదురు.

## III

### శాసనసభల అధికారములు

లెజిస్లేటివు అసెంబ్లీలో ప్రవేశపెట్టబడిన ఏచిత్తుచట్టము గూడ లెజిస్లేటివు కవున్సిలువారివలన తీర్మానింపబడనిదీ శాసనముకాదు. మరియు గవర్నరు ఆమోదింపనిదీ శాసనముకాదు. ఈరెండుసభలకు ఏశాసనమువిషయమైన గాని అభిప్రాయ భేదము వచ్చినచో గవర్నరు ఉభయసభలను సమావేశపరచును. అంతట ఆ సంయుక్తసభలో నాశాసనము తీర్మానింప బడినచో ఉభయసభలు తీర్మానించినట్లే ఎంచబడును. ప్రతి చట్టమువిషయములోను తాను దానిని ఆమోదింపక అది శాసనము కాకుండ గవర్నరు దానిని అరికట్టవచ్చును. అత డంగీకరించిన శాసనముకూడ 12 నెలలలో ఆంగ్లనృపాలుడు

తోసివేయవచ్చును. చట్టముయొక్క 5 వ భాగము 3 వ ప్రకరణమున చెప్పబడినట్లు ప్రత్యక్షముగాగాని ప్రచ్ఛన్నముగాగాని బ్రిటీషు వాణిజ్యపారిశ్రామిక హక్కులపట్ల వ్యతిరేకముగా విచక్షణాపుచూపు ఏశాసనమును రాష్ట్రీయశాసననిర్మాణసంస్థ చేయవీలులేదు. ఎట్టిది విచక్షణగా పరిగణింపబడునో నిర్ణయించువాడును గవర్నరే. ద్రవ్యవిషయములందు రాష్ట్రీయశాసనసంస్థయొక్క అధికారము లింకను సంకుచితములై యుండును. రాష్ట్రీయవ్యయము రెండుతరగతులుగా విభజింపబడును. (1) రాష్ట్రముయొక్క రెవిన్యూ ఆదాయముపైన బద్ధతచేయబడినది. (2) రాష్ట్రముయొక్క రెవిన్యూ ఆదాయములోనుండి ఖర్చుపెట్టదలచినది. మొదటితరగతి వ్యయము శాసనసభల వోటుకు లోబడదు. ఆతరగతిలో ఈక్రిందివ్యయములు చేరియున్నవి:—

1. గవర్నరుయొక్కజీతము, అలవెన్సులు, ఆ ఉద్యోగహోదాకు సంబంధించిన ఇతర ఖర్చులు.

2. రాష్ట్రము బాధ్యతవహించు ఋణవ్యయములు.

3. మంత్రులయొక్కయు అడ్వకేటుజనరలుయొక్కయు జీతములు, అలవెన్సులు.

4. హైకోర్టుజడ్జీలజీతములు, అలవెన్సులు.

5. మినహాయింపబడిన ప్రదేశముల వ్యయములు.

6. చట్టమువలన రెవిన్యూపైన బద్ధతకాబడినట్లు ప్రకటింపబడిన ఇతరవ్యయములు. తక్కినబాపతుల వ్యయము శాసనసభ వోటుకులోబడునుగాని శాసనసభ వ్యతిరేకముగా

తీర్మానించినను ఏఖర్చునైనను గవర్నరు శాంక్షను చేసి బడ్జెటులో చేర్చవచ్చును. మరియు గవర్నరు శిఫారసుచేయనిది దేనికైనను సొమ్ము కావలెనని శాసనసభలో కోరుటకువీలు లేదు. ఒక క్రొత్తపన్ను విధించుటకుగాని, ఒకపన్ను హెచ్చించుటకుగాని, దేశముయొక్క ద్రవ్యసంబంధ బాధ్యతల వ్యవహారములకుగాని, ఏవ్యయమైనను శాసనసభయొక్క వోటుకు లోబడునట్లు నిర్ణయించుటకుగాని సంబంధించిన శాసనమేదియు గవర్నరు శిఫారసుపైనతప్ప శాసనసభలో ప్రవేశపెట్టబడరాదు. ప్రజాప్రతినిధులకు బాధ్యులుగా నుండవలసిన మంత్రుల జీతములుకూడ రాష్ట్రశాసనసభల వోటుకు లోబడకపోవుట విపరీతము. పై సంగతిసందర్భములవలన రాష్ట్రీయ వ్యవహారములం దెట్టి ముఖ్యమైనమార్పులను చేయుటకు వీలు లేకుండా శాసనసభలపైన రాజ్యాంగచట్టము అనేకఆటంకములు కల్పించుచున్నదని స్పష్టమగుచున్నది. శాసననిర్మాణ విషయములందు ద్రవ్య వ్యవహారములందు గవర్నరే పెత్తనము గల సర్వాధికారిగా నుండి ప్రస్తుతపుపద్ధతులనే స్థిరముగా నుంచుననియు స్పష్టమగుచున్నది.

## IV

### గవర్నరుయొక్క అధికారములు:

గవర్నరుజనరలు చలాయించు నట్టి నిరంకుశాధికారములనే గవర్నరును తనఅధికారమండలములో చలాయించును. ముఖ్యముగా శాసనసభవారు చేసిన ప్రతితీర్మానమునుగూడ

తొలగించివేయుటకు గవర్నరు కధికార మివ్వబడినది. మఱియు గవర్నరుజనరలుకుగల ప్రత్యేక బాధ్యతలవంటి అధికారములే గవర్నరులకును ఒసగబడినవి.

1. రాష్ట్రముయొక్క శాంతిభద్రతలకు అపాయము కలుగకుండ కాపాడుట.

2. అల్పసంఖ్యాకు లగు జనసంఘముల (మైనారిటీల) హక్కులు కాపాడుట.

3. సర్కారునౌకరుల హక్కులను కాపాడుట.

4. బ్రిటీషు వాణిజ్యముపట్ల పరిశ్రమలపట్ల విచక్షణ చూపకుండ కాపాడుట. (చట్టముయొక్క 5 వ భాగములోని 2వ ప్రకరణములోని నిబంధనలు అమలుజరుగునట్లుచూచుట.)

5. స్వదేశ సంస్థానముల హక్కులు సంరక్షించుట.

6. గవర్నరుజనరలు జారీచేయు ఆజ్ఞలను అమలు జరిగించుట.

ఈ ప్రత్యేక బాధ్యతలకు సంబంధించిన వ్యవహారములను గవర్నరు కేవలము తనస్వతంత్రవివేచనతోనే నిర్వహించును. ఈ విషయములను గూర్చి అతడు జరిగించుచర్య ఏ కారణము వలనను విమర్శింపబడరాదు. ఈ శాసనసభలతో నిమిత్తము లేకుండ ఆర్డినెన్సులను, 'గవర్నరుచట్టము' లనబడు శాశ్వతశాసనములను గూడ శాసించుటకు గవర్నరు కధికారముగలదు. ప్రత్యేక బాధ్యతలనబడు అధికారములయొక్క అంతరార్థ మిదివరకే చెప్పబడియున్నది. శాంతిభద్రతల విషయములో

భారత దేశపరిపాలనకు మూలాధారము పోలీసుబలమేగనుక దీనిని గూర్చిన అధికారమును రాజకీయ పార్టీలకు చెందిన మంత్రులచేతులలో పెట్టుటకు బ్రిటీషువారు ఇష్టపడరు. అందువలననే పోలీసుబలములను గూర్చి మంత్రులుచేసిన సూచనలను నిరాకరించుటకును, మంత్రులనుగాని శాసనసభలనుగాని ఆలోచింపకయే తనకుతోచినట్లు చేయుటకును గవర్నరుకు విపరీతాధికార మివ్వబడినది. అవసరమైనచో అతడు మంత్రులనే తీసివేయవచ్చును. శాసనసభను కూడ విలయము (డిజాల్వ్) చేయవచ్చును. శాంతిభద్రతలను గవర్నరుయొక్క ప్రత్యేక బాధ్యతకనుగుణముగా పరిపాలింపగల మంత్రులును పరిపాలకవర్గమును లభింపనిచో రాజ్యాంగమే భగ్నమైనట్లుగా ఎంచి గవర్నరు తన కవసరమని తోచిన అధికారములనెల్ల తానే వహించి ప్రభుత్వము చలాయించవచ్చును. ప్రతిరాష్ట్రములోను రహస్య పోలీసువ్యవహారములు మంత్రుల కెంతమాత్రము లోబడక గవర్నరుజనరలు అధికారముక్రింద 'సెంట్రల్ ఇంటెలిజెన్సు బ్యూరో'కు ఉపశాఖగానుండును. పై సంగతి సందర్భములవలన రాష్ట్రీయగవర్నరు లెట్టి నిరంకుశులుగ సర్వాధికారులుగ నున్నారో వెల్లడియగుచున్నది. మంత్రులును శాసనసభలును గవర్నరుల దయాధర్మములపైన ఆధారపడియుండురనుటకు సందియములేదు. అమితములగు అధికారములును బలమునుగల ఈ గవర్నరులు ప్రతిరాష్ట్రములోను సామ్రాజ్య విధానముయొక్క పునాదులను గట్టిపరతురనుటకు సందియములేదు.

54 వ సెక్షను గవర్నరు తన స్వతంత్ర వివేచనకు సంబంధించిన విషయములందు గవర్నరు, గవర్నరు జనరలుకే బాధ్యుడై ప్రవర్తింపవలెనని విధించుచున్నది. ఆర్థిక స్వాతంత్ర్య మనగా స్వపరిపాలనము కాదనియు, గవర్నరుజనరలు యొక్కయు, రాజ్యాంగ కార్యదర్శియొక్కయు అదుపు ఆజ్ఞల నుండి విడుదల మాత్రమేయనియు పూర్వము అసెంబ్లీ శాసన సభయొక్క ప్రథమ అధ్యక్షుడు చేసిన తీర్మాన ప్రకటనమునకు కూడ ఇది విరుద్ధముగానున్నది.

ఫెడరలు శాసనములతోగాని రాష్ట్రీయ శాసనములతోగాని నిమిత్తము లేకుండా మినహాయింపబడిన ప్రదేశములను గవర్నరు తన చిత్తానుసారము పరిపాలింపవచ్చునని 92-వ శెక్షను శాసించుచున్నది. రాష్ట్రీయ రాజ్యాంగ వ్యవస్థను రద్దుచేసి ఏరాష్ట్రీయ ప్రభుత్వ సంస్థయొక్క అధికారములనైనను గవర్నరే వహించి చలాయించవచ్చునని 93-వ శెక్షను చెప్పుచున్నది. 1919 నాటి ఇండియా రాజ్యాంగచట్టమును బట్టి కూడ ఇట్టి అధికారములు గవర్నరులు చలాయించి యెరుగరు. ఈ క్రొత్తరాజ్యాంగము మనకు శాసన నిర్మాణమునందుగాని ద్రవ్యమునందుగాని స్వపరిపాలనము నెంత మాత్రము ఒసగుటలేదు. అట్టి అధికారము లివ్వబడినవని చెప్పుట బూటకము.

ప్రజాప్రభుత్వ పద్ధతులకు విరుద్ధముగా ప్రజాప్రతినిధుల పరిపాలనాధికారము శాసననిర్మాణాధికారము సంకుచితపరుపబడిగవర్నరులకు గవర్నరుజనరలుకు ప్రత్యేక బాధ్యతలు

విశేషాధికారములు గల ఈ నూతనరాజ్యాంగమువలన భారతీయుల దాస్యబంధనములు మఱింత బిగియుననుట స్పష్టము. శాసననిర్మాణము ద్రవ్యపద్ధతి న్యాయపరిపాలన సైన్యము పోలీసులకు సంబంధించిన నిజమైన అధికారములన్నియు సామ్రాజ్యయంత్రముయొక్క చేతులలోనే యుండును. ఇదిగాక "దేశాభివృద్ధికి విముఖులగు 'ఫ్యూడల్' వర్గములు- సంస్థానాధిపతులు భూస్వాములు బలవంతులుగా చేయబడి ఈ సామ్రాజ్యత్వమునకు సహాయభూతులుగా చేయబడినారు. గవర్నరుల నిరంకుశపరిపాలనను విమర్శించుటకు గూడ వీలు లేకుండ శాసనసభలకు వాగ్బంధము గావింపబడినది. *

* శాసనసభలలోని వాక్స్వాతంత్ర్యము: 86వ సెక్షనునుబట్టి రాష్ట్రీయశాసనసభలలోని వాక్స్వాతంత్ర్యమునకు భంగకరములగు రెండు విధులు కలవు. (1) ఫెడరలుకోర్టు హైకోర్టు జడ్జీల ప్రవర్తననుగూర్చి శాసనసభలు చర్చింపరాదు. (2) ఒక చిత్తుచట్టమునుగూర్చిగాని దానిలో నొక పరిచ్ఛేదముయొక్క సవరణనుగూర్చిగాని శాసనసభలో చర్చించుట, రాష్ట్రముయొక్క శాంతిభద్రతలను గాపాడుటకు గవర్నరుకుగల ప్రత్యేకబాధ్యతకు భంగకరమని అతడు తనస్వతంత్ర వివేచన నుపయోగించి నిర్ణయించినచో ఆ తరువాత ఆ చిత్తుచట్టమునుగూర్చి సవరణనుగూర్చి శాసనసభలో నెట్టిగ్రంథము జరుపబడరాదని గవర్నరు నిషేధింపవచ్చును. అంతట దానినిగూర్చి ఎట్టిచర్చలు జరుగరాదు.

శాసనసభలయొక్క ఆచరణ విధులనుగూర్చి మద్రాసుగవర్నరు కొన్ని నిబంధనలను జేయుచు వాక్స్వాతంత్ర్యమునుగూర్చి చట్టములోలేని మరికొన్ని క్రొత్తనిషేధములను గల్పించినాడు. 26వ నిబంధననుబట్టి శాసనసభలో నేదైననొకప్రశ్న అడుగబడులోపుగా ఆ ప్రశ్నగాని దానిలో నొకభాగముగాని చట్టమునుబట్టి తన స్వతంత్ర వివేచనను స్వబుద్ధిని ఉపయోగించవలసిన అధికారములకు భంగముకలిగించును గనుక దానిని నిషేధించు-

చున్నావని గవర్నరు తన స్వతంత్ర వివేచన నుపయోగించి శాసనసభాధ్యక్షునికి తెలిపినచో ఆ ప్రశ్న సభాకార్యక్రమమున చేర్చబడదు. చేర్చబడియున్నచో శాసనసభాధ్యక్షుడు దానినడుగనివ్వకూడదు. 116 వ నిబంధనబట్టి గవర్నరు ఏ తీర్మానమునైనను అట్లు నిషేధింపవచ్చును. ఇంకొక నిబంధనబట్టి శాసనసభలోని సామాన్య ఉపపాదనములు అడ్జర్న్ మెంటు తీర్మానములు కూడా గవర్నరు నిషేధింపవచ్చును. ఇట్లు అసలే యధికారము లేని శాసనసభలకు వాగ్బంధనము కూడా చేయబడుచున్నది. ఈ ఉదాహరణమును బట్టియే క్రొత్తరాజ్యాంగము క్రింద రాష్ట్రీయగవర్నరు లెంత ఉదారముగా పరిపాలింతురో తేలుచున్నది.

# అనుబంధముల పరిచ్ఛేదము.

## మొదటి అనుబంధము

### బ్రిటీషు విద్యావిధానము; వైజ్ఞానిక పారతంత్ర్యము.

భారత దేశములోని వివిధ భాగములు ఆంగ్లేయులవశమై అందు బ్రిటీషుపరిపాలన స్థాపింపబడు నాటికి దేశములోని పట్టణములేగాక పల్లెలును పాడిపంటలతోను పరిశ్రములతోను తులతూగుచుండెను. అనాదిసిద్ధములగు ప్రజాపరిపాలనా సంస్థలు, గ్రామపంచాయితీలు నుండెను. సంస్కృతవిజ్ఞానమును బోధించు గురుకులములు గాక హిందూ మహమ్మదీయ జన సామాన్యమునకు చదువను వ్రాయను నేర్పు గ్రామపాఠశాలలు విరివిగా నుండెను. ఇదియంతయు కంపెనీ పరిపాలనలో రూపుమాసినది.

పూర్వమునాటి పరిస్థితులు తూర్పు ఇండియా కంపెనీ కాగితములవలననే తెలియుచున్నవి. 1822 - 26 మధ్యజరిగిన విచారణవలన మద్రాసు రాజధానిలో నానాటికి పాఠశాలలకు పోవు ఈడుగల బాలకులలో దరిదాపుగా ఆరవవంతు మంది ఏదో యొకవిధమగు విద్య గఱచుచుండిరని అంచనా వేయబడినది. ఇట్లే 1823 - 28 మధ్య బొంబాయిలో జరిగిన విచారణలో ఎనిమిదిమంది కొక బాలుడు విద్యనేర్చుచుండె నట్లు తేలినది. ఇట్లే వంగరాష్ట్రమున "ఆడం" గారు చేసిన విచారణవలన ఒకజిల్లాలో పురుషులలో నూటికి 13.2 మంది విద్యనేర్చుచుండినట్లు తేలినది. వంగరాష్ట్రమున పురుషులలో

నైదవవంతు చదువగలవారని "విలియంవార్డు"* చెప్పినాడు 'బ్రిటీషుఇండియాలో 1854 కు పూర్వమును 1870-71 లోను విద్య' అను పేరున ఏ. పి. హూవెల్ గారు వ్రాసిన గ్రంథములో 1835 నాటికే వంగరాష్ట్రమున 100000 దేశీయ గ్రామపాఠశాల లుండెననియు 1822 నాటికి మద్రాసులో సర్ తామస్ మన్రోగారి విచారణవలన 12498 గ్రామపాఠశాలలు 188650 విద్యార్థులుండినట్లు తెలిసదనియు వ్రాసినారు.

ఇట్టి స్థితిలో నానాడు మెల్ల మెల్లగా బ్రిటీషువారి వశమగుచున్న వివిధ రాష్ట్రములందలి గ్రామపంచాయితీలును ఇతరసంస్థలతో పాటు ఈ పురాతన పాఠశాలలును కూడ క్రమక్రమముగా నాశనమై పోవుచుండెను. ఇట్లు పూర్వపు విద్యావిధానము నాశనముకాగా దేశప్రజలకు ప్రభుత్వము వలన విరివిగా విద్యనేర్పబడకపోగా అజ్ఞానము వర్ధిల్లనా గెను. ఆంగ్లేయకంపెనీ ప్రభుత్వము నందలి విద్యావిధానమున జనసామాన్యములో విద్యాభివృద్ధిచేయు మాట నటులుండనిచ్చి, దేశములో చదువను వ్రాయను మాత్రమైన నేర్పుట, అనగా అక్షరజ్ఞానము కలిగించు పద్ధతియైన, వృద్ధిజెందలేదు సరికదా పూర్వమునాటికన్న క్షీణించిపోయెను. * 1870 నాటికి దేశములో అక్షరాస్యులు నూటికైదుమంది మాత్రమే యుండిరి ! ఈ విపరీతపరిణామమునకు గారణములేకపోలేదు. ఆంగ్ల విద్యావిధానమును నెలకొల్పుటలో బ్రిటీషు

---

♦ (Ancient Indian Education -- Rev. F. E. Keay)

* 1858 నాటి స్థితిగతులకు 133 - 134 పుటలు చూడుడు.

రాజ్యతంత్రజ్ఞుల యొక్క నిజోద్దేశము భారతీయులకు విద్యాభివృద్ధిగావించి విజ్ఞాన వికాసము కలిగింపవలెనని కాదు. కేవలము బ్రిటీషు పరిపాలనకు అనుకూలములగు పరిస్థితులు కలిగించుటకును, బ్రిటీసువారి నాగరకత, వారిపద్ధతులును భారతీయులర్థము చేసికొని వారిపట్ల గౌరవభావము, స్నేహభావము కలిగించుటకే ఈయాంగ్ల విద్యావిధానము నెలకొల్పబడినదనికంపెనీ ప్రభుత్వమున అనేక గొప్పయుద్యోగములు చేసి మదాసు గవర్నరైన సర్ ఛార్లెస్ ట్రివెలియన్ గారు తనపుస్తకములో స్పష్టముగా చెప్పియున్నారు. పూర్వము రోమునగర సామ్రాజ్యములో సామ్రాజ్యాధీశులు జయించిన వివిధజాతుల నెట్లు వైజ్ఞానిక పారతంత్ర్యమున ముంచినారో ఆప్రకారమే నేడు భారతీయులనుకూడ తమస్వదేశవేషభాషలపైన నాగరకతపైన అభిమాన శూన్యులుగ జేసి విజాతీయ నాగరకతా వ్యామోహమున ముంచుటయె ప్రధాన కర్తవ్య మనియు బయల్పరచినారు. ఈ సంగతి వంగరాష్ట్రమున ఆంగ్లవిద్యాభివృద్ధి ప్రయత్నము జేసిన వారిలో నొకడగు రెవరెండ్ అలెగ్జాండర్ డఫ్ గారుకూడ చెప్పియున్నారు. భారత దేశమునకు సాలుకు 15 వేల పౌనుల జీతముపైన లా మెంబరుగాను లా కమీషనరుగాను వచ్చిన లార్డుమెకాలేగారీ విద్యావిధానము యొక్క పరమోద్దేశమును 1836 లో నిట్లుచెప్పినారు. "మనవిధాన మమలుజరిగినచో వంగరాష్ట్రమునముప్పదేండ్లలో నొక్కవిగ్రహారాధకుడైన మిగులడని నా విశ్వాసము." ఇట్లు మన దేశముయొక్క నాగరికతను మతమునుకూడ రూపుమాపవలెనని ఈయాంగ్లేయ

ప్రభువులయూహా! ఈమహానుభావు డింతటితో నూరకొనలేదు. 1853 లో మఱల నిట్లుచెప్పినాడు "ఇప్పుడు మనము ముఖ్యముగా చేయవలసిన కర్తవ్యము; మనము పరిపాలించు లక్షోపలక్షల జనములకును మనకును మధ్యనొకరిభావ నింకొకరికి తెలుపు 'ద్విభాషీ' లుగానుండి రక్తములోను రంగులోను భారతీయులై (అనగా జన్మవలన మాత్రమే భారతీయులుగానున్నను) రుచులలోను, అభిప్రాయములందును, నీతియందును, విజ్ఞానమందును కేవలము ఆంగ్లేయులుగనేయుండు నొకతరగతి వారిని సృజియించుటకు మన యావచ్ఛక్తిని వినియోగింపవలెను."

"నేటీవు" (భారతీయు) లందు విద్యావ్యాప్తి చేయుటకుగల ముఖ్యకారణములలో నొకటి ప్రభుత్వోద్యోగములందు వారిని నియమించు పరిస్థితి కలుగుటయని బొంబాయి గవర్నరుగనుండిన సర్ జాన్ మాల్కలంగారు 1828 లో స్పష్టముగా చెప్పి 'దీనివలన ఖర్చుతగ్గును; కొంత దేశాభివృద్ధియు కలుగును; బ్రిటీష్ పరిపాలన గట్టిపడు'ననియు చెప్పినాడు. 1854 లో కంపెనీ పరిపాలకులు విద్యావిధానమునుగూర్చి జారీచేసిన (ఎడ్యుకేషనల్ డిస్పాచి) తాఖీదులోకూడా ఈవిద్యాభివృద్ధి ప్రభుత్వమువారి నౌకరీలోనుండు ఉద్యోగులకు శక్తిసామర్థ్యములను తెలివితేటలను హెచ్చించునని వ్రాసియుండిరి. మాల్కలంగారు వ్రాసిన మినిట్సులో నేటీవులలో విద్యనేర్చినవారు తక్కువగా నున్నందుననే హెచ్చుజీతములు ఇవ్వవలసి వచ్చుచున్నదనియు విద్యాభివృద్ధిచేసినచో ఉద్యోగములకొరకు

ప్రాకులాడువారి సంఖ్య హెచ్చునని యు జీతములు తగ్గించవచ్చునని యు సెలవిచ్చిరి! ఇట్లు విశ్వాసపాత్రులగు చౌకబారు నేటీవు నౌకరులను నిర్మించుటయే ఈ విద్యావిధానము యొక్క ప్రధానోద్దేశముగ నుండెను. ఇది ఫలించి సర్కారుగులాపు వారి తరగతి యొకటి బయలుదేరినది. వీరి బానిసబుద్ధి జగత్ప్రసిద్ధము.

భారతీయులలో నిజదేశవేషభాషలపైన స్వదేశనాగరకత మతములపైన అభిమానముపోగొట్టి ఆంగ్లేయ సభ్యతపైన వేషభాషలపైన క్రైస్తవ మతముపైన నభిమానము గౌరవము కలిగించుటకూడా ఈ విద్యావిధానముయొక్క ప్రధానోద్దేశములలో నొక్కటిగనుక క్రైస్తవ మతము, బైబిలు కధలు బోధించుట భారతదేశ వేదశాస్త్రపురాణములను గూర్చిన వెక్కిరింపులు సీయాంగ్ల పాఠశాలలందు పరిపాటియయ్యెను. ప్రభుత్వోద్యోగులు క్రైస్తవమతాచార్యులకు సాయము చేయుచు పరీక్షలందు ప్రపంచజ్ఞానమునుగూర్చిన ప్రశ్నలని పేరుపెట్టి బైబిలుకధలనుగూర్చి ప్రశ్నించి అవిచెప్పలేని వారిని తప్పించుచుండిరి. పరీక్షతప్పిన వారి కుద్యోగములు లేవు. ఇట్లు విజాతీయమతప్రచారము జరుగుచుండెను. భారతదేశనాగరకతను, మతములను నిరసించి క్రైస్తవ ధర్మములను పొగడిన వారికే యుద్యోగములు వచ్చుచుండెను. ఈ యన్యాయములనుగూర్చి రాజారామమోహనరాయలనాటినుండి స్వాతంత్ర్యవిప్లవమువరకు అందోళన జరిగెను.

వైజ్ఞానిక పారతంత్ర్యభూతమింతటితో మనలను వదల

లేదు. మనపాఠశాలలందు పఠనీయపుస్తకములను వ్రాయు గ్రంథకర్తలు, చరిత్రకారులు ఆంగ్లేయులో లేక ఆంగ్లక్రైస్తవాధికారుల తాబేదారులో లేదా వారి నాశ్రయించి తిరుగువారుగనో యుండిరి. ఇక చరిత్రలు వ్రాయువారు కేవలము ఆంగ్లగ్రంథకర్తలేతప్ప ఇతరులు లేనేలేరు. అందువలన హిందూదేశచరిత్రలో దేశీయచక్రవర్తులను, రాజులను, నవాబులను, సంస్కర్తలను, దేశోద్ధారకులనుగూర్చి వ్రాయుపట్ల అగౌరవముగ వ్రాయుట; అబద్ధములు వ్రాయుట; బ్రిటీషు వారు రాజ్యాక్రమణ చేసిననాటి యన్యాయములు గప్పిపుచ్చుట; మన ప్రజలపట్ల రాజులపట్ల నెన్నో యన్యాయములుచేసి ఎన్నో దుష్కృత్యముల కొడిగట్టిన క్లైవు, వారన్ హేస్టింగ్సు మొదలగువారి చర్యలను సమర్థించువారిని పొగడి వారి యందు మనకు గౌరవముగలిగింపజూచుట; వీరి యన్యాయములకు గుఱియై నాశనమైన మన రాజులకు నవాబులకు లేనిపోని అవగుణములంటగట్టుట; మనజాతీయ చరిత్రలో ననేక యథార్థాంశములు మఱుగుపరచుట; 'కలకత్తా చీకటికొట్టు' కథలవంటి అనేక పుక్కిటిపురాణములను వ్యాప్తిపరచుట; భారత దేశ చరిత్రలో దేశాభిమాన పూరితములగు ఘట్టములెవ్వియు వర్ణింపబడకపోవుట; దేశస్వాతంత్ర్యముకొరకు, దేశోద్ధరణము కొరకు పాటుపడిన స్త్రీ పురుషులను రాజద్రోహులుగ పరిగణించి వారి చరిత్రములుకాదుకదా తుదకు నామములనైనను చరిత్రలో నుదాహరింపకపోవుట; భారతీయుల సద్గుణములను గాని, ప్రభుమంత్రోత్సాహ శక్తులనుగాని ప్రకటింపక ఈ

విశాల దేశములో నేమూలనో యొకచోట కనబడు లోపము లనుమాత్రమే పేర్కొని ఈ ప్రజలు స్వతంత్రులుగ నుండ తగరని లోకమున ప్రచారము చేయుటయు బ్రిటీష్ రాజ్య తంత్రములో నొక ముఖ్యభాగముగా నున్నది. నిష్పక్షపాతి యగు నేయాంగ్లేయుడైనను దేశభక్తుడగు నేభారతీయుడైనను భారత దేశ యథార్థచరిత్రను వ్రాసినచో నది ప్రచారములోనికి రాకుండ రాజద్రోహమని యణచివేయుటయో లేదా అది పాఠశాలలందుపయోగింపనివ్వక పోవుటయో జరుగును. ఈ విషయమున ప్రభుత్వోద్యోగులగు తెల్లదొరలకన్న 'సర్కారు నౌకరుల'మని చెప్పుకొను నల్ల యుద్యోగులు మఱియు ముందంజవై చుచుందురు.

ఇట్లు తమ పూర్వులయొక్కయు దేశముయొక్కయు యథార్థచరిత్ర తెలిసికొనుట కవకాశములేక సీ ఆంగ్లేయబానిస విద్యనేర్చిన భారతీయులలో బ్రిటీషు రాజ్యతంత్రము నిర్మించిన వైజ్ఞానిక దాస్యముననే పుట్టిపెరిగి చాలమంది తమ దేశమునందుగాని మతధర్మములందుగాని వేషభాషలందుగాని అభిమానములేక కేవలము విజాతీయ సభ్యతలో వైజ్ఞానిక పారతంత్ర్యమునమునిగి బ్రిటీషు ప్రభువులను వారి వేషభాషల ననుకరించి మెకాలే చెప్పినట్లు జన్మవలన మాత్రమే భారతీయులుగనుండి రుచులందు అభిప్రాయములందు విజ్ఞానమందు ఆంగ్లేయులుగనేయుండి తదనుగుణముగనే ప్రవర్తించు బానిస బుద్ధికలవారుగా నున్నారు.

ఈవైజ్ఞానిక పారతంత్ర్య ప్రభావమునవలన దేశజనులలో

చదువురాని అజ్ఞానులుగాక చదువ నేర్చిన ఆంగ్లవిద్యాధికులు దేశప్రజలకేవిధముగను తోడ్పడక విజాతీయప్రభువులకన్న దేశమునకు హెచ్చు అపకారము చేయుటయు తటస్థించుచున్నది. విద్యాధికులలో చాలమంది సర్కారునౌకరులుగనో సర్కారుపై నాధారపడిన వృత్తివంతులుగనో యుండి వ్యగ్రులగుచున్నారు. ఇదియుగానిచో తాము నేర్చినవిద్యవలని ప్రభావమున దేశభక్తిశూన్యులై, నిరాయుధులై అసహాయులైన కారణమున పిరికివంతులై పొట్టకూటికొరకు బ్రిటిష్‌ప్రభువులను మెప్పించుటకొరకు దేశద్రోహముకూడ చేయుటకు వెరవకున్నారు! రాజకీయార్థిక దాస్యముకన్న నీ వైజ్ఞానిక దాస్యము మనజాతికి వేరుపురుగువంటిది. ఇట్లు మెకాలే మొదలగు బ్రిటిష్ రాజ్యతంత్రజ్ఞుల మనోరథము నేటికి సిద్ధించినది. ఆంగ్లవిద్య నేర్చిన భారతీయులలో చాలమంది పైనచెప్పిన కారణములవలన అస్వతంత్రులై తేజోవిహీనులై భారతీయ విజ్ఞానమునకు స్వాతంత్ర్యమునకు విముఖులుగానుండి యీ నిరంకుశబ్రిటిష్ ప్రభుత్వయంత్రమునకు సహాయులై దేశముయొక్క శాశ్వత దాస్యమునకు దారిద్ర్యమునకు తోడ్పడుచున్నారు.

# రెండవ అనుబంధము

## ప్రభుత్వోద్యోగుల జీతములు:

I వివిధ దేశముల ప్రజలకు సాలు 1కి తల 1కి వచ్చు సగటు ఆదాయము-ఉద్యోగుల జీతములు

| దేశము | సాలుకు జాతీయాదాయము సగటున తల 1కి ఎంత? రూ॥ లు | పనితనము కౌశలము లేని సామాన్యకూలి వానికి సాలు 1కి వచ్చుకూలి మొ॥ రూ॥లు | గుమాస్తావ సాలుకువచ్చు అల్పతమపు జీతము మొత్తము రూ॥లు | ప్రభుత్వములో పెద్దఉద్యోగికి వచ్చు సాలు జీతము రూ॥ లు | తారతమ్యము: కూలివానికి పెద్దయుద్యోగికి | తారతమ్యము: గుమాస్తావ పెద్దయుద్యోగికి |
|---|---|---|---|---|---|---|
| దక్షిణాఫ్రికా | — | — | 1866 | 21333 | — | 1కి 11 రెట్లు |
| ఇంగ్లాండు... | | | | | | |
| ...స్కాట్లండు వేల్సు | 1240 | 1333 | 1266 | 40000 | 1కి 30 రెట్లు | 1కి [illegible]2 రెట్లు |
| కెనడా | 1420 | 2620 | 1650 | 27400 | 1కి 10 రెట్లు | 1కి 17 రెట్లు |
| అమెరికా- | | | | | | |
| సంయుక్తరాష్ట్రములు | 1850 | 2950 | 3125 | 27400 | 1కి 9 రెట్లు | 1కి 9 రెట్లు |
| జర్మనీ | 520 | 1140 | 1110 | 14960 | 1కి 13 రెట్లు | 1కి 13 రెట్లు |
| జపాను | 295 | 675 | 650 | 8800 | 1కి 13 రెట్లు | 1కి 14 రెట్లు |
| ఇండియా | 74 | 240 | 360 | 48000 | 1కి 200 రెట్లు | 1కి 133 రెట్లు |

ఈ అంకెలను ప్రొఫెసర్ డి. ఆర్. గాడ్గిల్‌గారు 1931 లో తయారుచేసినారు. భారత దేశములో 1931 తరువాత ధరలు పడిపోయినందున సగటు ఆదాయము సాలు 1 కి 35 రూపాయిలు అయినది. కూలివానికిగుమాస్తాకు పెద్దజీతగానికిగల తారతమ్య మింకను హెచ్చియుండును. మనసగటు ఆదాయము తక్కిన అన్ని దేశములకన్న హీనముగానున్నను,మన దేశములోనున్నంత అత్యధికజీతము లింక నే దేశములోను లేవు. మనకన్న అనేకమడుంగులధిక సంపన్నులుగనున్న జపాను దేశములోని ఉద్యోగుల జీతములతో మన ఉద్యోగులజీతములను పోల్చిచూచినచో మన పరిపాలనలో ఎంతసొమ్ము వృధాగా వ్యయమగుచున్నదో తెలియును.

జపాను జనసంఖ్య 64450005. ఈజనసంఖ్య మన వంగ రాష్ట్రమునకు రెట్టింపుగనుండును. జాతీయఆదాయము తల 1 కి సాలుకు రు 143-11-6 లు.

1935-36 లో జపాను దేశాదాయము.

| | | |
|---|---|---|
| బడ్జెటు మొత్తము— | రూపాయిలు | 1722484286 |
| ఆదాయపుపన్ను | | 45034664 |
| వ్యాపారలాభములపై నపన్ను | | 39263744 |
| వారసత్వములపైన | | 22534856 |

వెరసి రూపాయిలు 106833264

భారత దేశముకన్న రెండురెట్లు హెచ్చు జాతీయాదా

యముగల ఆదేశములో జీతములు ఎంత తక్కువగ నున్నవో చూడుడు.

| | | నెలకు | సాలుకు |
|---|---|---|---|
| ప్రధానమంత్రికి | రూపాయిలు | 622- 0-0 | (7552) |
| ఇతరమంత్రులకు | ,, | 440- 9-4 | (5349⅓) |
| శెక్రిటరీలు | ,, | 375 12-8 | (456· ⅔) |
| కోరియూగవర్నరుజనరలు | ,, | 440- 9-4 | (5349⅓) |
| ప్రివికవున్సిలుఛాన్సిలరు | ,, | 427-10-0 | (5192) |

1934 లో అన్నిరకముల ఉద్యోగులుకలిసి 135692.

అచ్చట మూడుతరగతుల పెద్ద ఉద్యోగులు నాలుగవ తరగతి స్వల్పజీతగాండ్రునుగలరు.

| | | |
|---|---|---|
| మొదటితరగతి పెద్దఉద్యోగులకు నెల 1కి | సగటున | 334-1-0 |
| రెండవతరగతివారికి | నె1కి | 171-12-3 |
| మూడవతరగతివారికి | నె1కి | 68-10-0 |

భారత దేశములో సామాన్య ఐ. సి. యస్. ఉద్యోగుల సగటు జీతము నెల 1 కి 1301 రూపాయిగానున్నది

అమెరికా సంయుక్తరాష్ట్రముల జాతీయాదాయము భారత దేశముసకు 22రెట్లుగానున్నది. మన ప్రభుత్వాదాయము కన్న 8 రెం.. రెవిన్యూగలదు. ఆదేశ అధ్యక్షునికి ఇంగ్లాండు చక్రవర్తితో సమానగౌరవముకలదు. ఇట్టివాని నెలజీతము 17062. రూపాయలు మనవైస్రాయి కతనికన్నను ఎక్కువ.(రు-21333) ఇక మన ఎగ్జిక్యూటివుకౌన్సిలుసభ్యులకు నెలకి6667రూపా-

యలుండగా అమెరికామంత్రిమండలిలోని సభ్యులకు నెలకు రు. 3412. దక్షిణ డకోటాగవర్నరు నెలజీతము రు 682-0-0. మన ఐ.సి.యస్. ఉద్యోగికన్న తక్కువ. అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రధానన్యాయమూర్తి జీతము నెల 1కి రు 4550. మన వంగరాష్ట్ర న్యాయమూర్తికి నెల 1 కి రు 6000-0-0

బ్రిటిషు సామ్రాజ్యముయొక్క తలమానికమగు ఇంగ్లాండువారిసగటు ఆదాయము తల 1కి 1240. మనకన్న 14 రెట్లు. ఈదేశప్రధానమంత్రికి నెల 1 కి జీతము రు 11111 మనమద్రాసు గవర్నరుకన్న కొంచెము అధికము.మనగవర్నరు జనరలు జీతముకన్న 10222 రూపాయులు తక్కువ. మనవైస్రాయికి వలె 16 లక్షలరూపాయిల అలవెన్సులేదు. ఇంగ్లాండు క్యాబినెట్టు మంత్రులకు సాలు 1 కి జీతము 5 వేల పౌనులు; అనగా నెల 1 కి 5555 రూపాయిలు. ఇంగ్లాండులోనిఉద్యోగి అత్యుత్తమతరగతికి వచ్చి పర్మనెంటు సెక్రిటరీయైనప్పుడు వచ్చు నెలజీతము రు 3333. ఇంగ్లాండులోని సివిలుఉద్యోగుల సంఖ్య 1140. వీరిలో అధికసంఖ్యాకులకు నెలకు 770 మొదలు 1000 రూపాయిలవరకే జీతము.

కెనడా జాతీయాదాయము మనకన్న 17 రెట్లు అధికము. రివిన్యూ మనకన్న 11 రెట్లు హెచ్చు. ప్రధానామాత్యునికి నెల 1కి 3375 రు. తక్కినమంత్రులకు నెలకు 2250 రూ॥ జీతము.

ఇంగ్లాండు దేశము:

| | |
|---|---|
| ప్రభుత్వ రివిన్యూ సామాన్యఆదాయము | రు 1!306000000 |
| ఆదాయమువన్ను | 3164831093 |
| ఎస్టేట్లడ్యూటీ, వారసత్వము | 1173919307 |
| మొత్తము | రు 4338750400 |
| 1931 లో ఇంగ్లాండు జనసంఖ్య | 44937444 |
| సాలు 1 కి తల 1 కి సగటు ఆదాయము | రు 1240-0-0 |
| జీతములు (1) ప్రధానమంత్రికి నెల 1 కి | 11111-1-9$\frac{1}{3}$ |
| (2) ప్రెసిడెంట్ ఆఫ్ కౌన్సిలు | 5555-8-10$\frac{2}{3}$ |
| (3) లార్డ్ ఛాన్సిలర్ | 11111-1-9$\frac{1}{3}$ |
| (4) స్వదేశవ్యవహారముల కార్యదర్శి, విదేశవ్యవహారములు, డొమినియన్లు, ఇండియామంత్రి (రాజ్యాంగ కార్యదర్శి) ఇతర ముఖ్యమంత్రులు 19 మందికి ఒక్కొక్కరికి | 5555-8-10$\frac{2}{3}$ |

(ఈ ఇండియా మంత్రిక్రింది మనగవర్నరులకు 10 వేలు మనగవర్నరుజనరలుకు 21 వేలు జీతములు.)

| | |
|---|---|
| అటర్నీ జనరల్‌కు ఫీజుగా నె 1 కి | రు 5000-0-0 |
| లాంకాస్టర్ డచీఛాన్సిలర్ | 2222-12-1$\frac{1}{3}$ |
| పోస్టుమాస్టరు జనరలు | 2777-12-5$\frac{1}{3}$ |
| పింఛనుల మంత్రికి | 2222- 3-6$\frac{2}{3}$ |
| సొలిసిటర్ జనరల్ (ఫీజుగాక) | 2777-12-5$\frac{1}{3}$ |

లార్డుఅడ్వ కేటు 5558- 8-10⅔

స్కాట్లాండు సొలిసిటర్ జనరల్ 2222- 3- 6⅔

## II నూతనఇండియా రాజ్యాంగమున బ్రిటిష్ ప్రభుత్వోద్యోగుల జీతబత్తెములు.

i గవర్నరు జనరలు, గవర్నర్లు:—

1935 సం॥ నూతన ఇండియాచట్టములోనే గవర్నరు జనరలు యొక్కయు గవర్నరుల యొక్కయు జీతములు వివరింపబడి వారికివ్వవలసిన అలవెన్సులనుగూర్చి సభాయుతుడగు ఆంగ్లరాజు ఒక (ఆర్డర్ ఇన్‌కవున్సిలు) తాఖీదు జారీచేయుటకు ఏర్పాటు చేయబడినది. అత్యధికముగానున్న ప్రాతజీతములు వేతనములు మార్చబడలేదు.

| | | | | |
|---|---|---|---|---|
| గవర్నరుజనరలుకు | సాలుకు రూ | 250800 | నెల 1 కి | 21333-5-4 |
| మదాసు, బొంబాయి వంగరాష్ట్రగవర్నర్లకు ఒక్కొక్కరికి | సాలుకు | 120000 | ,, | 10,000-0-0 |
| సంయుక్తరాష్ట్ర పంజాబు బీహారుగవర్నర్లకు ఒక్కొక్కరికి | | 100000 | ,, | 8333-5-4 |
| మధ్యరాష్ట్ర బీరారు గవర్నరుకు | | 72000 | ,, | 6000-0-0 |
| సింధుఒరిస్సాల గవర్నర్లకు | | 66000 | ,, | 5500-0-0 |

ఈగవర్నరు జనరలుకు గవర్నరులకు ఎక్విప్‌మెంటు (సన్నాహ) సరంజాముఖర్చులక్రిందను, ప్రయాణపు ఖర్చుల

క్రిందను, కొన్ని వేలరూపాయల అలవెన్సుల నిచ్చుటయేగాక ఇండియాలో వారు తమయుద్యోగ దర్జాలనుబట్టి సగౌరవము గాను సుఖముగాను అధికారము చలాయించుటకు అవసరమైన సొమ్ము యివ్వబడి తగుఏర్పాట్లు గావింపబడుననియు వారి యుద్యోగములయొక్క ఆచారము దర్జా ఇతరసౌకర్యములు వారికొసగబడుననియు అందుకు వలసిన తాఖీదులను ఆంగ్ల చక్రవర్తి జారీచేయుననియు చట్టములోనే చెప్పబడినది. చట్టము ప్రకారము ఆంగ్లరాజు ఆర్డర్సు ఇన్ కవున్సిళ్ళను జారీచేసి ఆయారాష్ట్రముల గవర్నరులకు తగు ఏర్పాటులను చేసియు న్నాడు. సీమనుంచి బయలుదేరునప్పుడు మద్రాసు బొంబాయి వంగ రాష్ట్ర గవర్నరులకు 2000 పౌనులు సంయుక్తరాష్ట్ర ముల గవర్నరుకు 1800 పౌనులు పంజాబు బీహారు గవర్నర్లకు 1500 పౌనులు మధ్యరాష్ట్రములు పశ్చిమోత్తర సరిహద్దు ఒరిస్సాల గవర్నరులకు 1200 పౌనులు అస్సాము గవర్నరుకు 1100 పౌనులు సరంజాము ఖర్చులక్రింద నివ్వబడునట్లు ఏర్పాటుచేసి, వారికి వారికుటుంబములకు ఇండియాకు వచ్చుటకగు ఖర్చు లన్నియు భారతదేశము భరింపవలెననిరి. ఇదిగాక నివాస గృహము అందలిసామానులు ఆఫీసు(కార్యాలయమందలి) ఫర్ని చరు (ఆసనములు వగైరాలు) క్రొత్తవి కొనుటకును భోజనము నువారము, మిలిటరీ సెక్రిటరీ అతని సిబ్బంది, బ్యాండు, బాడీ గార్డు(రక్షకోద్యోగము) పర్యటనములు (టూరింగు) ఖర్చుకు మోటారు కారులువగైరా చిల్లరఖర్చులకు ఆఫీసు కార్యాలయము

లలో ఖర్చుచేరు మంచిస్థితిలోనుంచుటకు అనిచెప్పి ప్రతిసాలున ఈక్రింది మొత్తము లాయాగవర్నరు కిచ్చునట్లు శాసింపబడినది.

| రాష్ట్రము | మొత్తమురూపాయలు |
|---|---|
| మదాసు | 575500 |
| బొంబాయి | 538400 |
| వంగరాష్ట్రము | 606100 |
| సంయుక్తరాష్ట్రము | 332330 |
| పంజాబు | 141200 |
| బీహారు | 108200 |
| మధ్యరాష్ట్రము, బీరారు | 107300 |
| అస్సాము | 142100 |
| పశ్చిమోత్తర సరిహద్దుపరగణా | 112850 |
| సింధు | 129800 |
| ఒరిస్సా | 103000 |

ఇట్లు ఈ గవర్నరులకు మహారాజులకువలె అన్నిఖర్చులుపోను గొప్పజీతము లివ్వబడునట్లు నిర్ణయింపబడి ఈ సొమ్మంతయు భారతదేశ ఆదాయముపైన బద్ధతచేయబడినది. అనగా మనవిద్యకు వైద్యమునకు ఇవిపోగా మిగిలిన దానినే ఖర్చుపెట్టికొనవలెను.

ఈగవర్నరులు సెలవుమీదవెళ్ళినచో మదాసు బొంబాయి వంగ సంయుక్త పంజాబు బీహారు గవర్నర్లు ఆరుమందికి నాల్గువేలచొప్పున సెలవు అలవెన్సులు, మధ్యరాష్ట్రముల గవర్నరుకు రు 3000-0-0 తక్కినవారికి నెలకురు 2750-0-0 లు

నివ్వబడును. రు 5500 వరకు హెచ్చించుటకు ఇండియా రాజ్యాంగ కార్యదర్శికధికారముకలదు. గవర్నరులస్వంత ఉపయోగము నిమిత్తము దిగుమతిచేయు ఆహారపానీయములకు దుస్తులకు ఇతరవస్తువులకు మోటారులకు పైన సుంకములుండవు. ఇట్లే గవర్నరు జనరలుకుగూడ ఏర్పాటుచేయబడినవి. అతని ఉద్యోగ ఆలవెన్సు సాలుకు 15 లక్షల రూపాయలుగా నిర్ణయింపబడినది.

ii కొన్ని పెద్దయుద్యోగములు - వానిజీతములు:—

| | |
|---|---|
| సర్వసేనానికి నెలకి జీతము | రు 8333-0-0 |
| ఎగ్జిక్యూటివు కౌన్సిల్ సభ్యులకు ఒక్కొక్కరికి | 6666-10-8 |
| అండమాను నికోబారుదీవుల ఛీఫ్ కమీషనరుకు | 3000-0-0 |
| బెలూచిస్థాన గవర్నరుకు | 4000-0-0 |
| కూర్గుకమీషనరుకు | 4000-0-0 |
| ఢిల్లీకమీషనరుకు | 3000-0-0 |
| వంగరాష్ట్రఛీఫ్ సెక్రిటరీకి | 5333-5-4 |
| మదాృసుచీఫ్ సెక్రిటరీకి | 3750-0-0 |
| బీహారు బొంబాయి పంజాబు సంయుక్తరాష్ట్రముల చీఫ్ సెక్రిటరీలకు | 3000-0-0 |
| మధ్యరాష్ట్ర ఛీఫ్ సెక్రిటరీకి | 2200-0-0 |
| ఒరిస్సా | 2150-0-0 |
| డివిజనల్ కమీషనర్లకు ఒక్కొకరికి | 4000-0-0 |
| జిల్లాకలెక్టర్లకు ఒక్కొకరికి | 3500-0-0 |
| ఐ. సి. ఎస్. వారిలో హీనపక్షపు జీతము | 450-0-0 |

ii ఫెడరలు కోర్టు జడ్జీలు; హైకోర్టు జడ్జీలు:—

క్రొత్తగా స్థాపించిన ఫెడరలు కోర్టు ఛీఫ్ జస్టిసుకు నెలకు ఏడు వేలరూపాయిలజీతము. 12 సంవత్సరములైన పిదప సాలుకు 2000 పౌనులవరకు ఫించను. తక్కిన ఇద్దరు న్యాయాధిపతులకు నెలకు జీతము ఒక్కొకరికి 5000 రూపాయిలుగ నిర్ణయింపబడినది. ప్రధాన న్యాయమూర్తి సర్వీసులో నుండగా చనిపోయినచో అతని వారసులకు మూడు వేలపౌనుల విరాళము (గ్రాట్యూయిటీ) ఇవ్వబడును. (అతడు సీమనుండి బయలు దేరగానే పనిలో చేరినట్లే ఎంచబడును.) గడ్డైగైన ఒక సంవత్సరములోపుగా చనిపోయినచో గూడ అతని వారసులకు 3 వేలపౌనులలో అతనికి ముట్టినసొమ్ముపోను మిగతాసొమ్ము ఇవ్వబడును. తక్కిన జడ్జీలలో ఐ.సి.యస్. ఉద్యోగియున్నచో అతనికి ఐ. సి. యస్. నిబంధనలే వర్తించి అతనికి ప్రత్యేక సౌకర్యములుండును. అతడు సీమనుండి బయలుదేరుటకు 500 పౌనులు సరంజాము (ఎక్విప్ మెంటు) ఖర్చులును ఇదిగాక ప్రయాణపుఖర్చులు నివ్వవలెను. ఈ దేశములో గూడా ప్రయాణపు ఖర్చులివ్వబడును. ఐ. సి. యస్. వర్గమువారు గాక ఇతర రకముల జడ్జీలనుగూర్చిన నిబంధన లింకను ప్రకటింపబడలేదు.

వివిధ హైకోర్టుజడ్జీల విషయములోగూడా ఒక రాజాజ్ఞ జారీచేయబడినది. మదాసులో 15 జడ్జీలు, బొంబాయిలో 13, కలకత్తాలో 19, అలహాబాదులో 12, లాహోరులో 15, పాట్నాలో 11,నాగపూరులో 7గురుజడ్జీలుగలరు.అయోధ్యలో

ఛీఫుకోర్టున్యాయాధిపతులునుతక్కినచోట్లజ్యూడిషియల్ కమిషనర్లునుగలరు. కలకత్తాప్రధానన్యాయమూర్తికినెలకురు6000-0-0 లు జీతము. మద్రాసు, బొంబాయి, అలహాబాదు, పాట్నా, లాహోరు, నాగపూర్ హైకోర్టుల జడ్జీలలోని ప్రధానన్యాయమూర్తులకు నెల 1 కి 5000-0-0 లు నాగపురం హైకోర్టు ఛీఫ్‌జడ్జికి రు 4165-0-0 నెలజీతము, తక్కిన జడ్జీలకు నాలుగు వేలు. చిన్నరాష్ట్రములలో 3 వేలు నెల జీతములు నిర్ణయింపబడినవి. వీరికి 12 సంవత్సరములలో పూర్తిగా పింఛనుపొందు అర్హతవచ్చును. 7 సంవత్సరములలో దామాషాగా పింఛను వచ్చును. ఈజడ్జీలలో ఐ. సి. యస్. వారున్నచో వారు ఇండియామంత్రితో చేసికొనిన కవనెంటు (ఒడంబడిక)లు ప్రకారము ప్రత్యేకమరతులు వర్తించునని శాసింపబడినది. ఐ. సి. ఎస్. లో వచ్చు పింఛనుగాక వారికి 7 సంవత్సరముల సర్వీసుకు సాలుకు 100 పౌనులు మొదలు 12 సంవత్సరముల సర్వీసుకు 200 పౌనులవరకు "అదనపుపింఛను" ఒసగబడును. ఈ ఐ. సి. యస్. వారికి అకాలబలవన్మరణము కలిగినగాని అపాయమువలన అంగవైకల్యము, దేహపీడ కలిగినగాని "అసాధారణపింఛనులు, ఉపకారవేతనవిరాళములు (గ్రాట్యుయిటీలు) నివ్వబడును. ఏకారణముచేతనైనను అశక్తుడైనచో ప్రత్యేకసెలవు, ప్రయాణపుఖర్చులు మొదలగు ప్రత్యేక సౌకర్యములు పొందుటకు అర్హతలుకలవు. ఈనిబంధనలు జడ్జీలకుగూడా వర్తించునట్లు శాసింపబడినది.

ఒకజడ్జీ సర్వీసులోనుండగా చనిపోయినచో అతనివార

నులు ఇంగ్లాండు నివాసులై యున్నచో అతడు చార్జీపుచ్చుకొన్న 6 నెలలకు పైబడి చనిపోయినచో అతనికివ్వవలసిన బకాయి జీతముగాక 6 నెలల జీతము ఉచితముగా నివ్వబడును.

అరు నెలలలోనేగాని సీమనుండి ఇండియాకు ఓడనెక్కిగాని చనిపోయినచో ఒకసంవత్సరము జీతము వారసుల కివ్వవలెను. ఉద్యోగులకు వారికుటుంబములకు నిచ్చు ఉపకార విరాళములు పింఛనులు నీక్రిందివిధముగా నిర్ణయింపబడినవి:—

iv అపాయముల ఉపకార విరాళములు, పింఛనులు:—

| | ఉపకార విరాళము, రూ॥ | సాలుకు పింఛను పెద్ద స్కేలు. | సాలుకు పింఛను చిన్న స్కేలు. |
|---|---|---|---|
| మదాసు, కలకత్తా, బొంబాయి, అలహాబాదు, లాహోరు పాట్నా, నాగపూరు ఛీఫ్‌జస్టిస్ ప్రధానన్యాయ మూర్తికి | 27000 | 5400 | 4700 |
| సాధారణ న్యాయ మూర్తికి అక్టింగువారికి | 15000 | 4700 | 4000 |

వారి కుటుంబములకు ఉపకార విరాళములు; పింఛనులు.

| | విరాళములు | పింఛనులు |
|---|---|---|
| చీఫ్ జస్టిస్ ప్రధానన్యాయమూర్తి కుటుంబముకు | 17000 | 5000 |
| సాధారణ న్యాయమూర్తుల కుటుంబముకు | 13500 | 4000 |

పిల్లలకు ఒక్కొకరికి

| | | |
|---|---|---|
| తల్లి కూడా లేకపోయినచో | సాలుకు పింఛను | 550 రూ॥ |
| తల్లి యున్నచో | ,, | 320 ,, |

V. ఐ. సి. యస్. వగైరా:—

పెద్దజీతములుగల ఆల్ యిండియా (అఖిలభారత దేశ) ఉద్యోగవర్గములలో పూర్వము అన్ని తరగతుల వారిని ఇండియా రాజ్యాంగ కార్యదర్శియే నియమించుచుండెను. ఆ శాఖలలో ఐ. సి. ఎస్. పోలీసు, మెడికల్, ఇంజనీరులశాఖ విద్యాశాఖ వ్యవసాయశాఖ వెటర్నరీశాఖ మున్నగునవి కలవు. 1924 మొదలు దీనిలో ఇంజనీరింగు శాఖలో రోడ్లు బిల్డింగుల బ్రాంచి యుద్యోగులను విద్యాశాఖ వ్యవసాయశాఖ యుద్యోగులను రాజ్యాంగ కార్యదర్శి నియమించుటమాని ఇండియా ప్రభుత్వమునకే వదలినాడు; తక్కిన వారినతడే నియమించుచుండెను. ఇప్పుడీ క్రొత్తరాజ్యాంగము (1935) వలన పూర్వమువలెనే ఇక ముందుగూడ ఐ. సి. ఎస్. పోలీసు మెడికలు సర్వీసుల యుద్యోగులను కేంద్రరాష్ట్రీయ మండలములందుగూడ

రాజ్యాంగ కార్యదర్శియే నియమించును. ఇదిగాక దేశరక్షణ (సైనిక) శాఖ; విదేశవ్యవహారములు; మతవ్యవహారములు నింకను గవర్నరు జనరలు స్వతంత్రవివేచనలోని ఇతరశాఖలకు అవసరమైన ఉద్యోగవర్గములనుగూడ రాజ్యాంగ కార్యదర్శియే నియమించును. మరియు భారత దేశ ప్రభుత్వయంత్రము నందు "రిజర్వుడు" ఉద్యోగములు కొన్ని రాజ్యాంగ కార్యదర్శియె నిర్మించును. రాజ్యాంగ కార్యదర్శి నియమించు ఉద్యోగవర్గముల యొక్కయు ఉద్యోగుల యొక్కయు ఉద్యోగపరతులు, వారి జీతములు, పింఛనులు, అలవెన్సులు, ప్రమోషనులు అన్నియు అతని చేతులలోనేయుండును. మంత్రులకెట్టి అధికారముండదు. రాష్ట్రములందు సామాన్యవిషయములందు కూడా ఈ ఐ. సి. ఎస్. వగైరా ఉద్యోగులు మంత్రులమాటలు విననిచో వారు చేయునది యేమియులేదు. ఈ ఉద్యోగులకు కొన్ని శాశ్వత హక్కులు దానశాసనముగా చట్టములోనే వ్రాసి యివ్వబడినవి. వీరికింకను క్షేమలాభములు కలిగించు నిబంధనలు అర్డర్లు ప్యాసుచేయుటకు రాజ్యాంగ కార్యదర్శికి ఆంగ్లరాజుకు అధికారమివ్వబడినది.

ఈ క్రొత్త రాజ్యాంగ చట్టమువలన ఈ ఉద్యోగులకు పూర్వమునుండియున్న అత్యధిక జీతములందుగాని అలవెన్సులందును ఇతర సౌకర్యములందు గాని, ఎట్టి మార్పును చేయబడలేదు. ఈ ఉద్యోగులకు వ్యతిరేకముగా ప్రజా ప్రతినిధి శాసనసభలు మంత్రులు నెట్టి మార్పులు చేయుటకును వీలులేదు. ఐ. సి. యస్. వర్గములోని ప్రతి ఉద్యోగియొక్క-

పదవియు 450 రూపాయలతో ప్రారంభమై కళ్లుమూసికొనినను అనాయాసముగను అప్రియత్నముగను 2250 రూపాయల వరకును జీతము వృద్ధిని బడయును. అతనికిగల అలవెన్సులు ఇతర లాభములు కలుపుకొని 4 వేలరూపాయిలు ఇతనికిప్రతినెలయు చెందును. ఇండియన్ మెడికల్ మిలిటరీ సర్వీసు వారికికూడ ఇంతకన్న ఎక్కువగానే యున్నవిగాని తక్కువజీతములులేవు. ఈ జీతములసమస్య 147-150 పుటలలో కొంతచర్చింపబడినది. ఇక్కడ నిక కొన్నివిశేషములను చూతము: ప్రతి ఉద్యోగికి అనేక అలవెన్సులు సముద్రాంతర జీతములు, సెలవు కంట్రి బ్యూషను మారకము తేడా నష్టపరిహారము ఇల్లు సౌకర్య ప్రయాణపు సౌకర్యములు ఉద్యోగముమీద యితరలాభములునుండును. 25 పబ్లికు సెలవులు 20రోజుల క్యాజుయల్ లీవు, గాక పూర్తిజీతముపైన అర్ధజీతముపైన అనేకవిధములైన సెలవులు కలసి ఒక్కసారిగా 8 నెలలు తీసికొనవచ్చును. ఇట్లు 23 నెలల ఉద్యోగమునకు 5 నెలలు సెలవువచ్చుచుండును.

అనారోగ్యపుసెలవు, చదువుకొరకుసెలవు, కూడ కలవు. సెలవులో ఆదాయపు పన్నుఉండదు, మారకము ఏ రేటుగానున్నను రూపాయికి 20 పెన్నీలచొప్పున లెక్కచూచి జీతమిత్తురు. ఇన్నిలాభములున్నందునవేరే అదనపు ఖర్చులేకుండా విద్యాశాఖలోని దొరలు వేసంగి సెలవుల కింగ్లాండుకు పోవగలుగుదురు. ఇట్లు మొత్తము 30 సంవత్సరముల సర్వీసులో 23 సంవత్సరములకన్న పనిచేయుట తటస్థింపదు.

అందువలన 100 మంది నిజముగా సరిపోవు ఉద్యోగ శాఖలకు 140 మందిని నియమింపవలసి వచ్చుచున్నది.

ఇకపింఛనులువలన మన దేశమున కింకను నష్టముకలుగుచున్నది. పూర్వము ఐ. సి. యస్. ఉద్యోగుల జీతములనుండి నూటికి 4 వంతులచొప్పున పింఛను ఫండు కొరకు ప్రభుత్వము తీసికొని దానికి మఱికొంత సొమ్ముకలిపి ఏతరగతివాడైనను సాలుకు 1000 పౌనుల పింఛనిచ్చుచుండిరి. 1919 లో ఆ 4 వంతులు కంట్రిబ్యూషను తీసివేసిరి. పింఛను కూడా చాలా హెచ్చు చేయబడినది. ఇతరదేశములలో 65 సంవత్సరములకు పింఛనిచ్చుచుండగా నీ దేశములో 55 సంవత్సరములకే పింఛనిచ్చుపద్ధతి వీరికొరకే నెలకొల్పిరి. పెద్దఉద్యోగులకు సాలుకు 5 వేలు మొదలు 7 వేలువరకు నిర్ణీతమొత్తము పింఛను నొసగుదురు. ఐ. సి. ఎస్. వారికి సాలుకు 1000 మొదలు 1500 పౌనుల పింఛనునిచ్చెదరు. పెద్ద న్యాయాధికారులకు 12 సంవత్సరములకే పింఛనిచ్చెదరు. సీమలోనిచ్చు పింఛనులకు ఆదాయపుపన్ను లేదు. జబ్బుపడినచో దామాషాపింఛను నొసగుదురు. ఉద్యోగము రద్దుచేసినచో నష్టపరిహారపు అలవెన్సునిచ్చెదరు. పింఛనులను ఏకమొత్తముగా తీసికొనుపద్ధతి వీరికొరకే స్థాపింపబడినది. అన్ని ప్రభుత్వములలోని పెద్ద యుద్యోగుల జీతములుకలిపి సాలుకు 100 కోట్ల రూపాయలున్నవి. రాష్ట్రీయాదాయములో నూటికి 40 వంతులీ యుద్యోగుల జీతములక్రింద ఖర్చుఅగుచున్నదని జాయింటు పార్లిమెంటరీ కమిటీవారు 1934 లో చెప్పియున్నారు.

పైన చెప్పబడిన సాధారణ పింఛనులుగాక ఐ. సి. ఎస్. వారు మిలిటరీవారితోపాటు సర్వీసులో నుండగా ఆకస్మికముగా అంగవైకల్యము కలిగినను, దేహపీడ గలిగినను, మరణించినను వీరికిని వీరి భార్యలకును బిడ్డలకును 'గ్రాట్యూయిటీ' అనబడు ఉపకారవిరాళముక్రింద కొన్ని పెద్ద మొత్తము లిచ్చి సాలుకింత యని ఉపకారవేతనముకూడా ప్రభుత్వమువా రిచ్చెదరు. వీనిని గూర్చిన వివరములు కొంతవరకు హైకోర్టుజడ్జీలుగానున్న ఐ. సి. యస్. వారిని గూర్చి వ్రాయుపట్ల 268వ పుటలో చెప్పబడియున్నవి.

అలవెన్సులు: సీమకు పోయినఐ. సి. యస్. వారి కెల్లగకు సముద్రాంతర అలవెన్సు ఒసగబడును. ఇది నెల 1కి 30 పౌనుల వరకును నుండును. ఈ ఐరోపావారు సర్వీసులో నుండగా ఇంగ్లాండుకు పోయివచ్చుటకు రానుపోను నాలుగు ఫస్టుక్లాసు ఓడటిక్కెట్లు ఇవ్వబడును. ఇదిగాక మారకం తేడా నష్టపరిహారపు అలవెన్సుకూడా వీరికి వ్వబడును. ప్రభుత్వము వారి తప్పులకు ప్రజలు నష్టపడుచుండవలెను. ఇట్టి ఉద్యోగుల కివ్వబడు సౌకర్యములన్నియు కలిపి సాలుకు $1\frac{1}{4}$ కోట్ల రూపాయిలుండునని లీకమిషనువారు అంచనా వేసినారు. గాని ఆదాయపుపన్ను విధింపనందున మన దేశమునకు కలుగుచున్న నష్టముగాని సీమలో చెల్లింపబడు పింఛనులుగాని దీనిలో చేరలేదు. ఐరోపా ఉద్యోగులతోపాటు భారతీయోద్యోగులకు గూడా ఇండియాలో ప్రయాణపుఖర్చులు బత్తెము నిచ్చుచున్నారు. ఈ బాపతు కేంద్రగవర్నమెంటువారే సాలుకు 140 లక్షల రూపాయిలు ఖర్చుపెట్టుచున్నారని ఇంచ్కేప్ కమిటీ

వారు చెప్పియున్నారు. దీనికి రాష్ట్రీయప్రభుత్వములును రైల్వే శాఖయు తమఉద్యోగుల కిచ్చుదానితో కలిపినచో నీపద్దు మాత్రమే సాలుకు 5 కోట్ల రూపాయిలగును. ఈబత్తెములలో నిటీవల కొంతతగ్గింపు చేసినను ఆయుంకెలలో నిప్పుడుగూడ హెచ్చుతేడాయుండదు. ఈబత్తెములలో ఉద్యోగులు చాల సొమ్ము మిగుల్చుకొను చుండుట జగద్విఖ్యాతము. ఇదిగాక ఇంటిఅద్దె అలవెన్సు, హెడ్క్వార్టర్సు అలవెన్సు, లోకల్ అలవెన్సు, గ్రెయిన్ కంపెన్సేషన్ అలవెన్సు, పెండ్లి అలవెన్సు, స్పెషల్ఉద్యోగములందలి స్పెషల్ జీతములు ఇంక నెన్నో సౌకర్యములు వారికి కలవు.

vi

సివిలు మిలిటరీ ఉద్యోగుల 'కుటుంబముల పింఛనుఫండు'

ఐ. సి. ఎస్. వగైరా పెద్దజీతములుగల ఉద్యోగశాఖలకు వారికివ్వబడు పెద్దపింఛనులుగాక ఇతరఉద్యోగులకు లేని కొన్ని ప్రత్యేక సౌకర్యములు వీరికి కలవని ఇదివరకే చెప్పియున్నాము. 'సివిల్, మిలిటరీ ఉద్యోగుల 'కుటుంబ పింఛనుల ఫండు' అనబడునిధి వీరికొరకు చిరకాలముక్రిందట స్థాపింపబడినది. దానిలో నాలుగువిధములైన నిధులుకలిసియున్నవి. ఈయుద్యోగుల జీతములలోనుండి నెల కింతయని కంట్రిబ్యూషను పుచ్చుకొని దానికి మనప్రభుత్వము కొంతకలిపి యీఫండును వృద్ధి చేయుచుండును. ఇది పెరిగిపెరిగి నేను 120 లక్షల పౌనులు (సుమారు 18 కోట్లరూపాయిలు) అయినది. దీనిపైన సాలుకు నూటికైదుచొప్పున అయినవడ్డీ 90 లక్షలరూపాయిలు ప్రతి

సాలున భారత దేశప్రభుత్వ మిచ్చుచుండును. ఈఫండు యొక్క వివిధ ధర్మనిధుల నిర్వాహణమునుగూర్చి నూతన ఇండియా రాజ్యాంగ చట్టముయొక్క 273 వ సెక్షనులో కొన్ని కట్టుదిట్ట ములు చేయబడినవి. దీనినిగూర్చి ఇంకను కొన్ని బందోబస్తులు చేయుచు సభాయుతుడగు ఆంగ్లరాజు ఆర్డర్ ఇన్ కవున్సిలు జారీ చేయుట కధికారమివ్వబడినది. ఆప్రికాగ మొక ఆర్డరుకూడా ఇటీవల జారీచేయబడినది. ఈ ఫండు వడ్డీలోనుండి ఈ ఉద్యోగుల కుటుంబముల కివ్వబడు ఉపకార విరాళములు, వేతనములను గూర్చి తగు నిబంధనలుచేయబడి అమలు జరుపబడుచున్నవి.

ఈ సివిలు మిలిటరీ ఆఫీసర్ల కుటుంబముల పింఛనుఫండు యొక్క పుట్టుక చరిత్ర చాలా చిత్రమైనది. బ్రిటిష్ రాజ్యతంత్ర ప్రారంభమున మొగలాయి రాజప్రతినిధియు వంగరాష్ట్ర నవాబు నగు సురాజద్దౌలాపట్ల ద్రోహముచేసి క్లైవు అమిత ధనము లంచముగా గైకొని మీర్జాఫరును వంగరాష్ట్రనవాబుగ జేసియుండెను. క్లైవు 1765 లో మూడవసారి గవర్నరుగా వచ్చుచున్న సంగతి మీర్జాఫరు తెలిసికొని తన యవసానము సమీపించుచున్నందునను, తన కొమారునకు క్లైవు సహాయము చేయగలడను నాసతోను, క్లైవుకు 70 వేల నవరసులు చెందజేసి మీర్జాఫరు చనిపోయెను. అప్పటికే అన్యాయ విత్త సమార్జన మెంతయోజేసెనని క్లైవుపైన నింగ్లాండులో నేరము లారోపింపబడియుండెను. అందువలన నతడీ సొమ్మును స్వప్రయోజనముకొరకు కుపయోగించుకొనుటకు జంకి ఈ సొమ్మునొక ధర్మనిధిగా నేర్పరచి దానిపైన వచ్చిన

ఆదాయము కంపెనీప్రభుత్వకొలువులో పనిచేయు సివిలు మిలిటరీయుద్యోగులలో జబ్బుపడిగాని అపాయములవలన అశక్తులై గాని అసహాయులైనవారికిని వారికుటుంబములకును ఆకస్మిక మరణములందు వారియొక్క భార్యాబిడ్డలకును కొంత ద్రవ్య సహాయము చేయుటకు వినియోగింపుడని కంపెనీవారి వశము చేసెను. ఈ ధర్మనిధికి "క్లైవుఫండు" అని పేరువచ్చినది. తమ ఉద్యోగులకు తగుసహాయముచేయు బాధ్యత కంపెనీప్రభుత్వము వారికిగూడ కలదు. కాబట్టివారీసొమ్ముకునూటికెనిమిదివంతుల చొప్పున అదనముగా సొమ్ముకలిపి వృద్ధిచేసిరి. తరువాత భారత దేశ ఉన్నతోద్యోగులకు; ఐ. సి. ఎస్; మిలిటరీ; యుద్యోగులకు; వారివితంతువులకు, పిల్లలకు, వేరువేరు నిధులును కుటుంబ పింఛనుల నిధులు నేర్పరుపబడి ఉద్యోగుల జీతములనుండి ప్రతి నెలకు నీనిధులకుకొంతసొమ్ము చేర్చుచుందురు. ఇట్లు కోట్లకొలది రూపాయిలీనిధికిచేరెను. పార్లిమెంటు తన క్రింద కంపెని ప్రభుత్వమువారే ఈధర్మనిధిని చక్కగా నిర్వహించుచుండిరి. 1858 తరువాత ఇండియా ప్రభుత్వము ఈ బాధ్యత వహించెను. ఇంగ్లాండులో వడ్డీ రేటు చాలా చౌకగానున్నందున శాశ్వతముగా నీనిధిపైన సాలుకు నూటికైదు చొప్పున, మారకము రేటుతో నిమిత్తములేకుండా వడ్డీనిచ్చుబాధ్యత ఇండియా ప్రభుత్వము పైన వేయబడెను. ఈ సొమ్ము ఇంగ్లాండులోని ఉద్యోగుల కుటుంబములకు సక్రమముగా చెల్లింపబడుచున్నది. దీనిలాభములు ఐ. సి. యస్. వగైరా ఉద్యోగములలోని భారతీయులకు పూర్తిగా చెందకుండ వారికి వేరేఏర్పాటులు చేయుచు కొన్నినిబంధనలుకూడ చేయబడినవి.

III

భారతదేశ మిలిటరీ సివిలు ఉద్యోగులజీతములు అలవెన్సుల వృద్ధిచరిత్ర:

| | మిలిటరీసైనికశాఖ | | | సివిలుసర్వీసుశాఖ | | |
|---|---|---|---|---|---|---|
| | 1913-14 | 1922-23 | వృద్ధి | 1913-14 | 1922-23 | వృద్ధి |
| | (వేల రూపాయలు) | | | | | |
| అసలుజీతము. | రు 12,13,75 | 23,67,91 | 11,54,16 | 5,85,37 | 11,97,60 | 6,12,23 |
| స్పెషల్ జీతము, లేక డ్యూటీ అలవెన్సు | 84,63 | 1,19,29 | 34,66 | 4,22 | 16,25 | 12,03 |
| నష్టపరిహారము లేక లోకల్ అలవెన్సు | 1,44 | 1,40 | 0 | 13,51 | 29,93 | 16,42 |
| ఇంటిఅద్దె | 8 | 1,76 | 1,68 | 5,42 | 14,98 | 9,56 |
| ప్రయాణపు అలవెన్సు | 30,59 | 70,01 | 39,42 | 35,09 | 69,97 | 34,88 |
| ఇతరఅలవెన్సులు | 15,05 | 1,39,35 | 1,24,30 | 31,51 | 46,49 | 14,98 |
| మొత్తము | 13,45,54 | 26,99,72 | 13,54.18 | 67,512 | 13,75,22 | 7,00,10 |

వరా: ఇది ప్రొఫెసర్ కె.టి.షా గారిలెక్క. దీనిప్రకారము స్పెషల్ అలవెన్సులు ఎంత అభివృద్ధిచేయబడినవో చూడుడు: ఈ అభివృద్ధిగాక ఈఉద్యోగుల పింఛనులును సీమకు ప్రయాణ అలవెన్సులును చాలా అభివృద్ధి చేయబడినవి. ప్రభుత్వవ్యయము తగ్గించుటకు నియమింపబడిన ఇంచికేపుకమిటీ వారు 1922-23 లో కేంద్రప్రభుత్వాదాయము నుండి రైళ్ళ ఉద్యోగములుకు గాక తక్కినవారి కిచ్చుసొమ్ము (Staff) 1913-14 నాటికి 474966 నుండి 1922-23 లో 520762 కు అనగా నూటికి 10 వంతులచొప్పున హెచ్చుచేసిరి! ఈఅభివృద్ధి చాలకగాబోలును, లీకమీషనువారు అన్నిశాఖలయొక్క జీతములు, రెమిటెన్సు సౌకర్యములు, పింఛనులు, ఓడకేవుల అలవెన్సులు వృద్ధిచేయుటకు సిఫారసు జేసిరి!!

| | | జీతములు, రెమిటెన్సులు, | లక్షల రూ॥ |
|---|---|---|---|
| I. C. S. | | ఐ. సి ఎస్ వారికి | 18.6 |
| I. P. S | | ఇండియన్ పోలీసుశాఖ వారికి | 12.7 |
| I. M. S | ,, | మెడికల్ శాఖకు | 7.0 |
| I. E. S | ,, | ఎడ్యుకేషనల్ విద్యాశాఖ (పురుషులు) | 3.3 |
| I. F. S | ,, | ఫారెస్టు సర్వీసు | 3.4 |
| I.S.E. | ,, | ఇంజనీర్లు | 10.9 |
| I. A.S | ,, | ఆడిట్ (అకౌంట్లు) | .8 |
| I.V.S | ,, | వెటర్నరీ వారికి. | 0.4 |
| | | మొత్తం రు | 57.1 |
| | | ఓడకేవులు | 25.0 |

ఇతరసర్వీసులకు 13 మొదలు 15 లక్షలరూ॥వరకు

ఐ. సి. ఎస్. వారి పింఛనులు 18. ల.

అన్‌కవెనంటెడ్ శాఖోద్యోగుల పింఛనులు 1.2

అభివృద్ధిమొత్తము అన్ని బాపతులు వెరసి: రూ 96.21 లక్షలు మొదలు 98.21 లక్షల రూపాయులవరకు నున్నది.

## IV

### జీతముల పూర్వ చరిత్ర.

గవర్నరుజనరలుకును గవర్నరులకును ఐ. సి. యస్. మిలిటరీశాఖలందలి భారతదేశముయొక్క ఆంగ్లేయోద్యోగులకును అత్యధిక జీతములు బత్తెములు నొసగబడుపద్ధతి క్రొత్తగా వచ్చినదికాదు. గవర్నరు జనరలుకు గవర్నరులకును కార్యాలోచన సభలందలి మెంబర్లకును, జడ్జీలకును ప్రథమము నుండియు నీ పెద్దజీతములేయుండెను. మిలిటరీశాఖలోను సివిలు శాఖలోను కంపెనీ పరిపాలనారంభమున సామాన్యజీతము లుండెనుగాని క్లైవు వారన్‌హేస్టింగ్సులు కొంత హెచ్చించిరి. ఉద్యోగులలో లంచగొండితనము మితిమీరగా జీతవృద్ధి చేయుట యవసరమని కారన్‌వాలిస్ ప్రభువు సిఫారసుచేయుగా వీరి జీతములింకను ఎక్కువగా వృద్ధిచేయుబడెను. 1858 లో నీ సివిలు మిలిటరీశాఖల ఉద్యోగనిబంధనలు సవరింపబడి జీత బత్తెములింకను వృద్ధిచేయుబడెను. 1914 సం॥ యుద్ధానంతరమిది మఱియు వృద్ధిచేయుబడినది. 1921 లో మాంటేగూసంస్కరణములవలన తెల్లదొరలతోపాటునల్లదొరలకుగూడజీతములు వృద్ధియయ్యెను. ఇదియే మన ఉద్యోగులజీతముల అభివృద్ధిచరిత్ర.

1833 వ సంవత్సరపు చట్టము ప్రకారము నియమింపబడిన లా మెంబరగు మెకాలేకు సాలుకు పదివేల పౌనులును 'లాకమిషనరు'గా నతనికి సాలుకింకను ఐదువేల పౌనులును జీతముగా నిర్ణయింపబడెను. ఈయదృష్టము పట్టు నాటి కీత డింగ్లాండులో సాలుకు రెండువందల పౌనులు సంపాదించుకొనుచుండెను! సుప్రీము కౌన్సిలుసభ్యునిజీతము 1853లో సాలుకు 80 వేల రూపాయిలుగా నిర్ణయించిరి. లెజిస్లేటీవ్ శాసన నిర్మాణ కార్యాలోచన సభ్యుని జీతము నెల 1 కి రు 4166-10-8 లుగ నిర్ణయించిరి. ఆ నాడు సాదరుకోర్టు చీఫ్ జడ్జికి సాలు 1 కి 48 వేల రూపాయిల జీతముండవలెనని సిఫారసుచేసియుండిరి. ఆనా డేశాఖలో చూచినను ఆంగ్లేయులే ఉద్యోగులుగా నుండినందువ ఆ యుద్యోగముల కిట్లత్యధిక జీతములు నిర్ణయింపబడుచుండెను. చిన్నజీతముల "నేటీవు" ఉద్యోగవర్గముయొక్క నియామకమునకు పార్లిమెంటువా రెట్టి ఏర్పాటును చేయలేదు. అందువలన వీరికెట్టి హక్కులులేవు. ఈ అత్యల్పపు జీతగాండ్రసంఖ్యకు లెక్కలేదు. కొంచెము పెద్దజీతగాండ్రుకూడ కొంతమంది 1835 తరువాత సియమింపబడిరి. గాని ఈ ఉద్యోగములన్నియు ఇండియాలోని ప్రభుత్వము వారి దస్తూరాధర్మ్మములపైన నాధారపడియుండెను. 1861 లో చేయబడిన సివిలుసర్వీసు చట్టము ప్రకార మప్పటికి నిర్మింపబడియున్న ఆంగ్లేయుల పెద్దయుద్యోగవర్గములతోపాటు 'నేటీవు' ఉద్యోగుల చిన్నయుద్యోగములనుకూడా ప్రభుత్వము వారు మంజూరుచేసిరి.

ఆంగ్లేయులు భారతీయులుగల ఈ పెద్ద చిన్న యుద్యోగముల యొక్క తారతమ్యము అప్పటికి నిప్పటికి నొకేతీరున నున్నది.

1913 ఏప్రిలులో కేంద్ర రాష్ట్రీయ ప్రభుత్వము యొక్క వివిధ శాఖలందలి ఉద్యోగులలో (ఆంగ్లోఇండియనులు సహా) బ్రిటిషువారును, భారతీయులును ఈ క్రింది దామాషా ప్రకారముండిరి:—

నెలకు రు 200-0-0 ల జీతముగల ఉద్యోగులసంఖ్య ఆ నాటికి 11064. దీనిలో ఆంగ్లోఇండియనులు బ్రిటిషువారు 6491 మంది అనగానూటికి 59. భారతీయులు 4573 అనగా నూటికి 41. ఇంకను కొన్ని తప్సీళ్లు ఈక్రింద నొసగబడినవి.—

| నెల 1 కి జీతము రూపాయిలు | ఆఉద్యోగములలో నూటికెందరు ఇంగ్లీషువారు ? | నూటి కెందరు భారతీయులు | నూటికెందరు ఆంగ్లో ఇండియనులు |
|---|---|---|---|
| 200—300 | 12% | 64% | 24% |
| 300—400 | 19% | 62% | 19% |
| 400—500 | 36% | 49% | 15% |
| 500—600 | 58% | 31% | 11% |
| 600—700 | 54% | 36% | 10% |
| 700—800 | 78% | 14% | 8% |
| 800—900 | 73% | 21% | 6% |
| 900—1000 | 92% | 4% | 4% |

ఇది ప్రొఫెసర్ కె. టి. షా గారి లెక్క.

(Sixty years of Indian Finance - page. 121)

## V

## 1858 నాటి భారతదేశప్రభుత్వోద్యోగులజీతములు :

1876 నాటికి మద్రాసులో నుండిన ఉద్యోగముల స్కేలును చూచినచో ఆకాలమున తక్కినచోట్ల జీతము లెట్లుండెనో తెలియును. ప్రభుత్వోద్యోగియగు సి. డి. మెక్లీన్‌గారిచే తయారుచేయబడి మద్రాసు ప్రభుత్వమువారిచే 1879 లో ప్రచురింపబడిన మద్రాసురాజధానియొక్క పరిపాలనవివరముల గ్రంథమునకు అనుబంధముగ నీక్రింది జాబితా చేర్చబడినది.

| | ఉద్యోగము | జీతము నెలకు రూ॥ |
|---|---|---|
| 1 | గవర్నరు | 10666-10-8 |
| 2 | మద్రాసు హైకోర్టుయొక్క ప్రధాన న్యాయమూర్తి (చీఫ్‌జస్టిస్) | 5000-0-0 |
| 3 | బిషప్పు | 2133-5-4 |
| 4 | గవర్నరుయొక్క కౌన్సిలుమెంబరు | 5333-5-4 |
| 5 | సాధారణజడ్జీలు | 3750-0-0 |
| 6 | గవర్నమెంటు చీఫ్‌సెక్రిటరీ | 3750-0-0 |
| 7 | గవర్నమెంటు అండర్‌సెక్రిటరీ | 1050-0-0 |
| 8 | గవర్నమెంటురివిన్యూశాఖ సెక్రిటరీ | 3125-0-0 |
| 9 | గవర్నమెంటురివిన్యూ అండర్‌సెక్రిటరీ | 1000-0-0 |
| 10 | డి. పి. డబ్లియు. సెక్రిటరీ | 2250-0-0 |
| 11 | (పల్లంసాగు) ఇరిగేషన్‌జాయంటుసెక్రటరీ | 1200-0-0 |
| 12 | గవర్నమెంటుమిలిటరీ సెక్రిటరీ | 2500-0-0 |

| | | నెలవు రూ |
|---|---|---|
| 13 | శాసననిర్మాణ న్యాయవిచారణశాఖ అసిస్టెంటు సెక్రెటరీ | 800-0-0 |
| 14 | గవర్నరు ప్రైవేటు సెక్రెటరీ | 1500-0-0 |
| 15 | అకవుంటెంటుజనరలును పేపరు కరెన్సికమీషనరును. | 3000-0-0 |
| 16 | డిప్యూటీ అకవుంటెంట్ జనరల్ రు 1000 మొ॥ | 1500-0-0 వ॥ |
| 17 | డిప్యూటీఅకవుంటెంట్ జనరల్ యొక్క అసిస్టెంటు 800 మొ॥ | 1000-0-0 వ॥ |
| 18 | అకవుంటెంటు జనరలుయొక్క అసిస్టెంటుకు రు 400 మొదలు | 600-0-0 వ॥ |
| 19 | డిప్యూటీ పేపర్ కరెన్సికమీషనరు యొక్క అసిస్టెంటు | 100-0-0 |
| 20 | అన్ కవనెంటెడ్ సివిల్ సర్వీసుపరీక్షల కమీషనరుయొక్క సెక్రెటరీ | 350-0-0 |
| 21 | (కలెక్టరు) అసిస్టెంటుల పరీక్షల కమిటీయొక్క సెక్రెటరీ | 100-0-0 |
| 22 | ఖగోళవాతావరణ శాఖసూపరింటెండెంటు | 1050-0-0 |
| 23 | తిరువాన్కూరు రెసిడెంటు | 2800-0-0 |
| 24 | తిరువాన్కూరు రెసిడెంటుయొక్క అసిస్టెంటు | 600-0-0 |
| 25 | రైల్వేలకన్సల్టింగు ఇంజనీరు | 2000-0-0 |
| 26 | రైల్వేకన్సల్టింగు డిప్యూటీ ఇంజనీరు | 600-0-0 |

| | | |
|---|---|---|
| 27 | కన్సల్టింగు ఇంజనీరు (ఇరిగేషను కెనాల్ కంపెనీ) | నెలకు రూ 1000-0-0 |
| 28 | చెపాకుగవర్నమెంటు ఏజంటు | 525-0-0 |
| 29 | (ట్రాన్సులేటర్లు) అరవము తెలుగు పెర్షియన్ హిందూస్తాని | 300-0-0 |
| 30 | (ట్రాన్సులేటర్లు) కన్నడముమళయాళము | 250-0-0 |
| 31 | సెంట్రల్ మ్యూజియంసూపరింటెండెంటు | [illegible]00-0-0 |
| 32 | సింకోనాతోటల సూపరింటెండెంటు | 500-0-0 |
| 33 | డయసీస్ ఆర్చిడీకన్రీల రిజిస్ట్రారు | 213-5-4 |
| 34 | వివాహములరిజిస్ట్రారు మద్రాసుపట్టణము | 50-0 0 |
| 35 | సీనియర్ ఛాప్లిను (ప్రెసిడెన్సీలో నెల 1కి 130-0-0 యింటిఅద్దెగాక) | 800-0-0 |
| 36 | జూనియర్ చాప్లిను (రు 130-0-0 అద్దెగాక) | 500-0-0 |
| 37 | పోష్టుమాష్టరు జనరల్ రు 1,500 మొ॥ | 1750-0-0 వ॥ |
| | ఇనస్పెక్టింగు పోస్టుమాష్టరు | 700-0-0 |
| 39 | మద్రాసు పోస్టుమాష్టరు 600 మొదలు | 900-0-0 వ॥ |
| 40 | డైరెక్టరు ఆఫ్ పబ్లికు ఇన్స్ట్రక్షను 2000 మొదలు | 2250-0-0 |

41 ఇన్స్పెక్టర్సు (స్కూల్సు), కాలేజీ ప్రిన్సిపాల్సు, ప్రొఫెసర్లు:

| | | |
|---|---|---|
| మొదటి తరగతి | 1000 మొదలు | 1250-0-0 |
| రెండవ తరగతి | 800 మొదలు | 1000-0-0 |
| మూడవ తరగతి | 700 మొదలు | 800-0-0 |
| నాలుగవ తరగతి | 500 మొదలు | 700-0-0 |

| | | నెలకు రూ. |
|---|---|---|
| 41(ఎ) | 4 వ క్లాసు స్కూళ్ళ ఇనస్పెక్టరు 600 మొ॥ | 700-0-0 |
| 42 | ఇంగ్లీషు, లెఖ్ఖల అసిస్టెంటు ప్రొఫెసరు | 350-0-0 |
| 43 | రసాయనశోధకుడు కెమిస్ట్రీ ప్రొఫెసరు | 1250-0-0(ఏ) |
| 44 | మద్రాసు యూనివర్ సిటి రిజష్ట్రారు | 300-0-0 |
| 45 | మెడికలు కాలేజి ప్రిన్సిపాలు, జనరలు ఆసుపత్రి ఫిజిషన్ | 1600-0-0 |
| 46 | నార్మలు స్కూలు ప్రిన్సిపాలు | 600-0-0 |
| 47 | సివిలు ఇంజనీరింగు కాలేజి పిన్సిపాలు | 600-0-0 (బి) |
| 48 | ప్రావిన్షియలుస్కూలు హెడ్‌మాష్టరు | 500-0-0 |
| 49 | స్కూలు ఆఫ్ ఆర్ట్సుసూపరింటెండెంటు | 500-0-0 |
| 50 | డిస్ట్రిక్టుయింజనీరు 600-0-0 మొ॥ | 700-0-0 వ॥ |
| 51 | ఫస్టుఅసిస్టెంటు యింజనీరు | 300-0-0 |
| 52 | సెకండు అసిస్టెంటుఇంజనీరు | 150-0-0 |
| 53 | రిజిస్ట్రేషన ఇనస్పెక్టరుజనరల్ | 1500-0-0 |
| 54 | మద్రాసు అస్యూరెన్సుల రిజష్ట్రారు | 400-0-0 |
| 55 | మద్రాసుహైకోర్టుఅప్పీలుసైడురిజిస్ట్రారు | 1600-0-0 |
| 56 | మద్రాసు హైకోర్టు అప్పిలెటుసైడు డిప్యూటిరిజిస్ట్రారు | 700-0-0 |
| 57 | అడ్వకేటు జనరలు | 2187-8-0 (సి) |
| 58 | అడ్మినిస్ట్రేటర్ జనరలు | 300-0-0 |
| 59 | సాలిసిటరు | 1225-0-0 |
| 60 | గవర్నమెంటు ప్లీడరు | 500-0-0 |

| | | నెలకు రూ. |
|---|---|---|
| 61 | హైకోర్టు ఒరిజనల్ సైడ్ రిజిస్ట్రారు | 1500-0-0 |
| 62 | హైకోర్టు ఒరిజనల్ సైడ్ డిప్యూటిరిజిస్ట్రారు | 600-0-0(డి) |
| 63 | హైకోర్టుఒరిజనల్ సైడ్ లారిపోర్టర్ | 400-0-0 |
| 64 | షెరిఫ్ | 898-0-0 |
| 65 | క్లెర్కు-ఆఫ్ దిక్రివును మరియు క్రివును పాసిక్యూటరు | 800-0-0 |
| 66 | డిప్యూటి క్లార్కు ఆఫ్ దిక్రివును | 175-0-0 |
| 67 | జడ్జిగుమస్తా | 550-0-0 |
| 68 | కొరోనరు | 350-0-0(ఇ) |
| 69 | మద్రాసు స్మాలుకాజుల ఫస్టుజడ్జి | రు 2000-0-0 |
| 70 | మద్రాసు స్మాలుకాజుల రెండవజడ్జి | 1000-0-0 |
| 71 | మద్రాసు స్మాలుకాజుల జడ్జి గుమాస్తా నాల్గవజడ్జి | 500-0-0 |
| 72 | మద్రాసు స్మాలుకాజులజడ్జి అసిస్టెంటు గుమాస్తా; క్యాషియరు | 300-0-0 |
| 73 | మద్రాసు పోలీసుఇన్స్పెక్టర్ జనరలు | 2500-0-0 |
| 74 | మద్రాసు పోలీసుఇన్స్పెక్టర్ జనరల్ అసిస్టెంటు | 900-0-0 |
| 75 | మద్రాసు పోలీసుడిప్యూటీ ఇన్స్పెక్టర్ జనరల్ | 1200-0-0 |
| 76 | పోలీస్ సూపరింటెండెంటులు 1, 2, 3 తరగతులు | 700, 800, 1000-0-0 |

| | | నెలకు రూ |
|---|---|---|
| 77 | అసిస్టెంటు పోలీసుసూపరెంటెండెంట్ | 500-0-0 |
| 78 | జైళ్ల ఇన్స్పెక్టర్ జనరలు | 1833-5-4 |
| 79 | సెంట్రల్ జైళ్ల సూపరెంట్లు 1, 2 క్లాసుల 550-700 మొదలు 700 - | 950-0-0 |
| 80 | మద్రాసు పోలీసుకమీషనరు | 1500-0-0 |
| 81 | మద్రాసు డిప్యూటీపోలీసు కమిషనర్ | 750-0-0 |
| 82 | మద్రాసు డిప్యూటీపోలీసు కమిషనర్ (ఇంకొకడు) | 500-0-0 |
| 83 | మద్రాసుపోలీసు మేజస్ట్రీటు | 800-1000-1200-0-0 |
| 84 | కంటోన్మెంట్ మేజస్ట్రీటు | 700-0-0 |
| 85 | జిల్లాసెషన్సుజడ్జి | 2333-5-4 |
| 86 | సబుజడ్జి | 500-0-0 |
| 87 | జిల్లామునసబులు 1,2,3 క్లాసులు | 200,250,300-0-0 |
| 88 | రివిన్యూబోర్డు ఫస్టుమెంబరు | 4000-0-0 |
| 89 | రివిన్యూబోర్డు సెకండుమెంబరు | 3408-5-4 |
| 90 | రివిన్యూబోర్డు మూడవమెంబరు | 3016-10-8 |
| 91 | రివిన్యూబోర్డుసెక్రిటరీ | 2000-0-0 |
| 92 | రివిన్యూబోర్డు సబుసెక్రిటరీ | 1500-0-0 |
| 93 | సీ కస్టమ్సు డిప్యూటీకలెక్టరు | 700-0-0 |
| 94 | అప్రియిజర్ | 500-0-0 |
| 95 | అసిస్టెంట్ అప్రియిజర్ | 300-0-0 |
| 96 | డిప్యూటీకలెక్టర్లు 1, 2, 3, 4 క్లాసులు | 250, 350, 500, 600-100 |

| | | | నెలకు రూ. |
|---|---|---|---|
| 97 | శానిటరీకమీషనరు | | 2000-0-0 |
| 98 | హెల్తుఆఫీసరు (ఎఫ్) | | 800-0-0 |
| 99 | గవర్నమెంటుబుక్సుక్యూరేటరు, రిజిస్ట్రార్ ఆఫ్‌బుక్సు (జి) | | 200-0-0 |
| 100 | రివిన్యూసెటిల్మెంటు డైరెక్టరు (ఐ) | | 2837-8-0 |
| 101 | రివిన్యూసెటిల్మెంటు డిప్యూటీ డైరెక్టరు (ఐ) 700-0-0 మొ॥ | | 1200-0-0 |
| 102 | రివిన్యూసెటిల్మెంటు అసిస్టెంటు డైరెక్టరులు 1, 2 క్లాసులు రు 325 లు | | 425-0-0 |
| 103 | సాల్టురివిన్యూ కమీషనరు (హెచ్) | రు 2000 | 2500-0-0 |
| 104 | సాల్టు రివిన్యూడిప్యూటీ కమీషనరు | (ఐ) 1200-0-0 | 1400-0-0 |
| 105 | సాల్టురివిన్యూకమీషనరుకు పర్సనల్ అసిస్టెంటు | | 500-0-0 |
| 106 | రివిన్యూ సర్వేసూపరింటు | సివిలు 1500-0-0 | మిలిటరీ 1800-0-0 |
| 107 | ఫస్టుక్లాసు రివిన్యూ సర్వే డిప్యూటీ సూపరింటు | 1100-0-0 | 1400-0-0 |
| 108 | సెకండ్‌క్లాస్ రివిన్యూసర్వే డిప్యూటీ సూపరింటు | 750-0-0 | 1200-0-0 |
| 109 | రివిన్యూ సర్వే అసిస్టెంటు సూపరింటు 1 వ క్లాసు | 650/- | 900-0-0 |

| | | |
|---|---|---|
| 110 | రివిన్యూసర్వే అసిస్టెంటు సూపరెంటు 2 వ క్లాసు 425/- | నెలకు రూ. 600-0-0 |
| 111 | స్టాంపులు, స్టేషనరీల సూపరెంటు | 1000-0-0 |
| 112 | ఫారెస్టు ఇన్‌స్పెక్టరు | 1400-0-0 |
| 113 | ఫారెస్టు డిప్యూటీ సూపరెంట్లు 1, 2, 3, 4 క్లాసులు 250, 350, 500, | 700-0-0 |
| 114 | ప్రొబేషనరు | 200-0-0 |
| 115 | గంజాం,విశాఖపట్నం కలెక్టరు ఏజెంటు | 2500-0-0 |
| 116 | తంజావూరు కలెక్టరు, ఏజెంటు (ఐ) | 2583-5-4 |
| 117 | తంజావూరు కలెక్టరు (ఐ) | 2333-5-4 |
| 118 | నీలగిరి కమీషనరు (ఐ) | 2000-0-0 |
| 119 | సబు, ప్రిన్సిపాల్ అసిస్టెంటు (ఐ) | 1166-10-8 |
| 120 | హెడ్‌సీనియర్, స్పెషల్ అసిస్టెంటు; అసిస్టెంటు కమీషనరు (జె) | 733-5-4 |
| 121 | పరీక్షలుప్యాసైన అసిస్టెంటు కలెక్టరు | 525-0-0 |
| 122 | మాస్టర్ అటెండెంట్ షిప్పింగు రిజిస్ట్రారు | 1500-0-0 |
| 123 | డిప్యూటీ మాస్టర్ అటెండెంటు, మర్కెంటైల్ మెరైన్‌ఆఫీసు సూపరెంటు, స్టోరుకీపరు, పోర్టుకన్సర్వేటరు | 700-0-0 |
| 124 | మాస్టర్ అటెండెంటుకు ఫస్టుఅసిస్టెంటు | 650-0-0 |

| | | నెలకు రూ. |
|---|---|---|
| 125 | మాస్టర్ అటెండెంటుకు రెండవ అసిస్టెంటు, గవర్నమెంటు షిపింగు సర్వేయరు, మైగ్రేషన్ (వలస) సర్వేయరు | 350-0-0 |
| 126 | పీర్ మాస్టర్ | 225-0-0 |
| 127 | డైవింగుబెల్ సూపరెంటు | 150-0-0 |
| 128 | ట్యూటికారిన్ పోర్టు ఆఫీసరు పెరల్సు బ్యాంకుసూపరెంటు | 500-0-0 |
| 129 | కొచ్చిను, కాకినాడ, కళ్ళికోట పోర్టు ఆఫీసర్లు ఒక్కొకరికి | 350-0-0 |
| 130 | నాగపట్నం, గోపాలపూర్ పోర్టుఆఫీసర్లకు | 300-0-0 |
| 131 | భీమునిపట్నం, బందరు, విశాఖపట్నం, పాంబన్, పోర్టు ఆఫీసర్లుకు | 200-0-0 |
| 132 | ప్రొటెక్టర్ ఆఫ్ ఇమిగ్రెంట్సు | 250-0-0 |
| 133 | పాండుచెరీ కాన్సులర్ ఏజెంటు | 250-0-0 |
| 134 | కారికల్ కాన్సులర్ ఏజెంటు | 200-0-0 |
| 135 | ఇమిగ్రెంట్సు మెడికల్ ఇన్‌స్పెక్టరు | 200-0-0 |

* పైన వ్రాయబడిన యుద్యోగులలో నీక్రిందచూపబడిన రిమార్కులుగలవారికి క్రిందచెప్పబడిన సౌకర్యములు గలవు.

(ఏ) ఈయుద్యోగికి నెల 1 కి రు 125 లు ఇంటిఅద్దెకూడాయివ్వబడును.

(బి) ఈ హోదాలో ప్రస్తుతమున్నఉద్యోగికి రు 1002-4-0 లు జీతము కలదు.

(సి) ఈ ఉద్యోగికి రు 115 లు ఆఫీసు అలవెన్సుకలదు.

(డి) ఈ హోదాలో ప్రస్తుతమున్న ఉద్యోగికి పర్సనల్ అలవెన్సు రు 200 లు ఇవ్వబడుచున్నది.

(ఈ) ఈతనికి పల్లకీ అలవెన్సు క్రింద రు 80 లు కలదు.

(ఎఫ్) ఇతనికి లాకౌ అనుపత్రియుద్యోగముకూడా చేయుచున్నందుకు రు 100 లు అదనముగా ఇవ్వబడుచున్నది.

(జి) ఈహోదాలో ప్రస్తుతమున్న ఉద్యోగికి 65-0-0 ఆఫీసు అలవెన్సున్ను పుస్తకముల అమ్మకముపైన నూటికి $7\frac{1}{2}$ చొప్పున కమీషన్నుకూడా ఇవ్వబడుచున్నది.

(హెచ్)ఇతనికి నెలకు రు 250 లు ప్రయాణపుబత్తెము నిర్ణీతముగా నివ్వబడుచున్నది.

(ఐ) ఈ ఉద్యోగికి డేరాఖర్చులక్రింద నెలకు 87-8-0 లు నిర్ణయింపబడినది.

(జే) డేరాకొరకు నెలకు 42-0-0 ఇంటి అద్దె రు 35-0-0 లు

బత్తాలు:

స్మాలుకాజు జడ్జీలకు రోజు 1 కి రు 4-0-0 లున్ను, మైలు 1 కు 0-1-0 ప్రయాణము ఖర్చులును, ఇవ్వబడుచుండెను. ఫస్టు సెకండుక్లాసు డిప్యూటీ కలెక్టర్లకు రోజు 1 కి 3-0-0 లు బత్తాలును, 3, 4 తరగతుల వారికి రోజు 1 కి 2-0-0 బత్తాలును ఇవ్వబడుచుండెను. హుజూరు డిప్యూటి సెటిల్మెంటు ఉద్యోగులకు వారివారి జీతములనుబట్టి రోజుకు 0-2-0 మొదలు 1-8-0 వరకు కలదు. నౌకర్లకు 0-1-0. చొప్పున దినబత్తెము లివ్వబడు చుండెను.

---

## మూడవ అనుబంధము

### మింటోమార్లే రాజ్యాంగసంస్కరణలు

శాసనసభలకు ప్రజాప్రతినిధులను ఎన్నుకొను హక్కును కోరుచు కాంగ్రెసుమహాసభ చాల తీర్మానములను చేసియుండెను. మఱియు కార్యనిర్వాహకసభలందు భారతీయులుండవలెనని కూడా కోరియుండెను. ఈ రెండుసంస్కరణములును రాజ్యాంగ ప్రణాళికలలో చేర్చినచో మితవాదులు తృప్తిజెందుదురని నాటి రాజ్యాంగ కార్యదర్శియగు మార్లే వైస్రాయియగు మింటో ప్రభువు 1909 లో ఆప్రకారము గావించిరి. ప్రభుత్వము వారి పాచిక పారినది. ఈరాజ్యాంగ సంస్కరణలను వీని ప్రకారము ఏర్పడిన శాసనసభలను ఈ మితవాదిప్రముఖులు మహాప్రసాద మని కన్నుల కద్దుకొనిరి. ఆశాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వమునకు కృతజ్ఞులై ప్రభుత్వము వారికి ప్రత్యుపకారముగా ముద్రణాలయముల చట్టమనబడు స్వాతంత్ర్యనిరోధక శాసనము నొకదానిని వెంటనే 1910 లోనే శాసించుటకు తోడ్పడిరి. దీనివలననే విడదీసి పాలించు ప్రభుత్వరాజ్యతంత్రమెట్లు సఫలతగాంచినదీ బోధపడగలదు. ఈచట్టమువలన రాజద్రోహ నేరములను గావించునట్లు ప్రభుత్వము నిర్ణయించు పత్రికల ధరావతులను ముద్రణాలయములనుగూడ ప్రభుత్వము వశము జేసికొనుమరతులుగూడ చేర్చబడెను. ఇట్లు భారతదేశ ప్రజలకు పూర్తిగా వాగ్బంధముగూడ చేయబడెను. ఈసభల సహాయముతో 1911 లో రాజద్రోహకర సభాసమావేశము గూడ చేయబడెను.

## మింటోమార్లే రాజ్యాంగసంస్కరణలుచేసిన మార్పులు :

1909 వ సంవత్సరపు క్రొత్తచట్టమువలన శాసనసభల నిర్మాణమునందు ముఖ్యమైనమార్పులుచేయబడెను. గవర్నరు జనరలుసభలో పూర్వము సభ్యులసంఖ్య 16, ఇప్పుడు 60మందికి వృద్ధిచేయబడెను. ఈసభ్యులలో కొందరు గవర్నరు జనరలు నియమించినవారు; కొందరు రాష్ట్రశాసనసభలలోని ప్రజా ప్రతినిధులెన్నుకొనిన సభ్యులు నుందురు.

1912 లో మరికొన్ని సంస్కరణములు చేయబడగా ఈ 60 మందిలో గవర్నరుజనరలు కార్యాలోచన సభలోని 6 మంది సభ్యులును ఆశాసనసభ సమావేశమగు రాష్ట్ర ప్రభుత్వాధ్యక్షుడును సర్వసేనానియుగాక ఇంకా 33 మంది నియామకసభ్యులు నుందురు. వీరిలో 28 మంది ఉద్యోగులు 5 గురు ఇతరులు కలరు. రాష్ట్రశాసనసభ్యులలోని ప్రజాప్రతినిధులెన్నుకొన్నవారు 6 మంది, మహామ్మదీయు లెన్నుకొన్న వారు 5, మహామ్మదీయ జమీందారుల ప్రతినిధి యొకడు, వర్తకసంఘము (చేంబర్సు ఆఫ్ కామర్సు) ఎన్నుకొన్న వారు 2—ఇట్లు ఈ సభలో ప్రజాప్రతినిధులకన్న నియామకులగు ఉద్యోగసభ్యులే హెచ్చుమందిగా నుండిరి. మఱియు ప్రత్యేక నియోజకవర్గముల వలన ఎన్నుకొనబడినవారు పరస్పర విరోధులుగనుందురు. గవర్నరు జనరలు ప్రభుత్వము వారి నిరంకుశాధికారమున కెట్టి లోపము నుండదు. రాష్ట్రశాసనసభలకుప్రతినిధుల నెన్నుకొనుహక్కు మునిసిపాలిటీలకు జిల్లాబోర్డులకు జమీందారులకు వర్తకసమ్మేళనములకు తేయాకు కాఫీ

తోటలవారికి ఒసగబడెను. మహమ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గము నేర్పరుపబడెను. ఇట్లు విడదీసి పాలించు పద్ధతి శాసనసభలో నెలకొల్పబడెను. మదరాసు బొంబాయి శాసనసభలందు మొత్తముసభ్యులు 50 మంది యుండవచ్చును. పంజాబు బర్మాలలో 30 మంది; అందులో ముగ్గురు గవర్నరులయొక్క కార్యనిర్వాహక సభ్యులు, 21 మంది నియామక సభ్యులు. దీనిలో 16మంది ఉద్యోగులు, 2 నిపుణులు, 21మంది ఎన్నుకొనబడు ప్రతిధులు నుందురు. వంగరాష్ట్రమున 28 మంది ఎన్నుకొనబడు ప్రతినిధులు 20 మంది నియామకులు 2 మంది నిపుణులు 3 గ్గురు కార్యనిర్వాహక సభ్యులు నుందురు.

శాసనసభలఅధికారములు:

(i) ప్రభుత్వముయొక్క (ఫైనాన్షియల్) ద్రవ్య వ్యవహారముల అంచనాను ముందుగా గవర్నరు జనరలు శాసనసభలో ప్రవేశపెట్టుదురు. అంతట శాసన సభలోని ఏ సభ్యుడైనను ఆ అంచనాలోని పన్నులవిధానములోమార్పునుగూర్చి క్రొత్త రుణములను రాష్ట్రములకిచ్చు గ్రాంటులనుగూర్చిన సంస్కరణ తీర్మానములునుప్రవేశపెట్టవచ్చును. అంతట ప్రభుత్వసభ్యులు పంజాయిషీ చెప్పుదురు. ఈ శాసనసభచేయు తీర్మానములు కేవలము సలహాలేగాని ప్రభుత్వము అమలుజరిపితీరవలసిన నిర్బంధము లేదు. తరువాత ఫైనల్ బడ్జెటు (ఆదాయ వ్యయ పట్టిక) ప్రవేశపెట్ట బడినప్పుడు దానిని చర్చించవచ్చునేగాని దానినిగూర్చి ఏ తీర్మానమును ప్రవేశ పెట్టరాదు. సైనిక రాజకీయ రాష్ట్రీయ వ్యవహారములను గూర్చి చర్చించ రాదు.

రివిన్యూ అను పద్దు క్రింద స్టాంపులు సుంకములు విధింపబడిన పన్నులు, కోర్టులు; ఖర్చుపద్దుక్రింద అసైన్మెంటులు కంపెన్సేషనులు ఋణముపైన వడ్డీ; మత వ్యవహారములఖర్చు; ప్రభుత్వ రైళ్ళను గూర్చియు చర్చింపరాదు. గవర్నరు జనరలు లా ప్రకారము చేయ వీలులేని వ్యవహారములనుగూర్చియు చర్చింపరాదు. విదేశ వ్యవహారములు సంస్థాన వ్యవహారములు చర్చింపరాదు. శాసనసభ అధ్యక్షుడే తీర్మానమునైనను ప్రజాభిప్రాయమునకు విరుద్ధమని త్రోసివేయవచ్చును; లేదా రాష్ట్రసభలో చేయబడవలెననియు త్రోసివేయవచ్చును.

(ii) రాష్ట్రీయద్రవ్య వ్యవహారములను గూర్చి యిట్లు జరుపబడుచుండును. గవర్నరు శాసనసభలో బడ్జెటు ప్రవేశపెట్టబడగానే రాష్ట్రములకు సంబంధించిన 5 వేల రూపాయిలకు పైబడిన ఖర్చులనుగూర్చి రాష్ట్రీయశాసనసభలోని ప్రతినిధి సభ్యులునుఉద్యోగులును చేరినగముగానుండు కమిటీలు దానిని పరిశీలించును. తరువాత నిది గవర్నరుజనరలు ప్రభుత్వమున కంపబడి పెద్దబడ్జెటు పట్టికలో చేర్చబడి పైన చెప్పబడిన విధముగా చర్చింపబడును. పైన చెప్పబడిన సందర్భములో రాష్ట్రశాసనసభలకు ద్రవ్యవ్యవహారములను చర్చించు అధికారముగూడ లేదని తేలుచున్నది.

(iii) ప్రజాక్షేమమునకు సంబంధించిన విషయములను గూర్చి శాసనసభలందు తీర్మానములు ప్రవేశపెట్టుటకుగూడ అధికారము గలిగింపబడెను. అయితే గవర్నరుజనరలు సభవారు ఆశాసనసభకు శాసనముచేయుట కధికారములేని వ్యవ

హారములను గూర్చిన చర్చలు చేయరాదు. విదేశవ్యవహార ములు స్వదేశసంస్థానములు కోర్టునిర్ణయములు వీనినిగూర్చియు చర్చింపరాదు. ప్రజాక్షేమమునకు విరుద్ధమనిగాని 'రాష్ట్ర శాసనసభలోనే ప్రవేశపెట్టబడవలెననిగాని' అధ్యక్షు డే తీర్మా నమునైనను త్రోసివేయవచ్చును. తీర్మానములు సవరణచేయ బడవచ్చును. ఇట్టి తీర్మానములు శాసనసభవా రామోదించి నను కేవలము సలహాలుగానే యుండునుగాని ప్రభుత్వము శిరసావహించవలెనను నియమములేదు.

(iv) విదేశవ్యవహారములు సంస్థానములు కోర్టుతీర్పు లను గూర్చిన విషయములుగాక తక్కినవిషయములను గూర్చి శాసనసభలో సభ్యులు ప్రశ్నలువేయుటకు అధికారమివ్వ బడెను. వానినిగూర్చి ఇంకను అదనపుసవాళ్లను ఇతరసభ్యులు వేయవచ్చును. అయితే వీనికి ప్రభుత్వసభ్యుడు జవాబుచెప్ప వలెనను నిర్బంధములేదు. దీనిని త్రోసివేయుటకుగూడ అధ్య క్షుని కధికారముకలదు. రాష్ట్రశాసనసభలకుగూడ ఇట్టి అధి కారమే యివ్వబడెను. ఈశాసనసభలందు జరుగు చర్చల కాలమును తగ్గించుటకుగూడ అధ్యక్షున కధికారమివ్వబడెను.

కార్యనిర్వాహకసభలు:—

1909 వ సంవత్సరపు చట్టమువలన మదరాసు బొంబా యిరాష్ట్రములందు కార్యనిర్వాహకసభలందు నలుగురు సభ్యులు నియమింపబడునట్లు ఏర్పాటుచేయబడెను. ఈసభకు నియమింపబడువారిలో నిరువురు 12 సంవత్సరములు అనుభ వముగల ఉద్యోగులుండవలెనను నియమముచేయబడెను. వంగ

రాష్ట్రమునగూడా కార్యాలోచనసభ యేర్పడెనుగాని లెఫ్టి నెంటు గవర్నరుల పరగణాలకట్టివిలేవు. ఈచట్టము చేయబడిన పిదపగవర్నరు జనరలు కార్యాలోచనసభలో నొకభారతీయుని గూడ నియమించి మితవాదులను సంతుష్టిపరచిరి. ఈ ఉద్దేశ్య ముతోనే ఇండియా రాజ్యాంగ కార్యదర్శి ఆలోచనసభకు ఇరువురు భారతీయులు నియమింపబడిరి. మఱియు మదరాసు బొంబాయిరాష్ట్ర గవర్నరుల కార్యాలోచన సభలయందు గూడ నిట్లే ఒక్కొక భారతీయసభ్యుడు నియమింపబడెను.

సంస్కరణల స్వభావము: ఈ మార్పులను చేయు టలో పార్లిమెంటరీ ప్రజాప్రభుత్వ పద్ధతులను గాని, బాధ్యతాయుత ప్రజాప్రతినిధ్య స్వపరిపాలనమును గాని భారతీయుల కొసగు తలంపు బ్రిటీషువారి కెన్నడును లేదు. ఈ మార్పువలన అట్టి పరిణామము గలుగునని తోచినచో వారీ సంస్కరణములను గావించియుండరు. దేశ ములో ప్రభుత్వముపట్ల విరోధభావము ద్వేషభావము ప్రబలి అరాజకవిప్లవోద్యమము నుదయించి చెలరేగుచున్నందున వానిని అరికట్టుటకును నిర్బంధవిధానముతోపాటు దేశములో ప్రభుత్వమునకు తోడ్పడగల శక్తులనెల్ల నేకముజేసి ప్రభుభక్తిపరులను చేరదీసి భారతదేశ నిరంకుశ ప్రభుత్వము నింకను బలవంతముగా జేసికొనవలెననియే వారి యుద్దేశ్యము. అందుకొరకు గావలసిన కట్టుబాటులనెల్ల గావించుకొనిరి. ఈ రాజ్యాంగమువలన ప్రజాప్రతినిధులకట్టి హక్కులను కలుగ లేదు. ఎట్టిహక్కులు కలిగింపవలెననియు వారి యభిమతము

కాదు. ఈ రాజ్యాంగమువలన భారతదేశ నిరంకుశ పరిపాలానా విధానములో నావంతయైన మార్పుకలుగలేదు. బ్రిటీషు సామ్రాజ్య లాభవిధానమునందు కొరంతకలుగలేదు. ప్రభుత్వము నాశ్రయించు జమీందారులు మితవాదులు ధనవంతులు శాసనసభలందుజేరి వారి మెప్పు బడయ ప్రయత్నింపసా`రి. ఇది త్వరలోనే విదితమయ్యెను. 1910 లో నీ శాసనసభవారు దేశప్రజల అభిప్రాయ ప్రకటనను అణచివేయగల తీవ్రనిబంధనలతో ప్రెస్సుచట్టమును చేయుటకు బుద్ధిపూర్వకముగా తోడ్పడిరి. దేశములోని రాజకీయ మితవాదులను సంతృప్తిపరుప జూచుకార్యము లింకను కొన్ని చేయుబడెను. 1912 లో జరిగిన డిల్లీదర్బారులో వంగరాష్ట్ర విభజన రద్దు చేయబడెను.

---

## నాలుగవ అనుబంధము:

## మాంటేగు రాజ్యాంగసంస్కరణము

1919 సం॥ హిందూదేశ రాజ్యాంగచట్టము ప్రకారము భరతఖండముయొక్క పరిపాలనమునకు ఇంగ్లాండులోని ప్రధాన ప్రభుత్వాధికారి బ్రిటీషు నృపాలుని మంత్రిమండలిలో నొకడగు హిందూదేశ రాజ్యాంగమంత్రి ( Secretary of State for India). ఈతడు పార్లమెంటువారికి బాధ్యతకల కార్యనిర్వాహకమంత్రి యగుటవలనను, బ్రిటీషు రాజ్యాంగవిధానమును బట్టి సార్వభౌమత్వాధికారములును ప్రభుతయు పార్లమెంటు వందే నెలకొనియుండుటవలన నీమంత్రి నిజముగ పార్లమెంటు

వారి యుద్యోగియే యగుచున్నాడు. హిందూ దేశ రాజ్యాంగ చట్టమునుబట్టి ఈ రాజ్యాంగమంత్రికి హిందూ దేశ ప్రభుత్వ వర్గము పైన పెత్తనము, పరిపాలనాధికారములు, మాత్రమే గాక పరిపాలనావిధానమును నడపుటకు రాజాజ్ఞలనిచ్చుటకు నధికారములు కూడ కలవు. ఈమంత్రికి ఇండియాకవున్సిలు అనునొక కార్యాలోచనసభకలదు. సాధారణముగ నితడన్ని పనులు నాసభవారితో ఆలోచించి చేయునుగాని రహస్య విషయములం దట్లాలోచింపడు. ఇంగ్లీషు "కాబినెట్టు" మంత్రి మండలియొక్క ఆచారధర్మములనుబట్టి సమస్తకార్యములును ప్రధానమంత్రియు, తక్కిన ముఖ్యమంత్రులును గలిసి బ్రిటీషు దీవుల ప్రభుత్వమును, సామ్రాజ్య ప్రభుత్వమును నడుపుదురు ఆ రాజ్యాంగవిధానమున, ఏ రాజకీయపక్షము వారి ప్రతినిధులు పార్లమెంటులో నధికసంఖ్యాకులై యుందురో ఆ రాజకీయ సిద్ధాంతముల ప్రకారము ప్రభుత్వముచేయు మంత్రి మండలియే పరిపాలన మందుండును గనుక తక్కిన రాజకీయములందువలెనే హిందూ దేశ ప్రభుత్వపద్ధతులుగూడ ఆయా కాలములందు ప్రభుత్వము సేయు రాజకీయ పక్షము వారి యభిప్రాయములకు లోనై యుండునని చెప్పవలసిన పనిలేదు.

## వైస్రాయి అధికారములు

హిందూ దేశ రాజ్యాంగమంత్రి యధికారములకు, ఆజ్ఞలకులోబడి భరతఖండమునందలి పరిపాలనాధికారములు - అనగా ప్రభుత్వముయొక్క వ్యవహారిక, సైనిక కార్యనిర్వాహణాధికారమెల్ల కార్యాలోచన సంఘ సభాయుతుడగు గవ

ర్నరు జనరలునందు నెలకొల్పబడియున్నది. గవర్నరు జనరలు ఆంగ్లరాజ ప్రతినిధి. ఈతనిని బ్రిటీషు సార్వభౌముడే నియమించును. ఇతడు 5సం వత్సరములుద్యోగము చేయును. గవర్నరు జనరలు కార్యాలోచన సభలో సర్వసేనానితో కలిసి 7 గురు సభ్యులుందురు. ఈ సభ్యులను కార్యనిర్వాహక సభ్యులందురు. సాధారణముగ వీరిలో అధిక సమ్మతినిబట్టి రాజకార్యములు జరుగును. గాని ఒక్కొకప్పుడు వీరిసలహాను విసర్జించి గవర్నరు జనరలు స్వయముగకూడ కార్యనిర్వహణము చేయవచ్చును.

భరతఖండములోని శాసన నిర్మాణాధికారము గవర్నరుజనరలు, రెండు శాసనసభలు గల కేంద్రశాసన సంస్థయందు నెలకొల్పబడినది. స్టేటుకవున్సిలులో 34 గురు ఎన్నుకొనబడిన సభ్యులును, 26 గురు ప్రభుత్వమువారిచే నియమింపబడిన సభ్యులు నుందురు. అసెంబ్లీసభలో 105 మంది ఎన్నుకొనబడినవారు, 40మంది నియామకసభ్యులుకలరు. రాజ్యాంగ చట్టమునందలి నియమములకు లోబడి ఉభయసభలు తీర్మానించినతప్ప ఏచిత్తుచట్టమును శాసనముకాదు. అవసర శాసనములను తానే చేయుటకును, శాసనసభలు తీర్మానించిన శాసనమును పునర్విమర్శ చేయగలందులకు, వెనుకకంపుటకు, దేశముయొక్క శాంతికి, రక్షణకు సంబంధించిన శాసనసభ వారి చట్టములను ప్రత్యాఖ్య (Veto) (రద్దు) చేయుటకును గవర్నరు జనరలుకు విశేషాధికారములు కలవు. ప్రభుత్వకోశముయొక్క ఆదాయ వ్యయ పరిశాలిక ఉభయసభలయందును చర్చకొరకంపబడును. అసెంబ్లీసభవారా పరిశాలికను

తీర్మానింతురు. ఆదాయవ్యయములందు కొన్ని పద్దులనుగూర్చి అసెంబ్లిసభవారు జోక్యము కలిగించుకొనరాదు. మఱియు అసెంబ్లీసభవారి ఇష్టానిష్టములతో నిమిత్తములేకుండా దేశముయొక్క శాంతికి, రక్షణకు నావశ్యకములైన ఆదాయవ్యయములను గవర్నరుజనరలే చేయుట కధికారము కలదు. వారు శాసనసభలకు బాధ్యతకలిగి యుండక ఇంగ్లాండు పార్లమెంటువారికే బాధ్యతకలిగియున్నందున ప్రజాప్రతినిధుల శాసనసభల ప్రభుత్వాధికారములు తగ్గింపబడినవి. మఱియు గవర్నరుజనరలు కిట్టి యధికారము లీయబడినవి.

1. కోశశాఖ: పబ్లికులెక్కలు, ఋణములు, నల్లమందు చలామణి, బ్యాంకి వ్యవహారములు, టంకశాలలు మొదలగు పనులు జూచును.

2. విదేశరాజకీయశాఖ: విదేశవ్యవహారములు, సంస్థానవ్యవహారములు, సరిహద్దుజాతుల వ్యవహారములు జూచును.

3. స్వదేశశాఖ: (Home Department) ఆంతరంగిక రాజకీయ వ్యవహారములు, (సివిలుసర్వీసు) ఉద్యోగములు, న్యాయశాఖ వ్యవహారము, కారాగారములు, పోలీసువ్యవహారములు జూచును.

4. శాసనశాఖ: లామెంబరు శాసనసభలందు ప్రవేశపెట్టబడు ప్రభుత్వశాసనములను జూచును.

5. వాణిజ్యశాఖ: వర్తకము, నౌకావ్యాపారము, రేవులు మున్నగు పనులు జూచును.

6. పరిశ్రమలు, వార్తిక శాఖ : పరిశ్రమలు, వస్తునిలయములు, స్టోరులు, పబ్లికువర్క్సు, తపాల తంతి కార్యాలయముల వ్యవహారము, సివిలు వాయువ్యవస్థ, రాకపోకలు, పల్లం సాగు, కర్మాగారములు మున్నగువానిని గూర్చిన వ్యవహారములు.

7. సైనికశాఖ: సైనిక వ్యవస్థను, రక్షణవ్యవహారములను జూచును.

8. విద్య, ఆరోగ్య, భూముల శాఖ : విద్య, స్థానిక పరిపాలన, ఆరోగ్యము, కజవులు, భూమిశిస్తు, సర్వే, వ్యవసాయము, అడవులు, ఆహారము మున్నగువానిపైన అధికారములు కలిగియుండును.

9. రైళ్ళశాఖ : రైలువ్యవహారముల జూచును.

## అధికార విభజనము

1919 వ సంవత్సరములోని సంస్కరణల ప్రకారము వృద్ధిక్రమానుగతముగా భారతదేశమునకు బాధ్యతాయుత పరిపాలనము నొసగుటయు, అందుకొరకు ముందుగ రాష్ట్రములందు స్వపరిపాలన విధానమును నెలకొల్పుటయు యుక్తమని పార్లమెంటువారు చట్టముననే ఉదాహరించినందున దేశ పరిపాలనముకొరకు కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రీయ ప్రభుత్వములకును ప్రభుత్వాధికారములు విభజింపబడినవి. కేంద్ర ప్రభుత్వమునకు దేశరక్షణము, రాజకీయ సంబంధములు, రైళ్లు, సుంకములు, రాకపోకలు, మున్నగు కేంద్ర విషయము

లోనగబడి, రాష్ట్రీయ ప్రభుత్వములకు స్థానిక సంబంధము లైన స్థానిక స్వపరిపాలనము, విద్య, ఆరోగ్యము, డి. పి. డబ్లియు శాఖ, నీటి సప్లయి, భూమి సిస్తులు, భూమి వ్యవహారములు కఱవుల నివారణ, వ్యవసాయము ఆబ్కారి మున్నగు విషయ ములందు కొన్ని నియమములకు లోబడి తమ రాజ్యమున అధికారములీయబడినవి.అయితే ఈ విషయములందు రాష్ట్రీయ శాసనసభలకు శాసన నిర్మాణాధికారమునకు కొంత లోపము గలదు. రాష్ట్రీయ శాసనసభలతోపాటు ఈవిషయములందు కేంద్ర శాసనసభలకు గూడ శాసన నిర్మాణాధికారము కలదు. అయితే సాధారణముగా స్థానిక విషయములందు కేంద్ర శాసనసభ వారు శాసనములను జేయరుగాని, చేయుట కభ్యంతరము లేదు. దేశాదాయ మార్గములుకూడ కేంద్ర, రాష్ట్రీయ ప్రభుత్వములమధ్య విభజింపబడినవి. అట్లొనగ బడిన ఆయా ఆదాయములను వసూలుచేసి, వ్యయముచేసి కొనుటకు రాష్ట్రములకు పూర్ణాధికారము కలదు. అయితే కొన్ని విషయములలో గవర్నరుజనరలు అనుమతినిపొందవలెను.

## రాష్ట్రీయ ప్రభుత్వములు

పెద్ద రాష్ట్రములు, చిన్న పరగణాలుకలిపి 15 రాష్ట్రములుగ విభజింపబడినవి. చెన్నపట్నము, బొంబాయి,బంగాళా గవర్నరులు ఇంగ్లండులోని రాజ్యాంగమంత్రితో తిన్నగ వ్యవహారములు, నుత్తరప్రత్యుత్తరములు జరుపవచ్చును. తక్కిన గవర్నరులు, పరిపాలకులు గవర్నరుజనరలుద్వారాతప్ప అట్లొనర్పరాదు. అయితే భరతఖండ రాజ్యాంగవ్యవహారములందెల్లి

గవర్నరులు, తక్కిన పరిపాలకులు గవర్నరు జనరలుకు లోబడవలెను.

తొమ్మిది పెద్దరాష్ట్రములలో రాష్ట్రీయ ప్రభుత్వముయొక్క కార్యనిర్వహణాధికారము క్రొత్తచట్టమువలన గవర్నరుక్రింద రెండుభాగములుగ విభజింపబడినది. ఒక భాగము గవర్నరును కార్యనిర్వాహకసంఘములును గల రిజర్వుడుశాఖ, రెండవభాగము గవర్నరును ఆయననియమించుమంత్రులునుగల ట్రాన్సుఫర్డుశాఖ. గవర్నరు, ఆయన కార్యనిర్వాహక సంఘమునందలి సభ్యులు బ్రిటీషునృపాలుని వలన నియమింపబడుదురు. ఈ ప్రభుత్వభాగమునకు రిజర్వుడు విషయము లనబడు ముఖ్యప్రభుత్వాధికారములెల్ల ఒసగబడినవి. రెండవ భాగములో గవర్నరుకు సలహానొసగు మంత్రులను శాసనసభయందలి ప్రజాప్రతినిధులలో నుండి నియమించును. ఆయన చిత్తము వచ్చినన్నాళ్ళు వీరుద్యోగము చేయుదురు. వీరికి "ట్రాన్సుఫర్డు" విషయములన బడు కొన్నిసామాన్య ప్రభుత్వాధికారములుగలవు.

గవర్నరు జనరలుకు గల అధికారములవంటి విశేషాధికారములేగల ఈగవర్నరులకు లోబడిన అధికారములుగల రాష్ట్రీయ శాసనసభలందు శాసన నిర్మాణాధికారము నెలకొల్పబడినది. ఈసభలును కేంద్రశాసనసభలవలెనే కొన్ని విషయములందు ఆదాయవ్యయములనుగూర్చి జోక్యము కలిగించుకొనరాదు. ట్రాన్సుఫర్డు విషయములందు మంత్రులు బాధ్యతకలిగియుందురు. బాధ్యతాయుత పరిపాలనమున శాసన

సభలకు మొదటి సోపానముగ రాష్ట్రీయశాసనసభలు పెద్దవి
చేయబడినవి. అందు నూటికి 70 మంది ఎన్నుకొనబడు సభ్యులు
నియమింపబడుట కేర్పాటు చేయబడినది. దేశమునందలి
జనసంఖ్యలో 50 లక్షల ప్రజలకు ఎన్నికహక్కు ఒసగబడినది.
అనగా నూటికిద్దరువంతున నియోజకులు గలరు. సౌకర్యము
కొరకు దేశమెల్ల జిల్లాలుగ విభజింపబడినది. ప్రతిజిల్లాకును
కలెక్టరు లనబడు వ్యవహార దండనాధికారులుందురు. బి
రాజ్యమున 273 జిల్లాలుకలవు. న్యాయపరిపాలనము కార్య
నిర్వహణాధికారమును జిల్లా మేజస్ట్రేటులందు నెలకొల్పబడినది.
వేర్వేరు రాష్ట్రములందు వేరువేరు ఉన్నతన్యాయస్థానము
లేర్పరుపబడి ధర్మపరిపాలనచేయుచున్నవి. వానిపైన ఇంగ్లాండు
లోని ప్రీవీకవున్సిలు సభకు అప్పీలు అధికారములుకలవు.

రాష్ట్రీయశాసనసభలకు బాధ్యతకల మంత్రుల వశ
మునగల ట్రాన్స్ఫర్డు విషయములు:—

1. స్థానికస్వపరిపాలన 2. మునిసిపాలిటీలు, జిల్లా బోర్డులు
ఆరోగ్యము, వైద్యము, ఆసుపత్రులు, వైద్యవిద్య, 3. భార
తీయుల విద్య, (కొన్ని విశ్వవిద్యాలయములుతప్ప). 4. రోడ్లు,
బ్రిడ్జీలు, ట్రాములు మున్నగు పబ్లికువర్క్సు. అయితే పబ్లికు
వర్క్సులో వ్యవహారము, పల్లంసాగు, నీటిపారుదల(Irrigation)
కాల్వలు మున్నగునవి చేరవు. (ఇవి రిజర్వుడు విషయములు)
5. వ్యవసాయము; చేపలు, 6 సహకార సంఘములు,
7 సారాయము, కల్లుకు సంబంధించినంతవరకు అబ్కారీ వ్యవ

హారములు. (అయితే నల్లమందు చేరదు) 8. బర్మాలోను, బొంబాయిలోనుమాత్రము అడవులు మంత్రులవశమున గలవు. 9. అభివృద్ధిశాఖ అనగా పరిశ్రమాభివృద్ధి శాఖ పరిశోధన, వృత్తివిద్య.

రాష్ట్రీయశాసనసభలకు బాధ్యతలేని గవర్నరు కార్య నిర్వాహకసంఘమువారి వశమునగల రిజర్వుడు విషయములు:- 1. పల్లంసాగు, కాలువలు, మురుగు కాల్వలు, గట్టులు (Embankments ), నీటివసతి (Storage,) జలశక్తి(Power) 2 భూమిరివిన్యూలు పరిపాలన, పన్నులు విధించుట, వసూలు చేయుట, భూమి అభివృద్ధి, వ్యవసాయఋణములు; 3 కఱవుల నివారణము, 4 న్యాయశాఖ; 5 పోలీసు; 6 వార్తాపత్రికలు పుస్తకములు, ముద్రాక్షరశాలలు; 7 కారాగారములు, సంస్కరణ కారాగారములు; 8 రాష్ట్రీయ పరపతిపైన ఋణము తెచ్చుట; 9 అడవులు; 10 కర్మాగారముల తనిఖీ, కార్మిక వివాదల పరిష్కారము, పారిశ్రామికభీమా, గృహ వసతులు.

---

# ఐదవ అనుబంధము : భారతదేశ స్థితిగతి లెక్కలు.

## I. కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వవ్యయవిధానము. *

ఆయా సంవత్సరములలో మొత్తమువ్యయములో వివిధములైన పద్దులు నూటి కెన్ని వంతులుగ నుండెనో తెలుపు ప్రభుత్వపు లెక్క.

| సంవత్సరములు | 1921-22 | 1923-24 | 1925-26 | 1927-28 | 1930-31 |
|---|---|---|---|---|---|
| మొత్తము వ్యయము లక్షల రూపాయలు | 222.02 | 206.48 | 215.75 | 218.73 | 226.81 |
| వ్యయము తబ్సీలు | | | | | |
| 1. దేశరక్షణసైనికవ్యయము | 36 | 30 | 28 | 26 | 26 |
| 2. రైల్లు | 11 | 12 | 13 | 15 | 15 |
| 3. ఋణతీర్మానము | 8 | 9 | 10 | 9 | 9 |
| 4. పోలీసు, జైళ్ళు, న్యాయశాఖ | 9 | 10 | 10 | 9 | 10 |
| 5. విద్య | 4 | 5 | 5 | 6 | 6 |
| 6. సివిలు కార్యములు | 5 | 5 | 5 | 6 | 6 |
| 7. సామాన్య పరిపాలన | 5 | 5 | 6 | 6 | 6 |
| 8. భూమిశిస్తు వసూలు | 3 | 3 | 2 | 2 | 2 |
| 9. అడవులు | 2 | 2 | 1 | 2 | 1 |
| 10. వ్యవసాయసాగుకు నీటి పారుదల (ఇరిగేషను) | 2 | 2 | 3 | 3 | 3 |
| 11. ప్రజల ఆరోగ్యము | 2 | 2 | 1 | 1 | 1 |
| 12. ఉపకార వేతనములు | ... | ... | 3 | 3 | 3 |
| 13. వివిధములు | 13 | 15 | 13 | 12 | 13 |

* గమనిక :-(i)ఇవి ప్రభుత్వమువారి లెక్కలు. (ii) ఈలెక్కలలో 1925-26, 1927-28 లలో సైనికవ్యయముగా చూపబడిన వంతులు సరికావు. గాంధి మహాత్మునికి శిష్యుడగు ప్రొఫెసర్ జె. సి. కుమారప్పగారి లెక్కలవల్ల నిజముగా 1925-26 లో నూటికి 39.5 వంతులును 1927-28 లో నూటికి 39.4 వంతులును సైనికవ్యయము చేయబడెనని బయల్పడినది. (iii) ఈ లెక్కలను బట్టి గూడ ప్రజల ఆరోగ్యము, విద్య, వ్యవసాయముల కెంత తక్కువగను ప్రభుత్వము వా సివిలు మిలిటరీఖర్చులకు ఋణముల వడ్డీలకు ఎంత హెచ్చుగను ఖర్చుపెట్టబడు చున్నదో కనబడును.

## II. వివిధ దేశస్థితిగతి

| దేశము | అక్షరజ్ఞత | | | | చదువుకొనుచున్న | |
|---|---|---|---|---|---|---|
| | సంవత్సరము | మొత్తము జన సంఖ్య | | మొత్తము జనసంఖ్యలో నూటి కెంత మంది చదువనేర్చినవారు | సంవత్సరము | మొత్తము జనసంఖ్య |
| | | మొత్తము 10 లక్షలలో | చదవనేర్చిన 10 లక్షలకు | | | |
| | 2 | 3 | 4 | 5 | | |
| యావద్భారతము | 1931 | 353 | 28 | 8 | ... | ... |
| బ్రిటిషు ఇండియా | 1931 | 272 | 22.7 | 8.5 | 1930-31 | 12689086 |
| ఇంగ్లాండు స్కాట్లాండు వేల్సు (1) | 1921 | 42.7 | 32.5 | 76.1 | 1930-31 | 8719134 |
| అమెరికా సంయుక్తరాష్ట్రంలు | 1920 | 105.7 | 79 | 74.5 | 1930-31 | 29156286 |
| కెనడా | 1921 | 8.8 | 6.3 | 71.6 | 1931 | 2542747 |
| జర్మనీ | 1925 | 62.4 | 50.2 | 80.5 | 1931 | 10430774 |
| ఫ్రాన్సు | 1926 | 40.2 | 32.2 | 80.1 | 1930 | 6371439 |
| జపాను | 1925 | 59.7 | 42.8 | 71.7 | 1930-31 | 12428519 |

1 - 2 నుండి 5 వ కలమువరకు ఇంగ్లాండు వేల్సులకు మాత్రమే.

లెక్కలు — విద్య.

| విద్యార్థులు | ఖర్చు | | ప్రాథమిక విద్య | | విశ్వవిద్యాలయ చదువు | |
|---|---|---|---|---|---|---|
| [illegible] ఎందరు | మొత్తము ఖర్చు | తల 1 కి ఖర్చు | విద్యార్థుల మొత్తము | ఖర్చు | మొత్తము విద్యార్థులు | ఖర్చు |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| | కోట్ల రూ. | రూ. | | కోట్ల రూ. | | కోట్ల రూ. |
| 4.67 | 28.32 | 1.04 | 9362748 | 8.14 | 92028 | 3.92 |
| 18.8 | 149.81 | 32.4 | 6186973 | 86.21 | 61712 | 56 |
| 23.7 | 801.4 | 65 | 23534000 | 347 | 971000 | 374.17 |
| 24.4 | 49.72 | 48 | 2005652 | 42.1(2) | 41168 | 6.6 |
| 16.07 | ... | .... | 6771404 | ... | 131081 | ... |
| 15.3 | ... | ... | 5576312 | ... | 91910 | ... |
| 19 | 71.5 | 11 | 9923877 | ... | 143503 | ... |

2 వృత్తివిద్యలు ఇతరవిధవిద్యా కలుపుకొని.

(ఈ పట్టిక సర్. ఎమ్. విశ్వేశ్వరయ్య గారిది.)

## * III ప్రభుత్వముయొక్క దామాషా ఆదాయము వివరములు. (1861—1920).

| సంవత్సరము | మొత్తము ఆదాయం కోట్లరూ | ఆదాయం లో వృద్ధి లక్షలరూ | భూమిశిస్తు మొత్తం కోట్లరూ | వసూలు ఖర్చులుపోగా నికరం భూమి శిస్తు కోట్లరూ | ఆదాయపు పన్ను కోట్లరూ | ఉప్పు పన్ను కోట్లరూ | అడవులు లక్షలరూ |
|---|---|---|---|---|---|---|---|
| 1861-74 | 47.21 | 50 | 20.21 | 17.88 | .08 | 5.10 | 14 |
| 1875-1898 | 79.77 | 170 | 26.86 | 23.36 | .11 | 7.00 | 49 |
| 1899-1913 | 116.31 | 165 | 33.60 | 28.05 | 1.95 | 6.11 | 105 |
| 1914-1920 | 164.40 | 1205 | 35.26 | 29.01 | 10.70 | 5.84 | 165 |

## * IV ప్రభుత్వముయొక్క దామాషా నికరవ్యయముల వివరము. (1861—1920).

| సంవత్సరము | ప్రభుత్వ వ్యయము మొత్తము కోట్లరూ | సైన్య వ్యయము కోట్లరూ | మొత్తము ఆదాయము లో నూటికిది ఎన్ని వంతులు | సీమ ఖర్చులు కోట్లరూ | మొత్తము వ్యయంలో నూటికెన్ని వంతులు | ఋణము పైని వడ్డి | ఇది నూటికెన్ని వంతులు | సివిలు పరిపాలన ఖర్చు కోట్లరూ | మొత్తము వ్యయంలో నూటికెన్ని వంతులు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1861-1874 | 47.20 | 16.2 | 46.8 | 10.47 | 28 | 5. 1 | 14.9 | 10.28 | 29.5 |
| 1875-1898 | 79.99 | 21.5 | 49.5 | 20.83 | 42.7 | 3. 7 | 7.7 | 15.04 | 31.2 |
| 1899-1913 | 112.92 | 27.4 | 54.1 | 28.35 | 25 | 0.48 | 1.6 | 24.16 | 34.4 |
| 1914-1920 | 169.60 | 53.8 | 58.4 | 35.85 | 21.1 | 2. 9 | 4.6 | 34.38 | 37.7 |

* V ఆయాకాలములలోని సివిలు పరిపాలనలోని కొన్ని ఖర్చుల తబ్సీళ్ళు. (1861 - 1920)

కోట్ల రూపాయిలు

| సంవత్సరము | పన్నుల వసూలు ఖర్చులు | లా న్యాయ పరిపాలన | పోలీసు | విద్య | పొలిటికల్ | పింఛనులు | పల్లం సాగు వు నికర ఖర్చులు |
|---|---|---|---|---|---|---|---|
| 1861-1874 | 5.4 | 1.5 | — | — | .47 | — | — |
| 1875-1898 | 7.6 | 2.9 | 2.9 | 1.0 | .73 | 3.6 | 1.1 |
| 1899-1913 | 10.7 | 3.4 | 5.1 | 2.2 | . 9 | 4.1 | .8 |
| 1914-1920 | 13.0 | 6.0 | 8.8 | 5.1 | 2. 7 | 4.7 | .8 |

* ఈ అంకెలు సి. యన్. వకీలుగారి "ఫైనాన్షల్ డెవలప్‌మెంట్ ఇన్ మాడరన్ ఇండియా"లోనుండి.

# VI వివిధ దేశ స్థితిగతి లెక్కలు - ఆయురారోగ్యపు లెక్కలు

| దేశము | సంవత్సరము | వైశాల్యము చతురపు మైళ్ళు | జనాభా | | | జన సాంద్రత | మొత్తం జనసంఖ్యలో వేయింటికి | | దామాషా ఆయుర్దాయము 1 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | సరి | పట్టణవాసులు మొత్తము జనాభాలో నూటికెందరు | గ్రామవాసులు మొత్తము నూటికెందరు | చ॥ మై॥కు | జననములు | మరణములు | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| భారతదేశము | 1931 | 1,808,679 | 352837778 | 38979211 (11.0) | 313858567 (89.0) | 195.5 | 32.9 | 24.5 | 26.7 |
| ఇంగ్లాండు స్కాట్లాండు వేల్సు | 1931 | 94,278 | 46178884 | 31948166 (80.0) 2 | 7999765 (20.0) 2 | 490 | 16.3 | 12.5 | 57.6 (3) |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | 1930 | 3,685,382 | 122775046 | 68954823 (56.2) | 53820223 (43.8) | 33.3 | 18.9 | 11.3 | 56.4 |
| కెనడా | 1931 | 3,510,008 | 10374196 | 5572058 (53.7) | 4802138 (46.3) | 2.95 | 23.9 | 10.7 | |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| జర్మనీ | 1930 | 180,985 | 64776000 | 40191588 (62.0) | 24584412 (38.0) | 357.9 | 17.5 | 11.1 | 49.04 |
| ఫ్రాన్సు | 1931 | 212,659 | 41860000 | 19984766 (49.05) 4 | 20759131 (50.95) 4 | 197 | 17.4 | 16.3 | 50.5 |
| జపాను | 1931 | 147,593 | 65366500 | 33324000 (56.0) 5 | 26413000 (44.0) 5 | 443 | 32.35 | 18.17 | 44.5 |

1. 10 వ కలములోని అంకెలు, 2 వ కలములోని సంవత్సరమునకే చెందినవి కావు
2. ఇంగ్లాండు వేల్సులకు మాత్రమే
3. ఇంగ్లాండువి మాత్రమే
4. 1926 లో
5. 1925 లో

(ఈ పట్టిక సర్ ఎమ్. విశ్వేశ్వరయ్యగారిది)

| సంస్థానము లేక రాష్ట్రము పేరు. | వైశాల్యము. | జనసంఖ్య. | |
|---|---|---|---|
| | | 1901 | 1931 |
| 1 | 2 | 3 | 4 |
| హైదరాబాదు | 82698 | 11141142 | 14436148 |
| మైసూరు | 29444 | 5539399 | 6557302 |
| బరోడా | 8099 | 1952692 | 2443007 |
| కాశ్మీరము | 80900 | 2905578 | 3646243 |
| తిరువాన్కూరు | 7091 | 2952157 | 5095973 |
| కొచిను | 1362 | 812025 | 1205016 |
| స్వదేశ సంస్థానములు | 712508 | 62461549 | 81310845 |
| మదరాసు | 141726 | 38209436 | 46748644 |
| బొంబాయి | 123064 | 18559561 | 22259977 |
| వంగరాష్ట్రము | 151185 | 74744866 | 50122550 |
| సంయుక్తరాష్ట్రము | 107164 | 47691782 | 48408763 |
| పంజాబు | 97209 | 20330339 | 23580851 |
| బర్మా | 236738 | 10490624 | 14665618 |
| బీహారు ఒరిస్సా | 83161 | — | 37590356 |
| మధ్యరాష్ట్రము | 104169 | 12630662 | 15472628 |
| అస్సాము | 56243 | 6126343 | 8622251 |
| పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రము | 16466 | 2125480 | 2425076 |
| బ్రిటీషు ఇండియా | 1096171 | 231899507 | 271526933 |
| యావద్భారతదేశము | 1808679 | 294361056 | 352837778 |

| ఆదాయము - లక్షల రూ॥ | | జనసంఖ్యలో అక్షరాస్యులు వేయింటి కెంతమంది? | | | | చ॥ మైలుకు జనసంఖ్యా సాంద్రత | జనసంఖ్యలో పెరుగుదల నూటికి |
|---|---|---|---|---|---|---|---|
| | | పురుషులు | | స్త్రీలు | | | |
| 1901 | 1931 | 1901 | 1931 | 1901 | 1931 | 1931 | |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 359 | 798.9 | 55 | 57 | 3 | 8 | 175 | |
| 190 | 345.27 | 93 | 148 | 8 | 22 | 224 | |
| 123 | 260.09 | 163 | 240 | 8 | 47 | 299 | |
| 87 | 223.29 | 38 | 46 | 1 | 3 | 43 | |
| 100 | 244.02 | 215 | 380 | 31 | 173 | 668 | |
| 27 | 90.09 | ... | 317 | ... | 115 | 814 | |
| రూ. | రూ. | | | | | | |
| 134272000 | 199845443 | 119 | 95 | 45 | 31 | 329 | 23 |
| 45220000 | 192820000 | 116 | 90.8 | 9 | 28.3 | 174 | 24 |
| 237423000 | 118474000 | 104 | 83 | 5 | 23.2 | 616 | 24 |
| 130634000 | 103906788 | 57 | 53 | 2 | 7.2 | 442 | 18 |
| 43153000 | 120670000 | 64 | 88.2 | 3 | 18.5 | 208 | 27 |
| 76086000 | 116147000 | 37.8 | 68.1 | 45 | 30.1 | 63 | 18 |
| ... | 55884000 | ... | 51.5 | ... | 6.7 | 379 | 22 |
| 17039000 * | 65912000 | 54 | 50.7 | 2 | 8.5 | 137 | 26 |
| 13801000 | 24566000 | 67 | 68.8 | 4 | 15 | 137 | 20 |
| — | — | — | 57 | — | 12 | 129 | 21 |
| 1145200000 | 2262191000 | 100 | 144 | 7 | 20 | — | 24.63 |
| — | — | 98 | 139 | 7 | 21 | — | 26.85 |

1419000 (చీరాల).

షరా:— 1931 లో భారతదేశము మొత్తము జనసంఖ్యలో నూటికి 8 మంది అక్షరాస్యులు.

## VIII వివిధదేశముల ప్రభుత్వ ఆదాయము - ఋణము - జాతీయసంపద

| దేశము | దేశాదాయము రివిన్యూ కేంద్ర రాష్ట్రీయ స్థానిక | | | దేశ ఋణము | | | జాతీయాదాయము | | | జాతీయ సంపద | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం॥ | మొత్తం | తల 1 కి | సం॥ | మొత్తం | తల 1కి | సం॥ | మొత్తం | తల 1కి | సం॥ | మొత్తం | తల 1కి |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| | | కోట్లరూ | రూ॥ | | కోట్ల రూ | రూ॥ | | కోట్ల రూ | రూ॥ | | కోట్ల రూ | రూ॥ |
| బ్రిటిషు ఇండియా | 1932-33 | 268(1) | 10 | 1932 | 1212 | 45 | 1922-23 | 2223 | 82 | 1930 | 12000 | 441 |
| ఇంగ్లాండు స్కాట్లాండు వేల్సు | 1933 | 1334(2) | 290 | 1932 | 10197 | 2217 | 1931 | 4995 | 1092 | 1925 | 29432 | 6371 |
| అమెరికా సంయుక్త రాష్ట్రములు | 1930 | 2732(3) | 222 | 1932 | 5413 | 440 | 1928 | 24533 | 2053 | 1928 | 112315 | 9365 |
| కెనడా | 1931 | 205 | 197 | 1931 | 555 | 533 | 1930 | 1319 | 1268 | 1929 | 8344 | 8023 |
| ఫ్రాన్సు | 1933 | 460(4) | 115 | 1931 | 5163 | 1230 | 1928 | 2618 | 636 | 1928 | 18857 | 4581 |
| జపాను | 1932-33 | 459(5) | 76 | 1932 | 940 | 145 | 1928 | 1471 | 271 | 1924 | 13645 | 2308 |

1. కేంద్రరాష్ట్రీయ 1932-33 స్థానిక 1930-31
2. సామ్రాజ్య 1933 స్థానిక 1931-32
3. ఫెడరలు 1933 రాష్ట్రములు 1929
4. స్టేటురివిన్యూకు సంబంధించినవి.
5. సామ్రాజ్య 1932-33 ప్రీఫెక్టురల్ 1932-33 నగరములు 1931-32 పట్టణములు 1931-32 గ్రామములు 1931-32

ఈ పట్టిక ప్లాన్డ్ ఎకానమీ ఫర్ ఇండియాలోనిది—సర్. ఎమ్. విశ్వేశ్వరయ్యగారు

## IX బ్రిటీషు, భారతీయ సైనికులకు ఉద్యోగులకు సాలు కగు ఖర్చులలో తేడాలు *

రూపాయిలు

| బ్రిటీషు ఆఫీసర్లు (ఉద్యోగులు) | | | భారతీయ ఉద్యోగులు | |
|---|---|---|---|---|
| | 1913 | 1922 | 1913 | 1922 |
| బ్రిటీషు క్యావల్రి (అశ్వదళం) | 8312 | 11294 | — | — |
| ,, ఇన్ ఫాంట్రీ (కాల్బలం) | 6393 | 10277 | — | — |
| ఇండియన్ క్యావల్రి | 9332 | 14277 | 1439 | 2524 |
| ,, ఇన్ ఫాంట్రి | 8691 | 13992 | 1197 | 2124 |
| బ్రిటీషు ఎన్. సి. ఓ. | | | | |
| బ్రిటీషు క్యావల్రి | 1512 | 3529 | — | — |
| ,, ఇన్ ఫాంట్రి | 1386 | 3307 | — | — |
| బ్రిటీషు సోల్జరు (సైనికుడు) | | | భారతీయ సైనికుడు | |
| బ్రిటీషు క్యావల్రి (అశ్వదళం) | 1036 | 2526 | 313 | 669 సవార్ |
| ,, ఇన్ ఫాంట్రి (కాల్బలం) | 963 | 2503 | 283 | 631 |

భారతదేశ సైన్యములోగల ఒక్కొక బ్రిటీషు సోల్జరు (ఆంగ్లేయసైనికుని) జీతబత్తెములకొరకు మనప్రభుత్వము ప్రతిసాలున చేయవలసివచ్చు ఖర్చు భారతీయసైనికుని కగు వ్యయముకన్న 1913 లోనే మూడురెట్లు హెచ్చుగానుండెను. 1922 లో నది నాల్గురెట్లు హెచ్చుఖర్చుగా పెరిగినది.

ఇట్లే బ్రిటీషుఉద్యోగుల కగువ్యయము భారతీయుని కన్న ఆరురెట్లు హెచ్చుగనుండెను. ఒక్క బ్రిటీషు సైనికుని కగు ఖర్చు దరిదాపుగా భారతీయోద్యోగి కగు ఖర్చుతో సమానముగ నుండెను!

---

* ఇదియు 147 పేజీలో చెప్పబడిన పట్టిక (సి. ఎస్. వకీలుగారి లెక్క)

# కొన్ని ముఖ్యమైన సవరణలు

| పుట | పంక్తి | తప్పు | దిద్దుకొనవలసినరీతి |
|---|---|---|---|
| 96 | 14 | ఆనాటి | 1901 లో విక్టోరియాచనిపోవు నాటి |
| 109 | 13-15 | జిల్లాజడ్జీలు మొదలగువారి సంఖ్యలలో తప్పులు | 21 మంది జిల్లాజడ్జీలు - తిగ్గురు బోర్డు ఆఫ్ రివిన్యూసభ్యులు- 2ద్దరు గవర్నమెంటు సెక్రిటరీలు - 19మంది కలెక్టర్లు - 2రు రివిన్యూబోర్డు సెక్రటరీలు |
| 123 | 10 | 1923 లో | 1924 లో |
| 134 | 14 | 1871 వరకు | 1861 నుండి 1898 వరకు |
| 137 | 16 | తల 1ికి దేశాదాయము | తల 1కి దేశాదాయము సాలుకు పౌనులు |
| 138 | 10 | తల 1కి సాలుకు | తల 1కి సాలుకు పౌనులు |
| 147 | 10 | మొత్తం రూ | మొత్తము సైనికులు |
| 147 | పుటలోగల సైనికులపట్టిక | | గోఖలేగారి లెక్క |
| 191 | 11 | సంస్థానాధీశులు | III సంస్థానాధీశులు |
| 254 | 12 | సమర్థించువారిని | సమర్థించుచు వారిని |
| 261 | 19 | ఫీజుగా | ఫీజుగాక |
| 279 | 2 | 18 ల. | .18 లక్షల రూపాయిలు |

The Government of India Act 1935, Edited by N. R. Aiyengar. With The Orders in Council etc.
A Constitutional History of India. 1600-1935—Keith.
Speeches and Documents on Indian Policy Volumes I and II.—Professor. A. B. Keith. D.C.L;D.Litt.
The Montague Chelmsford Report.
The Report of the Indian Statutory Commission.
The Proceedings of the Round Table Conference.
Joint Parliamentary Committee Report (1934)
The Federal Structure —Prof. K. T. Shah
Provincial Autonomy. Do
A Brief Analysis of the New Constitution
Dr. Z. A. Ahmed. A. I. C. C. Allahabad.
The Politico-Economic Consequences of the India Act.
Prof. D. H. Butani. (Modern Review May 1936.)
The Encyclopaedia Britannica (XIV th. Edition).
The Report of the Inchcape Committee.
The Report of the Lee Commission on Public Services.
The Report of the Indian Taxation Enquiry Committee.
The Report of the Royal Commission on Agriculture.
The Central Banking Enquiry Committee Report-1931.
Wealth of India. —Wadia and Joshi.
Indian Economics.— Jather and Beri.
The Congress Golden Jubilee Brochures.
The Congress Political and Economic Studies Series.
Financial Developments in Modern India - C.N. Vakil.
Wealth and Taxable capacity of India.
By Prof. K. T. Shah and Khambatta.
Sixty Years of Indian Finance—Prof. K. T. Shah.
Some Economic and Financial Aspects of British Rule in India. by Dr. Z. A. Ahmed. (A. I. C. C. Allahabad.)
Public Services in India—Prof. D. R. Gadgil.
The Civil Service Regulations (Govt. of India).
Economic History of India R. C. Dutt.
The Victorian Age Do
The Imperial Gazetteer of India Vols. I to IV.
A Memorandum on some results of the Indian Administration, during the last 50 years of British Rule;

submitted to the parliament by the Government of India (1911).

Standing Information regarding the Administration of the Madras Presidency C. D. Maclean. (1879.)

An account of the progress in the Administration of the Presidency of Madras, during the last 40 years. Dewan Bahadur S. Srinivasa Raghava Iyengar, C. I. E. (1893)

An authentic account of the condition of the Ryot submitted by Mr. John Bruce Norton on 1-2-1854 to Robert Lowe Esq., Joint secretary of the Board of Control.

Poverty and kindered Economic Problems in India Findley Shirras (Govt. of India. 1932.)

India in 1920, 1921-1935 Government of India.

The Indian Year Book & Who is Who for 1930-36.

The Congress Select Committee Report on the Financial obligations between Great Britain and India. (1931)

England's Debt to India—Lala Lajpat Rai.
Unhappy India Do
Life & Experiences of a Bengali Chemist—Dr. P.C. Roy.
Planned Economy for India—Sir M. Visveswarayya
Proverty and Un-British Rule in India—Naoroji.
British Imperialism in India—Joan Beauchamp.
The Indian Crisis—Fenner Brockway.
Speeches and Writings of the Hon. G. K. Gokhale,
Speeches and Writings :—Dadhabai Naoroji,
Madan Mohun Malaviya & Surendranath Banerji.
The Impeachment of Warren Hastings - Burke.
The works of Garret and Thompson; Anderson and Subedar; V. A. Smith, and Major B. D. Basu.
Sedition Committee Report (1918.)
Congress Presidential Addresses
History of the Congress—Dr. B. Pattabhi
The Modern Review

అచ్చులోనున్నది. (200 పుటలు) త్వరలో వెలువడును.

భారతదేశమున

# బ్రిటిష్ రాజ్యతంత్రము

రెండవ భాగము : చారిత్రికసమీక్ష 1600 — 1938

రచయిత : దిగవల్లి వేంకటశివరావు

పాశ్చాత్యుల కన్నుగుట్టిన భారత దేశ భాగ్యభోగ్యము లేమైనవి?
స్వధర్మస్వదేశములకొరకు పోరాడిన క్షాత్రతేజ మేమైనది?
స్వతంత్రభారతము బ్రిటిష్ ఇండియాగా నెట్లు మారినది?
ఈ రాజకీయార్థిక వైజ్ఞానిక దాస్యశృంఖలము
లేరీతిగా నిర్మింపబడినవి?
భారతీయు లీ యజ్ఞానాంధకారమున, పారతంత్ర్యమున,
దారిద్ర్యమున నెట్లుమునిగిరి?
ఈవిచిత్రపరిణామమునకు గారణమైన బ్రిటిష్
రాజ్యతంత్రముయొక్క రహస్యచరిత్రమిందు కన్నులకు
గట్టినట్లు వర్ణింపబడినది.

మొగలు సామ్రాజ్యాస్తమయకారణములు; నాటిపరిస్థితులు.
వర్తకకంపెనీవారు రారాజులైన వింతకథ.
క్లైవు వారన్ హేస్టింగ్సులనాటినుండి నేటివరకు ప్రయోగింపబడిన
అభినవచాణక్యనీతి.

పారతంత్ర్య దాస్యశృంఖలముల నిర్మింపు;
భాగ్యభోగ్యముల తరలింపు; పరిశ్రమల నశియింపు;
అవిద్యాంధకారవ్యాపనము
భారతదేశ దారిద్ర్యచరిత్రయు విపులముగా వర్ణింపబడినవి.

కంపెనీవారి దుష్పరిపాలనము - ప్రజాపీడనము
అత్యధికభూమిపన్నులు - వీనిని వసూలుచేయుటలో నిచిత్రహింసలు
ఉద్యోగుల లంచగొండితనము - నిరంకుశులగు కలెక్టరుల దేశపరిపాలన
తెల్లవారల న్యాయవిచారణ - క్రైస్తవమతబోధకుల యాగడములు
ప్రభుత్వములోని అన్యాయములు - ప్రజలబాధలు

గృహచ్ఛిద్రములు, లోటుపాటులు; వింతలు గోవిందులు, పూలదండలు, వినతిపత్రములు! దేశప్రజల సమస్యలు; కాంగ్రెసు మంత్రుల కర్తవ్యము; మొదలగున వెన్నియో కలవు.

**బ్రిటిషు రాజ్యతంత్రము నిర్మించిన ప్రభుత్వయంత్రము,**

కార్యనిర్వాహక శాసన నిర్మాణసభలు, మిలిటరీ సివిల్ సర్వీసు ఉక్కుచట్రములు–వానిమర్మములు – ఉద్యోగరహస్యములు – వేతనములు– స్పెషల్ అలవెన్సులు–కుటుంబవేతనములు ఇందు వర్ణితములు. మహారాజుల పోలు నీయధికారులు, ఉద్యోగగర్వితులగు భారతీయ తాబేదారులు, దారిద్ర్యమున మునిగి నోరులేని ప్రజల బాధించు విధము లిందుగలవు.

గోఖలే, సర్ విశ్వేశ్వరయ్య, ప్రొఫెసర్ షా, మొదలగు మహనీయుల విమర్శనలు, 1856–1937 వరకు వివిధవిషయముల భారతదేశ స్థితిగతిలెక్కలు, ఇతరదేశములతో పోల్చబడి ఇందు పొందుపరుపబడినవి.

ఇంగ్లీషువారీ దేశమున అడుగుపెట్టినది లాభముకొఱకే! వర్తకము చేయుచు దేశము నాక్రమించినది లాభముకొఱకే!! సామ్రాజ్యస్థాపనము చేసి పరిపాలించుచున్నది లాభముకొఱకే!! ఎన్ని రాజ్యాంగ సంస్కరణలు చేసినను ఆ లాభములో ఆవంతయైన తగ్గరాదు; నూతన ఇండియా రాజ్యాంగ చట్టమువలన ఇది సూత్రీకరింపబడినది. ఈ గ్రంథమునందు ఈ విషయములన్నియు సహేతుకముగ విమర్శనాపూర్వకముగ స్థితిగతిలెక్కలతో నిరూపింపబడినవి.

బ్రిటిష్ ప్రభుత్వ వ్యయములు–ఆర్థికస్థితి–పరిపాలనా విధానము ఇంగ్లీషువారి రహస్యములు బయల్పరుపబడినవి. 1935 సం॥ నూతన ఇండియా రాజ్యాంగ చట్టముయొక్క స్వరూపస్వభావములు, ఫెడరేషన్ [illegible], రాష్ట్రీయ స్వపరిపాలనలోని నిర్బంధకట్టుడులు, [illegible] కార్యకలాపములు, గవర్నరు జనరలు గవర్నరుల విశేషాధికారములు [illegible].

## రు 500 లు బహుమానము.

ఆరోగ్యశాస్త్రమును రచియించినందుకు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారు రు 750 లు బహుమాన మొసగిన డాక్టరు గుళ్ళపల్లి నారాయణ మూర్తిగారు 2-9-37 తేదీన ఇట్లు వ్రాయుచున్నారు.

“[illegible] వ్రాసిన వ్యాసమునకు మదరాసు విశ్వ విద్యాలయమువారు రు 500 లు బహుమతి నొసగినారని వ్రాయుటకు సంతసించుచున్నాను. దానిని రచించుటలో మీ పారిభాషిక నిఘంటువు నాకు చాలాతోడ్పడినది. కృతజ్ఞుడను”.

***Patronised by:***

### The High Court of Judicature at Rangoon.

Sir Alladi Krishnaswami Iyer.
The Hon. Justice Sir Vepa Ramesam.
The Hon. Mr. T. Prakasam. & The Hon. Mr. B. Gopala reddi.
Sir K V. Reddi Nayudu. & Dr. C. R. Reddi.
J. K. Lancashire Esq., I C. S., District Judge.
V. Purnayya Pantulu Esq., District Judge (Retired).
Mahbub Khan Esq, Treasury Deputy Collector.
**The Maharajas of Jeypore, and Venkatagiri, and others.**

ఆంధ్ర, అన్నామలై, మదరాసు, మైసూరు, కాశీవిశ్వవిద్యాలయముల వారును మదరాసు [illegible] బోర్డువారిచేతను రంగూను హైకోర్టు వారిచేతను ఆదరింపబడి అనేక ఉన్నతపాఠశాలలందును కోర్టులయందును ఉపయోగింపబడుచున్నది.

## OPINIONS

### The Hindu, 19-6-34.

**“It bears testimony to Mr. Siva Rao's extra-ordinary patience and industry and *is sure to prove indispensable for purposes of reference in all Public Libraries and in Government and other offices* where translation from English to Telugu and *vice versa* has to be done...*All honour is due to poineers like Mr. Siva Rao.*”**

# అభిప్రాయములు.

హిందు పత్రిక: మద్రాసు 19—6—34.

"ఇంగ్లీషు తెలుగు తర్జుమాల యావశ్యకముగల ప్రభుత్వశాఖలందలి అన్ని కార్యాలయములయందును గ్రంథాలయములయందును ఇతరసంస్థలందును ఇది అత్యంతావశ్యకముగు ననుటకు సందియములేదు."

"వ్యవహారపరులకేకాక కేవలము భాషాభిమానులును, దీనివలన గొప్ప ప్రయోజనములు పొందగలరు".—7-7-34 భారతి.

"విద్యార్థులకేగాక ప్రచారకులు, లేఖకులు, పత్రికాసంపాదకులు మొదలగువారికెల్ల చాల నుపయోగముగ నుండగలదు.. ఈవిషయములో వీరు దారితీసిన సాహసులు" —కృష్ణాపత్రిక, 2-2-35.

"కోర్టులు, రాజకీయములు, శాస్త్రీయవిషయములకు సంబంధించిన అనేక పదములకు అర్థములు వ్రాయబడినవి. వ్యవహారస్థులకు దేశసేవకులకు, విద్యార్థులకు వ్యాసరచయితలకు, దీనివలన గలుగు ప్రయోజనము లనంతములు. ఆంధ్రభాష కిది అమూల్యభూషణము. విద్యాధికులనేకుల ప్రస్తుతు లందినది. పాఠ్యగ్రంథనిర్ణయ సభవారిచే గ్రంథాలయోపయోగ నిమిత్త మంగీకరింపబడినది". —గృహలక్ష్మి, మార్చి 1935.

"ఈ కాలములో నిట్టినిఘంటువు అత్యవసరమని అత్యుపయోగమని వేఱుగ వ్రాయనక్కరలేదు. శివరావుగా రీమహాప్రయత్నమును నెత్తినందులకు వారిని కీర్తించుచున్నాము. మేము చూచినంతవరకు కొన్ని కొన్ని గొప్పవిషయములకు వీరు కడు తేలికయర్థముల నొసంగినారు. చివర [illegible] కర్తయగు మార్గదర్శియగు నాదర్శముతో పనిచేసినారు. కొన్నియర్థముల నొసంగుపట్ల స్వకపోల కల్పనాశక్తిని ప్రదర్శింపక వ్యవహారమును వదలక, పాటించి, గానినే నిరూపించినారు. పలుగ్రంథముల పరిధి యీనిఘంటువుకు గూర్చినారు. వీరు కావించిన మహాకృషికి తగిన ప్రోత్సాహము లభించుగాక." —ఆంధ్రపత్రిక, 25-7-35.

'అత్యంతోపయుక్తమగు ప్రచురణము'— సర్. [illegible] గారు, [illegible], 30-9-34.

'తెలుగులో నిదియే మొట్టమొదటిది. చిరకాలమునుండియున్న కొరత నివారింపబడినది.' —సర్ అల్లాడి కృష్ణస్వామిగారు, అడ్వొకేటు జనరల్, 30-1-35.

## హెచ్చరిక :

'వ్యవహారకోశము శాస్త్రపరిభాష' కలిసిన ఈ పారిభాషికనిఘంటువు 1934 లోనే ప్రకటింపబడినది.

ఇటీవల ధాత సం॥ ఆశ్వయుజ బహుళ చతుర్దశి (14-11-36) తేదీన ప్రకటింపబడిన "పారిభాషికపదకోశము" అను నొక పుస్తకమును గూర్చి అనుదినమును ఆంధ్రపత్రికలో 'అది గ్రంథకర్తలకు వ్యాసకర్తలకు చింతామణియనియు, అనేకసంవత్సరములు అష్టకష్టములుపడి సమకూర్చినదనియు' వర్ణింపబడుటయేగాక "తెలుగులో నిప్పటికిట్టి గ్రంథములేదు" అనికూడా ప్రకటన చేయబడుచున్నది!

దీనినిగూర్చి హిందూపత్రిక ఇటీవల తీవ్రవిమర్శ చేసియున్నది.

## A Misleading Advertisement

A highly glorified advertisement about a publication entitled "Paribhashika Padakosamu" (పారిభాషిక పదకోశము) appears in the Andhra Patrica which besides singing its praise also asserts that there is no such glossary extant in Telugu at all.

Reviewing it under date 9-5-37, The **Hindu** says :—

"The publication by the Government of Madras of lists of scientific terms and *the glossary of Mr. Digavalli Venkata Siva Rao, have held the field for some time in Telugu.* The reason for the publication of this fresh glossary is no where given. Nor is there an explanation of the scheme of choice of the terminology incorporated nor a mention of the previous publications consulted and of the literature used from which the words are taken.

In regard to the terminology adopted to describe the main sciences themselves there is room enough for difference of opinion. Important divisions of modern knowledge as Economics, Geology and the like, do not find a place in this publication. For words for which simple effective and idiomatic Telugu equivalants are available unnecessary Sanskrit forms have been adopted. Foreign terms in daily use have been excluded. The publishers should have bestowed more attention on the spelling of the English words."

# అధినివేశ స్వరాజ్యము

బ్రిటిషుసామ్రాజ్య స్వరూపస్వభావములు, స్వరాజ్యసమస్యలు, జ్యప్రయోజనము, అధినివేశస్వరాజ్యచరిత్ర, ఫెడరలు రాజ్యాంగము, ప్రజాప్రభుత్వ ప్రాతినిధ్యపద్ధతులు, కనడా డొమినియను, లియా కామన్వెల్తు, ఐరిషు ఫ్రీస్టేటు, ఆంగ్లరాజ్యాంగములను చర్చించు రాజ్యాంగ శాస్త్రగ్రంథము. నూతన ఇండియారాజ్యాంగములోని మంచిచెడ్డలుగ్రహించుట కిది తోడ్పడగలదు హిందూపత్రిక, పత్రిక ప్రశంసించినవి .250 పుటలు. వెల రు. 0—12—0

# సహకారోద్యమము

## భారతదేశస్థితిగతులు

సు టెక్స్టుబుక్కు కమిటీవారు గ్రంథాలయములకు ఆమోదించినారు. (ఫోర్టుసెంట్ జార్జి గెజెట్ సప్లిమెంటు, 2-6-36 పుట 118).

ఇది దేశీయ దేశాంతర సహకారోద్యమమును అందుకుసంబంధించిన ల్యలను విపులముగా చర్చించు ఉత్తమ అర్థశాస్త్రగ్రంథము. అర్థోత్పత్తి, పరిశ్రమ, వ్యాపారములు, ప్రజారోగ్యము, విద్యనభివృద్ధిచేయగల కారపద్ధతులు, వస్తునిలయములు, గ్రామపునర్నిర్మాణము, మన ఆర్థిక కులను ప్రభుత్వాదాయ వ్యయపద్ధతులను ప్రపంచములోని ఇతర లవానితో పోల్చిచూపు స్థితిగతిలెక్కలును గలవు. 260 పుటలు. బైండు వెల రు 1—0—0. క్యాలికో బైండు వెల రు 1—4—0.

# దక్షిణాఫ్రికా

విజ్ఞానచంద్రికా గ్రంథమాల 36 వ గ్రంథము.

ఇది దక్షిణాఫ్రికాదేశ చరిత్ర. వలసకేగిన భారతీయుల చరిత్ర మహాత్ముడు మొట్టమొదట ప్రయోగించి విజయము గాంచిన సత్యాగ్రహ మోడరన్ రివ్యూపత్రిక ప్రశంసించినది. 432 పుటలు. అనేక ములు. కాలికో బైండు. వెల: రెండురూపాయలు.

# రాష్ట్రీయ స్వపరిపాలనము

## (నూతన ఇండియా రాజ్యాంగ చట్టము)

ఈ రాజ్యాంగ విధానములో ప్రజాప్రభుత్వ పద్ధతు లెంతవరకు గలవో తెలుపు పీఠికయు, నూతన రాజ్యాంగ చట్టములో రాష్ట్రపరిపాలనకు సంబంధించిన భాగములకును చక్రవర్తి గవర్నరుకిచ్చు "రాజనిర్దేశపత్రము" (Instrument of Instructions) కును తెలుగు తర్జుమాయు నిందుకలవు. రాష్ట్రపరిపాలనలో గవర్నరుల కివ్వఁబడిన సర్వాధికారములు; మంత్రుల అధికారములందును శాసననిర్మాణమందును రాష్ట్రాదాయ వ్యయములందును చేయబడిన మినహాయింపులు; బ్రిటిషువర్తకులకు ఐ. సి. యస్. వగైరా ఉద్యోగులకు చట్టమిచ్చిన శాశ్వతహక్కులు; కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వాధికారముల విభజన కేంద్రరాష్ట్రీయ శాసనాధికారముల జాబితాలు కలవు.

98 పుటలు వెల 0—3—0

# భారత దేశ స్థితిగతులు

వివిధదేశప్రజల ఆర్థికపరిస్థితులు, ప్రభుత్వాదాయవ్యయవిధానముల మనదుస్థితిని ఇతరదేశముల యౌన్నత్యమును పోల్చిచూపు స్థితిగతి లెక్కల

72 పుటలు దేశసేవకులకు అమూల్యము. వెల రు 0-2-0

నవీన (రష్యా) ఆర్థికస్థితి 0-2-0

ఆంగ్లరాజ్యాంగము 30 పుటలు 0-1-0

అంకులుటాము కథ (అంకుల్ టామ్స్ కాబిన్)

నీగ్రోబానిసల స్వాతంత్ర్యము. 84 పుటలు 0-2-0

బసవరాజు అప్పారావుగీతములు,

భావతరంగములు, ప్రేమతరంగములు, గాంధీగీతలు

(క్రౌను 200 పుటలు) వెల 0—8—(

---

దొరుకువారు :-దిగవల్లి వేంకటశివరావు బి.ఏ.,బి.యల్., బెజవా